# అష్టావక్ర సంహిత



శాంతిశ్రీ
జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

# అష్టావక్ర సంహిత

వ్యాఖ్యాసహితము


"శాంతిశ్రీ"
జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి



పుట్టపర్తి
ప్రశాంతి నిలయము

# ఓం నమో మహద్భ్యః

సర్వ జ్ఞానాలకంటె సర్వోత్కృష్టమైనది ఆత్మజ్ఞానం. సంజ్ఞానం. విజ్ఞానం. తదుపరి స్థానం ప్రజ్ఞానం. అదే బ్రహ్మజ్ఞానం. బ్రహ్మయే ఆత్మ. ఆత్మజ్ఞానం అనిర్వచనీయం. అది ఆత్మకు అనుభవైకవేద్యం. అది హృద్యం.

శ్రుతి స్మృతుల ద్వారా, ఉపనిషత్తుల ద్వారా, సంహితల ద్వారా ఆత్మజ్ఞానం గూర్చి మహర్షులు మహాపురుషులు మహాత్ములు బోధించటానికి ప్రయత్నించి ఏకొంచిత్తు భాగమో! వెల్లడించగలిగాము అంటున్నారు. జ్ఞానబోధలో అష్టావక్ర సంహిత, యోగవాసిష్ఠం, భగవద్గీత ఉత్తమోత్తమాలు. 'ఈ సంహితను' శ్రీఅష్టావక్ర మహర్షి శ్రీ జనకమహారాజుకు బోధించాడు. ఈ అష్టావక్రసంహిత'లో' కేవలం ఆత్మతత్త్వం ఉన్నతస్థాయిలో విలక్షణంగా వివరించబడింది.

శ్రీ జనకమహారాజు పరాశర, యాజ్ఞవల్క్య, వసిష్ఠాది అనేక మహర్షి పుంగవులతో నిత్యం ఆత్మవిచారణ జరుపుతుండేవాడు. జ్ఞానవిజ్ఞానంలో అనుభవ ప్రజ్ఞానంలో మహానిపుణుడు ఆ రాజు. వ్యాసుడు ఒకసారి తన సుతుడైన శుకుణ్ణి ఈ రాజువద్దకు పంపుతూ "ఆకాశ గమనంతో వెళ్ళబోకు అది అవినయం అవుతుంది. పాదచారివై ప్రభువును దర్శించు" అని సలహా యిచ్చాడు. వ్యాసుడేమిటి పరాశరాది మహామహులకు రాజర్షి శ్రీ జనకుడంటే మహా గౌరవం. వ్యాసుడు తన శుకుణ్ణి జనకమహారాజుచేతనే పరీక్ష చేయించాడు. అట్టి ఆత్మజ్ఞాని జనకచక్రవర్తి. జ్ఞానఖనికి జనకుడు జనకుడే.

అటువంటి యోగిరాజు తన పండిత పరిషత్తులో 'వంది' వంటి పండిత ప్రకాండులను పరాభూతులచేసి జ్ఞానపీఠ సింహాసనంపై అధిష్ఠించిన అష్టావక్రముని విజ్ఞాన గాథలు విని అమితానందంపొంది ఆత్మజ్ఞానం అర్థించాడు అంటే అష్టావక్ర పండితుడెంతటి జ్ఞానియో ఊహించవచ్చు.

శ్రీ జనకమహారాజు కోరినమీదట రాజును పరీక్షించి అర్హుడని రూఢి చేసికొని అష్టావక్రుడు జనకునకు ఆత్మవిద్య బోధించాడు. అదే 'అష్టావక్ర సంహిత' అని ప్రసిద్ధి చెందింది. ఇది కేవలం ఆత్మవిద్యాజ్యోతి. ఆత్మజ్ఞాన దీపిక. ఇది ఇరువది ప్రకరణాల గ్రంథం. ఈ మహాతత్త్వ గ్రంథాన్ని నా శక్తికొలది వ్యాఖ్యానించాను. ఈ జ్ఞానయజ్ఞంలో నాకు శ్రుతులు స్మృతులు ఉపనిషత్తులు హిందీ సంస్కృత తెలుగు గ్రంథాలు ఎన్నో సహాయపడ్డాయి. ఆ ఋషులకు ఆయా గ్రంథకర్తలకు కృతజ్ఞతా పారిజాతాంజలులు.

లక్ష్మీవల్లభుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి దయవల్ల ఈ కృతి ఈ ఆకృతి ధరించింది. దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎమ్. వి. ప్రసాద్ గారికి, సప్తగిరి సంపాదకులకు నా ధన్యవాదాలు.

పుస్తకాన్ని అందంగా ముద్రించిన శ్రీ సాయిశ్రీనివాస్ ప్రింటర్స్ అధినేతలకు కృతజ్ఞతలు.

సమస్త కార్యకలాపాలకు సూత్రధారియైన శ్రీ సత్యసాయి భగవంతునికి ఈ కృతిని సమర్పిస్తున్నాను.

—శాంతిశ్రీ



# అంకిత పారిజాతము

సాయిదేవ ! "అష్టావక్ర సంహిత" ఇది
ఈ ప్రశాంతిలో దీని స్ఫురింప జేసి
పదము లందించి చూచి ప్రోద్బల మొసంగి
కృతిని నాచేత పట్టి వ్రాయించినావు !

ఆత్మ విద్యాప్రబోధ మహామృతమ్ము
నేను వ్రాయుటా ! నటరాజ ! నేనెవండ ?
నీ కృపాబలమింతయే కాక, నాకు
జ్ఞాన మున్నదా ! తండ్రి ! శ్రీసాయిదేవ !

గంగలో నిల్చి పురిషెదర్ఘ్యముగ దీసి
స్వామి! గంగను గంగకే వదలినట్లు
ఈవు వ్రాయించినట్టి ఈ కృతిని సాయి!
ఈశ్వరా! నీది నీకె అర్పింమచుంటి-

నాది ఏమున్నదయ్యా ! అనాథనాథ !
నే నిమిత్తమాత్రుండ మహానుభావ !
దేవ ! కృతికర్త కృతిభర్త నీవె ! శేష
శాయి ! విద్యాప్రదాయి ! శ్రీ సత్యసాయి !

నిత్య నిర్మల నిశ్చల నిర్వికార !
సుందరాకార ! సచ్చిదానందసార!
ధీ ప్రసార ! ప్రశాంతి మందిర విహార !
సత్యసాయీశ్వరా ! నమస్కారశతము!

# అష్టావక్ర అభినుతి

ఏకపాద - సుజాత ఋషి దంపతుల గర్భ
ముక్తా ఫలంబుగా పుట్టె నెవడు ?
జనని గర్భము నందె సస్వరంబుగ సర్వ
నిగమంబులు పఠింప నేర్చెనెవడు ?
ఉద్దాలకుని తూగుటుయ్యాల తొట్టెలో
శ్వేతకేతుని తోడ పెరిగెనెవడు ?
జనక పండిత సభన్ జయమంది నృపతికి
దివ్యాత్మ విద్య బోధించెనెవడు ?
సుప్రభా మనోహరి తోడ సుతుల బడసి
తపము గావించి మోక్ష విద్యను గ్రహించి
కృష్ణ పాదాల తనువు త్యజించె నెవడు ?
అట్టి మునిని అష్టావక్రు నభినుతింతు

# అష్టావక్ర మహర్షి చరిత్ర

## జననీ జనకులు

ఏకపాదుడనే మహా విద్వాంసుడు ఏకాగ్రచిత్తంతో ఏకదీక్షతో షడంగ వేదాధ్యయనం చేసి వేదవిదుడైనాడు. అధ్యయనం అధ్యాపనం ఆ వేద విప్రుడి నిత్య కృత్యాలు. ఆ ఋషి శిష్యవాత్సల్యం మూర్తీభవించినవాడు. ఆదర్శ జీవనుడు. అతిలోక పావనుడు. వారి అపార విద్యాసంపన్నత బోధన కళాప్రావీణ్యం పాండిత్య ధురీణత చూచి అందరూ వారిని 'మహామహోపాధ్యాయుడు' అని సంబోధించేవారు. ఆ మహోదయుడికి 'మహోఘుడు' 'కహోడుడు' 'మహోడుడు' అని పేర్లుండేవి.

ఆనాటి మహర్షులలో మహోన్నతుడు ఉద్దాలక మహర్షి. అత్యుత్తమ గృహస్థుడు. ఈ ముని కుమార్తె 'సుజాత'. సుజాత విదుషీమణి. యుక్త వయస్కురాలు.

ఇలా ఉండగా ఏకపాద విబుధుని కీర్తి ప్రతిష్ఠలు ఉద్దాలక మహర్షికి శ్రవణ పర్వాలైనాయి. యోగ్య వరుడని తోచింది మౌనికి. ఏకపాదుడికి సుజాతనిచ్చి వివాహంచేసి తన జామాతగా చేసికొన్నాడు.

సుజాత పరమ పతివ్రత. పునీతచరిత. భర్తకనుకూలవతి. సుగుణవతి. విద్యావతి పుణ్యవతి. పతినే ప్రత్యక్షదైవంగా భావించి ఆరాధిస్తున్న అతివినయసంపన్నురాలు భక్తురాలు. దాంపత్య ధర్మాలు చక్కగా నిర్వహింపబడుతున్నాయి. వారి గృహంలో అతిథులు అభ్యాగతులు ఆతిథ్యం అందుకొని సంతృప్తులై ఆనందిస్తున్నారు. మునివాడ మోద మందింది. మరికొన్ని నాళ్ళకు మానినీమణి మధురస్వప్నం ఫలించింది. సుజాత గర్భవతి అయింది. పతి పరమానందం పొందాడు.

తల్లిదండ్రులు విద్యా ప్రభావం వల్ల తల్లి గర్భంలో ఉండే గర్భస్థ శిశువు వేదాధ్యయనంలో మెలకువలు ఉచ్చారణలు ఉదాత్త అనుదాత్త స్వరాలు అద్భుతంగా అలవరచుకొన్నాడు. గర్భంలో శిశువు క్రమక్రమంగా అభివృద్ధి అవుతున్నాడు. శ్రీమతి సుజాతకు నెలలు నిండాయి.

ఒకసారి శ్రీమతి పతిదేవుని సమీపించి ప్రసవ కాలానికి కొన్ని అత్యవసర వస్తువులు తీసికొనిరావాలని అన్నది. ఏకపాద పండితుడు భార్య అభిలాషకు ఆమోదించాడు. ధనార్థియై శ్రీ జనకమహారాజును అర్థించాలని అనుకొన్నాడు.

## వందితో వాదం

అదే సమయంలో రాజు ప్రకటన ఇలా వెలువడింది— "శాస్త్ర చర్చా గోష్ఠికి శ్రీ వరుణ పుత్రుడు వంది పండిత ప్రకాండుడు సభకు విచ్చేసియున్నాడు. వారితో శాస్త్ర వాదంలో విజయలక్ష్మి నందిన వారికి బహుమతులు బహు దానాలు బహూకరింపబడతాయి. ఇందు పాల్గొన దలచిన పండితులు సాదరాహ్వానితులు."

రాజు ప్రకటన గూర్చి విని ఏకపాదునికి ఆనందం కలిగింది. అర్థించకుండా విజయలక్ష్మి ఇంటికి నడిచి వస్తున్నది. నా కంటే పండితుడున్నాడా! ఆస్థానంలో శాస్త్రవాదం చేస్తే కీర్తి ప్రతిష్ఠలు బహూకృతులు కలుగుతాయి అనుకొన్నాడు.

ధర్మపత్నికి చెప్పి రాజ పండిత పరిషత్తుకు వెళ్ళాడు. పండిత చర్చలో పాల్గొన్నాడు. ధర్మశాస్త్రాలు క్రోడీకరించి సప్రమాణంగా వాదించాడు కానీ దైవవశాత్తు ఓటమిని చవిచూడవలసి వచ్చింది. ఇదివరకటి కోవిదులతోపాటు ఏకపాదుడు కూడా వరుణ నగరం కొనిపోబడినాడు.

గర్భవతి అయిన సుజాత పుట్టింటికి తోసికొనిపోబడింది. మరికొన్నినాళ్ళకు ఒక శుభ ముహూర్తాన సౌభాగ్యవతి సుజాత తన తండ్రి ఉద్దాలక మహర్షి ఆశ్రమంలో పురుడు పోసికొన్నది. మగశిశువు అష్టావక్రుని కన్నది.

## ఉద్దాలక మహర్షి

అదే సమయంలో ఉద్దాలక మహర్షి భార్య శ్వేతకేతుణ్ణి ప్రసవించింది. అష్టావక్ర, శ్వేతకేతు లిరువురూ అల్లారుముద్దుగా పెరుగుతున్నారు. మామ అల్లుళ్ళు ఆటపాటలందు చదువు సంధ్యలందు పోటీపడి వర్ధిష్ణువులవుతున్నారు. ఏక సంథగ్రాహులై అధ్యయన ధీరులై విక్రమవీరులై విరాజిల్లుతున్నారు.

'అష్టావక్రు'డని తనను 'శ్వేతకేతు'వని మామను అందరు పిలుస్తుంటే మామకు ఎంతో మంచిపేరు, నాకీ పేరు ఏమిటి? అనుకొనేవాడు అష్టావక్రుడు. తల్లి ని అడిగితే లాభం లేకపోయింది. కంటికి కడివెడు కన్నీరే సమాధానం.

తాతగారి ఒడిలో కూర్చొని మెల్ల మెల్లగా అడిగి మారాంచేసి నిజం చెప్పమని పట్టుపట్టాడు. ఉద్దాలక మహర్షి మనుమడు ప్రాజ్ఞుడవుతున్నాడు. విషయాలు వివరించటం అవసరం అని ఈ విధంగా చెప్పాడు— "అబ్బాయి! అసలు రహస్యం వివరిస్తాను. శ్రద్ధగా విను. మీ నాన్న విజ్ఞాన ఖని. వేద విద్యాప్రకాండుడు. ఏకాగ్రచిత్తుడు. ఏకసంధాగ్రాహి. ఏకపాద నామధేయుడు. బహు సూక్ష్మగ్రాహి. మహామహోపాధ్యాయుడు, ఆ తండ్రికి తగ్గ కుమారుడివి అనిపించుకొన్నావు.

## వేద సంస్కారం

నీవు నీ తల్లి కడుపులోఉండే తండ్రికి పేరు పెట్టావు. ఒకనాడు మీ నాన్న విద్యార్థులకు వేద పనస చెప్పుతున్నాడు. ఛాత్రులు పవిత్రంగా వల్లిస్తున్నారు. మీ నాన్న మనస్సు అన్యథాపోయింది. అంతేవాసి ఒకడు అపస్వరం పలుకుతున్నాడు. మీ నాన్న పట్టించుకోలేదు. మాతృగర్భంలో ఉండి నీవు అది విని సహించలేకపోయావు. "ఎవరిదైనా దోషం దోషమే. వేదాపచారం జరుగుతోంది. చెప్పకతప్పదు తండ్రి కనుక వహించి శపించినా నా ఒక్కడికే శిక్ష. ఈ పవిత్ర వేదంలో అపశ్రుతి దోషం అనేకులను అప్రతిష్ఠపాలు చేస్తుంది." అని పరిపరి విధాల ఆలోచించి చివరకు తండ్రితో ఇలా అన్నావు- తండ్రీ! ఈ మంత్ర భాగంలో అపస్వరం వినబడుతోంది. విద్యార్థులను సరిచేయండి."

ప్రథమంలో తండ్రికి ఆశ్చర్యం కలిగింది. ఆ తదుపరి ఆనందం కలిగింది. అంతేవాసులచేత అపస్వరం సరిచేసి సుస్వరం పలికించాడు మీ నాన్న.

## అష్టావక్ర నామం

మరొకసారి ఏకపాద మహోపాధ్యాయుడైన మీ తండ్రి శిష్యులకు పాఠాలు చెప్పి చెప్పి డస్సిపోయాడు. అది గమనించి నీవు మీ తండ్రితో "మీరు శ్రమపడు

తున్నారు. నాన్నగారూ! నిద్రాహారాలు మాని క్షణమైనా విశ్రాంతి లేకుండా ఏమిటీ విద్యాబోధ! నాకు ఒక్కసారి విని వినగానే వేదం సస్వరంగా వస్తోందే! అన్నావు.

మరొకసారి ఇలానే వేదాధ్యయన కార్యాన్ని అల్పంగా పలికావు. మీ తండ్రి ఇది పట్టించుకొనక అధ్యాపనకార్యంలో ఉండేవాడు. అధ్యయనకార్యంలో ఇలా ఎనిమిది తడవల జరిగింది. మీ నాన్నకు కొంచెం కష్టంవేసింది. 'బాలుడి కింత ఔద్ధత్యం మంచిదికాదే. వారించినా వారింపబడటంలేదే' అని ఆగ్రహించాడు.

"గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్లు వీడు నాకే వంకలు పెడుతున్నాడే. వీడి ఔద్ధత్యం సహించరాదు. విద్యకు వినయం విభూషణం. ఇప్పుడే ఇంత అవిధే యత చూపిస్తున్నాడు కన్నకొడుకని ఉపేక్షించరాదు. వీడు శిక్షార్హుడే" అని తల పోశాడు. "అధ్యయనాన్ని అష్ట పర్యాయాలు వంకలుపెట్టి ఆక్షేపించావు. కనుక "అష్టావక్రుడ"వై జన్మిస్తావు అని మీ నాన్న నిన్ను శపించాడు. అందువల్ల నీకీ పేరు వచ్చింది.

ఇక మీ నాన్న సంగతి వివరిస్తాను విను. నీవు మాతృగర్భంలో ఉన్నప్పుడు మీ అమ్మ మీ నాన్నను ఏవో చాలింత వేవిళ్ళు కోరింది. ధనం సాధనం కదా! ధనం లేదు. మీ నాన్న ధనంకోసం ఆలోచిస్తుండగా జనకమహారాజు ప్రకటన కంట పడింది. ఆ ప్రకటన చూచి మీ నాన్న రాజు వద్దకువెళ్ళి చిక్కుకొనిపోయాడు.

"ఆఁ! అలానా! జనకమహారాజు ఎవరు? ఆ రాజు ఎట్టివాడు? ఆయన చరిత్ర ఏమిటి? చెప్పు తాతయ్యా! నేనువెళ్ళి మా నాన్నను తీసికొనివస్తాను!" అని అష్టావక్రుడు మాతామహుణ్ణి మరి మరీ ప్రశ్నించాడు.

## జ న క మ హా రా జు

తాతగారు మనుమడికిలా చెప్పసాగాడు. మనుమడు కళ్ళు పెద్దవిచేసి శ్రద్ధగా వినసాగాడు- "ఇక్కడికి కొద్దిదూరంలో మిథిలానగరం ఉంది. ఆ మిథిలా నగరాన్ని 'మిథి' అనే మహారాజు నిర్మించాడు. మిథి రాజుకు వంశపురుషుడు నిమి ఆ మహాత్ముడు. మిథిరాజసింహుడికి జనకుడు ఉద్భవించాడు. జనకుడు ప్రజాపరిపాలనా దక్షుడు, ధర్మాత్ముడు. జనకుడి తరువాత చాలామంది రాజ్యం ఏలారు.

ఆ జనక మహారాజు పట్టమహిషి రత్నమాల. వీరికి నాగేటి చాలులో ఒక బాలిక దొరికింది. ఆ బాలిక పేరు సీత. ఆ సీతను దశరథాత్మజుడైన శ్రీరామ చంద్రుడికిచ్చి వివాహం మహావైభవంగా చేశారు.

జనకమహారాజు గొప్ప జ్ఞాన సంపన్నుడు. సత్య జ్ఞాన శాంతిప్రేమ ధర్మాలు కార్యాచరణలో పెట్టి రాజ్యంలో ఋషులను మహర్షులను బ్రహ్మర్షులను సమావేశ పరచి గోష్ఠులు జరుపుతూ గౌరవిస్తూండేవాడు.

"సర్వం కాలాధీనం" అని ఈ రాజుకు జ్ఞానబోధ చేసిన మహర్షి అశ్మకుడు. యాజ్ఞవల్క్యుడి చేత బ్రహ్మోపదేశం పొంది జనకుడు మహాత్ముడయ్యాడు. "విదేహ ముక్తి" ఈ రాజుకు చాలా ఇష్టవస్తువు. బ్రహ్మర్షి అయిన వసిష్ఠుడికి ఈ రాజు తత్త్వం క్షుణ్ణంగా తెలుసు. రాజుకి వశిష్ఠుడి జ్ఞాన నిష్ఠపై గురి ఎక్కువ. శ్రీ వసిష్ఠ బ్రహ్మర్షి వద్ద ఈ రాజు ఆత్మతత్త్వం గూర్చి మిక్కిలి శ్రవణం చేస్తూండేవాడు.

## అగ్ని పరీక్ష

వసిష్ఠ జనకుల యొక్క అన్యోన్య ప్రగాఢ మైత్రి చూచి ఇతర మునులకు అసూయగా ఉండేది. "మహారాజు మాకంటే జ్ఞానసంపన్నుడా! మహారాజ్యాధినేత కనుక మహర్షి గౌరవిస్తున్నారు" అనుకొనేవారు.

ఇది గ్రహించి ఈ మునివరులకు బుద్ధి చెప్పాలి అనుకొన్నాడు వసిష్ఠమహర్షి. ఒకరోజు గోష్ఠి జరుగుతుండగా వెంటనే యోగాగ్ని కల్పన చేశాడు మహర్షి. పట్టణంలో పెనుమంటలు ఉవెత్తుగా లేచాయి. ప్రజలలో హాహాకారాలు వ్యాపించాయి. భటులు పరుగు పరుగున రాజువద్దకువచ్చి "మిథిలానగరం అంటుకొన్నది. స్వామీ!" అన్నారు. "మీరు వెళ్ళి మంటల్ని ఆర్పే ప్రయత్నం చేయండి!" అన్నాడు రాజు. "మహారాజా! మంటలు ఎక్కువైనాయి. అంతఃపురం కూడా ఆహుతి అవుతున్నది" అన్నారు వారు. "సహాయ కార్యక్రమాలు చేయండి!" అన్నాడు రాజు.

"రాజా! అంతఃపుర స్త్రీలు మంటలలో చిక్కుపడ్డారు!" "రక్షణ కార్యక్రమాలు చేయండి!" "ప్రభూ! పట్టమహిషి మందిరం మధ్యలో ...." "అలానా! మీప్రయత్నం

మీరు చేయండి! సర్వం కాలాధీనం. ఈశ్వరలీల." అన్నాడే కానీ రాజు కదలలేదు మనస్సు చలించలేదు. తొట్రుపడలేదు.

"కారు చిచ్చు అడవికాల్చి ఆశ్రమాలు అంటుకుపోతున్నాయి! దారుణం! దారుణం." అని భటులు ఆక్రందనం చేశారోలేదో మునీశ్వరులు అది విని "మా కౌపీనాలు! మా కౌపీనాలు!" అని తమ తమ కుటీరాలవైపు పరుగులెత్తసాగారు. "అయ్యో! అయ్యో!" అని ఒకటే ఆర్తనాదాలు.

మహర్షి చేత యోగాగ్ని ఉపశమింపబడింది. మహారాజు ఆత్మనిగ్రహాన్ని మహర్షి అందరికి ఎరుకపరచి ఆత్మ సంయమనం అంటే ఇది అన్నాడు. అనుభవ జ్ఞానం అంటే ఇలా ఉండాలి- అని ఋషులకు పాఠం నేర్పాడు వసిష్ఠ బ్రహ్మర్షి. జనకమహారాజు ఆత్మస్థైర్యం అది

## జనకుడు – శుకమహర్షి

అబ్బాయి! జనకమహారాజు గూర్చి మరొక సంగతి వివరిస్తాను విను– వేదవ్యాస మహర్షి పేరు విన్నావు కదా! చతుర్వేదాలు విభజించాడు. అష్టాదశ పురాణాలు ప్రవచించాడు. బ్రహ్మసూత్రాలు గ్రథనం చేశాడు. భారత భాగవతాలు రచించాడు.

ఆ మహామహుడి ఆత్మజుడు శుక మహర్షి. ఆ శుకమహర్షి తండ్రినిమించిన తనయుడు. బ్రహ్మజ్ఞాని, ఆత్మవిద్యా విదుడు, పరిశుద్ధ స్వరూపుడు. నిశ్చల నిర్మల నిష్ఠాగరిష్ఠుడు. పెద్దవాడైన వ్యాసుణ్ణి చూచి స్త్రీలు సిగ్గుపడేవారు. దాగుకొనేవారు కానీ యుక్త వయస్కుడైన శుకుణ్ణి చూచి మనస్సులు వికారాలు చెందక చేతులెత్తి నమస్కరించేవారు. అట్టి స్వచ్ఛ స్ఫటిక హృదయుడు శుకదేవుడు.

ఆ శుకమహర్షికి ఒకసారి ఒక చిన్న సందేహం కలిగింది. తాను గ్రహించిన వస్తువు శుద్ధమూ బుద్ధమూ, నిర్మలమూ నిత్యమూ సత్యమూ అత్యంత క్షమూ అయినదే కదా! అని తన పితృదేవుడైన వ్యాసమహర్షి దగ్గరకు వెళ్ళి ప్రశ్నం చేశాడు– "పితృదేవా! అభివాదాలు! ఈ దృశ్యమాన జగత్తు ఎలా ఉద్భవించింది? ఎలా వ్యాపించింది? ఎలా లయిస్తోంది? దీని పరిమాణమెంత? దీనికి

మూలకారణం ఎవరు? ఎప్పుడు జనించింది? దీని తత్త్వం ఏమిటి? పరమ వస్తువు ఏది? దయచేసి వివరించండి."

తండ్రి వ్యాసర్షి తనయుడు శుకర్షి అడిగిన సంప్రశ్నలన్నిటికీ సమాధానం చెప్పాడు. అన్నీ ఆలకించి "తండ్రీ! తమరు చెప్పింది విన్నాను. శాస్త్రాలలో పఠించాను. కాని ఆత్మకు అంత తృప్తి కలగటంలేదు. ఇంకా ఏవో పరమ వస్తు తత్త్వం తెలియంది తెలిసికోవాలి అనిపిస్తున్నది" అన్నాడు శుకుడు.

"అయితే ఒకపనిచేయి! మాధవుడి కృపాకిరణం సోకందే సంశయాంధకారం అంతరించదు. సంశయ నివృత్తి చేసికొనటం సంయముల విధి. నీవు మిథిలాపురం వెళ్ళి జనక రాజర్షిని అడిగిచూడు. సందేహం తీరవచ్చు. జనకుడు రాజర్షి మాత్రమే కాదు. గొప్ప బ్రహ్మజ్ఞాని. హృదయగ్రంథి విచ్ఛేదంఅవుతుంది ఆ రాజర్షి అసమాన ఆత్మజ్ఞాని. వెళ్ళిరా!" అన్నాడు వ్యాసుడు ఆప్యాయంగా.

శుకుడు తండ్రి సలహాకు సంతోషించాడు. తండ్రి ఆశీస్సులతో ఒక సుముహూర్తాన మిథిలాపురి వెళ్ళాడు. రాజద్వారం జేరాడు. ద్వారపాలకులు మహారాజు దగ్గరకువెళ్ళి "వేదవ్యాస మహర్షి ఆత్మజుడు శుకమహర్షి ద్వారం వద్ద ప్రతీక్షిస్తున్నాడు" అని రాజుకు నివేదించారు.

జనక మహారాజు భటులతో "అలానా" అని ఊరకున్నాడు. అధిపతి అటు చూడనేలేదు. శుకుడు ఏడురోజులూ అలాగే ఉండిపోయాడు. ఏమీ తొందరపడలేదు. ఓర్పు సడలనీయలేదు. తత్త్వ జ్ఞానంకోసం దీక్ష వహించి ఈశ్వర ధ్యానంచేస్తూ అలానే ఉండిపోసాగాడు.

'తదుపరి శుకుణ్ణి మందిరంలో ప్రవేశపెట్టండి' అన్నాడు మహారాజు సప్త వాసరాలు ఐన తర్వాత. పరిచారికాగణం శుక మహర్షిని మందిరంలో ప్రవేశపెట్టి సకలోపచారాలు చేయసాగింది. మహర్షికి మహాద్వారం దగ్గర పడిగాపులు కాస్తున్నప్పుడు దిగులూలేదు. సకలోపచారాలు అందుకొంటున్నప్పుడు సంతోషమూలేదు.

మహారాజు మహర్షి అభ్యంగన స్నానాది కృత్యాలకు మదవతులను నియోగించాడు. పరిచారకులు సకల పరిచర్యలు గావిస్తున్నారు. బహువిధాలైన వైభోగాలతో ముంచిఎత్తుతున్నారు. తత్త్వ జ్ఞానం అపేక్షిస్తున్న ఆ మౌని మనస్సును

మదవతులూ మధుర పదార్థాలూ మందమారుతాలూ మహాభోగాలూ ఏమాత్రమూ మార్చలేకపోయాయి. మారుతాలకు చలించని మందరగిరి వలె మౌని మహిమాన్వితుడై మార్తాండుడై ప్రకాశిస్తున్నాడు.

'పరమయోగి పరీక్షలలో కృతార్థుడైనాడు' అనితెలిసికొని జనకుడు సంతుష్టుడై శుక యోగిని అంతఃపురానికి రప్పించుకొని సత్కరించాడు. ముని సమ్ముఖాన కూర్చొని రాజు ఇలా ప్రశ్నించాడు- "మహర్షీ! మానసేంద్రియాదులు జయించావు. సంసార సాగరం తరించావు. పరమ వస్తువు గుర్తించావు. ఆత్మపీఠాన్ని అధిరోహించావు. ఇక నీ మిగిలిన మహత్వాకాంక్ష ఏమిటి?

మహారాజయోగి మధుర వాక్యాలు విని మహానంద భరితుడై మహర్షి ఇలా అన్నాడు- "గురుదేవా! సహస్రప్రణామాలు. ఈ సంసారం వేగిరపాటు ఎలా చెందుతున్నది? ఎలా ఉపశమిస్తున్నది? ఈ ప్రపంచ తత్త్వం ఏమిటి? పరమ వస్తువేది? సత్యం వివరించండి!"

అది విని జనక మహారాజు సంతోషించి సవిస్తరంగా బోధించాడు. "వ్యాస మహర్షి ప్రవచన సారం కూడా ఇదే. సర్వశాస్త్ర ప్రకటనం కూడా ఇదే. నిశ్చయ బుద్ధి కలిగియుండు బాబూ" అని ఆత్మధైర్య వచనాలు పలికాడు జనకుడు.

శుకయోగి రాజర్షితో ఇలా అన్నాడు- "రాజర్షీ! నా బుద్ధి బలంతో ఇదే గ్రహించాను. తండ్రీ ఇదే జ్ఞానఖండం బోధించాడు. తమరూ ఈ జ్ఞాన సారం వివరించారు. అస్తు! ఈ సారహీనమైన సంసారం స్వామియొక్క వికల్ప వికారంచేతనే జన్మిస్తున్నది నశిస్తున్నది. కానీ సుస్థిరమైన పరమ వస్తువు ఏది? చిత్తం భ్రమిస్తున్నది. ఈ చంచల చిత్తం తమవల్లనే స్థిరపడాలి. సందేహ తరంగాలు శమింపబడాలి." "శుకర్షీ! శుద్ధ తత్త్వం గ్రహించావు. "పరోపకారాయ పుణ్యాయ-పాపాయ పరపీడనమ్" అని మీ నాన్న చెప్పింది సత్యం".

"నీవు నీ స్వబుద్ధితో సకల శాస్త్రాల సారం సమ్యగ్దృష్టితో యోచించింది కూడాను ఒక్కటే. ఇంతకుమించి మరొక జ్ఞాన రహస్యం లేదు. అఖండ అనంత జ్ఞానంగల చిదాత్మ పురుషుడొక్కడు నిరంతరం వెల్గుతున్నాడు. ఆతడు విష్ణుస్వరూపుడు. విస్తరించిఉన్నాడు. ఇతరం మరొకటి ఏదీలేదు. ఆ స్వామి సంకల్ప

వికల్పాలచేత సకలసృష్టి జనించటం లయించటం జరుగుతుంది. ఆ స్వామి సంకల్పంచేత సంసారం వికల్పంచేత విముక్తి లభిస్తుంది. ఆ స్వామి సకలానికి కర్త భర్త హర్త. ఇదే జ్ఞానసారం.

నీవు మహానుభావుడవు. ఆత్మవిద్యా కోవిదుడవు. జ్ఞానానుభవంగల విజ్ఞుడవు. భోగభాగ్యాలపైన విశ్వ విజ్ఞానంపైన విరక్తి పొందావు. జ్ఞానులు తెలిసికోతగింది తెలిసికొన్నావు. పొందవలసింది పొందావు. విముక్తుడవైనావు విదేహం కైవల్యం అందుకొన్నావు. నీవు శుద్ధుడవు శుకమహర్షీ!"- అని శుక మహర్షికి జనక రాజర్షి జ్ఞాన రహస్యం విశదపరచి శాంతి చేకూర్చాడు. శుకమహర్షి సంతుష్టుడై నిండు హర్షంతో నిశ్చల పరమ వస్తువు గ్రహించి విశ్రాంతి తీసికోసాగాడు. ఆ విధంగా శుక బ్రహ్మర్షికి జ్ఞానబోధ చేసిన ప్రతిభాశాలి జనకరాజ మహర్షి.

-అని ఉద్దాలక మహర్షి జనకమహారాజును గూర్చి మనుమడైన అష్టావక్రుడికి బోధించాడు. అష్టావక్రుడు అతిసూక్ష్మగ్రాహి కనుక అంతా అవగాహనం చేసి కొన్నాడు. 'తాతయ్యా! అటువంటి మహాయోగిరాజైన జనకమహారాజును నేనూ శ్వేతకేతుడూ వెళ్ళి చూచివస్తాము. వస్తూ వస్తూ రాజును మెప్పించి నాన్నను తీసికొని వస్తాము. ఆశీస్సులీయండి' అని పాదాభివందనం చేశాడు అష్టావక్రుడు. "శుభం భూయాత్" అని మహదాశీస్సు లందించాడు ఉద్దాలక మహర్షి.

## రా జ స భా ప్ర వే శం

చిరంజీవులు అష్టావక్రుడూ శ్వేతకేతుడూ సమవయస్కులు. మేథా సంపత్తి వేద విద్వత్తు గలవారు, వారు ఒక శుభముహూర్తాన శ్రీ జనక మహారాజు ఆస్థాన ద్వార భూమి జేరారు. ద్వారపాలకులతో ఇలా అన్నారు. "శుభం భవతు. ద్వార పాలక శ్రేష్ఠులారా! మేము రాజదర్శనానికి వచ్చాము. అనుమతించండి!" "బాల బ్రహ్మచారులారా! మీరు వచ్చారు మంచిది. కానీ వృద్ధపండితవర్యులకే రాజదర్శనం ఆస్థాన ప్రవేశం లభ్యమానాలు. మీరు తొలగండి" అన్నారు వారు.

"మేము జ్ఞాన వృద్ధులము. ఆత్మజ్ఞానం గలవాడే పండితుడు. జ్ఞానం పరిగ ణించాలి కానీ, కేవలం వయస్సు లెక్కగొనరాదు. మీ రాజు జ్ఞానయోగి. మమ్మ వారింపడు. ప్రవేశ మివ్వండి. అంధులకు బధిరులకు బ్రహ్మణులకు రాజులకు స్త్రీలకు అడ్డుపెట్టరాదు. వారి కార్యాలు ముందు నిర్వర్తించి పంపటం ధర్మసమ్మతం. వీరి క్షేమం చూడటం రాజుకు క్షేమం. క్షోభపెట్టటం అవివేకం. ఇది శాస్త్రోక్తి."

ఇలా వారితో వాదించి మెప్పించి లోపలకు వెళ్ళారు. రాజదర్శనం అయింది. వారి ప్రవర్తనకు వినయ విధేయతలకు విద్యా వైదుష్యానికి రాజు సంతోషించాడు.

జనకమహారాజు ఆమోదంతో అష్టావక్రుడిని పరీక్షించి వంది పండితునితో వాదానికి పంపాడు. ఆ వాదంలో వంది అపజయం పొందాడు. అష్టావక్రుడు విజయం పొందాడు. జనకమహారాజు అష్టావక్రుడిని "నీకు ఏమి కావాలో కోరుకో"మన్నాడు "మహారాజా! వంది పండితుడితో వాదించి పరాజయంపొందిన మా జనకుడు ఏకపాద మహర్షి జలమజ్జితుడై యున్నాడట. ఇప్పుడు నాచే ఓటు పడిన వంది మహాశయుని అందుంచి నా తండ్రినీ, మిగిలిన విద్వాంసులనూ విడుదల చేయించవలసినదిగా నా అభ్యర్థన. నా ఆకాంక్ష ఇదే" అన్నాడు అష్టావక్ర విద్వాంసుడు.

అందుకు వంది పండితుడు ముందుకు వచ్చి ఇలా విన్నవించాడు- నాయనా! కుశాగ్రబుద్ధీ! బుధాగ్రణీ! నీ తండ్రిని జలమజ్జితుణ్ణి చేయలేదు. ఆ మిషతో మాతండ్రి వరుణదేవుని యాగశాలకు మీ పితృదేవుణ్ణి ఇతర పండితులను కొనిపోయినారు. అచట పండితశ్రేణి సకలోపచారాలు అందుకొంటున్నది మీ తండ్రి పరమానంద భరితుడై యున్నాడు, మీరు కూడా వచ్చి గౌరవ పురస్కృతులందుకొనవలసినదిగా ఆహ్వానిస్తున్నాను.

అష్టావక్రుడు శ్వేతకేతువు జనకమహారాజు అభినందనలు పురస్కృతులతో వరుణాలయం వెళ్ళి యజ్ఞశాలలో తండ్రిని కలిసికొని మహానందం జెందారు, అందరూ సుఖంగా ఇంటికి వచ్చారు,

## పితృప్రేమ

వేద వేదాంత వియద్వీథుల్లో విజయ విహారం చేస్తున్న ఆత్మజుడైన అష్టావక్రుడి పితృ భక్తికీ-జ్ఞానశక్తికీ సంతోషించి ఏకపాద బుధాగ్రణి కుమారుడితో ఇల అన్నాడు-

"నాయనా! కుమారవరా! నీ పితృభక్తి అనుపమానం. జ్ఞానం అపారం మోక్షాసక్తి ఆదరణీయం. నీ శైశవ చేష్టలకు నేనే కోపించి నిన్ను శపించావ తత్ఫలితంగా నీవు అష్టావక్రుడవై పుట్టావు. ఇప్పుడు ఈ మంత్రజపంతో సమం తీర్థంలో స్నానంచేసిరా! నీ వక్రతలు హరిస్తాయి."

అష్టావక్రుడు సమంగా తీర్థంలో సుస్నాతుడై పునీతుడయ్యాడు. అష్టావక్రుడు నిర్వక్రుడై సహజ సౌందర్యంతో ప్రకాశించసాగాడు. ఇది తండ్రి అవ్యాజ వాత్స ల్యానికి ప్రతీక. కానీ కాలం గడిచినా అష్టావక్రుడనే పేరు అలానే స్థిరపడిపోయింది.

## నిర్వక్రత

ఆ తదుపరి నిర్వక్రుడైన అష్టావక్ర మహర్షి 'వదాన్య' ముని కన్యకామణి యైన 'సుప్రభ'ను వివాహం చేసికొన్నాడు. ఉత్తమ గార్హస్థ్య జీవనం నెరపాడు. పుత్ర సంతానవంతుడై యశఃకాంతులతో దివ్య జీవనంచేసి విరాజిల్లసాగాడు.

పూర్వం అసితుడనే యోగి "రాధా మంత్రం" పారాయణంచేసి దేవలుడనే సుపుత్రుణ్ణి పొందాడు. ఆ దేవలుడే ఈ జన్మలో అష్టావక్ర మహర్షి. ఈ మహర్షి అనవరత తపశ్శాలి. విఖ్యాత విరాగి. విజ్ఞానఖని. పరమ భక్తవర్యుడు. ముక్త పురుషుడు.

ఒకసారి ద్వాపరంలో శ్రీకృష్ణభగవానుడు రాధాదేవితో బృందావనంలో విహరిస్తున్నాడు. ఒక వట వృక్షం క్రింద కొలువుతీరాడు. అది చూచాడు అష్టావక్ర యోగి. శ్రీకృష్ణ పరంధాముడు - పరమాత్మ - సాక్షాత్తు సర్వేశ్వరుడని గుర్తించి కృష్ణ పాదాలకు ప్రణమిల్లాడు పరవశించాడు.

## బ్రహ్మజ్ఞానాభిలాష

ఒకసారి పండితగోష్ఠిలో పండితులు "బ్రహ్మోపదేశం అనేది సూర్యకిరణం వలె అతి త్వరలో లభించేది. ఇది శాస్త్ర సమ్మతం. సత్యవాక్యం" అని అన్నారు. కానీ పండితులెవ్వరూ సప్రమాణంగా ధ్రువీకరించలేకపోయారు. అప్పటి నుండి జనకుని మనస్సులో ఈ జిజ్ఞాస వుంది.

జనకమహారాజు అష్టావక్ర మునిని ఈ విషయమే అడిగాడు. అప్పుడు మహర్షి జనకునితో- "బ్రహ్మోపదేశం గూర్చి తమరు విన్నది సత్యం. నే చెప్పినట్లు నడుచుకోగలిగితే అది ధ్రువీకరిస్తాను." అన్నాడు. అందుకు జనకుడు. "అలానే నడుచుకొంటాను. ఆజ్ఞాపించండి!" అన్నాడు.

అష్టావక్రుడు— "అయితే! అతిశ్రద్ధ వహించు. అతిధైర్యం అవలంబించు. బ్రహ్మోపదేశం పొందటానికి ఒక గురువును వరించు అన్నాడు.

"జనకుడు ధైర్యం వహించాను. తమరినే సద్గురువుగా వరించాను స్వామీ!"

అన్నాడు. అలా అయితే ఒంటరిగా నాతో వనానికిరా అన్నాడు మహర్షి. అనుసరించాడు జనకుడు. ఒకచోటకు వెళ్ళారు. అష్టావక్రుడు- "నాకు గురుదక్షిణగా మనోవాక్కాయములు ధనంగా సమర్పించు" అన్నాడు.

రాజు ఒక్క క్షణం ఆలోచించాడు. "నా మనోవాక్కాయములు తమకు సమర్పిస్తున్నా" అన్నాడు. రాజు అచేతనంగా అమనస్కుడుగా అలాగే ఉండిపోయాడు. మూడురోజులు గడిచాయి. రాజపరివారమంతా మహారాజు కోసం వచ్చారు. వారంతా ఆందోళన పడసాగారు. మహర్షిని ప్రార్థించారు. వారి ప్రార్థన ఆలకించి మహర్షి రాజు దగ్గరకు వచ్చి "రాజయోగీ! ఏమిటిలా ఉన్నావు! మాట్లాడు!" అన్నాడు. రాజు "గురుదేవా! మహానుభావా! మహాదేవా! తమ ఆజ్ఞ లేనిదే నేనేమీ చేయలేను. కదలలేను. మాట్లాడలేను. భావించలేను. నా మనస్సు వాక్కు తనువు తమ పవిత్ర చరణాలపై సమర్పించాను. నాదేమీలేదు. నేను తమవాడను. తమ ఆజ్ఞానువర్తిని" అన్నాడు.

రాజు మాటలకు మహర్షి మహదానందం పొందాడు. ప్రజలెల్లరు సంతోషించారు. రాజును అభయహస్తంతో ఆశీర్వదించి మహర్షి ఇలా అన్నాడు- "రాజయోగీ! నీవు ముముక్షువు కావటానికి అర్హుడవు. బ్రహ్మోపదేశానికి ఉత్తమాధికారివి. నిశ్చయంగా నీవు బ్రహ్మ స్వరూపుడవు. విదేహముక్తుడవు. అఖండ సచ్చిదానంద స్వరూపుడవు."

అది విని రాజు 'నేను వికారిని-అజ్ఞానిని. బ్రహ్మస్వరూపుడ నెట్లయినాను. అనుకొని మునిని "కథం జ్ఞాన మాప్నోతి...." అని ప్రశ్నించాడు. మహర్షి బ్రహ్మోపదేశం చేసి ఆత్మబోధ ప్రారంభించాడు.

## సంహిత

చివరకు ముని "బ్రహ్మోపదేశం కిరణంవలె తక్షణం ప్రసరించేదే సందేహం ఉందా?" అని అడిగాడు అప్పుడు జనకుడు "సంశయమేఘం విచ్ఛిన్నమైపోయింది. శాస్త్ర వచనాలు త్రికాల సత్యాలు. అపరిమిత కరుణతో నను ధన్యాత్ముణ్ణి చేశారు." అన్నాడు.

అది ఆలకించి మహర్షి అప్పుడు బోధించిన ఆత్మబోధ "అష్టావక్ర సంహిత"యై ప్రచారం పొందింది. "ఆత్మవిద్య"గా అష్టావక్రగీత" ఆరాధింపబడుతున్నది. ఈ అష్టావక్ర సంహిత వేదాంత విచారణ సార సంగ్రహం. ఈ బోధామృతం గ్రోలి జనకమహారాజయోగి పొందిన ఆత్మానందం అనిర్వాచ్యం అద్భుతం. అనితరసాధ్యం.

* * *

# వి ష య సూ చి క

నీ కోవె లెక్కడ ? నిర్గుణచతురాస్య !
అదీ నా శరీరమై అలరు చుండె
నీ పీఠమెక్కడ ? ఓ పురుషోత్తమా !
అది నా మనోబ్జమై అందగించె
నీ తీర్థ మెక్కడ ? నీలకంఠస్వామి !
అదీ నా నరాలలో ఒదిగి పారె
నీ దివ్వె యెక్కడ ? అది పరంజ్యోతి !
అది నా సుదృక్కులో కదలసాగె
నీవు నన్నావరించియున్నావు-అది ఒ
కింత యెరుగక లోక విహీనగతుల
విసివి నినుజూడ వచ్చిన వేళలందు
ఎక్కడో 'నేను' జారిపోయినది దేవ !

# గురూపదేశం

## సంప్రశ్న

జనక ఉవాచ :—

కథం జ్ఞాన మవాప్నోతి కథం ముక్తి ర్భవిష్యతి
వైరాగ్యంచ కథం ప్రాప్తం ఏతద్బ్రూహి మమ ప్రభో !

ప్రభో ! జ్ఞానం కథం అవాప్నోతి=ప్రభూ ! పురుషుడు జ్ఞానం ఎట్లు పొందుతున్నాడు ?; ముక్తిం కథం భవిష్యతి= ముక్తి ఎట్లు కల్గుతుంది ?; చ వైరాగ్యం కథం ప్రాప్తమ్=మరి వైరాగ్యం ఎట్లు ప్రాప్తిస్తుంది ?; ఏతత్ మమ బ్రూహి= దీనిని నాకు చెప్పవలసింది.

శ్రీ జనక మహారాజు వినమ్రుడై శ్రీ అష్టావక్ర మహర్షి పాద పద్మములకు నమస్కారం చేసి ఇలా సంప్రశ్న చేశాడు. "ఆత్మజ్ఞానం ఎలా లభిస్తుంది ? ముక్తి ఏ విధంగా ప్రాప్తిస్తుంది ? వైరాగ్యం కలిగే మార్గం ఏమిటి ? వివరించండి స్వామీ !" అని.

అష్టావక్ర మహర్షి జనకుని సంప్రశ్నం విని సంతోషించాడు. ఆనందించి ఆలోచించసాగాడు. ఈ చరాచర జగత్తులో మానవులు నాలుగు విధాలు. ఒక రకం జ్ఞానులు. రెండవ రకం ముముక్షువులు, వీరే జిజ్ఞాసువులు. మూడవ రకం అజ్ఞానులు. నాలుగవ రకం మూఢచిత్తులు.

జ్ఞానులకు సంశయాలు విపర్యాయాలుండవు. వీరు అహరహం ఆత్మజ్ఞానంలో ఆనందిస్తూంటారు. ఇంకా సందేహాలున్నాయి కాబట్టి ఈ రాజు పండిపోయిన ఆత్మజ్ఞాని కాదు.

అజ్ఞానులకు అడుగడుగునా సంశయాలు సంకోచాలు అనేకం. ఇంద్రభోగాలు ఎక్కడో ఉన్నాయి. అవి తమకు దక్కాలని పేరాశ, దురాశ ఎక్కువ వీరికి. ఈ రాజుకు ఐశ్వర్యాల మీద అపేక్ష లేదు కాబట్టి ఈయన అజ్ఞానికాదు.

మూఢ చిత్తులున్నారంటే వారు పెద్దలకు నమస్కారమే చేయరు. వారు

కేవలం ధనమదాంధులు. గర్వం తలకెక్కి ఉంటుంది. ఇక్కడ ఈ మహర్షి ఈ మూడు వర్గాలకూ చెందినవాడుకాదు.

ఇకపోతే ఈయన ముముక్షువు అయిఉంటాడు సంప్రశ్న చేశాడు జిజ్ఞాస బాగా వుంది. అన్ని అర్హతలున్నాయి. ఆత్మ విద్యకు అనుకూలుడు. స్వా లేకుండా సద్విద్య రాదుకదా ! సుబోధ చేద్దాము. శుభం అనుకొన్నాడు అష్టావ మహర్షి .

## విషయాలు విసర్జించు

అష్టావక్ర ఉవాచ :—

ముక్తి మిచ్ఛసి చేత్తాత !విషయాన్ విషవత్ త్యజ
క్షమార్జవ దయా తోష సత్యం పీయూషవ ద్భజ

తాత ! ముక్తిం ఇచ్ఛసి చేత్=నాయనా ! ముక్తిని కోరుచున్నవాడవై విషయాన్ విషవత్ త్యజ=విషయాలను విషం వలె త్యజించు; చ క్షమా దయా తోష సత్యం పీయూషవత్ భజ=మరి ఓర్మి, ఋజుత్వం, దయ, సత్య అమృతం వలె సేవించు

హే ప్రియ జిజ్ఞాసువైన రాజా ! నీవు ముక్తి కోరుకొంటే ముందు క్రోధ మద మోహ లోభ దంభాది విషయాలను విషం వలె పరిత్యజించు. ఆర్జవం దయ సంతోషం సత్యాలను అమృతంవలె సేవించు.

చెవి, కన్ను, నాలుక, నాసిక, చర్మం శబ్ద రూప రస గంధ స్పర్శ లక్ష గలవి. ఈ జ్ఞానేంద్రియ స్వభావ గుణాలకు నీవు వశం కాకూడదు. వాటిని వశం చేసికోవాలి. వాటికి నీవు దాసుడవైనావా అవి నీ మీద స్వారి చేస్ నీ కపుడు పతనమే గతి. వాటికి నీవు స్వామివి కావాలి. వాటిని నీ అధీ ఉంచుకోవాలి.

అప్రాప్త వస్తువులపై ఆసక్తి చూపించకు. ప్రాప్తించిన వాటిని నియమంగా నిష్ఠగా మితంగా మనస్సంయమనంతో వాడుకో. చిత్తాన్ని వాటి చేయకు. అవి చిత్తానికి వశం కావాలి. ఆసక్తి అపేక్ష వాంచలు విషపద

ముందు వాంఛను జయించు. అసత్య భాషణం అనర్థం కలిగిస్తుంది. అవమానం కలిగిస్తుంది. ఆవేదన కలిగిస్తుంది. నియమాన్ని సంయమాన్ని తొలగిస్తుంది.

కనుక ఇంద్రియాల విషయం చాలా జాగ్రత్తగా ఉండాలి. మనస్సంయమము **అతి ముఖ్యం. అపుడు** రాజర్షివై ఎన్ని కార్యాలు నిర్వహించినా అవి నీ మనస్సుకు **అంటవు.** కామరహితంగా కర్తవ్యాలు చేస్తుండాలి. రాజ్యం చేసుకో ఆసక్తిని త్యాజ్యంచేయి. యోగివై భోగాలు అనుభవించు. రాగివి కాబోకు. విరాగివి కావాలి.

రాగం త్యజించు. విషయభోగాలను ఆ దృష్టితో ఆ భావంతో చూచి ఆత్మ విచారం చేసికో. సత్వగుణం అలవరచుకో. దేహం దేవాలయం. దేవాలయం పరిశుభ్రంగా పవిత్రంగా పరమ రమణీయంగా ఉండాలి. అలంకారాలు చేయాలి. ఆచారాలు జరపాలి. అనర్థాలు తొలగించాలి. ఆత్మవిచారం కలిగించాలి.

## నీవు పంచభూతాలు కావు !

న పృథ్వీ న జలం నాగ్నిః న వాయు ద్యౌర్నవా భవాన్
ఏషాం సాక్షిణ మాత్మానం చిద్రూపం విద్ధి ముక్తయే

భవాన్ న పృధివీ న జలం న అగ్నిః న వాయుః నద్యౌ=నీవు భూమివీ కావు, జలానివీకావు, అగ్నివీ కావు, గాలివీ కావు, గగనానివీ కావు; వా ముక్తయే ఏషాం సాక్షిణం చిద్రూపం=అయితే ముక్తికొరకు వీటికి సాక్షివి, చిద్రూపుడవు ఆత్మవై యున్న నీవు; ఆత్మానం విద్ధి=నిన్ను తెలుసుకో.

రాజా! నీవు పృథ్వివి కావు. జలానివి కావు. అగ్నివి కావు. వాయువువికావు. ఆకాశానివి కావు. ఈ పంచభూతాలలో నీవు ఏదీ కావు. ఇవి దేహధర్మాలు ఆత్మ ధర్మాలు కావు. నీవు ఆత్మవు. దేహానికి నీవు సాక్షిమాత్రుడవు. నీవు చిద్రూపుడవు. ఇది దృఢంగా నమ్మితే ఆత్మసాక్షాత్కారం లభిస్తుంది. ఆనందం అబ్బుతుంది. నీకు ముక్తి కలుగుతుంది.

ఆత్మజ్ఞానాన్ని దాని స్వరూప స్వభావాలను వివరిస్తాను సావధానుడవై ఆలకించు— అనాది కాలం నుండి ఆత్మ దేహం కలిసి ఉంటున్నాయి. అందువల్ల అల్పజ్ఞులు ఆత్మ దేహం ఒకటే అనుకొంటున్నారు. అందువల్ల జనన మరణాలు తప్పటంలేదు. ఇది అజ్ఞానం. ఇది పోవాలంటే ఆత్మజ్ఞానం అలవడాలి.

పంచభూతాలు నీలో ఉన్నాయి. కానీ అవి నీవు కావు. అందులో ఏ ఒక్క నీవు కావు. ఈ ఇంద్రియ తత్త్వాలు అన్నీ శరీర సంబంధాలు. శరీరాలు క్షణ భంగురాలు. శరీరం క్షణక్షణం మారిపోతుంటుంది. దీనికి అవస్థలు అనేకం శైశవావస్థ, బాల్యావస్థ, కౌమారావస్థ, యువావస్థ, వృద్ధావస్థ—శరీరం ఏ అవ లోనూ స్థిరంగా వుండదు. ఆత్మ ఈ అవస్థలను అనుభవించదు. ఆత్మ అనుక్ష మారదు. సుస్థిరంగా విరాజిల్లుతూ వుంటుంది. ఆత్మ దైహిక చర్యలకు సా ప్రత్యక్షసాక్షి. నీవు చిద్రూపుడవు. అంటే నిత్య సత్యమూర్తి వి. మాన్య చైత మూర్తి వి. ఇది తెలిసికో.

ఇంటి యజమాని ఉన్నాడు. ఇది నా యిల్లు. నా పొలం. నా మేడ. నా భా నా పుత్రులు అనుకొంటాడు. కానీ అతను అవి వేరువేరు కదా! అలానే మాన ఇది నా శరీరం. నా ఇంద్రియాలు అనుకొంటాడు. అవి వేరు. ఆత్మ అన్నిటికీ ఘాతం. 'అయమాత్మాబ్రహ్మ' ఈ ఆత్మబ్రహ్మం. బ్రహ్మం అంటే సర్వ మూలం. అంటే ఈశ్వరుడు.

సారాంశం ఏమిటి అంటే భూమ్యాది పంచభూతాలూ, వాటి కార్యకలా నిర్వహించే స్థూల శరీరం, ఇంద్రియాలూ వాటి విషయాలైన శబ్ద రస గంధా అన్నీ వేరు. నీవు వేరు. నీవు అన్నిటికీ సాక్షివి. నీ రూపం పరమాత్మ స్వరూ నీవు పరమాత్మవు. ఈ జ్ఞానమే ఆత్మజ్ఞానం.

* *

"న భూమి న తోయం న తేజో న వాయుః
న ఖం నేంద్రియం వా నతేషాం సమూహః
అనేకాంతి కత్వాత్ సుషుప్తైనికసిద్ధః
తదేకో వశిష్ట శ్శివకేవలోఽహమ్"

— శ్రీ శంకర

## భ్రాంతి త్యాగమే ముక్తి

యది దేహం పృథక్కృత్య చితివిశ్రామ్య తిష్ఠతి
అధునైవ సుఖీ శాంతః బంధముక్తో భవిష్యసి

దేహం పృథక్కృత్య=దేహం వేరుచేసి; చితి విశ్రామ్య తిష్ఠసి

చైతన్యాత్మలో విశ్రాంతిపొంది ఉంటున్న వాడవైతే: అధునా ఏవ సుఖీ శాంతః బంధ ముక్తః భవిష్యసి=ఇప్పుడే సుఖివి శాంతుడవు బంధముక్తుడవు కాగలవు:

జ్ఞానార్థీ ! నీవు దేహం వేరు-ఆత్మ వేరు-దేహం అస్థిరం-ఆత్మ సుస్థిరం అని తెలిసికొని ఆత్మపీఠంపై విశ్రమించావంటే ఇప్పుడే సుఖం లభిస్తుంది. బంధాలు విడిపోతాయి. శాంతి చేకూరుతుంది.

చిత్తంలో జడగ్రంధి నశించగానే జీవుడికి బంధాలు విడిపోతాయి. బంధం పోతే ముక్తే. ఈ విషయాన్ని 'శివగీత' ఇలా వివరిస్తుంది—

మోక్షస్య నహి వాసోఽస్తి నగ్రామాంతరమేవ వా
అజ్ఞాన హృదయగ్రంధినాశో మోక్ష ఇతి స్మృతః

మోక్షం అంటే అది ఎక్కడో ఏ లోకంలోనో ! ఏ గ్రామంలోనో ! వనాల్లోనో భవనాల్లోనో ! దాగి నివాసం చేయటంలేదు. హృదయంలోని జడగ్రంధి నాశనం కావటమే మోక్షం. అంతఃకరణం జడం. కర్తృత్వ భోక్తృత్వాలు అంతఃకరణ ధర్మాలు. అవి ఆత్మలో ప్రతిఫలిస్తాయి. అవి ఆత్మవే అనిపిస్తాయి.

ఇనుపగుండు అగ్నిలో కాలి కాలి వేడెక్కి ఎర్రబడుతుంది. చెయ్యి తగిలితే కాలుతుంది. అపుడు అంటారు- "ఇనుపగుండు గుండ్రంగా వుంటుంది. ఇనుపగుండు కాలుతుంది. ఇనపగుండును తాకరాదు అని. కాల్చటం ఇనపగుండు ధర్మంకాదు. గుండ్రంగా ఉండటం నిప్పు ధర్మంకాదు. కానీ నిప్పు-గుండు తాదాత్మ్యం చెందటంతో నిప్పు గుండ్రంగా ఉండటం ఇనుపగుండు కాలటం అధ్యాసం. అగ్ని ధర్మం గుండులోకి వచ్చింది. గుండు రూపం అగ్నిలోకి వచ్చింది.

అంతఃకరణంతో ఆత్మ తాదాత్మ్యం చెందటంవల్ల ఆత్మధర్మాలు అంతఃకరణకు వచ్చాయి. అంతఃకరణవైన కర్తృత్వ భోక్తృత్వధర్మాలు ఆత్మకువచ్చాయి. మానవులు అజ్ఞానంలోపడి కర్త భోక్త ఆత్మ అని అంటారు జనన మరణ బంధనాలు తగిలించుకొంటారు. ఆత్మజ్ఞానం కలిగిన యోగి తాను కర్త కాదూ భోక్త కాదూ. శుద్ధ బుద్ధ అసంగ అవినాశిని అని భావిస్తాడు.

కర్తృత్వాది ధర్మాలు అంతఃకరణవి అని నిశ్చయించుకొంటాడు. తాను కర్మసాక్షీ మాత్రుడై అంతఃకరణకు ప్రకాశం ప్రసాదిస్తాడు. అపుడు అధ్యాస నాశం అవుతుంది. అజ్ఞానం అంతంకావటమే ముక్తి. అంతేకాని ముక్తి ఎక్కడ నుంచో ఊడి పడదు.

కనుక దేహాభిమానం విడిచిపెట్టు. సర్వేంద్రియాలకు విలక్షణుడవై ప్రవర్తించు. కర్తృత్వ భోక్తృత్వ అనర్థాలను అంటుకోనకు. చార్వాకులు—తార్కికులు-పూర్వమీమాంసకులు-బౌద్ధులు దేహ పతనం ముక్తి అంటారు. కానీ అది తప్పు. ఆత్మజ్ఞానం చేతనే జీవన్ముక్తి అని అన్నారు ఋషులు.

## నీవు విశ్వసాక్షివి

న త్వం విప్రాదికోవర్ణో నాశ్రమీ నాక్ష గోచరః
అసంగోఽసి నిరాకారో విశ్వసాక్షీ సుఖీభవ

త్వం న విప్రాదికః వర్ణః=నీవు విప్రాది జాతి వర్ణుడవు కావు; న ఆశ్రమీ=నాల్గు ఆశ్రమాలకు చెందినవాడు కావు; న అక్షగోచరం=ఇంద్రియ గోచరుడవు కావు; అసంగః=సంగరహితుడవు; నిరాకార=నిరాకారుడవు; విశ్వసాక్షీ అసి=విశ్వానికి సాక్షి వగుతున్నావు; సుఖీభవ=సుఖివిగమ్ము;

వత్సా ! నీవు విప్రుడు వైశ్యుడు మొదలైన వర్ణాలకు చెందినవాడవు కావు. అలాకాదని సన్యాస వానప్రస్థయతి మొదలైన ఆశ్రమవాసులకు చెందినవాడవూ కావు.

జడప్రాయమైన స్థూల సూక్ష్మ కారణ శరీరాలకు చెందిన వాడవూ కావు. ఇంద్రియగోచరుడవూ కావు. నీవు సంగరహితుడవు. నిరాకారుడవు. నిరంజనుడవు. విశ్వసాక్షివి. ప్రత్యగాత్మవు. ఇది తెలిసికొని సుఖంగా వుండు.

సచ్చిదానంద ఆత్మ నిర్గుణమూ నిర్మలమూ. అది ఒక్కటే సర్వత్ర వ్యాప్తమైవుంది అనంత ఆకాశంవలె. కానీ ఆకాశం ఒకటే అయినా ఉపాధుల భేదం అనుసరించి ఘటాకాశం అనీ నీలాకాశం అనీ వర్షాకాశం అనీ స్వర్ణాకాశం అనీ మహాకాశం అనీ పేర్లు వస్తుంటాయి. వాస్తవానికి ఆకాశంలో భేదంలేదు. పాత్రలను బట్టే ఆకాశానికి కూడ వివిధ నామాలు. అంతటావున్న ఆకాశంఒక్కటే. ప్రాంతాలు పరిసరాలు పాత్రలు పరిమితులు పదార్థాలు రంగులు పొంగులు వీటి భేదం ఆకాశంలో ప్రతీయమానమవుతాయి.

అలానే ఆత్మ. ఆత్మకు అంతఃకరణకు వాస్తవంగా సంబంధంలేదు. అయినా అంతఃకరణ ధర్మాలైన సుఖదుఃఖాలు ఆత్మవే అనిపిస్తాయి. నిజానికి ఆత్మకు సుఖ దుఃఖాలతో గానీ భూతభవిష్యద్వర్తమాన కాలాలతోగానీ సంబంధం లేదు. సుఖ

దుఃఖాలు మనోధర్మాలు,-అన్నిటికీ అది సాక్షి మాత్రమే. అది అసంగం. అట్టి ఆత్మ స్వరూపుడవు నీవు. ఇది తెలిసికో. సుఖం లభిస్తుంది.

అనగా విని జనక మహారాజు మరో ప్రశ్నపూర్వకంగా సందేహం వెలువరించాడు. "భగవాన్! వేదాలు మానవులకు వర్ణాశ్రమధర్మాలు నియమించాయి కదా! ధర్మాలు అతిక్రమిస్తే అపచారం చేసి పతితులౌతారుకదా! కర్త కాకుండా యజ్ఞయాగాది పుణ్యకార్యాలు ఎలా నిర్వహించబడతాయి ? ధర్మచ్యుతులు కారా పౌరులు? అకర్త అభోక్త అయితే ఎలా లోక వ్యవహారం ? ఈ ధర్మ సంకటం ఎలా పరిష్కార మవుతుంది? తెలియజెప్పండి స్వామీ!" అన్నాడు.

అపుడు అష్టావక్ర మహర్షి జనక చక్రవర్తికి ఇలా వివరించాడు- "రాజా! వేదాలు వర్ణాశ్రమ ధర్మాలు లౌకికులకు చెప్పాయి. మనుష్యులు అనేక రకాలు. అనేక వర్గాలు. అందరికీ ఒకే ఔషధం పని చేయదు. అందరు ఆత్మజ్ఞానులూ కాదు. పండితులూ కాదు. జ్ఞానులూ అజ్ఞానులూ. మందబుద్ధులూ కుశాగ్రబుద్ధులూ పైదికులూ మూర్ఖులూ మూఢులూ స్వార్థులూ నిస్వార్థులూ శక్తి గలవారూ శక్తి లేనివారూ స్త్రీలూ పురుషులూ ఇలా వివిధ వర్గాలు కదా! ముముక్షువుల ధర్మాలు వేరు మూర్ఖుల ధర్మాలు వేరు. వారి వారికి తగినట్లు వేదమాత ధర్మాలు ధర్మ రహస్యాలు ధర్మ సూక్ష్మాలు అనేకం బోధించింది. కాలాన్ని అనుసరించి ధర్మ నిర్ణయాలు మహాత్ములైన మహర్షులు చేస్తారు. ఆ సద్గురువరేణ్యుల ఆదేశానుసారం నడుచుకోవటమే మిగిలినవారి విధి. అందుకనే ఆచార్యపీఠాలు వెలిశాయి. అంతేవాసులు అధ్యయనాలు చేస్తున్నారు. ఇవి అన్నీ ఇంద్రియగోచరాలు దేహధర్మాలు. ఆత్మజ్ఞానామృతంత్రాగి తృప్తి చెంది ఆత్మ విద్యలో కృతకృత్యుడైనవాడు కర్మకలాపం అంతా చేసినవాడే సుమా! వాడు చేయవలసిన విధి విధానాలు ఏమీలేవు. అలా కర్మలు చేయాలి అనుకొంటే అతడు ఆత్మవిదుడు కాదన్నమాట. భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు జిజ్ఞాసువులకు కర్మనిషిద్ధం అన్నాడు-

"జిజ్ఞాసురపి యోగస్య శబ్దం బ్రహ్మాతి వర్తతే"

జిజ్ఞాసుపైన శబ్దబ్రహ్మ వేదాల ఆజ్ఞలను ఉల్లంఘించి వర్తిస్తాడు. జిజ్ఞాసువుపైన వేదశాసనాలు వర్తించవు. అవి అన్నీ అన్యులకు.

జనకా ! నీవు జిజ్ఞాసుల వర్గంలోనివాడవు. నీకవి వర్తించవు. నీవు చేయాలి

అని అభిలషిస్తే నిష్కామంగా ఆత్మసాక్షిగా లోకాచారం కొరకు చేయి. మనుష్యకుల మార్గదర్శకం అనుకుంటే ఇవి ఆత్మధర్మం కాదు. అంతఃకరణ ధర్మం అని చేయి. తప్పులేదు.

## స దా ము క్తు డ వు

ధర్మాధర్మౌ సుఖం దుఃఖం మానసాని నతే విభో
న కర్తాసి న భోక్తాసి ముక్తఏవాసి సర్వదా 6

విభో! తే=ప్రభూ! నీకు; మానసాని=మనస్సంబంధాలైన; ధర్మాధర్మౌ= ధర్మాలు అధర్మాలు; సుఖం దుఃఖం=సుఖాలు దుఃఖాలు; న=లేవు; త్వం=నీవు; చ నకర్తాసి=మరి నీవు కర్తవు కావు; న భోక్తాసి=భోక్తవుకావు; సర్వదా= సర్వకాలంలో; ముక్త ఏవ అసి=ముక్తుడవే అయియున్నావు.

ప్రభూ ! ధర్మాధర్మాలు సుఖదుఃఖాలు మనోధర్మాలు. ఇవి నీ స్వభావాలు కావు. నీవు వీటికి కర్తవు కావు. భోక్తవుకావు. నీవు సదా ముక్త పురుషుడవు. నీ స్వరూపం విశ్వవ్యాపకం. నీవు శుద్ధ బుద్ధ స్వరూపుడవు. చిన్మాత్రుడవు.

అజ్ఞానం వల్ల సుఖదుఃఖాలు సంభవిస్తాయి. ఆత్మజ్ఞానఫలం చిదానందం. చిదానందంచేత అజ్ఞానం తొలుగుతుంది. అపుడు అజ్ఞాన జనితాలైన సుఖదుఃఖాలు నశించిపోతాయి. కాబట్టి అజ్ఞానం అంతరించాలి.

* *

అశ్మకముని జనకునితో ఈ విధంగా పలికినట్లు తెలుస్తున్నది-

జనన జరా మరణ గ్రా
హానిబిడ కాలాబ్ధి మగ్న మని జగము నెరిం
గిన వాడు ధర్మ వర్తన
మున నుండుం చింతదక్కి భూపవరేణ్యా!

—తిక్కన - భారతం - శాంతిపర్వం.

## ద్రష్టవు

ఏకోద్రష్టాసి సర్వస్య ముక్తప్రాయోఽసి సర్వదా
అయమేవహి తే బంధో ద్రష్టారం పశ్యసీతరమ్ 7

సర్వస్య=సర్వాన్ని: ద్రష్టాసి=చూచువాడవు: త్వం ఏకః అసి=నీవు ఒక్కడవే; చ=మరి; సర్వదా=నిరంతరం; ముక్తప్రాయోఽసి=ముక్త ప్రాయుడవు; ద్రష్టారం=చూచువానిని; ఇతరం=ఇతరునిగా; పశ్యతీతి యత్= చూచుచున్నావనేది ఏది కలదో: అయమేవ తే బంధః=అదే నీకు బంధం; హి=ఇది నిశ్చయం!

దివ్య ఆత్మ స్వరూపా! నీవు అన్నిటినీ చూచేవాడివి. నీవే ఏకైక సచ్చిదానందమూర్తివి. ముక్త పురుషుడివి. నీకు త్రికాలాలలోనూ బంధాలు లేవు. ఆదిత్యుడిలో ఎప్పుడూ అంధకారం ఉండదు అలానే నీలో నిరంతరం జ్ఞానప్రకాశం ఉంది అజ్ఞానం లేదు. అజ్ఞానం అనుకొని కళ్ళు మూసుకొంటున్నావు కళ్ళుతెరువు అంతా ప్రకాశమే ఈ జగత్తుకు నీవు ద్రష్టవు చిదాత్మవు. నేనసమర్థుణ్ణి అనుకొంటున్నావు ఇదే అజ్ఞానం. బంధనం.

ఇతరుడెవరో ద్రష్ట. నేను కర్తను ఫలం అనుభవించేవాణ్ణి నేనే అనుకొంటారు అజ్ఞానులు. జ్ఞానులు అలా అనుకొనరు. దేహాధ్యాస వల్ల బంధమున్నట్లు కనపడుతున్నది. కాని నీకు బంధం లేదు. దేహాది సర్వప్రపంచం నీవే అనుకొంటే అదే నీకు బంధం అవుతుంది. బాహ్యదృష్టి గలవాడికి ప్రాతీతికం బంధం. ప్రాతీతికం అంటే స్వప్నంవలె అప్పటికున్నట్లు అనిపించి మేల్కొని విచారణచేస్తే ఏమీలేనిది.

* *

అపాణి పాదోఽహ మచింత్య శక్తిః
పశ్యామ్యచక్షుః సశ్రుణోమ్యకర్ణః
అహం విజానామి వివిక్తరూపో
నచాస్తి వేత్తా మమ చిత్సదాఽహమ్

—కైవల్యోపనిషత్తు

నాకు ఏ అవయవాలూ లేవు. నా శక్తి అనంతం కళ్ళు లేకుండా చూస్తున్నాను. చెవులు లేకుండా వింటున్నాను నాకు ఏ రూపమూ లేదు. నాకు సర్వం తెలుసు. నన్ను తెలిసికొనేది వేరే ఏదీ లేదు. నేను నిత్యశుద్ధ జ్ఞాన జ్యోతిని నేను జ్ఞానానంద మూర్తిని.

## సు ఖీ భ వ !

అహం కర్తే త్యహమ్మాన మహాకృష్ణాహి దంశితః
నాహం కర్తేతి విశ్వాసామృతం పీత్వా సుఖీభవ 8

అహం కర్తా ఇతి=నేను కర్తను అని; అహంమాన=అహం కారం అనే మహా కృష్ణాహి దంశితః=మహాకాలనాగంచేత కరువబడిన వాడవైన శ్రీ నా హంకర్తా=నేను కర్తను కాను; ఇతి=అనే; విశ్వాసామృతం=విశ్వాసం అనేటి వంటి అమృతం; పీత్వా సుఖీభవ=త్రాగి సుఖివిగమ్ము.

ఆత్మ విద్యార్థీ ! కర్తృత్వాభిమానం అంటే నేను కర్తను అన్ని పనుల నేను చేయగలను అనే గర్వం. లేక అహంకారం ఈ అహంకార గర్వం చాల చెడ్డది. ఇది కృష్ణ సర్పం వంటిది ఈ అహకారం వల్ల కలిగే సుఖదుఃఖాలు అనుభవించటమే సర్పదష్టులు కావటం

ఈ అహంభావం కాకుండగా "నేను కర్తను కాను. అన్నిటికీ కర్త పరమేశ్వరుడే. నేను ఆత్మను. నేను కేవలం సాక్షీభూతుణ్ణి." అనే దృఢ విశ్వాసం అమృతం వంటిది. అట్టి అమృతంగ్రోలి పరమానందం పరమ సుఖం అనుభవించు

దేహాభిమానమే బంధహేతువు. అది అనర్థహేతువు. ఇది తెలిసికో ! ఇక పరమ సుఖం కలుగుతుంది.

## శో కం వి డి చి పె ట్టు

ఏకో విశుద్ధ బోధోఽహం ఇతి నిశ్చయ వహ్నినా
ప్రజ్వాల్యాజ్ఞానగహనం వీతశోకః సుఖీభవ ! 9

అహం ఏకః=నేను ఒక్కడను; విశుద్ధబోధః=శుద్ధ జ్ఞాన స్వరూపుడః

ఇతి=అను: నిశ్చయ వహ్నినా=నిశ్చయాగ్నిచేత: అజ్ఞాన గహనం=అజ్ఞానారణ్యం; ప్రజ్వాల్య=ప్రజ్వలింపజేసికొని; వీతశోకః=శోకం వీడినవాడవై; సుఖీభవ=సుఖివికమ్ము:

ఓ జనక రాజా ! యోగి అయినవాడు ఇలా నిశ్చయించుకొనాలి- "నాకు ఏ విధమైన భేద భావాలు లేవు. నేను స్వప్రకాశ చిదాత్మను. సర్వవిశ్వం నేనై వెలుగుతున్నాను. నేనే సర్వత్ర నిండియున్నాను. నేను ఏకైక పురుషుడను అన్ని రూపాలు నా ప్రతిబింబాలే. నేను శుద్ధ బుద్ధ స్వరూపుడను"

ఈ నిశ్చయ జ్ఞానాగ్నితో అజ్ఞాన వనాన్ని కాల్చివేయి. అపుడు నీవు జ్ఞాన స్వరూపుడవౌతావు. ఇక శోకం కించిత్తు కూడా రాదు. సుఖంగా ఉంటుంది.

ఈ నిశ్చయం అమృతం వలె సేవించు. విశ్వమంతా నేనే నిండి ఉన్నాను అనే విశాల భావం కలిగినప్పుడు ఇక నీలోకి విజాతీయ సజాతీయ స్వగత భేదాలు రావు. బాగా ఆలోచించుకో.

ఒక వృక్షం ఉందనుకో. ఆ వృక్షానికి మరో వృక్షానికి గల భేదాలు సజాతీయ భేదాలు. వృక్షములకు రాయిరప్పలకు గల భేదాలు అసంబంధిత ఘట పటాది ఆకార భేదాలు విజాతీయ భేదాలు. వృక్షంలోని పత్రాలు-పుష్పాలు-ఫలాలు వాటి భేదాలు శాఖాదుల భేదాలు స్వగత భేదాలు. ఇవే అవయవ ఇంద్రియాదుల భేదాలు.

నీవు విశ్వాత్ముడవు. విశ్వవ్యాపకుడవు. ఆత్మయే నీవు. నీవే ఆత్మ. ఆత్మ పారమార్థిక సత్యం. ఆత్మ నిత్యం. విశ్వమంతా నిండి ఉన్నది ఇదే కాని మరొకటి లేదు.

ఈ ఆత్మకు సజాతీయ విజాతీయ స్వగత భేదాలు లేవు. ఇవి, ఈ భేదాలు పరిమిత వ్యావహారిక భేదాలున్నవారికే. ఇవి ఆత్మేతర పదార్థాలు. ఇవి పారమార్థిక సత్తాకలవి కావు. అందువల్ల ఈ ఆత్మేతరం అన్నీ మిథ్య.

"ఏకమే వాద్వితీయం బ్రహ్మ" —శ్రుతి

"బ్రహ్మ భిన్నం సర్వం మిథ్య బ్రహ్మ భిన్న త్వాత్—"

బ్రహ్మకు భిన్నమైనదంతా మిథ్య. బ్రహ్మకు వేరైన కారణంచేత ముత్తెపు చిప్పలో వెండి వెలుగువలె విశ్వం బ్రహ్మంలో కనిపిస్తుంది. ఈ అనుమాన ప్రమాణంతో విశ్వం యొక్క మిథ్యాత్వం సిద్ధమవుతుంది. కనుక ఆత్మకు సజాతీయ

స్వగత విజాతీయ భేదాలు లేవు. ఆత్మకు దేశకాల వస్తు పరిమిత అవధులు లేవు. దేశకాల వస్తు పరిమిత అవధులు పరిచ్ఛిన్న పదార్థాలకే ఉంటాయి. వ్యాపకాని! ఉండవు. ఆత్మ సర్వవ్యాపి.

వస్తువు ఒక కాలంలో ఉంటుంది మరో కాలంలో ఉండదు. కనుక వస్తు కాల పరిచ్ఛేదంలో పరిమితం. ఘట పటాది వస్తువు లట్టివి. ఆత్మ మూడు కాలాలలో స్థిరంగా ఉంటుంది. ఒక వస్తువు రెండో వస్తువులో ఉండలేదు. ఘటంలో పట ఉండదు. అలానే పటంలో ఘటం ఉండదు.

ఆత్మ అన్ని వస్తువుల్లో ఉంటుంది. అందువల్ల ఆత్మకు దేశకాల వస్ పరిచ్ఛేదాలు లేవు. అది సర్వవ్యాపకం. ఆత్మకు అవిద్యా గంధం అంటదు. ఆత అతి నిర్మలం. అటువంటి ఆత్మ స్వరూపుడవు నీవు. బ్రహ్మవు.

*　　　　*

"ఏక మేవాద్వితీయం బ్రహ్మ"

## నీవు పరమానందుడవు

యత్ర విశ్వ మిదం భాతి కల్పితం రజ్జు సర్పవత్
ఆనంద పరమానందః స బోధ స్త్వం సుఖం చర 10

యత్ర=ఎక్కడైతే: ఇదం విశ్వం=ఈ విశ్వం: కల్పితం=కల్పి బడినదై: రజ్జు సర్పవత్ భాతి=త్రాటియందు పామువలె తోచుచున్నద సః=అ: ఆనంద పరమానందః=ఆనందాతీత పరమానంద స్వరూపుడ బోధః=జ్ఞానమూర్తి వి: త్వం అసి=నీవు అగుచున్నావు: సుఖం చర=సుఖ సంచరించు:

రాజా ! ఈ దృశ్యప్రపంచ మంతా రజ్జు సర్ప భ్రాంతితో ఉన్నది. భ్రా మంత మంతా మాయాకల్పితం. ఈ విశ్వం మాయాకల్పితం- నీవు పరమాన స్వరూపానివి. సుఖీభవ !

బ్రహ్మ మయమైన పరమాత్మలో ఈ విశ్వం రజ్జువులో కనుపించే సర్పంవ భ్రమగా భాసిస్తుంది. ఇది పరమాత్మలోని ఆనందరూపమే.

అయితే అల్పబుద్ధులకు అజ్ఞాన అంధకారంలో కదులుతున్న సర్పం వలె భ్రమపెట్టి భయపెడుతుంది. నిదానించి చూచి ఇది త్రాడు అని గ్రహించి సంతోషించి నట్లు జ్ఞాని ప్రపంచం పరమాత్మ స్వరూపం అని తృప్తి చెందుతాడు. రాజయోగీ! నీవే పరమాత్మవు.

ఈ దృశ్య ప్రపంచం అంతా అస్థిరం. అనిశ్చితం. మిథ్య. క్షణ క్షణం మారుతూ ఉంటుంది. ఇది స్వప్న ప్రపంచం. మానవుడు స్వప్నంలో వ్యాఘ్రా లను చూచి భయపడతాడు. భయంకర దృశ్యాలు చూచి దుఃఖిస్తాడు. మనోహర దృశ్యాలు చూచి సంతోషిస్తాడు. స్వప్నం తొలిగిన తర్వాత కల కల్లకదా అనుకొని దుఃఖమూ పొందడు, సంతోషమూ పొందడు. అలాంటిదే ఈ విశ్వం.

అజ్ఞానం అంతరిస్తే జగద్భ్రమ దూరమవుతుంది. బ్రహ్మ సాక్షాత్కారం అవుతుంది. నిజం తెలుస్తుంది. భ్రమ—భయం తొలిగిపోతుంది. ఆనందం అనుభవం లోకి వస్తుంది. లౌకిక భోగాలలో సుఖం ఉంది అనుకోవటం అజ్ఞానం. మరుస్థలంలో మరీచికలు చూచి దాహం తీర్చుకొందాము అనుకొన్నట్లుంటుంది.

ఆత్మజ్ఞానం కలిగితే ఈ భ్రమలు దూరమవుతాయి. మిథ్యా స్వరూప చిత్రమే విశ్వం. ఇది నిత్యనాటకశాల. ఇది నాటకరంగం అని తెలిస్తే చూచి దుఃఖించవు. సంతోషిస్తావు. పరిణామం ఏదయినా సంతోషంగానే ఉంటుంది. అందులో నీవూ పాత్రధారివే. ఇది ఎరిగి నటించు. సూత్రధారి భగవానుడు. భగవానుడితో కలిసిపో, సుఖపడతావు.

ఆనందం మూడు విధాలు. 1. మనుష్యానందం 2. దేవానందం 3. బ్రహ్మానందం. ఇదే పరమానందం. ఇది అత్యున్నతం. అతి ముఖ్యం. ఆత్మానుభవానందమే బ్రహ్మానందం. మిగిలినవి అత్యల్పాలు. నీవు బ్రహ్మానంద స్వరూపుడవు.

## మ తి - గ తి

ముక్తాభిమానీ ముక్తో హి బద్ధో బద్ధాభిమాన్యపి
కిం వదంతీ హ సత్యేయం యా మతిః సా గతి ర్భవేత్ 11

ముక్తాభిమానీ ముక్తః=ముక్తిపై అభిమానం గలవాడు ముక్తుడౌతున్నాడు బద్ధాభిమానీ=సంసారబంధంపై అభిమానం గలవాడు; బద్ధః=బద్ధుడౌతున్నాడు యా మతిః=మతి ఎటువంటిదైతే; సా గతిః=గతి అటువంటిది; భవేత్=అగును ఇతి=ఈ విధమైన; ఇయం కిం వదంతి=ఈ లోక ప్రవాదం; సత్యా=సత్యమైనది.

రాజేంద్రా ! "నేను ముక్తుడను" అనే నిశ్చయ బుద్ధి గలవాడు ముక్తుడవుతాడు. "నేను సంసారబద్ధుడను" అనుకొనేవాడు అలానే సంసార బద్ధుడవుతాడు. మతిని బట్టి గతి జరుగుతూ ఉంటుంది. బంధ మోక్షాలు రెండూ అభిమాన కల్పితాలే వాస్తవాలు కావు. జ్ఞాని ఈ రెండింటికీ అతీతుడు. వానికి రెండూలేవు. వాడు నిర్గుణుడు నిరంజనుడు. నిర్వికారుడు;

పరమార్థ దశలో ఆత్మ ఒక్కటే. సత్యం—నిత్యం. మిగిలింది అంతా మాయాకల్పితం—అసత్యం.

"తం విద్యా కర్మణీ సమార భేతే పూర్వ ప్రజ్ఞాచ"

శరీరం విడిచి మరో శరీరం ధరించేటపుడు పూర్వ ప్రజ్ఞచేత అష్ట వసువులైన పృథివి—నీరు—అగ్ని- వాయువు—ఆకాశం—అవిద్య—కామం—కర్మ వీటితో శరీరం ప్రారంభమవుతుంది. పూర్వ ప్రజ్ఞచేతనే ముక్తి కావాలి అనే జ్ఞానం కలుగుతుంది.

జీవుడు బద్ధాసురాగంతో 'నేను బ్రాహ్మణుడను-నేను క్షత్రియుడను- నేను పుణ్యాత్ముడను ఈ మొదలైన భావాలు తలుచుకొంటాడు. వారి వారి కర్మానుసారం వారి వారికి జన్మ లభిస్తుంది. ఫలం ప్రాప్తిస్తుంది.

ముక్తపురుషుడు "నాహం బ్రాహ్మణః-నాహం క్షత్రియః; శుద్ధోఽహం. నిరంజనోఽహం-నిరాకారోఽహం నిర్వికల్పోఽహం ...." అని భావిస్తాడు. బంధ మోక్షాలు మనోధర్మాలు. ఇవి నాలో లేవు. నేను అన్నిటికీ సాక్షీభూతుణ్ణి, నిత్య ముక్తుణ్ణి-ఇది ముక్తాభిమాని నిశ్చయం.

దేహాభి మానాద్యత్పాపం న తద్గోవధ కోటిభిః
ప్రాయశ్చిత్తా ద్భవేత్ శుద్ధిః నృణాం గోవధ కారిణామ్

దేహం మీద మైత్రి అభిమానం కలిగి ఉండటం కోటి గోవులను చంపినంత పాపం కంటె అధికం. గోహత్యా పాతకునకు ప్రాయశ్చిత్తమన్నా ఉందికాని దేహ బల గర్వికి ఎక్కడా ప్రాయశ్చిత్తం లేదు. జాతి వర్ణాలు దేహధర్మాలు. ఈ దేహ ధర్మాలను ఆత్మధర్మాలని తలంచేవాడే దేహాభిమాని. ఇట్టివాడే బంధాలలో చిక్కుకొని ఉంటాడు. 'దేహోఽహం' అనుకొంటాడు.

ఉత్తములు ఆత్మను 'అసంగం—నిత్యముక్తం—శుద్ధం—బుద్ధం—' అని భావిస్తారు. దేహాభిమానం లేనివాడే ముక్త పురుషుడు. అతడు సర్వదా నిత్య శుద్ధ బుద్ధుడు.

"యా మతిః సా గతిః"

మనీషికి మతిని బట్టి గతి కలుగుతుంది. మనోనిశ్చయానుసారం మనీషి మనుగడ సాగుతుంది. నీవు శుద్ధుడవు ముక్త పురుషుడవు- ఈ నిశ్చయంతో ఈ నమ్మకంతో మనుగడ సాగించు. ఆత్మజ్ఞానిపై రాజ్యం ఏలుకో ! మంచిది.

"యచ్చిత్తం తన్మయో భవతి పురుషః"

— యోగవాసిష్ఠం

## ఆ త్మ సా క్షి వి

అత్మా సాక్షీ విభుః పూర్ణ ఏకో ముక్తశ్చిదక్రియః
అసంగో నిఃస్పృహః శాంతో భ్రమా త్సంసారవా నివ 12

ఆత్మా=ఆత్మ; సాక్షీ=సాక్షి; విభుః=వ్యాపకం; పూర్ణః=పరిపూర్ణం; చిత్=చైతన్యం; అక్రియః=క్రియారహితం; అసంగః=సంగ రహితం; నిస్పృహః=ఇచ్ఛారహితం; శాంతః=శాంతవంతం (కాని); భ్రమాత్=భ్రమ వల్ల (ఆత్మ); సంసార వాన్ ఇవ=సంసారివలె తోస్తున్నది.

ఆత్మస్వరూపా ! ఆత్మతత్త్వం తెలిసికో ! ఆత్మ సర్వసాక్షి. అది పరిపూర్ణ వ్యాప్తిగలది. అది ఏకైకం. ముక్తం. చైతన్యం. అది క్రియా రహితం. అసంగం. అనంతం. సదాశాంతం.

అయితే అది భ్రమ కారణంగా సంసారంతో కూడి ఉన్నట్లు అనిపిస్తుంది.

కానీ దానికి సంసార బంధాలు లేవు. బంధం మోక్షం అనుకోవటం అవాస్తవికం. అజ్ఞానం వలన దేహాభిమాని 'బంధితుణ్ణి-ముక్తుణ్ణి' అనుకొంటాడు. వాస్తవంగా జీవుడికి బంధమూలేదు. మోక్షమూలేదు. జీవుడు దేవుడే జీవాత్మ పరమాత్మయే.

జీవుడు బంధ సహితుడుగా ఉన్నంతవరకూ మూర్ఖుడు. బంధరహితుడైతే మాత్రం దేవుడే. జీవుడు మూర్ఖుడుగా ఉన్నంతవరకూ అజ్ఞాని. విజ్ఞాని కాలేడు. జ్ఞాని అయినాడా ఈశ్వరుడే.

సాధో ! సమాధి శబ్దేన పరా ప్రజ్ఞోచ్యతే బుధైః
అజస్రం అంబు వహనాత్ యథా నద్యా రుద్యతే
—యోగవాసిష్ఠం

ఓ సాధూ! అంతటా ఉండే పరమాత్మే నాలో కూడా ఆత్మగా ఉంది అని తెలుసుకోవటమే, ఆ అనుభవమే సమాధి. నదిలో నీరు నిత్యం ప్రవహించినట్లు సమాధిస్థితుడయిన వానిలో ఏకమైన ఆత్మను నేను అనే భావం సదా ఉంటుంది.

ఆత్మను గూర్చి ఇలా ఉంది. ఆత్మ పుట్టేదికాదు. చనిపోయేది కాదు—అది నిత్యం. "న జాయతే మ్రియతే వా కదాచిత్"

ఆత్మ—అహంకారాదులకు సాక్షీ మాత్రమే కానీ దేహ ధర్మాలకు అతీతుడు. ఏ క్రియలకూ కర్త భోక్త కాదు. ఆత్మ ప్రభువు. అధిష్ఠాత, పరిపూర్ణుడు సర్వాధిపతి. ఆత్మ-ఏకైకం. దానికి సజాతీయ విజాతీయ స్వగత భేదాలు లేవు. ఆత్మపరిపూర్ణుడు-సర్వవ్యాపకుడు. ఆత్మ ముక్తుడు-మాయాసంబంధిత కార్యాలకు కర్తకాదు. వస్తు గతి చేత సదా ముక్తుడు. ఆత్మ చైతన్యమూర్తి స్వప్రకాశుడు. సర్వం ప్రకాశింప చేసేవాడు.

'తస్య భాసా సర్వమిదం విభాతి' ఆత్మ క్రియారహితం. చేష్టారహితం. పరిచ్ఛిన్నంలో క్రియలు జరుగుతాయి. ఆత్మ అపరిచ్ఛిన్నంకదా !

"అసంగో హ్యాయం పురుషః"

ఆత్మ అసంగుడు దేనితోనూ సంబంధంలేదు. ఆత్మ నిస్పృహుడు ఎట్టి విషయాల మీద అభిలాషలేదు. ఆత్మశాంతుడు. ప్రవృత్తి నివృత్తి చిత్తవృత్తి దేహాదిక అంతఃకరణ ధర్మాలకు అతీతం. ప్రవృత్తి నివృత్తులు ఇంద్రియ ధర్మాలు. ఇవి ఆత్మ ధర్మాలు కావు. ఇవి పది ఆత్మ లక్షణాలు.

ఈ లక్షణాలను బట్టి ఆత్మ సంసారభ్రమ నుండి దూరంగా ఉండేది అని తెలుస్తున్నది. పని చేయటానికీ మానటానికీ సంకల్పిస్తుంది మనస్సు- ఆజ్ఞాపిస్తుంది వాక్కు- కరచరణాలచేత చేయిస్తుంది కాయం- మనోవాక్కాయ కర్మలకు సాక్షి మాత్రం ఆత్మ. ఆత్మ సంసారి కాదు అన్నిటికీ సాక్షి.

* *

సర్వగః సర్వదేవాత్మా సర్వ మేవ చ సర్వథా
అసమాధి ర్హి కోఽసౌ స్యాత్ సమాధి రపి కః స్మృతః

ఆత్మ సర్వ వ్యాపిగా అందరిలోని చైతన్యంగా వ్యక్తమవుతూ అంతటా ఎప్పుడూ ఉండగా సమాధిస్థితి లేకపోవటం ఎలా సంభవం ? అసలు సమాధి స్థితి వేరే ఉండడమేమిటి ?

—యోగవాసిష్ఠం

నేను పరిచ్ఛిన్నుణ్ణి. నా దేహాదులు స్థిరం. నేను సుఖంగా ఉన్నాను. భోగాలు అనుభవిస్తున్నాను. నేను దుఃఖం పొందుతున్నానుఅని అనేవి అంతఃకరణ ధర్మాలు. ఇవి ఆత్మవని భ్రమిస్తున్నాడు సామాన్య మానవుడు.

ఒక్కసారిగా భ్రమ నివృత్తి అయ్యేదికాదు. వ్యాసమహర్షి ఇదే ఒక సూత్రంలో చెప్పారు—

"ఆవృత్తి రసకృ దుపదేశాత్" జ్ఞానసిద్ధి కోసం అనేక ఆవృత్తులు వల్లించాలి. శ్రవణ మననాదులు పెక్కుసార్లు చేయాలి. 'తత్త్వమసి' అనే మహావాక్యం గూర్చి ఉద్దాలక మహర్షి తన పుత్రుడికి తొమ్మిదిసార్లు ఉపదేశించినట్లు 'ఋషుల చరిత్ర'లో ఉన్నది. పునః పునః శ్రవణం మననం చేయటం వలన చిత్తం స్థిర పడుతుంది. అప్పుడే చిత్తానికి ఉండే విజాతీయ భావాలు తొలిగి సజాతీయ భావాలు ఆత్మస్థం అవుతాయి. అందుకే మహాత్ములు మాటి మాటికి ఆత్మజ్ఞానం గూర్చి వివరిస్తుంటారు.

## పలు పర్యాయాలు మననం చేయి

కూటస్థం బోధ మద్వైతం ఆత్మానం పరిభావయ
ఆభాసోఽహం భ్రమం ముక్త్వా భావం బాహ్య మథాంతరమ్ 13

అహం ఆభాసః="నేను ఆభాస మాత్రంగా జీవమాత్రుడను" అనే; భ్రమం=భ్రాంతిని; బాహ్యం=బయట; అభ్యంతరం=లోపలగల; భావం=భావం; ముక్త్వా=విడిచిపెట్టి; కూటస్థం=కూటస్థుడను; బోధం=బోధ స్వరూడను; అద్వైతం=అద్వైత మూర్తి ని అని; ఆత్మానం=ఆత్మలో నిన్ను నీవు; పరిభావయ=భావించుకో !

ఓ జ్ఞానీ ! అహంకామే నేను అనే భావం గర్వ సూచకం. "నేను చేస్తున్నాను. నా వల్లనే ఈ పని జరిగింది-ఇది నాది-నా శరీరం-నా భార్య-నా భాగ్య సంపదలు"- ఇవి బాహ్య పదార్థ సంబంధ భావాలు. ఇవి అహంభావాలు. "నేను సుఖిని - నేను ధనవంతుడను - పెద్ద అధికారిని - నేను దుఃఖితుడను - నేను పండితుడను" ఇవి అంతర్ భావాలు. అంతఃకరణ ప్రేరకాలు - ఇవి అనంత జన్మ పరంపరాగత భావాలు. ఇవి అహంకార మమకార పూరిత భావాలు. వీటిని త్యాగం చేయి.

"నేను అకర్తను - అసంగుడను అద్వితీయుడను - అక్రియుడను - బోధ స్వరూపుడను - నిత్యుడను - సర్వ వ్యాపకుడను - నేను జీవాత్మనేకాదు పరమాత్మను. చిరంజీవిని. మహాత్ముడను. చిదాత్ముడను-" అని సదా భావన చేస్తూ విశ్వ బాంధవుడవై ప్రకాశించు.

## అభిమాన పాశం ఖండించు

దేహాభిమాన పాశేన చిరం బద్ధోఽసి పుత్రక
బోధోఽహం జ్ఞాన ఖడ్గేన తన్ని కృత్య సుఖీభవ 14

పుత్రక=కుమారా !; దేహాభిమాన పాశేన=దేహాభిమానం అనే త్రాటిచేత; చిరంబద్ధః అసి=చిరకాలం నుండి బద్ధుడవై యున్నావు; అహం=నేను; బోధః=

జ్ఞానస్వరూపుడను; ఇతి = అనేటటువంటి; జ్ఞాన ఖడ్గేన = జ్ఞాన ఖడ్గం చేత; తత్ = ఆ త్రాటిని; నికృత్య = ఖండించి; సుఖీభవ = సుఖవంతుడివి కమ్ము.

ఆత్మ ప్రియా ! "దేహోఽహమ్" ఈ దేహమే నేను అనే దృఢాభిమానం పాశంలాగా ఇంతవరకు నిన్ను బంధించింది. ఈ దేహాభిమానం అనాది వస్తువు. 'నేను చిద్రూపుడను - ఆత్మ స్వరూపుడను' అని భావన చేయటం ప్రారంభించు - జ్ఞానం సాధించు.

ఈ జ్ఞాన ఖడ్గంతో దేహాభిమానం అనే పాశాన్ని ఖండించు. దేహ వాసనలు వదులు. నీకు అపుడు ఆత్మసుఖం లభిస్తుంది. ఇది మరి మరి చెప్పుతున్నాను. బాగా విను. ఇంద్రియాలు మోసం చేస్తాయి. వాటి మాట నీవు వినకూడదు. నీ ఆజ్ఞను అవి శిరసావహించి నీకు లొంగి అవి భృత్యులవలె నీ పని చేయాలి. వాటికి స్వాతంత్ర్యం ఈయకు. జాగ్రత్త. అభ్యాసం దీక్షతో చేయి.

నీవు నిశ్చలంగా నిష్ఠగా ఆత్మజ్ఞానం అభ్యాసం చేసికొన్నావంటే స్వస్వరూపం అవగతమవుతుంది. సర్వవ్యాపకత్వం లభిస్తుంది. అంతర్జ్యోతి రూపంలోని పరమేశ్వర కృపా కిరణం ప్రసారమవుతుంది. విష్ణుమూర్తివైన నీలో నిర్మల చిదానందం కలుగుతుంది. విశాల వినూతన విశ్వజనీన భావం నీలో మొలకెత్తుతుంది. నీవు విశ్వాత్ముడవై ప్రకాశిస్తావు.

## నీవు స్వయంప్రకాశ రూపుడవు

నిస్సంగో నిష్క్రియోఽసి త్వం స్వప్రకాశో నిరంజనః
అయమేవ హి తే బంధః సమాధి మను తిష్ఠసి 15

త్వం = నీవు; నిస్సంగః = సంగరహితుడవు; నిష్క్రియః = క్రియా రహితుడవు; స్వప్రకాశః = స్వయంప్రకాశమూర్తివి; నిరంజనః = దేహదోష రహితుడవు; (త్వం = అటువంటి నీవు); సమాధిం = చిత్తనిరోధ మాత్ర సమాధిని; అనుతిష్ఠసి = అనుష్ఠిస్తున్నావు; అయమేవ = ఇదే; తే బంధః = నీకు బంధం.

నీవు నిశ్చయంగా నిస్సంగుడవు. దేహాభిమానం గలవారితో నీకు సంబంధం లేదు. నీవు నిష్క్రియుడవు. నేను చేస్తున్నాను అని ఏ పనీ చేయనక్కరలేదు. నీవు స్వయంప్రకాశ స్వరూపుడవు. ఒకరివల్ల నీకు తేజస్సు రాదు. నీవే ప్రకాశం ప్రసారం చేస్తావు నీవు ప్రభాకరుడవు. నీవు నిరంజనుడవు. ఉపాధిరహితుడవు. ఏ ఉపాధి అవసరమైతే అదే వస్తుంది. పోతుంది. నీవు పరిశుద్ధుడవు. పర మాత్ముడవు

ఇటువంటి పరమ పవిత్రుడవు సమాధి. అనుష్ఠానం కోసం ప్రాకులాడబోకు. అది జ్ఞానవంతులకు కాదు.

నీ నిజ స్వరూపం నిష్క్రియత్వం. ఇపుడు సామాన్యుడవై సమాధి అని అనుష్ఠానం అనీ పరుగులు తీస్తే నీ నిజరూపం పోయి సక్రియుడవవుతావు అది నీకు కూడదు.

సమాధి కూడా ఒక విధమైన బంధమే. అభివృద్ధికని చేసే కర్మానుష్ఠానం ప్రతిదీ బంధమే ఈ సమాధి స్థితి చిత్తవృత్తి నిరోధం అంటారు కొందరు. కానీ అది ఆత్మజ్ఞానాతిరిక్తమై శక్తులు సాధించటం కోసం అవుతున్నది. అపుడు ముక్తికి ప్రతి బంధకమే కదా.

అప్రయత్నంగా మనోవృత్తులు అన్నీ నశించి దానియంతట అదే చిత్త ఏకాగ్రత కుదరటమే జ్ఞానం. అది స్వయంగా లభ్యమయ్యేదే కానీ శ్రమ పడితే వచ్చేది కాదు, అలా వచ్చేదే ముక్తి.

## చైతన్యమూర్తివి

త్వయా వ్యాప్తమిదం విశ్వం త్వయి ప్రోతం యథార్థతః
శుద్ధబుద్ధ స్వరూప స్త్వం మాగమ క్షుద్ర చిత్తతామ్ 16

ఇదం విశ్వం=ఈ ప్రపంచం; త్వయావ్యాప్తం=నీ చేత వ్యాప్తమైయుంది; త్వయిప్రోతం=నీ యందే కూర్పబడింది; త్వం=నీవు; యథార్థతః=సత్యంగా;

శుద్ధ బుద్ధ స్వరూపః=శుద్ధ బుద్ధ స్వరూపుడవు: క్షుద్ర చిత్తతాం=నీచమైన చిత్త వృత్తులను; మా గమః=పొందకు !

ఆభరణాలు కార్యరూపాలు. ఈ కార్యానికి కారణం సువర్ణం. సువర్ణం మూల కారణంగా అనేక అందమైన ఆభరణాలు తయారౌతున్నాయి. అలానే విశ్వం అందమైన కార్యరూపం. దీనికి కారణం ఆత్మ. ఈ ఆత్మ అన్నిటికి కారణమై సర్వత్ర వ్యాపించి ఉంది.

నీవే ఆత్మ స్వరూపం. మట్టి నుండి రకరకాల కుండలు ముంతలు మూకుళ్ళు తయారైనట్లు ఆత్మ స్వరూపుడవైన నీ నుండి ఈ విశ్వంలోని వివిధ నమూనాలు ఉద్భవిస్తున్నాయి. యథార్థంగా నీవు పరిశుద్ధుడవు. అవిద్యకు అజ్ఞానానికీ మాయా కల్పిత ప్రపంచానికీ నీవు అతీతుడవు. స్వయం ప్రకాశమూర్తివి. నీవు చిద్రూపుడవు.

నీ ఆత్మతత్త్వం ప్రపంచాతీతం. నీవు సర్వదా శుద్ధ బుద్ధ స్వరూపుడవు. చైతన్యం ఆత్మ స్వరూపం. ఈ విశ్వం చైతన్యంతో నిండి ఉంది. మణులన్నీ మాలలో ఒక్క దారానికి గ్రుచ్చబడి ఉన్నాయి. మణులకు దారం ఆధారం. అలానే చైతన్య ఆత్మకు ఈ విశ్వ దృశ్యజాలం అంతా సంలగ్నమై ఉంది. ఈ గాజుపూసల వంటి మిథ్యాలోక దృశ్యాలు నిజంలాగా భాసిస్తున్నాయి.

ఈ జగత్తు సత్యం, నిత్యం కాదు. ఆత్మస్వరూపుడవైన నీ సంకల్పంతో జగత్తు జన్మిస్తున్నదీ. జగత్తు గమించేది. అస్థిరం. నీవు సుస్థిరం. నీవు శుద్ధ స్వరూపం. ఇదీ నీ నిజరూపం. క్షుద్ర భావాలకు అల్ప బుద్ధులకు మనసులో చోటీయకు. జాగరూకుడవై సుఖించు.

మాతృశ్రీ మదాలస మహాజ్ఞానవంతురాలు. బిడ్డలకు జోల పాడుతున్నదీ. "చిత్ చిత్" చిచ్చీ ! "ఈ ఈ ఈ" హుళక్కి. ఈ ప్రపంచం హుళక్కి. "లీలా లీలా...." ఇది అంతా ఒక లీల. "హాయి-శేషతల్పశాయి. అని

శుద్ధోఽసి బుద్ధోఽసి నిరంజనోఽసి సంసార మాయా పరివర్జితోఽసి

సంసార స్వప్నస్త్యజ మోహనిద్రాం మదాలసా వాక్యమువాచ పుత్రమ్ !

నీవు శుద్ధుడివి బుద్ధుడివి, నిరంజనుడివి సంసార మాయామలం త్యజించు.

నీవు సంసార రూపమైన అసత్తువి కావు. సంసార స్వప్నమైన మోహనిద్రలో ఉన్నావు. దాన్ని వదిలించుకో ! నాయనా ! అని మదాలస బాలుడితో అంటున్నది.

## షడూర్మలు

నిరపేక్షో నిర్వికారో నిర్భరః శీతలాశయః
అగాధ బుద్ధి రక్షుబ్ధో భవ చిన్మాత్ర వాసనః 17

త్వం=నీవు; నిరపేక్షః=అపేక్షారహితుడవు; నిర్వికారః=వికారరహితుడవు; నిర్భరః=చిద్ఘనరూపుడవు; శీతలాశయః=శాంతికి ముక్తికి స్థాననీయుడవు; అగాధ బుద్ధిః=లోతైన చైతన్య బుద్ధివి; అక్షుబ్ధః=అవిద్యాక్షోభ రహితుడవు; చిన్మాత్ర వాసనః=చైతన్య మాత్ర స్వరూప సుస్థితుడవు; భవ=అగుము !

రాజా ! ప్రాణధర్మాలు క్షుత్పిపాసలు. మనోధర్మాలు శోకమోహాలు. సూక్ష్మ స్థూల దేహధర్మాలు జరా మరణాలు. ఇవి షడూర్మలు. ఇవి ఆత్మ ధర్మాలు కావు.

**"జాయతే - అస్తి - వర్ధతే విపరిణమతే - అపక్షీయతే - వినశ్యతి"** **పుట్టుట - ఉండుట - పెరుగుట - పండుట - తరుగుట - నశించుట- ఇవి షడ్భావ వికారాలు** - ఇవి ఆత్మవి కావు కానీ నీవు **ఆత్మ** స్వరూపుడవు.

నీవు నిరపేక్షుడవు - ఏ అపేక్షలు లేవు వికారాలు లేవు. మార్పులు చేర్పులు లేవు. నిర్వికారుడవు - నిర్భరుడవు చల్లని చక్కని సుఖ స్వరూపుడవు విశ్వ కల్యాణకరమైన ఆశయాలు కలవాడవు. ఎవరికీ బరువైన వాడవుకావు. అపరిచ్ఛిన్న చైతన్యమూర్తివి. సుబుద్ధివి - అగాధమైన మంచి బుద్ధిమంతుడవు. అవిద్యల వలన క్షోభ లేనివాడవు. చిన్మాత్రుడవు.

ఇది నీ స్వచ్ఛమైన స్వరూపం. దేహ సంబంధితాలు అవిద్యాకల్పితాలు. ఇది తెలిసి ప్రవర్తించు, నీకు ఆత్మానందం కలుగుగాక !

## ని రా కా ర ం

సాకార మనృతం విద్ధి నిరాకారం తు నిశ్చలమ్
ఏతత్ తత్త్వోపదేశేన న పునర్భవ సంభవః 18

సాకారం=ఆకారదృశ్యాలు; అనృతం=మిధ్యగా; విద్ధి=తెలిసికో; నిరాకారం=ఆకార రహిత ఆత్మతత్త్వం; నిశ్చలం=చంచల రహితమైనదిగా; విద్ధి=తెలిసికో; ఏతత్ తత్త్వోపదేశేన=ఈ యదార్థ ఉపదేశంచేత; పునః= మరల; భవ సంభవః=జన్మ సంభవం; న భవతి=కాదు;

ఈ సాకార ప్రపంచం అంతా అనృతం. మిథ్య. అతి చంచలం. ఈ దేహాదులు క్షణభంగురాలు. బుద్బుదాలు. ఇది విషయ సుఖాల దుఃఖాల మిశ్రితం. ఇది కాలకూట విషపదార్థం. దీనిపై అభిమానం అపేక్షలు పెట్టుకొనకు. అయితే ఇది నాటకం అని ప్రేక్షకుడవై చూస్తూండు. అందుకే నిన్ను సాక్షి అన్నారు కానీ కర్త భర్త అనలేదు. ఇది నిజం అనుకొని ఆవేదన పడకు.

స్థిరమైనది శాశ్వతమైనది ఆత్మ తత్త్వం. దానికి ఆకారం ఉండదు. అది నిరాకారం. నిరంజనం. నిశ్చలం. "నిత్యం విజ్ఞాన మానందం బ్రహ్మ" బ్రహ్మం అంటే ఆత్మ. అది నిత్యం. అది సత్యం. విజ్ఞానమయం. అద్వితీయమైన ఆనందం అదినా ఈ ఉపదేశంతో ఈ తత్త్వం తెలిసికొన్నావంటే మళ్ళీ జన్మలేదు.

ఈ చిన్మాత్ర రూపంతో తత్త్వంలో రమించి ఉండటమే ముక్తి. ముక్తి అంటే వేరుగా వేరు దేశాలలో లేదు. నీవు అజ్ఞానివికావు. విజ్ఞానివి మూర్ఖుడివికాదు పండితుడివి. అనాత్మవుకావు ఆత్మవు. పరమాత్మవు.

నీకు మృతం లేదు అమృతం. "అసతోమా సద్గమయ - తమసోమా జ్యోతిర్గమయ - మృత్యోర్మా అమృతం గమయ-" నీవు అసన్మార్గంలోకాదు సన్మార్గంలో నడు. చీకట్లోకి వెళ్ళవద్దు వెలుగులోకి ప్రయాణించేయి. మృత్యువు వాతపడకు. అమృతుడవై అమరుడవై చిరకాలం జీవించు.

* *

సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః

—శ్రీ శంకరాచార్య

## సర్వత్ర ఈశ్వరుడున్నాడు

యథైవాదర్శ మధ్యస్థే రూపేఽంతః పరితస్తు సః
తథైవాస్మిన్ శరీరేఽంతః పరితః పరమేశ్వరః 19

యథా ఏవ=ఏ ప్రకారంగానైతే; ఆదర్శ మధ్యస్థే=అద్దం మధ్య ఉన్న; రూపే=ప్రతిరూపంలో; అంతఃపరితః=అంతటా; సః=ఆ శరీర ఆకారం; భాసతే=కన్పిస్తుందో; తథా ఏవ=అట్లే; అస్మిన్ శరీరే=ఈ శరీరం యందు; అంతః పరితః=లోపల వెలుపల కూడ; పరమేశ్వరః=పరమేశ్వరుడు; భాసతే=భాసిస్తున్నాడు.

వర్ణాశ్రమ భేదాలుగల స్థూల శరీరం కంటే పుణ్యపాప ధర్మాలు గల సూక్ష్మ శరీరం గొప్పది. దీనికంటే కారణ శరీరం గొప్పది. దీనికంటే నిత్య చైతన్య పూర్ణ వ్యాప్తమైన ఆత్మ చాలా గొప్పది. ఈ ఆత్మే పరమాత్మ. ఈ పరమాత్మే పరమేశ్వరుడు. సావధానంగా విను.

అద్దంలో శరీరం ప్రతిబింబిస్తున్నది. అపుడు శరీరంపైన బయట చుట్టూ అంతటా అద్దపు వెలుగు వ్యాపించి శరీరం ప్రకాశిస్తున్నది. అది శరీర ఛాయ మాత్రమే. అది సత్యంకాదు. అధ్యస్తం. ఆ విధంగానే ఆత్మ ప్రకాశం శరీరం లోపల బయట మధ్య వ్యాపించి జడ శరీరం చైతన్యవంతంగా కనిపిస్తున్నది.

కల్పిత పదార్థం శరీరం. ఆత్మ అధిష్ఠానం. రెండూ భిన్నం. జడశరీరంలో తన సత్తా ఏమీలేదు. అధిష్ఠానమైన ఆత్మ ప్రకాశ బలంతో కల్పిత జడ శరీరం సత్యంవలె ప్రకాశిస్తున్నది. ముత్యపుచిప్పలో వెండి కనిపించినట్లు అద్దంలో ప్రతిబింబంవలె పరమేశ్వర ప్రకాశంలో సత్య సదృశంగా జడశరీరం భాసిస్తూ ఉంటుంది. శరీరం మిథ్య. శరీరం సత్యం కాదు. నీవు పరమేశ్వరుడిలో ఉన్నావు. నీవు చిరంతనమైన చిదాత్మ స్వరూపుడవు.

## నిత్యం నిరంతరం బ్రహ్మ

ఏకం సర్వగతం వ్యోమం బహిరంతర్యథా ఘటే
నిత్యం నిరంతరం బ్రహ్మ సర్వభూత గణే తథా 20

యథా=ఏ ప్రకారంగానైతే; సర్వగతం=సర్వ వ్యాపకమూ;

ఏకం=అద్వితీయమూ ఐన; వ్యోమం=ఆకాశం; ఘటే=కుండయందు; బహిరంతః=వెలుపల, లోపల; అస్తి=ఉంటున్నదో; తథా=అట్లే; నిత్యం, నిరంతరం; బ్రహ్మం=నిత్య నిరంతర బ్రహ్మం; సర్వభూతగణే=సర్వ భూత గణాలలో; అస్తి=ఉంటున్నది.

ఆకాశం ఏకైకం. అది నిత్యం. అది సర్వ వ్యాపకం. అట్టి ఆకాశం పాత్రల లోపల బయట నిండి వస్తు పాత్రాకారాలు దాలుస్తుంది. పాత్రలు పగిలిపోగానే ఉన్న పాత్రాకాశం వ్యాప్త ఆకాశంలో లీనమవుతూ ఉంటుంది. అట్టి ఆకాశం వంటిదే ఆత్మ.

అలానే నిత్యసత్యమైన అవినాశియైన ఆత్మదేవుడు సర్వ జీవకోటిలోని పరిమిత శరీరాలలో అంతర్బహిశ్చ వ్యాపించి నిండి ఉన్నాడు.

"ఏషతే ఆత్మా సర్వస్యాంతర" అని శ్రుతి. ఇది నీ ఆత్మయే. సర్వత్ర వ్యాపించి ఉంది ఇది గ్రహించు. "బోధోఽహమ్" దృఢ విశ్వాసం అనే జ్ఞాన ఖడ్గంతో దేహాదికం అనే పాశాలను త్రెంచివైచి సుఖం పొందు.

నానా పాత్ర రూపాలు భిన్నమైనపుడునూ ఆయా పాత్రల లోపల బయటగల ఆకాశం నిత్యమై శాశ్వతమై ఏకమై ఉన్నట్లుగా నానా రూపాలలో కనిపించే భూత కోటి ప్రపంచం నశించినా పరిపూర్ణ పరబ్రహ్మమైన ఆత్మ సుస్థిరంగా నిర్మలంగా నిత్యంగా సత్యంగా ప్రకాశిస్తుంది. అట్టి పరబ్రహ్మానివి నీవు. నిత్యుడవు. సుఖంగా ఉండు. శుభం.

* *

"చదువులన్ని చదివి చాల వివేకియై
మదిని తన్నెరుగడు మందబుద్ధి"

—శ్రీ సత్యసాయి

# ఉ ల్లా స ం

## ఉ పా ధి ర హి తు డ ను

జనక ఉవాచ :-

అహో ! నిరంజనః శాంతో బోధోఽహం ప్రకృతేః పరః
ఏతావంత మహం కాలం మోహేనైవ విడంబితః 21

అహం = నేను; నిరంజనః = ఉపాధి నిర్ముక్తుడను; శాంతః = ప్రశాంతు డను; బోధః = జ్ఞాన స్వరూపుడను; ప్రకృతేఃపరః = ప్రకృతికి పరుడను అయితే అహో = అత్యాశ్చర్యం ఏమంటే; ఏతావంతం = ఇంత; కాలం = కాలం మోహైవ = మాయామోహం చేత; విడంబితః = మోసపోయాను.

అష్టావక్ర మహర్షి ద్వారా తత్వబోధామృతం గ్రోలిన జనక మహారా పరమానందంతో ఇలా అంటున్నాడు — మహర్షీ! మహోపాధ్యాయా ! మద్గు రూత్తమా ! అహా ! ఎంత ఆశ్చర్యం ! నేనిపుడు నిరంజనుడను. సర్వోపా నిర్ముక్తుడను. నేను శాంతుడను. సకల వికార దూరుడను. నేను బోధ స్వరూపుడను జ్ఞానవంతుడను. నేను ప్రకృతి కంటే పరుడను. మాయాంధకార నిర్గతుడను స్వప్రకాశ చిద్రూపుడను. ఆత్మ సాక్షాత్కారం కలిగింది. ధన్యుడనైనాను.

అయ్యో ! ఇంతవరకు ఈ గురూపదేశం లేక సూర్యకాంతి లేని మాయాం కారంలో కొట్టుమిట్టాడుతుండేవాడను. నాకపుడు 'ఇది దేహం. ఇది ఆత్మ. దేహ తీరు ఇది. ఆత్మ ప్రకాశం అంటే ఇది.' అనే సంగతే తెలియదు. మమతా మాయ మోహ అజ్ఞానాంధకారంలో చిక్కుకొని మోసపోయాను. ఇప్పుడు తమ ఉపదేశ వల్ల ఆత్మానందానుభవం కలుగుతున్నది !

## జ డ దే హం జ గ త్తు

యథా ప్రకాశయామ్యేకో దేహమేనం తథా జగత్
అతో మమ జగత్సర్వం అథవా న చ కించన 22

యథా=ఏ ప్రకారంగా; ఏనం దేహం=ఈ దేహాన్ని; ఏకః=అద్వితీయుడనై: ప్రకాశయామి=ప్రకాశింప జేస్తున్నానో; తథా=ఆ ప్రకారంగానే; జగత్=జగత్తును కూడా; ప్రకాశయామి=ప్రకాశింపజేస్తున్నాను; అతః=ఈ కారణం వలన; జగత్ సర్వం=ప్రపంచం అంతా; మమ=నాదై యున్నది; అథవా=లేకపోతే; మమ=నాకు; న కించన=కొంచంకూడా లేదు.

గురువర్యా! నేను ఏకాత్మను. ఈ స్థూల దేహాన్నికాను. అయినా ఈ దేహాన్ని ప్రకాశింపజేస్తున్నాను. అలానే ఈ విశ్వ విరాట్ స్వరూపాన్ని కూడా ప్రకాశింప జేస్తున్నాను. ఈ దేహం ఈ విశ్వం రెండూ అప్రకాశకాలే. జడాలే. అనాత్మలే. ఈ జడవస్తువులు వాస్తవంగా ఆత్మవికావు. ఆత్మసత్యం-జగత్తుమిథ్య. రెండింటికీ పారమార్థిక సంబంధంలేదు.

నేను చిద్రూపుడను. ఈ దృశ్య జగత్తు నాయందు ఆరోపింపబడింది. ఇది స్వప్నంవలె మిథ్య. సత్య అసత్యాలకు సంబంధం ఉండదు. ఇది ఆరోపిత కల్పితం. నేను ప్రకృతికి విలక్షణుడను. శుద్ధ బుద్ధ స్వరూపుడను.

దేహాత్మల సంబంధం శుక్తి రజతాల కల్పిత తాదాత్మ్య సంబంధం వలె ఉంటుంది. శుక్తి ప్రభావంతో రజతం నిజంగా ఉన్నట్లు భాసిస్తుంది. అలానే ఆత్మ ప్రభావంతో దేహం సత్యంవలె తోస్తుంది. నిజానికి దేహం జడం. లోహం జడ పదార్థం. సూదంటురాయి ప్రభావంతో లోహవస్తువు ఎగిరెగిరి పడుతున్నట్లుగా ఆత్మ బలంతో ఈ జగత్తు నడుస్తున్నది.

పంచదశిలో ఇలా వివరించబడింది-

అస్తి - భాతి - ప్రియం - రూపం - నామ - చేత్యంశ పంచకమ్
ఆద్యం త్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయమ్

అస్తి అంటే ఉన్నది. భాతి అంటే ప్రకాశిస్తున్నది. ప్రియం అంటే ఆత్మకు చాలా ఇష్టమైనది. రూపం అంటే ఆకారం నామం అంటే పేరు. ఇవి మొత్తం ఐదు. ఇందులో అస్తి-భాతి-ప్రియం-ఈ మూడు అంశాలు బ్రహ్మ పదార్థాలు. అంటే ఆత్మ అంశాలు. సుస్థిరాలు. నామరూపాలు రెండూ జగత్పదార్థాలు జడాలు. ప్రపంచ సంబంధాలు. జగత్తు నామరూపాలతో భాసమానమవుతుంది. ప్రపంచం వ్యక్తమవుతుంది. ఈ నామరూపాలు లేకపోతే జగత్తు లేదు. విశ్వం కనిపించదు.

అయితే ఇవి అస్థిరాలు. పరిణామశీలాలు. ఇవి జగత్ సూచకాలు. చలిస్తుంటాయి. ఇవి మారుతుంటాయి. ఇందువల్లనే జగత్తు మిథ్య అన్నారు. ఇది చిత్రమైన జగత్తు

ఈ జగత్తు పరమేశ్వరుని యొక్క 'అస్తి-భాతి-ప్రియం' అనే త్రివిభాగాలతో వాస్తవంవలె ద్యోతకం అవుతుంది. ఈ మూడు క్రమంగా తొలగిస్తే ప్రపంచమే లేదు. బ్రహ్మం ఒక్కటే నిలిచేది. ఆచార్యా! ఈ దృశ్య జగత్తు కల్పితం పరమార్థపరంగా దేహాదులు ఏవీలేవు. ఆత్మ సత్యం దేహం మిథ్య.

## దే హ ం - వి శ్వ ం

స శరీర మహో! విశ్వం పరిత్యజ్య మయాధునా
కుతశ్చిత్ కౌశలాదేవ పరమాత్మా విలోక్యతే 23

అహో=ఆశ్చర్యకరంగా ఉంది; స శరీరం=శరీరంతోకూడిన; విశ్వం: ప్రపంచాన్ని; పరిత్యజ్య=పరిత్యజించి, తన నుండి వేరుగాచూచి; కుతశ్చిత్: ఎక్కడనో; కౌశలాత్ ఏవ=కౌశలం వలననే, తమ ఉపదేశం వలననే; మయా: నా చేత; అధునా=ఇప్పుడే; పరమాత్మా=పరమాత్ముడు; విలోక్యతే: వీక్షింపబడుతున్నాడు.

వేదాంత వేద్యా! విద్యాస్వరూపా! ఏమి ఆశ్చర్యం!! ఏమి ఆశ్చర్యం శరీర భేదాలు స్థూల సూక్ష్మ కారణ శరీరాలని మూడుకదా! ఈ సమయంలో శరీరత్రయంతో ప్రకాశించే విశ్వం విస్మరిస్తున్నాను ఇందుకు విలక్షణంగా పరమాత్మను సందర్శిస్తున్నాను

ఇది అంతా తమ ఉపదేశం వల్ల నే లభ్యమానమైనది. శాస్త్రజ్ఞానం ఆచార్య ఉపదేశం మహాఫలప్రదాలు. ఆత్మసాక్షాత్కారమే కాదు. పరమాత్మ సాక్షాత్కారం లభ్యమయింది. ఎంత అదృష్టం! మిథ్యా రూపమైన శరీర త్రయాన్ని విమర్శిస్తు విమర్శిస్తూ విచారణ చేయగా చివరకు పోనుపోను మిగిలిన సారం ఆత్మసాక్షాత్కారం ఒక్కటే అని అనుభవమయింది. దీనికి గురుప్రసాదం కాక మరొక ఉపాయం లేదుకదా స్వామీ!

ఈ శరీరత్రయాన్నే లింగ కారణ విశ్వ శరీరాలు అని వ్యవహరిస్తారుకదా విశ్వశరీరమే స్థూల శరీరం. జగత్తు నడుపుతుంది. లింగశరీరమే సూక్ష్మ శరీరం

స్వప్నంలో సంచరిస్తుంది. కారణ శరీరం కారణ శరీరం. ఇది సుషుప్తిలో పని చేస్తుంది- ఇవి ఆత్మశూన్యమైనవి. సత్యం వలె భ్రమింపజేస్తాయి. ఇవి నమ్మకుండా తమ దయతో వీటికంటే విలక్షణమూ జ్ఞానస్వరూపమూ అయిన పరమాత్మను నేటికి అవలోకనం చేసికొనగలిగాను. ధన్యాత్ముడను.

*　　　*

సచ్చిదానంద రూపాయ శివాయ పరమాత్మనే
నమోవేధాంత వేద్యాయ గురవే బుద్ధి సాక్షిణే

—స్కాంద పురాణం

## ఆత్మకంటే విశ్వం వేరుకాదు

యథా న తోయతో భిన్నాః తరంగాః ఫేన బుద్బుదాః
ఆత్మనో న తథాభిన్నం విశ్వమాత్మ వినిర్గతమ్ 24

యథా=ఏ విధంగానైతే; తోయతః=జలం కంటే; తరంగాః=తరంగాలు, ఫేన బుద్బుదాః=నురుగు, బుడగలు; న భిన్నాః=భిన్నమైనవి కావో; తథా= అలానే; ఆత్మ వినిర్గతం=ఆత్మనుండి పుట్టిన; విశ్వం=ప్రపంచం; ఆత్మనః= ఆత్మకంటే; న భిన్నం=వేరైనది కాదు.

పరమ గురూత్తమా ! నీరు కంటే నీటిలో జనించిన తరంగాలు బుద్బుదాలు భిన్నం కాదుకదా అలానే ఆత్మకంటే విశ్వం వేరుకాదు అని గ్రహించాను. జలం తరంగాదులన్నిటికీ ఉపాదాన కారణం. ఆత్మ విశ్వానికి ఉపాదానం. జలంఆత్మ. తరంగ భంగిమం విశ్వం. ఆత్మయే చైతన్యం. సర్వానికి అది అధిష్ఠానం. అధిష్ఠానంలో జనించిన విశ్వం కూడా పూజనీయమే.

ఆత్మయందారోపింపబడిన విశ్వానికి ఆత్మ సత్తారూపం. చిద్రూపమైన ఆత్మ కంటే వేరుకాదు. ఆత్మయొక్క అఖండ అనంత చిద్రూపమే విశ్వం. విశ్వం చిదాత్మ జనితమే. ఈ శరీర త్రయ సహిత ప్రపంచానికి ఆత్మయే మూలం.

స్వామీ ! తమరు చిన్మయమూర్తులు. బ్రహ్మానంద స్వరూపులు. పరమసుఖం ప్రసాదించేవారు. కేవలం జ్ఞానమూర్తులు. ద్వంద్వాతీతులు. గగన సదృశులు: తత్త్వ

మెరిగినవారు. ఆదిలక్ష్యభూతులు. ఏకైక స్వరూపులు నిత్యులు. విమలులు. అచలులు సర్వధీసాక్షి మాత్రులు. భావాతీతులు. త్రిగుణ రహితులు-సద్గురువులు నమోవాకాలు-

*　　　　　　　　*

బ్రహ్మానందం-పరమసుఖదం-కేవలం-జ్ఞానమూర్తిమ్
ద్వంద్వాతీతం-గగన సదృశం-తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం-నిత్యం-విమల-మచలం-సర్వధీసాక్షి భూతమ్
భావాతీతం-త్రిగుణ రహితం-సద్గురుంతంనమామి !

## ఆత్మ అధిష్ఠానం

తంతుమాత్రో భవేదేవ పటో యద్వద్విచారితః
ఆత్మ తన్మాత్రమేవేదం తద్వత్ విశ్వం విచారితమ్ 25

యద్వత్ = ఏ ప్రకారంగానైతే: పటః = వస్త్రం: తంతుమాత్రః ఏవ = నూలు మాత్రమే: భవేత్ = అగుచున్నదో: తద్వత్ = ఆ విధంగానే: విచారితః = తత్త్వ విచారణ వలన: ఇదం విశ్వం = ఈ ప్రపంచం: ఆత్మ తన్మాత్రమేవ = ఆత్మ సత్తా మాత్రమే అని: విచారితం = విశదమవుతున్నది.

ఆర్యా ! గురువర్యా ! స్థూలదృష్టితో చూస్తే వస్త్రం ఒక్కటిగానే కనిపిస్తుంది. కానీ సూక్ష్మ దృష్టితో చూస్తే వస్త్రమూ, నూలూ వేరువేరుగా ఉంటాయి. నేతవాని పనితనం వల్ల వస్త్రం మనోహరంగా భాసిస్తుంది. విచారణ చేసి చూస్తే అసలు వస్త్రానికి మూలపదార్థాలు నూలు- నూలుకు ప్రత్తి అలానే విశ్వానికి మూలం ఆత్మ. పరమమైన ఆ ఆత్మ కంటే వేరైనది ఏదీలేదు. ఇది అంతా ఆ పరమాత్మ విన్యాస విలాస భంగిమలే.

విమర్శనా దృష్టికి తెలుస్తుంది. 'విశ్వం విష్ణుమయం జగత్తు.' నూలు లేక వస్త్రం లేదు. ఆత్మ లేక జగత్తు లేదు. వస్త్రానికి ప్రత్తి అధిష్ఠానం. విశ్వానికి అధిష్ఠానం పరమాత్మ. అది తెలిసింది స్వామీ ! స్థూల దృష్టికి దారాలు ప్రత్తి కనిపించవు. వస్త్రమే దృశ్యమానమవుతుంది. విశ్వం చూచేవాడికి ఆత్మ కనిపించదు. ఆత్మదర్శనం చేసేవాడికి విశ్వం కనిపించదు. "సర్వాని ఆత్మ మూలపదార్థం."

*　　　　　　　　*

"తత్త్వ జిజ్ఞాస అనునది ధర్మ జిజ్ఞాస. కొందరు ధర్మంబె తత్త్వమని

పలుకుదురు. తత్త్వవిదులు 'జ్ఞాన'మను పేర అద్వయమైనది 'తత్త్వమ'ని ఎరుంగుదురు; ఆ తత్త్వంబు ఔపనిషదులచేత 'బ్రహ్మము' అని, హైరణ్యగర్భుల చేత 'పరమాత్మ' అనియు, సాత్వతులచేత 'భగవంతుడు' అనియును పలుకంబడు.

వేదాంత శ్రవణంబున గ్రహింపబడి జ్ఞాన వైరాగ్యములతోడం గూడిన భక్తి చేత తత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుడైన ఆత్మయందు 'పరమాత్మను' పొడగందురు. ధర్మంబునకు భక్తి ఫలంబు."

—భాగవతము-ప్రథమ-56

* *

వందే గురూణాం చరణార విందే సందర్శిత స్వాత్మసుఖావబోధే
జనస్యయేజాంగలి కాయమానే సంసార హాలాహల మోహ శాంత్యై !

## విశ్వమానందమయం

యథైవేక్షురసే క్లప్తా తేన వ్యాప్తైవ శర్కరా
తథా విశ్వం మయిక్లప్తం మయా వ్యాప్తం నిరంతరమ్ 26

యథైవ=ఏ ప్రకారంగానైతే; ఇక్షురసే=చెరుకురసంలో; క్లప్తా= ఇమిడియున్న; శర్కరా=పంచదార; తేనైవ=ఆ ఇక్షురసంచేతనే; వ్యాప్తా= వ్యాప్తమవుతున్నదో; తథైవ=అట్లే; మయి=నా యందు; క్లప్తం=ఇమిడి యున్న; విశ్వం=ప్రపంచం; మయా=నా చేతనే; వ్యాప్తం=వ్యాప్తమైనది.

దేశికోత్తమా ! నాకు తెలిసింది విన్నవిస్తున్నాను పరికించండి. చెరుకు రసంతో చక్కెర తయారవుతున్నది. చక్కెర మాధుర్యానికి మూలకారణం చెరుకు రసం. రసానికి మూలం చెరుకు. రసానికీ, చక్కెరకూ చెరుకు అధిష్ఠానం. అలానే ఆత్మ అంటే పరమాత్మ అన్నింటికీ అధిష్ఠానం. అధిష్ఠానమైన ఆత్మ నా స్వస్వ రూపం. ఈ ఆత్మవల్లనే ఈ విశ్వం విస్తరించి చిత్ర విచిత్ర భంగిమలు ప్రదర్శిస్తు న్నది. ఈ విరాట్ విశ్వం కల్పితం. ఇది నా ఆనంద ప్రకాశం. ఇది బాహ్యాభ్యంతర సీమలో వ్యాపించి నర్తిస్తున్నది.

పరమాత్మ పరమానందమూర్తి. ఆత్మ ఆనందమయం. ఆత్మలో జనించిన విశ్వం ఆనందజనకం. విశ్వం విచిత్ర విలాసాల వినూత్న నాటకశాల. జీవుకికి

ఒకడు చీకటిలో త్రాడుచూచి పాము అనుకొని పరుగిడివస్తున్నట్లే భావించి భీతిలి తత్తరిల్లిపోతాడు. ఇంతలో దీపం వెలుగులో చూచి ఇది పాముకాదు ఉత్త త్రాడే అని నిశ్చయించుకొని తన భ్రాంతికి భయానికి తానే సిగ్గుపడతాడు.

విశ్వాన్ని ఆడించేది అధిష్ఠానమైన ఆత్మ అని తెలియనపుడు విశ్వలీలలు విచిత్రంగా విస్తారంగా తోస్తుంటాయి. విషయ వీచికలలో విహరిస్తాము. హర్షిస్తాము. మరుక్షణంలో విచారిస్తాము. విలపిస్తాము. గురుబోధ వల్ల పరమాత్మ తత్త్వం తెలిసినప్పుడు "ఈ జగత్తు మూన్నాళ్ళ ముచ్చట. ఇది విశ్వ విలాసం. జగన్నాటకం. దీనిలో దుఃఖించవలసిందీలేదు. హర్షించవలసిందీలేదు. అంతా జగన్నాటక సూత్రధారి చేతిలో కీలుబొమ్మలం." అనే ఆత్మజ్ఞానం కలుగుతుంది తరువాత ఈ నాటకంలో సంతోషంగా నటిస్తాము. నిజానికి ఈ జగన్నాటకం అంతా మిథ్య అని బోధపడుతుంది. ఇది కాకాక్షిన్యాయం. అజ్ఞానానికి ఏకదృష్టి మాత్రమే పని చేస్తుంది.

* *

"కనుల కగపడు దృశ్యంబుగాంచి మీరు
సత్యమిదియని ఎంచక—సంబరమున
తెరను దాగిన సత్యంబు తెలిసికొనగ
విశ్రమించక నాతోడ వెడలిరండు"

—శ్రీ సత్యసాయి

## ప్రకాశం నిత్య బోధ

ప్రకాశో మే నిజంరూపం నాతిరిక్తోఽస్మ్యహం తతః
యదా ప్రకాశతే విశ్వం తదాఽహం భాస ఏవ హి 28

ప్రకాశః=వెలుగు; మే=నా యొక్క; నిజం రూపం=యథార్థరూపం; తతః=ఆ ప్రకాశ జ్యోతి రూపంకంటే; అహం=నేను; అతిరిక్తః=వేరైనవాడను; న అస్మి=కాను; యదా=ఎప్పుడు; విశ్వం=జగత్తు; ప్రకాశతే=ప్రకాశమానం అవుతున్నది అంటే; తదా=అప్పుడు; తత్=ఆ వెలుగు; **అహంభాస ఏవహి=నేను ప్రకాశించటంవల్లనే; ప్రకాశతే=ప్రకాశిస్తున్నది !**

స్వామి ! అంతర్యామి ! నా ఆత్మ స్వాభావికం. అది నిత్య బోధ చేస్తుం టుంది. ఆ జ్ఞానమే ఆత్మప్రకాశం. నేను స్వయంప్రకాశకుడను. నేనూ-ఆ నిత్యబో ప్రకాశమూ వేరుకావు.

విశ్వం నా ఆత్మప్రకాశంలోనే ప్రకాశిస్తున్నది. స్వరూప చైతన్యం సర్వ జడ పదార్థాలను ప్రకాశింపచేస్తుంటుంది. జడవస్తువు ప్రకాశంలేక కనిపించదు. ఆత స్వరూపప్రకాశం లేకపోతే జగత్తు భాసమానం కాదు. ఆత్మప్రకాశం దీవ్య వస్తువును ఆవరించినప్పుడు అజ్ఞానం క్షయ మవుతుంది. యథార్థ వస్తువు దృగ్గోచ మవుతుంది. ఆత్మప్రకాశంచేతనే విశ్వం స్ఫురిస్తుంది. అజ్ఞానం అలముకొనియున్నం వరకు ఆత్మజ్యోతి దర్శనంకాదు. ఆ జ్యోతి అజ్ఞాతంగానే ఉండిపోతుంది.

నిత్య జ్ఞానం నా స్వరూపం. ఆ జ్ఞాన ప్రకాశంలో విశ్వం కనిపిస్తుంది చేతనాలు రెండు రకాలు. 1. సామాన్య చేతనం 2. విశేష చేతనం. సామాన్య చేతనం అజ్ఞాన సాధకం. విశేష చేతనం జ్ఞాన సాధకం. అలానే అగ్ని రెండురకాల సామాన్యాగ్ని, విశేషాగ్ని. సామాన్యాగ్ని కట్టెల గర్భంలో కనిపించకుండా ఉంటుంది. ఇది పైకి దహనకార్యం చేయదు. అంతర్యాగం చేస్తుంది. విశేషాగ్ని కట్టెల రాపిడివల్ల జనిస్తుంది. పైకి అగ్ని జ్వలిస్తుంది. కనిపిస్తుంది.

ప్రపంచంలో అన్ని పదార్థాలు ఈ భూత పంచీకరణంలోనే ఉత్పన్నమౌ తున్నాయి. వృక్షాలూ అంతే. పంచతత్త్వాలతోనే తయారయియున్నాయి. కట్టెలో సామాన్యాగ్ని లోపల దాగి ఉంటుంది. పైకి జ్వాలలు రేపదు. కాని రెండు కట్టెల రాపిడివల్ల జనించిన విశేషాగ్ని బైటికివచ్చి ఆ కట్టెలను ఇతర వస్తువులను మాడ్చి మసిచేస్తుంది. అలానే సామాన్య చైతన్యం సర్వత్ర వ్యాప్తమై ఉంటుంది. ఇది అజ్ఞానాన్ని అడ్డుకోదు. ఇంకా దానికి సాధకం అవుతుంది బాధకం ఎంతమాత్రం కాదు.

విశేష చైతన్యం ఆత్మాకార వృత్తికి అవిఛిన్నం చేకూరుస్తుంది. ఇది అజ్ఞా కి బాధకం. ఆత్మవృత్తికి సాధకం. అజ్ఞాన హానికారకమైన ఈ విశేష చైతన్యం దార్థ జలాన్ని దహిస్తుంటుంది జగత్తు స్వయంగా ప్రకాశింపలేదు. ఆత్మ ంలోనే అది ప్రతిఫలిస్తుంది.

"తస్య భాసా సర్వమిదం విభాతి" —శ్రుతి

## భ్రాంతి

అహో ! వికల్పితం విశ్వం అజ్ఞానాత్ మయి భాసతే
రూప్యం శుక్తౌ ఫణీ రజ్జౌ వారి సూర్యకరే యథా 29

యథా=ఏ ప్రకారం: శుక్తౌ=ముత్తెపుచిప్పయందు: రూప్యం=వెండి: రజ్జౌ=త్రాటియందు: ఫణీ=పాము: సూర్యకరే=సూర్యకిరణాలయందు: వారి=జలం: వికల్పితం=కల్పింపబడి: భాసతే=తోస్తున్నదో: తథైవ= అలానే: వికల్పితం=విశేషకల్పితమై: విశ్వం=ప్రపంచం: అజ్ఞానాత్= అజ్ఞానం వలన: మయి=నాయందు: భాసతే=తోస్తున్నది: అహో=ఇది చాలా ఆశ్చర్య విషయం !

ఆచార్యదేవా ! మహానుభావా ! అహో ! ఇది మహాశ్చర్యంగా ఉంది. ముత్యపు చిప్పలందు వెండి మెరిసినట్లూ రజ్జువు మసకచీకటిలో సర్పంగా కదిలినట్లూ- గ్రీష్మకాలంలో ఎడారులందు ఎండమావులు జలతరంగాలవలె భ్రమగొలిపినట్లూ- అసత్యమైన విచిత్ర విశ్వం సాక్షాత్తు సత్య పదార్థంలాగా నేత్రాలముందు వివిధ విన్యాసాలు హాస్యాలు చేస్తున్నది ప్రభూ !

ఇది మిథ్య అయినా ఎంత ఆకర్షణా ! వికల్పితమైనా ఎంత విభ్రమమూ ! అజ్ఞానం వల్ల జనించేది అయినా ఎంత అద్భుతం ! ఇది జడమైనా ఎంత చైతన్య శీలంగా ఉంటుంది ! విశ్వం తీరు విచిత్రం. ప్రపంచం వంచనయేనేమో ! అమాయకులను మాయలో పడేస్తుంది కదా ! అంతా నటన ! పరమేశ్వరుడు నాట్యకళాప్రియుడు కదా ! ఇది ఒక నాటకరంగమే ! తెలిసి నటించాలి. లేకపోతే జీవుడు మోసపోతాడు.

* *

బ్రహ్మమురారి సురార్చితలింగం
నిర్మల భాసిత శోభిత లింగం
జన్మజ దుఃఖ వినాశక లింగం
తత్ప్రణమామి సదాశివలింగమ్

—శంకరాచార్య

## మ ట్టి కు ం డ

మత్తో వినిర్గతం విశ్వం మయ్యేవ లయ మేష్యతి
మృది కుంభో జలేవీచిః కనకే కటకం యథా 30

యథా = ఏ ప్రకారం; మృది = మృత్తిక-మట్టియందు; కుంభః = కుండ; జలే = నీటియందు; వీచిః = అలలు; కనకే = బంగారమందు; కటకం = మురుగులు; లయం = లీనమై ఉంటున్నవో; (తద్వత్ = అలానే); మత్తః = నా నుండి; వినిర్గతం = ఉత్పన్నమైన; ఇదం విశ్వం = ఈ విశ్వం; మయ్యేవ = నా యందే; లయం = లయం; ఏష్యతి = పొందుతుంది.

గురువర్యా ! మట్టి నుండి భాండాలు తయారై కొద్దికాలానికి భగ్నమై మరల మట్టిలో కలిసిపోతాయి- నదీ జలంలో ఉద్భవించిన వివిధ తరంగాలు మరల జలం లోనే లీనమైపోతాయి- బంగారంతో తయారైన ఆభరణాలు మరికొంత కాలాని. మరల బంగారంలోనే కరిగిపోతాయి-

అదే విధంగా విశ్వం కూడా పరమాత్మ స్వరూపుడనైన నా ఆత్మలో ఉద్భవించి నాయందే అనగా పరమాత్మయందే లయమైపోతున్నది. నేను ప మాత్మను. ప్రకృతిని. వాస్తవానికి విశ్వం మిథ్య జడం. ఆత్మచేతనం.

జ్ఞాన దశలో విశ్వం బ్రహ్మంగా పరమాత్మ విష్ణు స్వరూపంగా దర్శనమిస్తుంది ప్రతిఫలిస్తుంది. అజ్ఞానదశలో విశ్వం విచిత్రం. ఇదే ప్రజ్ఞానదశలో లయమైన విశ్వ ఏకమై చిద్రూపమై ప్రకాశమానమవుతుంది. విశ్వం మాయలో పుట్టి మాయలో మాయమైపోతుంది. పరమాత్మ చైతన్యశీలం అదే మిగులుతుంది. అది నా ఆత ప్రకాశం. పరమాత్మ ప్రకాశం. ప్రపంచ ప్రాదుర్భావ ప్రళయాలు పరమాత్మకు సంబంధించినవికావు.

పరమాత్మ నుండి ఈ భూతజాలమంతా జనిస్తున్నది. పరమాత్మ ప్రభావంతో జీవకోటి జీవిస్తున్నది. మరల ఈ జీవులు తనువులు చాలించి పరమాత్మలో పోతాయి. ఆ పరమాత్మ నా ఆత్మయే.

* *

యతోవా ఇమాని భూతాని జాయంతి
యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభి సంవిశంతి— శ్రుతి

"పాలు పెరుగుగనూ, మట్టికుండవలెనూ, సువర్ణం ఆభరణాలుగాను పరిణమిస్తున్నాయి. అలానే ప్రకృతి పరిణమించి ప్రపంచం అవుతున్నది"— అని సాంఖ్యుల పరిణామ సిద్ధాంతం.

"అన్య వస్తువుల నుండి అన్య వస్తువులు జనిస్తాయి. నూలు అనే వస్తువు నుండి వస్త్రం అనే వస్తువు ప్రాదుర్భవిస్తోంది అల్లే పరమాణువులనుండి ప్రపంచం పుట్టింది— అని నైయాయికుల ఆరంభవాదం.

"ఒక వస్తువు తన పూర్వావస్థ నుండి అన్య అవస్థలో ప్రతీయమానం అవుతుంది. రజ్జువు యొక్క వివర్త రూపం సర్పం. రజ్జువే సర్పరూపంలో భ్రమవల్ల కనిపించింది. అజ్ఞానదశలో రజ్జువు సర్పంలాగా అనిపించింది. అజ్ఞానం నివృత్తి జెంది జ్ఞానకాంతి రాగానే సర్పం అదృశ్యమై రజ్జువే మిగిలింది. అలానే ఆత్మ జ్ఞానంతో మిథ్యాజగత్తు నివృత్తి అయి నిజమైన బ్రహ్మం సాక్షాత్కరిస్తుంది— అని వేదాంతుల వివర్తవాదం.

వివేకంతో విజ్ఞులు విమర్శచేయగా చివరకు వివర్తవాదమే నిలిచేది. వేద ప్రమాణంతో విరాజిల్లేది. మిగిలిన సాంఖ్యుల వాదం. బౌద్ధుల శూన్యవాదం, నైయాయికుల ఆరంభవాద పరమాణు సిద్ధాంతం నిలిచేవి కావు.

*　　　　*

"ఈశ్వరానుగ్రహాదేవ పుంసాం అద్వైతవాసనా" ఈశ్వరానుగ్రహం వల్లనే పురుషుడికి అద్వైతజ్ఞానం లభ్యమవుతుంది.

## నా కు నా శం లే దు

అహో అహం నమో మహ్యం వినాశో యస్య నాస్తిమే
బ్రహ్మాదిస్తంబ పర్యంతం జగన్నాశోఽపి తిష్ఠతః 31

బ్రహ్మాది=బ్రహ్మమొదలు; స్తంబపర్యంత మపి=తృణం వరకు కూడా; తిష్ఠతః=ఉంటున్నటువంటి; జగత్=జగత్తు; నాశేఽపి=నశించిననుకూడ; యస్య=ఏ; మే=నాకు; నాశః=నాశం; నాస్తి=లేదో (అట్టి నన్ను గూ

నాకు): అహో:=ఆశ్చర్యంగా ఉంది; మహ్యం=నా కొరకు (నామహత్వానికి); అహంనమః=నేను నమస్కరించుకొంటున్నాను.

స్వామీ ! నాలో ఎంత గొప్పదనముందో ఇప్పుడే తెలిసింది. మహాశ్చర్య విభ్రమాలు కలుగుతున్నాయి. నాలోని మహస్సుకు నాకే నమస్సుమనస్సులు అర్పించాలి" అనిపిస్తున్నది. నా ఆత్మశక్తి అజేయమై అఖిల ప్రపంచాతీతమై అద్వితీయమై అఖండ సచ్చిదానందమై ప్రకాశిస్తున్నదన్నమాట.

అహా ! "అహం నమోన్నమోన్నమః" సకల జగత్ కార్యాలకు వివర్త ఉపాదానమైనా కూడా నాకు ప్రణయమేగానీ ప్రళయం లేదు. వినయమేకానీ విలయం లేదు. నేను శాశ్వతుణ్ణేకానీ అశాశ్వతుణ్ణి కాను. నేను సర్వసాక్షిని. కర్మసాక్షిని. ప్రపంచం ఈ చరాచరాలు నశించినా నేను వసించే ఉంటాను. నాకు వికారాలు లేవు. విధ్వంసాలు వినాశాలు లేవు. నాకు క్షయంలేదు. అక్షయ పురుషుణ్ణి సుమా ! చిద్రూపుణ్ణి. ఆత్మను పరమాత్మను. బ్రహ్మాది స్తంబ పర్యంతం నాశనమైనా నేను అవినాశిని.

* *

సర్వ భూతాంతరస్థాయ నిత్యముక్త చిదాత్మనే
సమ్యక్ చైతన్యరూపాయ మహ్యమేవ నమోనమః

అన్ని ప్రాణులలోనూ చిద్రూపంగా నివసిస్తున్నాను. నిత్య ముక్తుడనై యున్నాను. చైతన్యమూర్తినై యున్నాను. అట్టి నాకు నేను నమస్కరించు కొంటున్నాను.

—వరాహ ఉపనిషత్తు

బ్రహ్మను తెలుసుకొన్నవాడు ఆ బ్రహ్మయే. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" నేను సర్వానికి అధిష్ఠానమూర్తిని. పరిణామ ఆరంభ ఉపాదానాలు నేనుకాను నేను నిత్యుణ్ణి. సత్యుణ్ణి. నిర్మలుణ్ణి. నిరంజనుణ్ణి. నిశ్చలుణ్ణి. కంకణాలకు కనకం వలె విశ్వానికి నేను పరిణామ ఉపాదానం కాను. వస్త్రానికి దారాలవలె అణువులకు ఆరంభ ఉపాధానాన్నికాను. నేను సర్పారోపమైన రజ్జువువలె అద్వైత వివర్త ఉపాధాన కారణాన్ని.

అధిష్ఠాన వస్తువుకు మార్పులేని ఆరోపస్ఫూర్తి వివర్త ఉపాదానం. ఆరోప దృష్టిగలవాడికి అధిష్ఠానం స్ఫురించదు. అధిష్ఠానంపై దృష్టిగలవాడికి ఆరోపవస్తువు స్ఫురించదు. ఇది లోకసహజం.

*   *

## నేను రాను పోను

అహో అహం నమోమహ్యం ఏకోఽహం దేహవానపి
క్వచిన్న గంతా నాగంతా వ్యాప్య విశ్వమవస్థితః 32

అహం=నేను; అహో=ఆశ్చర్యరూపుడను; మహ్యం=నాకొరకు; నమః=నమస్కారం; అహం=నేను; దేహవానపి=దేహధారినైననూ; ఏకః=అద్వితీయుడను; క్వచిత్=ఎక్కడికి కూడా; న గంతా=పోవువాడను కాను; క్వచిత్=ఎక్కడికి కూడా; న అగంతా=వచ్చువాడనుకాను; విశ్వం=ప్రపంచమంతటా; వ్యాప్తం=ఆవరించి; అవస్థితః=ఉంటున్నాను

గురువరేణ్యా ! తమరు బోధిస్తే తెలిసింది. ఇవి అన్నీ నా ఆత్మ యొక్క ప్రతిబింబాలు అని. ఎంత ఆశ్చర్యం ! ఎంత ఆశ్చర్యం ! ఇంత ఆత్మశక్తికి అభివందనాలు. శతాధిక అభివందనాలు.

"ఏకోఽహమ్" నేను ఒక్కడినే. ఏకాత్మనే. అయినా విశ్వమెల్లా వ్యాపించి ఉన్నాను. నావి సహస్రశీర్షాలు-సహస్రపాదాలు-సహస్రహస్తాలు-సకలరూపాలు నావే. అన్ని వేషాలు నావే. ఈ విశ్వనాటకంలో అన్ని పాత్రలూ నావే. అన్ని దృశ్యాలు నావే. నేను సర్వాత్ముడనై ఎన్ని భూమికలు నిర్వహించగలుగుతున్నాను ! నాలో ఇంత శక్తి, రక్తి ఉన్నదనే సంగతి తమరు చెప్పేవరకు తెలియలేదుకదా !

ఆకాశం ఒక్కటే. నానాఘటాది ఉపాధుల్లో వేరు. క్రియాదులు ఉపాధిధర్మాలు. అవి ఆకాశధర్మాలు కావు. నా ఆత్మ ఒక్కటే. నేను ఒక్కణ్ణే. ఇన్ని రూపాలు ధరిస్తున్నాను. నాటకం ఆడుతున్నాను. నా శక్తికి నేనే విస్తుపోతూ నాకు నేనే అభినందించుకొంటున్నాను. ఇవి నా ఉపాధి ధర్మాలు. ఆత్మధర్మాలు కావు.

సూర్యుడొక్కడే వివిధ నదీనదాల్లో సరోవరాల్లో సాగరాల్లో పాత్రల్లో ఎన్ని సూర్య ప్రతిబింబాలు దర్శనమిస్తున్నాయి. అలానే నేను కూడా విశ్వవేదికపైన

వేలాది పాత్రలలో వివిధ భంగిమల్లో ఎప్పటికప్పుడు వినూత్నంగా అభినయిస్తున్నాను. నా రూపమే ప్రతిబింబిస్తుంది అన్నీ నా రూపాలే.

నేను విశ్వవ్యాపకుణ్ణి. విలక్షణుణ్ణి. వేరుగా ఎక్కడి నుంచీరాను. ఎక్కడికీ పోను. వివిధ ఉపాధుల్లో సంచరిస్తున్నాను. ఇవి దేహధర్మాలు. నేను నిత్య సత్య స్వరూపుణ్ణి. అచలుణ్ణి. సుస్థిరుణ్ణి.

* *

## నాకు బంధం లేదు

అహో అహం నమోమహ్యం దక్షో నాస్తీహ మత్సమః
అసంస్పృశ్య శరీరేణ యేన విశ్వం చిరం ధృతమ్ 33

యేన=ఎందుచేత; శరీరేణ=ఈ దేహంతో; అసంస్పృశ్య=అంటుకోని; ఇదం విశ్వం=ఈ విశ్వం; మయా=నా చేత; ధృతం=ధరింపబడుతున్నదో; అతః=ఆ కారణం వలన; ఇహ=ఈ ప్రపంచంలో; మత్సమ=నాతో సమమైన; దక్షః=సమర్థుడు మరొకడు; నాస్తి=లేడు; అహో=ఇది అత్యాశ్చర్యకరమైన విషయం కనుక; అహం=నేను; మహ్యం=నా కొరకు (నా ఆత్మలోని మహాత్ముడికి); నమః=నమస్కరిస్తునాను.

ఆచార్యదేవా! మరీ ఆశ్చర్యంగా ఉంది. నాతో సమానమైనవాడే లేడు. నాకు అన్యం అనేదిలేదు. అందరూ నా రూపాలే. అందరిలో నా ఆత్మ చేరి అన్ని కార్యాలు నిర్వహిస్తున్నది. నా ఆత్మ ఎంత సామర్థ్యం కలదో ఇప్పుడు తెలుస్తోంది. దాని మహత్వం, దాని పటుత్వం, దాని తత్త్వం అమోఘం-అద్భుతం-అనిర్వచనీయం. నా ఆత్మను నేను ఎంత అభినందించినా తక్కువే.

తైలం లేక దీపం వెలుగనట్లే నా ఆత్మ శక్తి లేక విశ్వం వెలుగలేదు. ఈ శరీరంతో స్పృశించకుండా ఈ విశ్వం ధరిస్తున్నాను. నన్ను అది ధరించటంకాదు నేను విశ్వాన్ని ధరిస్తున్నాను. చిరకాలం నుండి ఇదే వరస. ధరించటానికి తీసివేయటానికి నేను సర్వదక్షుణ్ణి. ఘటనాఘటనా కార్యదక్షుడను. ఆశ్చర్య స్వరూపుడను. ఈ విశ్వమును ధరిస్తున్నాను. విశ్వనాథుడను. విశ్వేశ్వరుడను.

* *

ప్రాతర్నమామి గిరిశం గిరిజార్థదేహం
సర్గ స్థితి ప్రళయ కారణ మాదిదేవం
విశ్వేశ్వరం విజితవిశ్వ మనోఽభిరామం
సంసార రోగ హరణౌషధ మద్వితీయమ్

## నేను ఆశ్చర్యరూపుడను

అహో అహం నమో మహ్యం యస్య మే నాస్తి కించన
అథవా యస్యమే సర్వం యద్వాఙ్మానస గోచరమ్ 34

యస్యమే=ఏ నాకు; కించన=కొంచం కూడా; నాస్తి=లేదో; యస్యమే=ఏ నాకు; వాఙ్మానస=వాక్కులకు మనస్సుకు; గోచరం=అవగత మగునో; యత్=ఏ (నాకు); సర్వం=సర్వమూ; అస్తి=ఉన్నదో (అట్టి నేను); అహం=నేను; అహో=ఆశ్చర్యరూపుడను; మహ్యం=నాకొరకై; నమః=నమస్సులు !

గురువర్యా ! దివ్యాత్మ స్వరూపులకు సాష్టాంగ నమస్కారాలు. సత్యం మూడు విధాలు. జగద్వ్యాపార సంబంధం వ్యావహారిక సత్యం. స్వాప్నిక సంబంధ మైనది ప్రాతిభాసిక సత్యం. కాలత్రయ అబాధితం పారమార్థిక సత్యం. ఇది ఆత్మ సంబంధితం.

ఈ పారమార్థిక సత్యంతోనే నాకు సంబంధం. ఇది బ్రహ్మాత్మ సత్యం. జగత్తు ధరిస్తున్నాను. కాని జగత్తు శారీరకం మిథ్యా తాదాత్మ్యం. ఇది కల్పితం. వాస్తవం కాదు. జగత్తుతో వాస్తవ సంబంధం లేదు. ఆత్మ విశ్వంతో కలిసియున్నా విశ్వం యొక్క అన్ని దశలలోనూ ఆ ఆత్మ స్వయం ప్రకాశమానమై విలక్షణంగా విరాజిల్లుతుంది.

ఈ చైతన్య ఆత్మలో నానా రూపాలుగా జగత్తు ప్రతిఫలిస్తుంది. ఇదివాస్తవ కాదు. మిథ్య అని శ్రుతి. "మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి—" —శ్రుతి. అది మృత్యువు నుండి కూడా మృత్యువునే పొందుతుంది. అది

బ్రహ్మంలో నానా ఆత్మలను చూస్తుంది. ఈ శ్రుతి వాక్యాలు ద్వైతాన్ని నిషేధిస్తున్నాయి.

మనస్సు-వాక్కు విషయాలన్నీ మిథ్యా కల్పితం ఈ మనో వాక్కులకు చైతన్య స్వరూపమైన నా ఆత్మతో సంబంధంలేదు. కనుక నా ఆశ్చర్య ఆత్మ స్వరూపానికి అభివందనం చేసికొంటున్నాను

* *

క్రోధ ఏష మహాన్ శత్రుః తృష్ణావైతరణీ నదీ
సంతోషో నందనవనం శాంతిరేవహి కామధుక్

— అధ్యాత్మ రామాయణం

## సోఽహమ్

జ్ఞానం జ్ఞేయం తథాజ్ఞాతా త్రితయం నాస్తి వాస్తవమ్
అజ్ఞానాత్ భాతి యత్రేదం సోఽహమస్మి నిరంజనః 35

యత్ర=ఎక్కడ; జ్ఞానం=తెలివి; జ్ఞేయం=తెలియదగిన వస్తువు; జ్ఞాతా=తెలిసికొనేవాడు; త్రితయ=ఈ మూడును; వాస్తవం=యదార్థంగా; నాస్తి=లేవో; చ=మరి; యత్ర=ఎచ్చట; అజ్ఞానాత్=అజ్ఞానం వలన; ఇదం=ఈ మూడూ ఉన్నట్లుగా; భాతి=తోస్తున్నవో; సః=ఆ; అహం=నేను; నిరంజనః=ఉపాధి రహితుడను; అస్మి=అగుచున్నాను.

అధ్యాపకశ్రేష్ఠా ! వరిష్ఠా ! జ్ఞానం-జ్ఞేయం-జ్ఞాత ఈ మూడు వాస్తవాలుకావు. ఇవి పారమార్థిక సత్యాలుకావు. ఇవి మిథ్యాజ్ఞానం వలన నాయందు ప్రతీయమానమవుతున్నాయి. లయశీలమైన విశ్వం అలా భాసిస్తున్నది. వాస్తవంగా నేను నిరంజనుడను. ప్రపంచ మల శూన్యుడను. పవిత్రుడను. పరమాత్మను. "సోఽహమస్మి".

నాకు ఈ మాయా కార్యాలతోగానీ మాయతోగానీ సంబంధంలేదు. అయితే అన్నిటికీ సాక్షీభూతుడను. నేను మాయారహిత శుద్ధ చైతన్యాత్మను. మాయలో

బంధాలు మూడు సాత్త్వికం రాజసం తామసం. అలానే జ్ఞానం మూడు రకాలు సాత్విక జ్ఞానం, రాజస జ్ఞానం, తామస జ్ఞానం. ఈ జ్ఞాన భూమికలు దాటినవాడు పరమ జ్ఞాని.

*　　　　*

"అహో! అహం నమో! మహ్యం"—
"అహో! అహం నమో! మహ్యం"—
"అహో! అహం నమో! మహ్యం"—
"అహో! అహం నమో! మహ్యం"—
"సోఽహ మస్మి" ఇది మంత్రం.

ఇది ఆత్మ మంత్రం. ఈ పంచశ్లోకాలలోనూ ఇది సంపుటి చేయబడింది. ఇది జీవన్ముక్తి దాయకం. ఆత్మానుభవ భాగ్యప్రదం. ఇది నిత్యపఠనీయం.

: :　　　　: :

ధ్యాతా నతే హి హృదయే న చ సమాధిః
ధ్యానం నతే హి హృదయే న బహిఃప్రదేశః
ధ్యేయం నచే తి హృదయే న హి వస్తుకాలో
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్

ధ్యానించేవాడూ లేడు. హృదయ సమాధీలేదు. ధ్యానమూలేదు. హృదయానికి బాహ్యంగా దేశంలేదు. ధ్యానించతగిందీలేదు. హృదయంలో వస్తువులూ కాలమూ లేదు. ఆకాశంవలె అసంగంగా జ్ఞానామృతం సమచిత్తంతో నేనే ఉన్నాను.

—అవధూతగీత

## ద్వైతం దుఃఖం

ద్వైతమూలమహో! దుఃఖం నాన్యత్ తస్మాస్తి భేషజమ్
దృశ్యమేతత్ మృషా సర్వం ఏకోఽహం చిద్రసోఽమలః 36

దుఃఖం=విషాదం; ద్వైతమూలం=ద్వైతభావ ప్రధానం; తస్య=

అద్వైత దుఃఖనివారణకు; అన్యత్=ఇతరమైన; భేషజం=ఔషధం; నాస్తి= లేదు; ఏ తత్=ఈ సర్వ; దృశ్యం=దృశ్య ప్రపంచం; మృషా=అసత్యం సర్వం=సమస్తం; అహం=నేను; ఏకః=ఒక్కడినే; చిద్రసః=జ్ఞాన రస స్వరూపుడను; అమలః=నిర్మలుడను.

గురు మహోదయా ! సహృదయా ! ద్వైతం దుఃఖానికి మూలం. అసత్యం అనిత్యం. దృశ్య ప్రపంచం అంతా జడం. ఇది వట్టి మృష. ఉత్త భేషజం మిధ్య. ఇది ఈ నిశ్చయం- పరమార్థ జ్ఞానంవల్ల, తమ ఉపదేశంవల్ల ఇది తెలిసికొన్నాను. తేల్చుకొన్నాను. నేను చిదానందుడను. త్రివిధ దుఃఖాలకు పరమౌషధం. జ్ఞానం. ఆత్మజ్ఞానం-అదే పరమాత్మ జ్ఞానం.

ద్వైతం వలన భ్రమ జనిస్తుంది. వాస్తవంగా నాకు ఏగ్లానీలేదు. మాయకూ, మాయాకార్యాలకూ అతీతుణ్ణి. చిన్మాత్ర స్వరూపుణ్ణి. ఈ జగత్తంతా మిధ్య. ఇది ప్రతిబింబమేకానీ అసలుమూర్తి కాదు. అసలుమూర్తి స్థిరం. ప్రతిబింబం అస్థిరం. "నాన్య త్తస్యాస్తి భేషజమ్" అహంకార అనుభవ క్షేత్రంలో బాధలు పోవాలంటే సత్యం తెలిసికొనటం కంటే మరో మార్గం లేదు.

నేను విశ్వం నిండిన ఏకైకమూర్తిని. అమలుడను. అచలుడను. నిరంజనుడను. నిత్యుడను. చిదాత్మ స్వరూపుడను. చైతన్యమూర్తిని. నాకు సుఖమేగానీ దుఃఖంలేదు.

* *

శరీరం సురూపం తథా వా కళత్రం
యశ్చారు చిత్రం ధనం మేరు తుల్యం
గురోరంఘ్రి పద్మం మనశ్చే న్న లగ్నం
తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిమ్

—శంకరాచార్య

# నేనే పరమార్థం

బోధమాత్రోఽహ మజ్ఞానాత్ ఉపాధిః కల్పితో మయా
ఏవం విమృశతో నిత్యం నిర్వికల్పే స్థితిర్మమ 37

అహం=నేను; బోధమాత్రః=జ్ఞానమూర్తిని; మయా=నా చేతనే; అజ్ఞానాత్=అ విద్య వలన; ఉపాధి=దేహం; కల్పితః=కల్పింపబడింది; ఏవం=ఈ ప్రకారంగా; నిత్యం=సదా; విమృశ్యతః=విచారణచేసే; మమ=నాకు; నిర్వికల్పే=వికల్పరహిత సమాధిలో; స్థితః భవతి=స్థిరమౌతున్నది.

దేశికాచార్యా ! విప్రవర్యా ! నేను సుబోధ మాత్రుడను. పరమార్థ స్వరూపుడను. నిర్వికల్పుడను. నిత్యుడను. సర్వకారణభూతుడను. సుస్థిరుడను. అజ్ఞానం వలన ఉపాధి కలిగింది. నానా ఉపాధులు అనేక అసంఖ్యాకమైన మాయలు నిమిత్తంగా అహంకారాది ద్వైత ప్రపంచం నా చేతనే కల్పించబడింది. జ్ఞానం విజ్ఞానం నాదే. అజ్ఞాన కల్పనా నాదే.

ఇలా నిత్యం తత్త్వ విమర్శ చేయగా నాకు జ్ఞానకిరణం సోకింది. అందువల్ల ద్వైత వాసన రహితమైపోయింది. అద్వైతం వివరిస్తున్నాను. స్వస్వరూపనిష్ఠ అధికం కానొచ్చింది. నా చైతన్యాత్మ విశాల దృష్టి విశ్వం నిండింది. నేను ఆత్మను పరమాత్మనైనాను అందరిలో నన్నే చూచుకొంటున్నాను.

నేను ఒక్కడినే సర్వత్రా వ్యాపించియున్నాను. నేను పారమార్థిక సత్య స్వరూపుడను. ఈ అద్వైత జ్ఞానం వల్లనే నాకు నిర్వికల్ప సమాధిస్థితి ప్రాప్తించింది. నిత్య చైతన్యస్థితి వచ్చింది అజ్ఞాన కార్యాలకు విజ్ఞాన కార్యాలకు ఆత్మజ్ఞాన కార్యాలకు అధిష్ఠానం నేనే.

నిత్య పరిశీలన వలన ప్రపంచ అసత్య స్వరూపం బయట పడుతుంది. ఇది మిథ్య అనే సుజ్ఞానం కలుగుతుంది. ప్రజ్ఞానంతో సచ్చిదానందం అనుభవిస్తాడు.

నాకు అలా అనుభవం కలిగింది జీవన్ముక్తుడనైనాను.

*　　　*

నిత్యానందైక కందాయ నిర్మలాయ చిదాత్మనే
జ్ఞానోత్తమాయ గురవే సాక్షిణే బ్రహ్మణే నమః

## బంధ మోక్షాలు లేవు

అహో మయిస్థితం విశ్వం వస్తుతో న మయిస్థితమ్ 38
నమే బంధోఽస్తి మోక్షోవా భ్రాంతిః శాంతా నిరాశ్రయా

మే=నాకు; బంధోవా=బంధం కానీ; మోక్షోవా=మోక్షం కానీ; న అస్తి=లేదు; అహో=ఆశ్చర్యం ఏమంటే; మయి=నా యందు; స్థితం=ఉన్నదనుకొనే; విశ్వం=ప్రపంచం; వస్తుతః=యథార్థంగా; మయి=నా యందు; న స్థితం=లేదు; ఇతి విచారతః=ఇలా విచారణ చేయటం వల్ల; భ్రాంతి=భ్రమ; నిరాశ్రయా=నిరాధారమై; శాంతా=శాంతి పొందింది !

నాకు బంధ మోక్షాలు లేవు. ఇవి తలంచటం అంతా భ్రాంతి. ఈ భ్రాంతి వదిలించుకొన్న విజ్ఞానిని నేను. నేను నిత్య సత్య స్వరూపుడను. శాంతం నిరాశ్రయం. శాస్త్ర విచారం వలన ఈ భ్రాంతి తొలగిపోతుంది. విచారణ వలన నిత్య పరమానందం ప్రాప్తించకపోయినా మార్గం సుగమమవుతుంది. శాస్త్ర విమర్శ చేత అజ్ఞానం అంతరించి భ్రమలు వీడిపోతాయి.

ఆత్మవిమర్శ సద్విచారం లేనివాడికి భ్రాంతి తొలగదు. ముక్తి దొరకదు. నా యందు ఉన్నదనుకొన్న విశ్వం వాస్తవంగా నాలోలేదు. ఉన్నదంతా బ్రహ్మమే. జీవుడి ఆత్మ ఆనంద స్వరూపం. అందుకోవటమే మోక్షం.

"ఆనందాత్మక బ్రహ్మ ప్రాప్తిశ్చ మోక్షః" నాకు ఆశ్చర్యంగా ఆత్మజ్ఞానం కలిగింది. "నేను దేహధారిని. ఈ దేహం నాది. ఇంద్రియాలు నావి. నేను బ్రాహ్మణుడను. నేను బాలుడను. నేను కర్తను నేను భోక్తను." ఇలా తలచటం భావించటం అహంభావికి లక్షణం. ఈ భ్రమపోయి శాస్త్రజ్ఞానం వలన గురూపదేశం వలన "నేను దేహినికాను ఆత్మను. ఇంద్రియాలు నావి కావు. ఇవి దైహిక కల్పనలు. నేను కర్తనూ కాదు. భోక్తనూ కాదు. ఈ దేహ క్రీడలకు నేను కేవలం సాక్షీభూతుడను" అనే యథార్థజ్ఞానం కలుగుతుంది. ఇదంతా తమ సదుపదేశఫలమే స్వామీ ! నాకు ఆశ్చర్యంగా ప్రజ్ఞానం కలిగింది.

*　　　　*

"శ్రీమత్పరం బ్రహ్మగురుం స్మరామి
శ్రీమత్పరం బ్రహ్మగురుం వదామి
శ్రీమత్పరం బ్రహ్మగురుం నమామి
శ్రీమత్పరం బ్రహ్మగురుం భజామి"

## ఆత్మ శుద్ధం

న శరీర మిదం విశ్వం న కించిదితి నిశ్చితమ్
శుద్ధ చిన్మాత్ర ఆత్మాచ తత్కస్మిన్ కల్పనాఽధునా 39

న శరీరం = దేహాదులతో కూడిన; ఇదం విశ్వం = ఈ విశ్వం; న కించిదపి = కొంచెం కూడా లేదు; చ = మరి; ఆత్మా = ఆత్మ; శుద్ధచిన్మాత్రః = పరిశుద్ధమైన చైతన్యమాత్రం; ఇతి = అని; యదా = ఎప్పుడు; నిశ్చితం = నిశ్చయజ్ఞానం కలుగుతుందో; తదా = అప్పుడు; కస్మిన్ = ఏ విషయంలోనైనా; అధునా = ఇప్పుడు గల; కల్పనా = విశ్వ కల్పన ఉంటుందా !

ఆచార్యదేవా ! ఈ విశ్వం అనిత్యమై శరీర ఉపాధులతో విలసితమై దృశ్యమానమవుతున్నదికదా. ఇది "సత్యం" అని కాని "అసత్యం" అని కానీ నిశ్చయించటానికి వీలులేనిది. ఆత్మ నిత్యం. సత్యం అది చిన్మాత్రం. మాయామల శూన్యం.

విశ్వ కల్పనకు ఉపాదాన కారణమైన అజ్ఞానం నశిస్తే విశ్వకల్పనకుమూలం తెలుస్తుంది విశ్వకల్పనకు ఆధారంలేదు. ఇది భ్రమ విశ్వం విచిత్రం. జగత్తు చలించేది. గమించేది ఇది ముఖ్యం. ఆత్మ సత్యం. విశ్వం అనిత్యం అసత్యం అయినా అనిర్వచనీయమైన అజ్ఞానవృతమై ఉందికనుక ఇదీ కూడా అనిర్వచనీయమే అయియున్నది. ఈ అజ్ఞాన అంతంతో ప్రపంచం కూడా మిధ్య అని తేలుతుంది. అజ్ఞానమే విశ్వానికి కారణం. జ్ఞాన ప్రకాశమే సత్య బోధకం.

## స్వర్గం - నరకం

శరీరం స్వర్గ నరకౌ బంధమోక్షౌ భయం తథా
కల్పనామాత్రమేవై తత్ కిం మే కార్యం చిదాత్మనః 40

ఏతత్ = ఈ; శరీరం = దేహం; స్వర్గ నరకౌ = స్వర్గ నరకాలూ;

బంధమోక్షౌ=సంసార మోక్షాలు; తథా=అ ప్రకారంగానే; భయం=భయమూ ఈ మొదలైనవి అన్నీ; కల్పనా మాత్రమేవ=కల్పనా మాత్రమే; చిదాత్మనః= జ్ఞాన స్వరూపుడనైన; మే=నాకు (వీటితో); కిం=ఏమి; కార్యం= ప్రయోజనం ?

అధ్యాపకవర్యా ! శరీర సుఖాలు స్వర్గనరకాలు కల్పనలే. కానీ వాస్తవాలు కావు. ఇవి కదిలిపోయే మేఘాలు. వీని వలన సూర్యదేవుడికి ఏమీ ప్రతిబంధకాలు లేవు. లాభనష్టాలు కలుగవు.

అలానే ఈ స్వర్గ నరకాల వలన సచ్చిదానంద రూపుడైన పరమాత్మకు ఏమీ లాభనష్టాలు లేవు. ఈ విధి నిషేధాలు బంధ మోక్షాలు బోధించే శాస్త్రాలు అన్నీ అవిద్యావంతులు అనుసరించి బాగుపడటానికే. విద్యావంతుడికి విజ్ఞానికీ, మహాజ్ఞాన భూమికలు దాటినవాడికీ ఇవి అవసరమే లేవు. అన్నీ తెలిసినవాడికి పుస్తకాలతో ప్రయోజనం ఉండదు కదా!

ప్రపంచం అవాస్తవం. ఉపాధులు అనిత్యం. చిదానంద స్వరూపులకు ఈ విశ్వ విన్యాస విభ్రమాలతో పని ఏముంది ? ప్రపంచసుందరి విలాసాలు కాసేపు చూడటానికి మాత్రం ఉపయోగపడతాయి. కాని స్థిరంగా ఉపయోగపడవు. జ్ఞాని వీటిని లక్ష్యం చేయడు. వాని గమ్యం పరమేశ్వర రమ్య శరణ్యం. సత్యానికి మిథ్యకు వాస్తవిక సంబంధంలేదు. ఇవి కల్పితాలు. కనుక స్వర్గ నరకాదులతో ప్రయోజనం లేదు.

* *

అంతా మిథ్య తలంచిచూచిన నరుండట్లౌటెఱింగిన్ సదా
కాంతల్ పుత్రులు అర్థముల్ తనువు నిత్యంబంచు మోహార్ణవ
భ్రాంతింజెంది చరించుగాని పరమార్థంబైన నీయందు తా
చింతాకంతయు చింతనిల్పడుకదా ! శ్రీకాళహస్తీశ్వరా !

— ధూర్జటి

## జ న ం వ న ం

అహో! జనసమూహేఽపి న ద్వైతం పశ్యతో మమ
అరణ్యమివ సంవృత్తం క్వ రతిం కరవాణ్యహమ్ 41

జనసమూహేఽపి = జన సమూహం మధ్యలో కూడా; ద్వైతం = రెండవది ఏదీ; న పశ్యతః = చూపుచుండుటలేదు; మమ = నాకు; ఆ జనపదం; అరణ్యమివ = అరణ్యం వలె; సంవృత్తం = అనిపిస్తున్నది; తస్మాత్ = ఆ కారణం వలన; అహం = నేను; క్వ = ఎక్కడ; రతిం = మోహ ప్రీతిని; కరవాణి = చేయగలను; అహో = చాలా ఆశ్చర్యం.

దేవా ! ఆహా ! ఈ జనసమూహంతో దేశం అంతా అరణ్యంగా ఉంది. ఈ ప్రపంచ తత్త్వం అంతా మిథ్యా కల్పితం. ఇందు ప్రేమించే వస్తువే కనిపించటం లేదు. ఈ ఇహలోకం ఎందుకు ? అయితే ఇది వేరు నేను వేరు అనుకొన్నప్పుడే. ఇపుడు ఆ దృశ్య భ్రాంతి పోయింది. అంతటా ఆత్మయే. ద్వైత భావం తొలగి అద్వైత భావం స్థిరమయింది. అన్నిటా ఆత్మరూపుడైన ఆ పరమాత్మ దర్శన మిస్తున్నాడు. అజ్ఞాని మిథ్యా ప్రపంచ సుఖాలకు ఆకర్షింపబడతాడు. జ్ఞాని అలా అసత్య వస్తువులకు ఆపేక్షపడడు.

* *

అనఘ! శబ్దాది విషయంబులందు దగిలి
ఇచ్ఛ చరియించు నెప్పుడు ఇంద్రియములు
బుధుడు తత్స్వభావము తన బుద్ధినెరిగి
ఏమరక వాని దగ గుదియింపవలయు

—ఎఱ్ఱన (భారతం 5-62)

## నాకు దేహం లేదు

నాహం దేహో నమే దేహో జీవో నాహమహం హి చిత్
అయమేవ హి మే బంధ ఆసీద్యా జీవితే స్పృహా 42

అహం = నేను; న దేహః = దేహం కాను; మే = నాకు; న దేహః =

దేహంలేదు; న జీవః=జీవుడనుకాదు: అహం=నేను; చిత్=జ్ఞానస్వరూపుడ
జీవితే=జీవితంలో; యా స్పృహా=ఏ స్పృహ, ఆశగలదో: అయమేవ=
మే=నాకు; బంధ=బంధమైనది.

గురుదేవా! ఆత్మబాంధవా! మహానుభావా! నేను దేహాన్నికాను.
దేహం లేదు. ఇందు సందేహంలేదు. సాంగత్యం లేదు. నేను నిస్సంగుడను. దే
జడ పదార్థం. అందు పరమార్థంలేదు. అహంకారం లేదు. నేను నిరహంకా
నేను చైతన్యమూర్తిని. నిరంజనుడను. దేహంతో నాకు బంధంలేదు. ఈ బం
ఆత్మజ్ఞానానికి అవరోధాలు. నేను చిద్రూపుడను.

వివేకవంతులకు కూడ జీవితస్పృహ ఉంటున్నది. ఇది బంధహే
ధనార్జనాది ప్రయత్నం జీవితేచ్ఛా బంధం. జ్ఞాన సాధనకు ఇది ప్రతిబంధ
ఇపుడు గురుబోధచేత అజ్ఞాన అంధకారం పటాపంచలై పోయింది. జ్ఞాన ప్రభ
ప్రభలు అంతటా వ్యాపించాయి.

నేను సచ్చిదానంద ఆత్మానుభవశాలినైనాను అకర్తాత్మనైన నాకు
త్వాహంకారాలులేవు. ప్రాణధారణ రూపకమైన జీవితమందు కూడా ఇచ్ఛ
"నా త్వహం తేషు తేమయి" వ్యావహారిక దేహాదులలో అహంకార మమ
లుంటాయి. ఇవి అజ్ఞాని మనోధర్మాలు. నేను ఈ అహంకార మమకారాలకు
భూతుణ్ణి. అకర్తను. అభోక్తను. అవ్యయుడను. అవినాశిని. నేను ఆత్మస
పుడను.

నిద్రా భిక్షే స్నాన శౌచే నేచ్ఛామి న కరోమి చ
ద్రష్టారశ్చేత్ కల్పయంతి కింమే స్యాదన్య కల్పనాత్

నిద్రించటం మేల్కొనటం. భిక్షకు వెళ్ళటం. స్నానం చేయటం.
గృహానికి వెళ్ళటం ఈ మొదలైనవన్నీ ఆశయంగా అనుకొని ఆచరించను. చ
వాళ్ళు అనుకొంటారు 'అన్నీ క్రమం తప్పకుండా ఆచరిస్తాడు' అని. సరే!
కోనీ నాకేమి! ఇవి దేహధర్మాలు. ఆత్మవికావు.

గుంజ పుంజాది దహ్యేత నాన్యారోపిత వహ్నినా
నాన్యారోపిత సంసార ధర్మాన్నేవ మహం భజే—

దట్టమైన శీతాకాలంలో కోతులు చలిబాధకు తాళలేక వణికిపోతున్నాయి. అవి ఎండుపుల్లలు ప్రోగుచేసికొని అన్నీ బాగా దగ్గరకు జరిగి అనుకొని రాచుకొని కూర్చుంటాయి. పుల్లల నుండి మంటలు వస్తున్నట్లూ చలి కాచుకొంటున్నట్లూ భావన చేసి ఏదో ఒక వెచ్చదనానికి చలి తగ్గినట్లు తృప్తిపడుతుంటాయి. ఇంతకు అవి కలిసి కూర్చొన్నందువల్ల తమతమ ఒడలు వెచ్చదనమే అట్లు అనిపించాయి. అంతే కాని అక్కడ అగ్నిలేదు. ఏమీలేదు. అంతా మిథ్య. కల్పన.

అలానే అజ్ఞానులు 'ఆహారాన్ని నేనే ఆర్జించుకోవాలి. ఆలుబిడ్డలను నేనే పోషించాలి. లేకపోతే పుట్టి మునిగిపోతుంది' అనుకొంటారు. 'నేను అకర్తను-అభోక్తను అనుకొంటారు అసంగులు. వారు నిర్మలనిత్య చైతన్యజ్ఞానులు. జీవించటానికి అజ్ఞానులు అనర్థాలకు పాటుపడతారు. జ్ఞానులు అనర్థాలు అకృత్యాలు చేయరు. జీవించాలి అనుకొనటం కూడ అజ్ఞానం. అవివేకం. బంధహేతువే. జీవించటం-మరణించటం జీవి చేతుల్లోలేదు. అలా భావించటం అవివేకం. ఈ జీవన్మరణ కాంక్షలు అంతఃకరణ ధర్మాలు. కానీ అసంగుడి ఆత్మధర్మాలు కావు.

*　　　　*

మయా తతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా
మత్థ్సాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః

నేను అతీంద్రియ స్వరూపుడను. కారణమూర్తిని. నా చేత జగత్తంతా వ్యాపించింది. చరాచరాలు సర్వభూతాలు నా యందు వెలుగుతున్నాయి. కానీ నేను అసంగుడను, నేను చరాచరాలలోలేను. అవి నాలో ఉన్నాయి.

—భగవద్గీత 9.4

## లోకం తరంగం

అహో! భువన కల్లోలై ర్విచిత్రై ర్ద్రాక్ సముత్థితమ్
మయ్యనంత మహాంభోధౌ చిత్తవాతే సముద్యతే 43

మయి=నాయందు; అనంత=పారంలేని; మహాంభోధౌ=మహాసాగరంలోవలె; చిత్తవాతే=చిత్తవాయువు; సముద్యతే=వీచికలు వీచి; విచిత్రైః=

చిత్ర చిత్రములైన: భువనకల్లోలైః=ప్రపంచ తరంగాలు: ద్రాక్=శీఘ్రం సముత్థితం=పుట్టుకొని వస్తున్నాయి !

ఓం శ్రీ గురుభ్యోనమః ! ఈ ఆత్మతత్వం చాలా చిత్రంగా ఉంది. ఆత్మను. పరమాత్మను. పారావారాన్ని. నేను అనంత సుఖసాగర రూపం పొంద చైతన్య స్ఫురణ విజృంభణ కారణంగా నాలో చిత్తం అనే వాయువు బయలుదే ఆ బయలుదేరింది ప్రభంజనమయింది. ఆ ప్రభంజనం చిత్ర విచిత్ర కల్లో రేపింది. అవి భువన కల్లోలాలు. ఆ తరంగాల తాకిడికి అంతరంగంలో భ దృశ్యాలు అనేకం ఏర్పడుతున్నాయి. అంతలోనే లయమవుతున్నాయి.

ఈ ప్రభంజన తరంగాలు అంతరంగ అంభోనిధిలోనివేకదా ! చిదాత చిత్త విజృంభణం వలన నానా విధ భువన దృశ్యాలు దృశ్యమానమవుతున్నా అలలు అంబుధి కంటె వేరుకానట్లే భువన విభ్రమాలు చిదాత్మకంటే వేరు వాయు వీచికలు విజృంభించటంమానితే విశ్వం అంతా విలయమవుతుంది. ఆ ఆత్మకు చిత్త పైకల్యం కలిగినప్పుడే విశ్వం వివిధ దృశ్యాలలో స్ఫురిస్తుంది. మిథ్య. చిత్తం అయిన మిథ్య ఆత్మకాదు. అట్టి చిత్తంలో ఉద్భవించే సం వికల్పాల సంకలనమే విశ్వం లేక బ్రహ్మాండం. ఈ బ్రహ్మాండ భాండాలు భావ ప్రపంచంలోవే. అన్నిటికి అధిష్ఠానం ఆత్మ. అన్నీ ఆత్మకు అభిన్నాలే.

## మానస సరోవరం

మయ్యనంత మహాంభోధౌ చిత్తవాతే ప్రశామ్యతి
అభాగ్యాత్ జీవవణిజో జగత్పోతో వినశ్వరః 44

మయి=నాయందు; అనంత మహాంభోధౌ=అపార పారావారమైన చిత్తవాతే=చిత్త వాయువు: ప్రశామ్యతి=ఉపశమిస్తుండగా: జీవ వణిజ = వ్యాపారియొక్క: జగత్పోతః=జగద్రూపమైన శరీర నౌక: అభాగ్యాత్=ు దృష్టం వలన: వినశ్వరః=నశించిపోయింది!

స్వామీ ! అంతర్యామీ ! నేను సర్వవ్యాపక చిత్సాగరుడను. నా మ మరుద్వీచికలు శాంతించాయి. సంకల్ప వికల్పాలు సమసిపోయాయి. మనో మహా

నిధిలోని నా శరీర నౌక ప్రారబ్ధకర్మలలో పడి బ్రద్దలై పోయింది. నా మానసమే మహా సముద్రం. మహాసముద్రుడు సర్వ వ్యాపక చిదానందుడు. జీవుడు సముద్ర ప్రయాణీకుడు. ఇతడు సముద్ర వ్యాపారస్థుడు. ఇతనికి జీవలక్షణాలు వ్యాపార సంపదలు. అభాగ్యం వలన అంటే ప్రారబ్ధక్షయం వలన ఆ జగజ్జీవన నౌక నాశనమయింది. అది ఆత్మ సముద్రంలో అంతర్ధానమయింది. ఇదేకదా జీవాత్మ గమ్యం.

నేను సముద్రుణ్ణి అయినాను. అంటే పరమాత్మ అనే పారావారంలో లీనమై పారావార నీరమై ప్రకాశిస్తున్నాను. ఇది మహాభాగ్యం కదా! మనోబుద్ధ్యాదులు లయమైనపుడు జీవాత్ముడు మహాత్ముడై పరమాత్ముడై నిర్మలమైన ఆలయంలో బోధ రూపంలో ప్రకాశిస్తాడు. అప్పడు జీవుడు దేవుడౌతాడు. బిందువు సింధువు కావటంలోనే చరితార్థత. జీవుడు మానవుడై మాధవుడైనప్పుడే ధన్యత్వం. జీవాత్మ మహాత్మఅయి పరమాత్మ కావటమే లక్ష్యం అదే ముక్తి.

* *

అశ్మకఋషి జనకుడితో ఇలా అంటాడు- "రాజా! వర్ష మేఘాలను ప్రభంజనం చెదరగొట్టినట్లు మానవుడి ఆత్మ జ్ఞానం అనే ధైర్య స్థైర్యాలను సాంసారిక వ్యామోహ బంధాలు కష్టసుఖాలు కలచివేస్తాయి. రారాజుకైనా జరా మృతువులు తప్పేవికావు. కనుక మనకు ప్రాప్తమైన ధన జన భోగాలను దైవ ప్రసాదం అని అనుభవించటం ఆత్మ విభ్రమం లేకుండ పరమాత్మ తత్త్వచింతనతో జీవనం చేయటం వివేకమార్గం. రోగాలు భోగాలు కాలాధీనాలు.

— భారతం (శాంతిపర్వం)

## మ హా ం భో ధి

మయ్యనంత మహాంభోధా వాశ్చర్యం జీవ వీచయః
ఉద్యంతి ఘ్నంతి ఖేలంతి ప్రవిశంతి స్వభావతః 45

అనంత మహాంభోధౌ=అపార పారావార రూపుడనైన; మయి=నాయందు; జీవ వీచయః=జీవతరంగవాయు వీచికలు; ఉద్యంతి=లేస్తున్నవి; ఘ్నంతి=ఒకదానికొకటి రాచుకొంటున్నాయి; ఖేలంతి=ఆడుతున్నాయి; స్వభావతః=స్వభావంగానే; ప్రవిశంతి=ఉపశమిస్తున్నాయి!

ఆర్యా ! ఆచార్యా ! ఆశ్చర్యం! మహాశ్చర్యం. నేనసలు నిష్క్రియుడను. నిర్వికారుడను. నిశ్చలుడను. నిరంజనుడను. సచ్చిదానందసాగరుడను. అనంత మహాంభోధిని. నాలో భావ వీచికలు ఉవ్వెత్తుగా పుట్టుకవస్తున్నాయి. ఉవ్వెత్తుగా వీస్తున్నాయి. వీచికలు విచిత్రరూపాలు దాలుస్తున్నాయి. వివిధ విన్యాసాలు ప్రదర్శిస్తున్నాయి. వానిలో కొన్ని మైత్రితో క్రీడిస్తున్నాయి మరికొన్ని శత్రుభావంతో చంపుకొంటున్నాయి. అవిద్యా కామ కర్మలు క్షయంకాగానే అవి ఆత్మలో లయమై పోతున్నాయి.

స్వాభావికంగా అవిద్యా కామ్య కర్మలు ప్రబలినప్పుడు జగత్తు జరుగుతుంటుంది ఘటాకాశం మహాకాశంలో లీనమైనట్లే జీవాత్మ పరమాత్మలో లీనమై జన్మ చరితార్థం చేసికొంటుంది. ఇదేకదా విజయం. పునఃపునః ఆకర్షించి బాధించేవి లోక మాయామోహ బంధనాలు. ఇవి కలిగి ఉండటం బాధితానువృత్తి. ఈ బంధనాలు లేకుండా చిత్తం స్థిరంగా ఉండటం అబాధితానువృత్తి. జనకమహారాజు అన్ని వ్యవహారాల్లో ఉన్నా, రాజ్యం చేస్తున్నా ఆయన లక్ష్యం అబాధితానువృత్తి. ఆ అనువృత్తిలో ఆయన స్థిరంగా ఉన్నాడు. తామరాకుపై నీటిబొట్టువోలె.

ఒకడు వేసవిలో ప్రయాణించి ఒక చెట్టుక్రింద కూర్చొన్నాడు దాహం వేస్తుంది. అటువైపుచూస్తే జలం ఉన్నట్లు కనిపించాయి. అక్కడికి వెళ్ళాడు. మరి కొంత దూరంలో ఉన్నట్లు అనిపించాయి. అలసిసొలసి అక్కడికి వెళ్ళాడు ఆశ నిరాశ అయింది. ఇసుకమీద సూర్యకిరణాలు ప్రతిఫలించి దూరానికి జలతరంగాల వలె కనిపించాయి. ఇది భ్రమ అని తెలిసికొన్నాడు. ఇక వెళ్ళలేదు. ఎండమావులని తెలిసింది. అది దూరత్వనేత్రేంద్రియ దోషం. అజ్ఞాని అటు ఇటు వెళ్ళి తలబొప్పికట్టి భ్రమిస్తూ శ్రమిస్తూంటాడు. జ్ఞానికి ప్రపంచం మిథ్య అనే సత్యం తెలిసికొనటంవల్ల చిదానందంతో ఉంటాడు.

# పరీక్ష

## ఆత్మ - అర్థం

అష్టావక్ర ఉవాచ -

అవినాశినం ఆత్మానం ఏకం విజ్ఞాయ తత్త్వతః
తవాత్మజ్ఞస్య ధీరస్య కథం అర్థార్జనే రతిః 46

ఏకం=అద్వయమూ; అవినాశనం = నాశన రహితమూ అయిన; ఆత్మానం=ఆత్మను; తత్త్వతః=తత్త్వ దృష్టితో; విజ్ఞాయ=తెలిసికొన్న; ధీరస్య=బుద్ధిమంతుడవు; ఆత్మజ్ఞస్య=ఆత్మనుగూర్చి తెలిసినవాడవైన; తవ= నీకు; అర్థార్జనే=ధన సంపాదనయందు; రతిః=అభిలాష; కథం=ఎట్లు?

శ్రీజనకుని ఆత్మానుభవోల్లాసం చూచి పరీక్ష చేయదలచిన అష్టావక్రమహర్షి ఇలా అన్నాడు— దివ్యాత్మస్వరూపా ! ధీరస్వభావా ! నీ అభ్యుదయం సంతోషం కలిగిస్తున్నది నీవు అవినాశివి. ఆత్మజ్ఞుడవు. బుద్ధిమంతుడవు. అద్వైత జ్ఞాన వంతుడవు. నిర్వికల్పుడవు. నిరంజన తత్త్వమెరిగినవాడవు. కాలత్రయఅబాధ్యుడవు. దేశకాల వస్తుభేద శూన్యుడవు. ఏకైక చిత్స్వరూపుడవు. ధీరుడవు. అన్నీ బాగున్నాయి.

కానీ నీవు అర్థార్జనపై ప్రీతి-లోకవ్యవహారరీతి నియమభీతి వదిలినట్టు లేదే! ఆత్మజ్ఞానానికి అర్థ సంగ్రోహపేక్ష వాంఛనీయం కాదే! ఇలాంటి లోపం నీలో ఉండ టానికి కారణం ఏమైఉంటుంది ?

* *

సర్వసంకల్ప రహితుడై సత్త్వమున వి
నిశ్చలంబుగ చిత్తంబు నిలుపవలయు
సత్త్వసక్తచిత్తంబు ప్రసాద మొసగు
దాన కాలంబు నడపు టుత్తమ విధంబు

—తిక్కన (భారతం శాంతిపర్వం)

## ఆత్మజ్ఞానం-విషయానందం

ఆత్మాఽజ్ఞానాదహో ప్రీతిః విషయభ్రమ గోచరే
శుక్తేరజ్ఞానతో లోభో యథా రజత విభ్రమే 47

యథా=ఏ ప్రకారంగానయితే; శుక్తేః=ముత్తెపు చిప్పనుగూర్చి దాని: అజ్ఞానాత్=చరిత్ర తెలియకపోవటం వలన; రజతభ్రమే=వెండి యనెడి భ్రాంతి యందు; లోభః=లోభం కలుగుతున్నదో; తథా=అట్లే; ఆత్మ=ఆత్మను గూర్చిన; అజ్ఞానాత్=అజ్ఞానంవల్ల; విషయభ్రమగోచరే=నశ్వరములైన దృశ్య విషయాలయందు; ప్రీతి=అభిలాష; భవతి=కలుగుతున్నదే!

శిష్యచూడామణీ! ఆత్మనుగూర్చి తెలియనప్పుడే లౌకిక విషయాలపై ప్రీతి కలుగుతుంది. ఆత్మనుగూర్చి పూర్తి అవగాహన అయితే విషయ వాంఛలపై ప్రీతి ఉండదు. ఇది సహజక్రమంగా వస్తున్న రీతి. ఉదాహరణ ఇస్తాను—

"ఇవి ముత్తెపుచిప్పలు. ఇందులో వెండి వెలుగు ప్రతిబింబిస్తుంది. ఈ మెరుగు వెండి కాదు. ఇది కాంతి మాత్రమే" అని తెలియనప్పుడే ఇది వెండి అనే భ్రమ కలుగుతున్నది. తెలిసినవాడు ఆ కాంతిచూచి భ్రమ చెందడు. 'ఇవి సహజంగా ముత్తెపుచిప్పలు. దీని స్వభావం ఇది. ఇది వెండివలెనే ఉంటుంది. కానీ ఇది వెండి కాదు' అని అతడి మనస్సు స్థిమితంగా స్థిరంగా నిశ్చలంగా ఉంటుంది. భ్రమ లోభాలకు చోటే ఉండదు. ఆత్మజ్ఞానం లేనివానికే విషయ భ్రాంతి. జ్ఞానికి విషయ లోభం ఉండదు.

## విజ్ఞత - అజ్ఞత

విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా ఇవ సాగరే
సోఽహమస్మీతి విజ్ఞాయ కిం దీన ఇవ ధావసి 48

యత్ర=ఏ ఆత్మరూపసాగరంలో; ఇదం విశ్వం=ఈ విశ్వం; తరంగా ఇవ=అల వలె; స్ఫురతి=తోస్తున్నదో; సః=ఆ ఆత్మయే; అహం=నేను; అస్మి=అవుతున్నాను; ఇతి=అని; విజ్ఞాయ=తెలిసికొని కూడా; కిం=ఎందుకు; దీన ఇవ=దీనునివలె (విషయాలపైపు); ధావసి=పరుగెత్తుతున్నావు?

శిష్యచూడామణీ ! తరంగాలకు సముద్రమే మూలస్థానం. అలానే విశ్వ చిత్రాలకు ఆత్మయే మూలం. తరంగాలవలెజగచ్చిత్రాలు నాట్యాలు సలుపుతుంటాయి. ఈ దృశ్యాలు నీ ఆత్మలోనే పుట్టి పెరిగి కొంతకాలానికి నశిస్తుంటాయి. అన్నిటినీ నీ ఆత్మయే జనింపచేస్తుంది. నీ ఆత్మదే జనకస్థానం.

"సోఽహ మస్మి" తత్ పదార్థం సర్వాధారం. అన్నిటికి అధిష్ఠానం ఆత్మ. దానికి ఆత్మస్వరూపుడవైన నీవే మూలం. అట్టి శుభంకరమైన ఈ అనుభవం నీకు కలిగింది. మంచిది. ఆత్మసాక్షాత్కారం కలిగింది సంతోషం. కానీ ఇంతా తెలిసి 'అది నాది. ఇది నాది' అనే ఆశ నిన్ను వదలలేదే ! ఎందుచేతనో ! దీనుని వలె దుఃఖపడుతున్నావే. విషయాలపైపు పరుగులు తీస్తున్నావేల ?

## తెలిసిన మూఢుడు

శ్రుత్వాపి శుద్ధ చైతన్యం ఆత్మాన మతిసుందరమ్
ఉపస్థేఽత్యంత సంసక్తో మాలిన్య మధిగచ్ఛతి 49

అతిసుందరం=మిక్కిలి అందమైన; శుద్ధ చైతన్యం=పరిశుద్ధమూ చైతన్యమూ అయిన; ఆత్మానం=ఆత్మనుగూర్చి; శ్రుత్వాపి=వినికూడా; ఉపస్థే=సమీప విషయాలమీదకు; అత్యంత సంసక్త=మిక్కిలి ఆసక్తి గలవాడవై; మాలిన్యం=మలినత్వాన్ని; అధిగచ్ఛతి=పొందుతున్నావు.

పవిత్ర ఛాత్రాగ్రగణ్యా ! అత్యంతసుందరమూ శివమూ శుద్ధ చైతన్యమూ మాన్యమూ అనుపమానమూ అయిన ఆత్మతత్త్వం విని మననంచేసి కూడా సమీప విషయాలపై మిక్కిలి ఆసక్తి చూపిస్తున్నాడు అంటే వాని మౌఢ్యాన్ని గూర్చి ఏమి చెప్పేది?

జ్ఞానాభిలాషి అయిన శిష్యుడికి దృశ్యమాన విషయ వ్యవహారాలు నిందనీయాలు. ఆత్మతత్త్వ శుద్ధ స్వరూప స్వభావాలను అతి ఆత్మవిదుడైన అధ్యాపకుడి ముఖతః శ్రవణం చేశావు. వేదాంత వాక్యాలు మననం చేశావు. నిన్ను నీవు తెలిసికొన్నావు. ఆత్మ అత్యంత సుందరమూ శుద్ధ చైతన్యమూ అని గుర్తించావు. సాక్షాత్కారం పొందావు. అయినా కూడా నీవు ప్రాప్త విషయాసక్తులు విడనాడటం

లేదు. నీకు ఇంకా మాలిన్యం అంటుకొనేవుంది. జ్ఞాని అయి కూడా మాలిన్యాన్ని మౌఢ్యాన్ని వదలటంలేదంటే అత్యంత ఆశ్చర్యంగా ఉంది. ప్రాప్తమైన విషయాలకు దూరంగా ఉన్నవాడే జ్ఞాని సుమా !

## మునికి మమకారం?

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని
మునే ర్జానత ఆశ్చర్యం మమత్వ మనువర్తతే 50

సర్వభూతేషు=సమస్త భూతాలయందు; ఆత్మానం=తననూ; చ=మరియు; సర్వభూతాని=సమస్త భూతాలను; ఆత్మని=తన ఆత్మలోనూ; జానతః=తెలిసి దర్శించుకొంటున్న; మునేః=మునికి; మమత్వం=మమకారం; అనువర్తతే=వెంటాడుతున్నది; ఆశ్చర్యం=ఇది అత్యంత ఆశ్చర్యంగా ఉందే!

అంతేవాసి ! సర్వ భూతాలకు ఆత్మ అధిష్ఠానం. అట్టి ఆత్మ సర్వభూతాలలో విరాజిల్లుతున్నది. సర్వభూతాలు ఆత్మలోనే రమిస్తున్నాయి. ఇది ఎరిగిన మునీశ్వరుని మనస్సులో మమత నిలిచి ఉండటం ఆశ్చర్యాలకు ఆశ్చర్యంగా ఉంది.

బ్రహ్మ మొదలు పిపీలిక వరకూ గల సర్వ జీవకోటిలో ఆత్మ అధిష్ఠానమై అధివసించింది అని తెలిసింది. సర్వ చరాచరాలు ఆత్మలో అధివసించి ఉంటున్నాయి అని తెలిసింది. నిజంగా ఉన్న త్రాడుపై సర్పారోపణ చేసి భయపడుతున్న అజ్ఞాని వలె ఆత్మపైన విశ్వాన్ని కల్పన చేస్తున్నారు. ఈ సంగతి తెలిసికూడా మమత్వానికి లోనవుతున్నారు అంటే అత్యంత ఆశ్చర్య విషయమే.

ముత్తెపు చిప్పలోని వెలుగు వెండికాదు అని తెలిసిన తర్వాత చిత్తం భ్రమించదు. స్వప్నంలో దర్శించిన అతి మూల్య వస్తు సంపదలు జాగ్రత్ స్థితిలో లేవని ఎవరూ చింతించరు. కాని కొందరు జ్ఞానులం అనుకొనేవారు విశ్వం మిథ్య అని తెలిసి కూడా మమతాబంధాన్ని ఛేదించలేకపోతున్నారు.

*  *

సర్వభూతస్థ మాత్మానం సర్వ భూతాని చాత్మని
ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శినః

యోగారూఢుడైన జ్ఞాని సర్వ ప్రాణులలో చైతన్యం తానయి ఉంటాడు చైతన్య మయమైన తనలో సర్వప్రాణులను గుర్తించి సమదృష్టి కలిగి ఉంటాడు.

—భగవద్గీత

## ఆశ్చర్యం ?

అస్థితః పరమాద్వైతం మోక్షార్థేఽపి వ్యవస్థితః
ఆశ్చర్యం కామవశగో వికలః కేళి శిక్షయా 51

పరమాద్వైతం=విశిష్టమైన ఉన్నత అద్వైతమతం; అస్థితః=ఆశ్రయించిన వాడవై; మోక్షార్థే అపి=మోక్షం కోరుకొన్నవాడవైకూడా; వ్యవస్థితః=ప్రయత్న పరుడవైన పురుషపుంగవా !; కామవశగః=వాంఛావశుడవై; కేళి శిక్షయా=క్రీడాభ్యాసంచేత; వికలః=వికలత్వం పొందినవాడవగుచున్నావు; ఆశ్చర్యం=ఆశ్చర్యకరంగావుంది?

శిష్యవర్యా ! లోకంలో ఆశ్చర్యం ఏమిటంటే పరమ అద్వైత్వ జ్ఞానరాశిని ఆశ్రయించిన ఏకైక బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడూ, మోక్షశిక్షా ప్రవీణుడై వ్యవస్థితుడైన వాడూ కూడా ఎందుచేతనో వికలుడై కామవశుడైనాడనేదే ఆశ్చర్యం.

సజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యుడై అద్వైత జ్ఞానశీలుడై పరమ భక్తాగ్రగణ్యుడై మోక్ష స్వరూపుడైన సచ్చిదానందుడిలో ఏకమై ఆత్మసాక్షాత్కార భాగ్యం పొందిన జ్ఞాని కూడా ప్రాక్తన వాసనా వశంచేత కామ పర తంత్రుడైనాడు. శృంగార కేళీలోలుడైనాడు. ప్రవర్తన అనుమానజనకంగా ఉంది. ఏమిటిది విధి వైపరీత్యమా ? శిష్యుడైన జనకుడు మోక్షార్థిఅయి ఆత్మ సాక్షాత్కారం పొందాడు. జీవన్ముక్తుడైనాడు. ఇది గురువుకు సంతోషమే. శిష్యుడు లోక వ్యవహారానికి అనుగుణంగా నటిస్తున్నాడు. కానీ ఇతడి హృదయం పరమ పవిత్రం. నీరు అంటని తామరాకు వంటిది. ఇది అంతా బాహ్యనటనే. దీనికి గొప్ప కారణముందే అలా చేస్తున్నాడు అనే సంగతీ తెలుసు అయినా గురువు తన శిష్యుణ్ణి ఎప్పుడూ స్తుతించరాదు. ఇంకా ఇంకా పరీక్షించి నిగ్గు తేల్చాలి అనేదే గురుదేవుని ఆశయం.

## కా మ ం జ్ఞా న ం

ఉద్భూతం జ్ఞానదుర్మిత్రం అవధార్యాతి దుర్బలః
ఆశ్చర్యం కామమాకాంక్షేత్ కాలమంత మనుశ్రితః 52

ఉద్భూతం=ఉత్పన్నమైన; జ్ఞాన దుర్మిత్రం=జ్ఞాన శత్రువైన కామాన్ని; అవధార్య=ధారణచేసి: అతి దుర్బలః=మిక్కిలి బలహీనుడై: అంతకాలం= చివరికి అంత్యకాలం; అనుశ్రితః=ఆశ్రయించినటువంటివాడై: కామం= కామాన్ని: ఆకాంక్షేత్=కోరుకోసాగాడు; ఆశ్చర్యం=ఇది ఆశ్చర్య విషయం.

ఓ రాజా ! జ్ఞానివై కూడా దైవ వశంచేత సంప్రాప్తమైన జ్ఞానం విలువ తెలిసికొనలేక దానికి బద్ధశత్రువైన కామానికి వశమైపోతున్నావు. అతిదుర్బలుడవై అంత్యకాలంలో కామాన్ని ఆకాంక్షిస్తున్నావు. జ్ఞానానికి కామం ప్రబలవైరి. జ్ఞాని కామికాకూడదు. విజ్ఞానికి విషయవాంఛ కలుగదు. మృత్యుదేవత మ్రింగుతుంటే సగం మృత్యువాత పడికూడా విషయభోగాలు కోరుకొనేవాడు ఎంత మూర్ఖుడు.

జ్ఞాని సమీప సంప్రాప్త సుఖాలను కూడా అపేక్షించరాదు. వివేకం గల వాడెవడూ విషయసుఖాలు అపేక్షించడు. వినాశకాల మాసన్నమైనవాడికి విపరీత విషయతృష్ణ కలగటం సహజమే కదా! నీ విషయంలో ఇది మరీ ఆశ్చర్యం ! ఆశ్చర్యం !

## వివేకికి విత్తాకాంక్ష !

ఇహాముత్ర విరక్తస్య నిత్యానిత్య వివేకినః
ఆశ్చర్యం మోక్షకామస్య మోక్షాదేవ విభీషికా 53

ఇహ=ఈ లోకం; అముత్ర=పరలోక భోగాలనుండి; విరక్తస్య= విరక్తుడు; నిత్య అనిత్య వివేకినః=నిత్యానిత్య వివేకం గలవాడు; మోక్ష కామస్య=మోక్షం కావాలనే ఆకాంక్షగలవాడికి; మోక్షాత్ ఏవ=మోక్షం నుంచే; విభీషికా=భయమా!; ఆశ్చర్యం=ఆశ్చర్యం !

వత్సా ! ఇహలోక భోగాలు పరలోక సౌఖ్యాలు రెండింటి ఎడల విరక్తుడై

విసర్జించి నిత్య అనిత్య వస్తు విచారం చేస్తున్న వివేకశాలి మోక్షం కాంక్షించి కూడా మోక్షం అంటే భయంతో పారిపోతున్నాడంటే ఆశ్చర్యమే !

ఆత్మ నిత్యం. దేహం అనిత్యం. ఇలా ఆలోచించేవాడు వివేకవంతుడు. బ్రహ్మానందప్రాప్తి మోక్షం. మోక్షకాంక్షి అయిన జ్ఞానికి పుత్ర కళత్ర సంపదాదులు బంధాలు. విశ్వం స్వప్నం వంటిది. జ్ఞాని స్వప్న సంపదలవలె ఇహలోక భోగాలను విసర్జిస్తాడు. స్వప్నంలో దొరికేవి మేలుకొన్నప్పుడు లభ్యమానంకావు కదా!

## రోషతోషాలు కూడవు

ధీరస్తు భోజ్యమానోఽపి పీడ్యమానోఽపి సర్వదా
అత్మానం కేవలం పశ్యన్ న తుష్యతి న కుప్యతి 54

ధీరస్య=ధీరుడు జ్ఞాని; భోజ్యమానోఽపి=భోగపురుషుడైనా; పీడ్యమానోఽపి=పీడితుడైనా; సర్వదా=ఎల్లప్పుడు; కేవలం=ఒక్కడుగా; అత్మానం=ఆత్మను; పశ్యన్=చూస్తున్నవాడై ఉంటాడు (అతడు సమబుద్ధి); న తుష్యతి=సంతోషించడు; న కుప్యతి=కోపించడు.

**ఆత్మజ్ఞానీ !** ధీరపురుషుడు భోజ్యమానుడై అనవరతం భోగిఅయి రాగిఅయి కూడా ఆత్మను అవలోకిస్తున్నాడు. పీడ్యమానుడై కూడా నిత్యం పరమాత్మలో ఆనందంలో తల్లీనమవుతున్నాడు. జ్ఞానికి శోకమూలేదు. క్రోధమూలేదు. ఆ పురుషుడికి సంతోషమూలేదు. దుఃఖమూలేదు. కోపమూలేదు. ప్రసన్నమూలేదు. అతడు స్థితప్రజ్ఞుడు. అతివిజ్ఞుడు.

మహాజ్ఞానులు లౌకికదృష్టికి భోగులవలె కనిపిస్తారు. కానీ వారు మహాయోగీశ్వరులు వారు కష్టాలు నష్టాలు పీడలు బాధలు నిందలు నిష్ఠూరాలు అపనిందలు పొందుతున్నట్లు లోకులదృష్టికి అనిపిస్తారు కానీ వారు సర్వదా సుఖదుఃఖరహితులు. వారు నిత్యులు. నిర్మలులు. వారి లక్ష్యం ఆత్మ తత్త్వసిద్ధి. తోషరోషాలు ఆత్మవి కావు కనుక వారిని బాధించవు. ఇవి శరీర ధర్మాలు. వారు పరిశుద్ధ ఆత్మ సుఖం నిత్యం పొందుతారు,

## నిందాస్తుతులు సమం

చేష్టమానం శరీరం స్వం పశ్యత్యన్య శరీరవత్
సంస్తవేచాపి నిందాయాం కథం క్షుభ్యేత్ మహాశయః 55

చేష్టమానం = ఆత్మసంబంధిత క్రియలు చేస్తూకూడా; స్వం = తన; శరీరం = దేహాన్ని; అన్య శరీరవత్ = పరుల శరీరం వలె; యః = ఎవడు; పశ్యతి = చూస్తున్నాడో; సః మహాశయ = అట్టి మహాపురుషుడు; సంస్తవే = సంస్తుతియందు; నిందాయాం = నిందలందు; అపి = కూడా; కథం = ఎట్లు; క్షుభ్యేత్ = క్షోభజెందును?

నాయనా ! నిత్యకృత్యాలు చేస్తూ పరుని శరీరంవలె తన తనువును ఆత్మకంటే వేరని భావించి అన్యంగా తలంచే మహాశయుడు స్తుతికి పొంగిపోడు నిందకు క్రుంగిపోడు. ఆ యోగీంద్రుడికి ఎన్నడూ దిగులులేదు. ఇతరుల శరీరం తన ఆత్మకంటే భిన్నం అని భావించినట్లే తన శరీరం కూడా తన ఆత్మ కంటే అన్యం అని భావనచేసే మహాత్ముడు స్థితప్రజ్ఞుడు.

సంతోషరోషాదులు స్తుతినిందలు శరీర ధర్మాలు. కానీ నీవెందుకు క్షోభచెందుతున్నావు. ఆత్మ నిష్క్రియా భరితం. ఆత్మకు మాయాకల్పిత చేష్టలు అంటవు. భయదుఃఖాలు శోకమోహాలు ఆత్మధర్మాలు కావు. అవి దేహధర్మాలు. నీవు శరీరాతీత ఆత్మస్వరూపుడవు. ఇట్టి ఆత్మజ్ఞానం స్థిరపడాలి. జ్ఞాని అయినవాడికిది ముఖ్యం. జ్ఞాని తన శరీరాన్ని ఉపేక్షించి ఆత్మను ఆపేక్షిస్తాడు. ఆత్మజ్ఞానికి నిందాస్తుతులులేవు.

## మృత్యువంటే భయమా

మాయామాత్రమిదం విశ్వం పశ్యన్ విగత కౌతుకః
అపి సన్నిహితే మృత్యౌ కథం త్రస్యతి ధీరధీః 56

విగతకౌతుకః = ఆకాంక్షలు లేనివాడు; ధీరధీః = స్థితప్రజ్ఞగల బుద్ధిమంతుడు; ఇదం విశ్వం = ఈ విశ్వమును; మాయామాత్రం = మాయాజాలంగా; పశ్యన్ = చూచుచున్నాడు (అట్టివాడికి); మృత్యౌ = మరణం; సన్నిహితేఽపి = సన్నిహిత మైతేమాత్రం; త్రస్యతి = భయం; కథం = ఎందుకు?

వాంఛా విజయం చెందిన ధీరపురుషుడు ఈ విశ్వదృశ్యాలను ఒక మాయా చిత్రంవలె వీక్షిస్తుంటాడు. అట్టి మహాజ్ఞానికి మృత్యువు ఎదురైతే మాత్రం భయ మెక్కడిది? రాజా ! నీవు భయపడతావేమి? ఈ దృశ్యమాన ప్రపంచం అంతా ఒక మాయా కార్యకలాపం. ఇది మిథ్య. జ్ఞాని దీనిని చూస్తున్నా ఇందులో సంచరిస్తున్నా దీనిని గురించి పట్టించుకొనడు. ఇది అసద్రూపం. ఇది ఎక్కడినుంచి పుడుతోంది? ఎక్కడ లయమవుతోంది? దీని లీలావిలాసాలు ఏమి? అని జ్ఞాని ఆలోచనచేయడు. అలా విచారణచేసి ఈ మోహజాలానికి వశుడైనవాడు జ్ఞానికాదు. జనన మరణాదులు గూర్చి కుతూహలం లేనివాడే ముని. విద్వాంసులు తమ ఆత్మస్వరూప తత్త్వ విభూతిలో సుస్థిరులు, నిశ్చలులు, ఆత్మజ్ఞులు. దేహాదులను గూర్చి కౌతుకంలేనివాడు ధీర ధీనిధి. చలన రహితుడైన స్వస్వరూప అనుసంధాన నిపుణుడే పరమ విజ్ఞాని. అష్టావక్ర మహర్షి శిష్యుడు జనకుడు ధైర్యశాలి. అయినా మరొకసారి శిష్యుని చిత్తాన్ని మరింత పరీక్ష చేస్తున్నాడు మహర్షి .

* *

"అంతవంత ఇమేదేహా నిత్యస్యోక్తాః శరీరిణః"

—భగవద్గీత

## మ హా త్ము డు

నిః స్పృహం మానసం యస్య నైరాశ్యేఽపి మహాత్మనః
తస్యాత్మజ్ఞాన తృప్తస్య తులనా కేన జాయతే 57

యస్య=ఏ; మహాత్మనః=ఆత్మజ్ఞానియొక్క; మానసం=మనస్సు; నైరాశ్యే అపి=ఆశలు ఆకాంక్షలు లేక (చివరికి మోక్షం విషయంలోకూడ); నిస్స్పృహం=వాంఛారహితంగా ఉంటుందో; తస్య=అట్టి; ఆత్మజ్ఞాన=ఆత్మ విజ్ఞానంలో; తృప్తస్య=సంతృప్తి గలవాడికి; తులనా=సామ్యం; కేన= ఎవనితో; జాయతే=కల్గుతుంది?

శిష్యా ! మోక్ష విషయంలో కూడా అపేక్ష శూన్యుడైన ఆత్మజ్ఞానికి సాటి

ఎవరూ లేరు. ఎవరి మనస్సులో మోక్షాపేక్ష కూడా లేకుండా ఉంటుందో అతడు మహాత్ముడు. అవిజ్ఞానికి లౌకిక పదార్థాలపై కోరికలు వాటిని గూర్చి లాభాలాభాలు హర్షశోకాలుండవు. ఆ ముని మనోరథాలు అన్నీ సమాప్తమైనాయి. అతడు సమాప్త సర్వ మనోరథుడు.

"అహమస్మి" "బ్రహ్మాహమస్మి" అను బ్రహ్మ మంత్ర భావనోదాహరణ ప్రాయుడు. పరబ్రహ్మ స్వరూపంలో ఐక్యమైపోయిన మహా మహర్షి అతడు. నిస్పృహమానసం మహాత్ములకు మణి మంజూష. వారితో సమానులు ఎవరూ లేరు.

* *

వ్యాసుడు శుకుడితో ఇలా అంటున్నాడు—

పురము శరీరంబు-బుద్ధితత్స్వామిని-సర్వార్థచింతన సచివ పదవి-
నడుచుచునుండు మనంబు-శబ్దాద్యంబు లైచెల్లు విషయంబు లైదు-తగు పు
రోహిత వర్గంబు శ్రోతాదులగు-ఇంద్రియంబులు పౌరజనంబు-లిట్లు
పరగెడురాజ్యంబు-పరిభోగమునకు దూషకులైన దొరలు రజస్తమములు
వాటి కలపులబడు బుద్ధి నేరకుండి మనసుతోడ నేర్పడిన దాసును మనంబు
నేక ముఖత కార్యముచూచునేని దుష్టులజగుదురు భోగ మవ్యయమగు
కుమార!

—తిక్కన భారతం (శాంతిపర్వం 5-200)

## గ్రాహ్య త్యాజ్యా లుండునా

స్వభావాదేవ జానానో దృశ్యమేతత్ న కించన
ఇదం గ్రాహ్య మిదం త్యాజ్యం స కిం పశ్యతి ధీరధీః 58

యః=ఎవడు; ఏతత్ దృశ్యం=ఈ దృశ్యప్రపంచం; స్వభావాత్=సహజంగా; న కించన=కొంచమైనాకాదు; ఇతి=అని; జానానః=తెలిసికొనునో; సః=అట్టి; ధీరధీః=బుద్ధిశాలి; ఇదం=ఇది; గ్రాహ్యం=గ్రహింపదగింది; ఇదం=ఇది; త్యాజ్యం=త్యజింపదగింది అని; కిం=ఎట్లు; పశ్యతి=చూస్తున్నాడు?

వత్సా ! ఈ కనిపించే ప్రపంచం యథార్థ స్వభావ సిద్ధమైనదికాదు. ఇది భ్రమకలిగించే మిథ్యాజగం. సత్యం అనేది ఇందులో కొంచెం కూడా లేదు. ఇందులో అన్నీ ప్రతిబింబ ఛాయలే అని తెలిసికూడా ధీరుడు ఇది గ్రహింపతగింది, ఇది త్యజింపతగింది అనే భేదదృష్టితో ఎందుకు చూస్తున్నాడు ?

మహాజ్ఞానికి 'ఇది త్యాజ్యం ఇది గ్రాహ్యం' అనే భేదభావం ఉంటుందా! ఉండకూడదే. ముత్తెపుచిప్పలోనిది రజితం అని భ్రమించి విమర్శచేయగా రజితం కాదని తేలిపోయినట్లు ఈ దృశ్య ప్రపంచం 'సత్యమా! అసత్యమా!' అని పరీక్ష చేయాలి. ఇది తత్త్వోపదేశం ద్వారా తెలుస్తుంది. ఈ జ్ఞాన విచారణ కలిగిన జ్ఞానికి త్యాజ్యములు గ్రాహ్యములు లేవు.

* *

"నిత్యమూ ఏకమూ ఐన ఆత్మ సర్వానికి అధిష్ఠానం. అజ్ఞానం వల్ల కలిగే భ్రమలకూ ఊహాపోహలకూ ఆత్మతో సంబంధంలేదు. భ్రమ ఉన్నా లేకున్నా ఆత్మ పరిణామరహితం. అట్టి ఆత్మస్వరూపుడవైన నీవు కలతలు వీడి శాంతంగా జీవించు."

—మహోపనిషత్తు (4-13)

## ద్వంద్వ రహితుడు జ్ఞాని

**అంతస్త్యక్త కషాయస్య నిర్ద్వంద్వస్య నిరాశిషః**
**యదృచ్ఛయాగతో భోగో న దుఃఖాయ న తుష్టయే** 59

అంతస్త్యక్త కషాయస్య=అంతఃకరణం నుండి తుడిచివేయబడిన వాసనా మలాదిదోష కషాయం గలిగి; నిర్ద్వంద్వస్య=ద్వంద్వాలైన శీతోష్ణాలు సుఖ దుఃఖాలు లేనట్టి; నిరాశిషః=ఆకారరహితుడికి; యదృచ్ఛయా=దైవవశంగా; ఆగతః=వచ్చిచేరిన; భోగః=భోగం; న దుఃఖాయ=దుఃఖానికి కాదు న తుష్టయే=సంతోషం కొరకూకాదు.

వివేకనిపుణా ! అంతఃకరణ నుండి విషయ వాసనా కషాయాలను త్యజించినవాడు ధన్యుడు. వాడు ద్వంద్వరహితుడు. ఆశారహితుడు అట్టి పురుషునికి యాదృచ్ఛికంగా సంప్రాప్తించిన భాగ్యసంపదలు దుఃఖకరాలుకావు. సంతోషకరాలు కావు. స్థితప్రజ్ఞుడై యోగి అయి వాటిని అనుభవించాలి.

ఆ విజ్ఞాని అంతఃకరణలోని మలదోష మాలిన్యాన్ని తొలిగించుకొని పరిశుద్ధుడైనాడు. శీతోష్ణాలు సుఖదుఃఖాలు లాభనష్టాలు మొదలైన ద్వంద్వాలకు ఆ పండితుడు అతీతుడు. సమచిత్తుడు. అట్టి సుబుద్ధికి దైవయోగం వలన ఏవిప్రాప్తించినా సంతోషంగా స్వీకరిస్తాడు. కష్టాలు అని క్రుంగిపోడు. సౌఖ్యాలు అని పొంగిపోడు. సమచిత్తుడు కదా! మనోబుద్ధి చిత్త అహంకారాలు అంతఃకరణ ధర్మాలు. వీని దోషాలు విషయ వాసనలు. పూర్ణజ్ఞానిని ఈ దోషాలు దరిజేరలేవు. నీవు పూర్ణజ్ఞానస్థితి అందుకొన్నావా ! అందుకోలేదన్నదే ఆశ్చర్యం! అంటూ గురువు ఈ విధంగా ఆక్షేపణల ద్వారా శిష్య పరీక్ష చేయసాగాడు.

# ఆ నం దం

## సంయమి - సంసారి సమమా!

జనక ఉవాచ -

హంతాత్మజ్ఞస్య ధీరస్య ఖేలతో భోగలీలయా
న హి సంసారవాహీకైః మూఢైః సహ సమానతా 60

భోగలీలయా=లీలాభోగాలతో; ఖేలతః=ఆడుకొంటున్న; ఆత్మజ్ఞస్య=ఆత్మజ్ఞానియగు; ధీరస్య=ప్రజ్ఞాశాలికీ; సంసారవాహీకైః=సంసారం మోయుచున్న; మూఢైః=మూఢులకు; సమానతా=సామ్యమా; హంత=అయ్యో; నహి=లేదు ప్రభూ!

అష్టావక్ర మహర్షిచేత పరీక్షార్థమై ఆక్షేపింపబడిన జనకుడు ఆత్మజ్ఞాన ఉల్లాసంతో సముచితంగా ఇలా సమాధానమిస్తున్నాడు-

గురుదేవా ! సాష్టాంగ దండ ప్రణామాలు. యథార్థం వచిస్తున్నాను స్వామీ ! తమరు ఏమన్నా నా మేలు కొరకే. భోగాలు లీలగా అనుభవిస్తున్నా ఆత్మజ్ఞానంగల ధీరునితో సంసార లంపటుడు సమానం ఏనాటికీ కాడు. ప్రారబ్ధవశాన జ్ఞానం గలవాడు లోకవ్యవహారాలలో మెలగినప్పటికీ ఏ దోషం పొందదు. అన్నిటికీ అధిష్ఠానమైన ఆత్మ తత్త్వం ఎరిగినవాడు విషయ విక్షేపాల విసురులకు చలించడు. భోగాలలో ఉన్నా ఆ విజ్ఞాని చిత్తం అందులో చిక్కుకోదు. మూఢుడయితే లౌకిక కర్మ కలాపంలో ఆసక్తి గలిగి మునిగిపోతాడు.

* *

"అంతస్సంసిక్త నిర్ముక్తో జీవో మధురవృత్తిమాన్
బహిఃకుర్వన్నకుర్వన్ వా కర్తా భోక్తా నహి క్వచిత్"

మన శ్శరీరాలు తనవికావని మోహం వీడి జ్ఞాని నిర్మమత్వంతో, నిరహంకారంతో, ప్రేమపూర్ణ హృదయంతో జీవిస్తాడు అట్టి జ్ఞాని ఏ పనిని చేసినా చేయకున్నా తాను కర్తననీ భోక్తననీ భావించడు.

—అన్నపూర్ణోపనిషత్తు (1-57)

## యోగి స్థితప్రజ్ఞుడు

యత్పదం ప్రేప్సవో దీనాః శక్రాద్యాః సర్వదేవతాః
అహో తత్ర స్థితో యోగీ న హర్ష ముపగచ్ఛతి 61

యత్ పదం=ఏ స్థానం కొరకు; ప్రేప్సవః=అభిలషిస్తూ; శక్రాద్యాః=ఇంద్రాది; సర్వదేవతాః=సమస్త దేవతలూ; దీనాః=దీనాతిదీనులై ఉంటారో; తత్ర=ఆ స్థానంలో; స్థిత=ఉంటున్న; యోగీ=యోగి; హర్షం=గర్వాతిశయం; న ఉపగచ్ఛతి=పొందదు; అహో=ఇది ఆశ్చర్యం!

ఆచార్యవర్యా ! ఏ పదవి ఉత్తమోత్తమమూ ఉన్నతమూ అని భావిం అది పొందలేక ఇంద్రాదిదేవతలు దీనాతిదీనులైయున్నారో ఆ మహోన్నతప మంది యోగీశ్వరుడు ఉబ్బితబ్బిబ్బుకాకుండా స్థితప్రజ్ఞుడై విరాజిల్లుతుంటాడు. అహ ఇది ఆశ్చర్యం స్వామీ! అజ్ఞాని లౌకిక విషయాలలోని లాభాలాభాలు సుఖదుఃఖా తూకంచూచుకొంటాడు. జ్ఞాని అలా చూచుకొనడు. ప్రాప్తాప్రాప్త దృష్టి మాత్ర ఉంటుంది.

ఇంద్రాదులు ఆత్మపదం అభిలషిస్తారు. అయినా అందుకోలేక దీనులౌతా ఆత్మపీఠం అధివసించిన జ్ఞాని అందుకు గర్వించడు. విషయసుఖ మహాభోగ పొందినా హర్షించడు. మునికి సచ్చిదానంద పదవిలోగల అనుభవం అనితరం ఎఱుక ఉంటుంది.

## పుణ్య పాపాలంటవు

తజ్జ్ఞస్య పుణ్యపాపాభ్యాం స్పర్శోహ్యంత ర్నజాయతే
న హ్యాకాశస్య ధూమేన దృశ్యమానోపి సంగతిః 62

తజ్జ్ఞస్య=తత్ అనే ఆత్మపదం ఎరిగిన జ్ఞానికి; అంతః=అంతఃకరణం ...డిన; పుణ్యపాపాభ్యాం=పుణ్యపాపాలతో; స్పర్శః=సంబంధం; న జాయతే ...దు; హి=కదా; ఆకాశేన=ఆకాశానికి; ధూమేన=పొగతో; సంబంధం ...బంధం; దృశ్యమానఃఅపి=ఉన్నట్లు కనిపిస్తున్నా; నహి=లేదుగదా!

దేశికోత్తమా ! ఆ సచ్చిదానంద పదవిజ్ఞానం గలవాడి అంతఃకరణం పుణ్య పాపాలకు అతీతం. ధూమం ఆకాశంలో తిరుగుతున్నా ధూమానికి ఆకాశానికి అను బంధంలేదుకదా! జ్ఞాని విధి వాక్యాలకు బద్ధుడుకాదు. ఆ మహాత్ములకు పుణ్యపాపాలు అంటవు.

జనకుడు అంతఃపురంలో ఎన్నో ఆడంబరాలు, వైభవాలు, భోగాల మధ్యలో ఉన్నప్పటికీ అతడు ఎప్పుడూ ఆత్మనిష్ఠలో ఉండటంవల్ల ఆ సుఖాలు అతనిని అంటటంలేదు. ఆకాశంలో ధూమం ఉన్నా ఆకాశానికి దానికి సంబంధం లేనట్లుగా.

* *

"జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా"

—స్మృతి

## విధి నిషేధాలు లేవు

ఆత్మైవేదం జగత్సర్వం జ్ఞాతం యేన మహాత్మనా
యదృచ్ఛయా వర్తమానం తం నిషేద్ధుం క్షమేత కః 63

యేనమహాత్మనా=ఏ మహాత్మునిచేత; ఇదం సర్వం జగత్=ఈ సంపూర్ణ జగత్తు; ఆత్మైవ=ఆత్మయే (అని); జ్ఞాతం=తెలిసికొనబడుతున్నదో; తం= అటువంటి; యదృచ్ఛయా=ప్రారబ్ధవశం వలన స్వేచ్ఛగా; వర్తమానం= ఉంటున్న జ్ఞానిని; నిషేద్ధుం=నిషేధించటానికి; క్షమేత కః=సమర్థుడైన వాడెవడు?

మహాత్మా ! జగత్సర్వం పరమ ఆత్మయే అని బాగా ఎరిగిన మహామహుడికి నిషేధం ఏమి వర్తిస్తుంది? ఆ మహర్షిని యాదృచ్ఛికంగా వర్తమాన కర్మకలాపంలో ఎవరు ప్రవేశింపచేయగలరు? ఎవరు నిషేధించగలరు? వారిని శాసించటానికి సమర్థు లెవరు? వేదాలు జ్ఞానుల కొరకే.

"అవిద్యా వద్విషయోః వేదః" "ప్రబోధనీయ నివాసో సుప్తో రాజేన స్తుతిభిః" అని శారీరక భాష్యం చెప్తున్నది. వందిమాగధ వర్గం రాజు నిద్రిస్తున్నా

ప్రేమతో వర్ణించి మేల్కొల్పి స్తుతిస్తారు. అలానే వేదాలు కూడా ఆత్మజ్ఞానిని బోధ నీయంగా వర్ణిస్తుంటాయి. ఆ స్తుతులు రాజును, వేదాలుఆత్మజ్ఞాని ప్రబోధిస్తుంటాయి.

దేహేంద్రియభ్రాంతి లేనివాడికి బ్రహ్మానందం తప్ప ఇతరస్పృహ ఉండదు. జ్ఞానికిది జాగ్రదవస్థ. ప్రపంచ స్పృహ కలగటం స్వాప్నికస్థితి.

## సర్వ సమర్థుడు

ఆ బ్రహ్మస్తంబ పర్యంతే భూతగ్రామే చతుర్విధే
విజ్ఞస్యైవ హి సామర్థ్యం ఇచ్ఛానిచ్ఛా వివర్జనే 64

ఆ బ్రహ్మస్తంభ పర్యంతే=బ్రహ్మ మొదలుకొని తృణంవరకూగల; చతుర్విధే=నాల్గువిధాలైన (గర్భజ-అండజ-స్వేదజ-ఉద్భిజ); భూతగ్రామే= భూతగణంలో; విజ్ఞస్య వివ=జ్ఞాని ఒక్కడికే; ఇచ్ఛానిచ్ఛా వివర్జనే=ఇచ్ఛ అనిచ్ఛలను వర్జించటానికి; సామర్థ్యం=సామర్థ్యమున్నది; హి=ఇది నిశ్చయం.

ఆర్యా ! ఆచార్యవర్యా ! సకల బ్రహ్మాది స్తంబ పర్యంతంగల చతుర్విధ భూత గ్రామాలలో జ్ఞాని ఇష్టానిష్టాలకు వ్యతిరేకం లేదుకదా !

బ్రహ్మ మొదలు చీమ వరకుగల సమస్త ప్రాణికోటిలో దేనికీ తమ ఇష్ట ప్రకారం నడుచుకొనటానికి సామర్థ్యంలేదు ఒక్క జ్ఞానికే ఆ సామర్థ్యం ఉన్నది. ఆత్మజ్ఞానికి విధి నిషేధాలు లేవు.

వాయువేగానికి కొట్టుకొనిపోవు దూదివలె పైకి కనిపించినా అస్థిరంగా గమన భోజనాదికృత్యాలు చేస్తున్నా అతడు పూజనీయుడే. ఆ జ్ఞానికి ఈ నిత్యకృత్యాలలో స్ఫురణలేదు. దైహికకృత్యాలవి జరిగిపోతుంటాయి. ఆయన ఆత్మానంద సాగర నిమగ్నుడు. అనవరత ఆత్మజ్ఞాన అవలోకనా తత్పరుడు.

"తస్య పుత్రా దాయముపయాంతి సహృదః సాధుకృత్యం ద్విషంతః పాప కృత్యం—" భక్తుడి సంపదను పుత్రులు గ్రహిస్తారు. పుణ్యఫలాలను సాధుపురు షులు స్వీకరిస్తారు. పాప ఫలాలను శత్రువులు తీసికొనవలసి ఉంటుంది. అపురుషుడు మాత్రం పుణ్యపాపరహితుడై ముక్తి పొందుతాడు; ప్రారబ్ధకాలం గడవగానే బ్రహ్మలో లీనమైపోతాడు.

"తదా విద్వాన్ పుణ్య పాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి" ఆ విద్వాంసుడు పుణ్యపాపరహితుడై మరో జన్మ లేక బ్రహ్మలో లీనమైపోతాడు. "న తస్య ప్రాణా ఉత్క్రామంతి ..." "అత్రైవ సమ వ లీయంతే ..." జ్ఞాని ప్రాణాలు లోకాంతరాలకు పోవు. అవి అక్కడ కారణభూతం లయమౌతాయి. ఈ ఉద్దిష్ట వేదవాక్యాలు ఈ అర్థాన్ని వివరిస్తున్నాయి.

భక్తుడికి ప్రారబ్ధకర్మలు తొలగగానే పుణ్యపాపాలు పోయి ఆ భక్తుడు ఉపాధిని విడచి పరలోకం వెళ్ళకుండా కారణస్థానమైన పరబ్రహ్మంలో లీనమై పోతాడు "జ్ఞానాగ్నిలో సంచిత కర్మజాలం దగ్ధమైపోతుంది. జ్ఞానాగ్నిలో జ్ఞాని కర్మలతో శరీరం కూడా దగ్ధమౌతుంది." శరీరాదులు నష్టమైనా జ్ఞాని ఆత్మ సూక్ష్మ కారణ దేహాలతో ఇంకా పనిచేస్తుంది.

భారతంలో ఇలా ఉంది– 'బ్రహ్మాస్త్ర ప్రభావంతో అర్జునుడి రథం భస్మమై పోయింది. శ్రీకృష్ణ మంత్రబలంతో అది భస్మమైకూడా నడుస్తూనే ఉంది. అలానే విద్వాంసుడి శరీరం భస్మమైకూడా ఆత్మజ్ఞానం వల్ల ప్రారబ్ధ శక్తి ప్రభావంతో తన నిర్దిష్టకార్యం నిర్వహిస్తుంది. అనాదికాలం నుంచి వస్తూన్న అజ్ఞాన కార్యాలు నాశనం కావటానికి చాలాకాలం పడుతుంది. శ్రద్ధగా పరిశ్రమ చేయాలి. సహజంగా జ్ఞాని ప్రతిబంధకాలు దాటి ముందుకుపోతుంటాడు.

## తెలిసికొని చేయి

ఆత్మాన మద్వయం కశ్చిత్ జానాతి జగదీశ్వరమ్
యద్వేత్తి తత్సకురుతే న భయం తస్య కుత్రచిత్ 65

కశ్చిత్=ఒకానొకడు; ఆత్మానం=జీవాత్మను; చ=మరియు; జగదీశ్వరం=జగన్నాథుడిని; అద్వయం=వేరుకాని వానినిగా; జానాతి=తెలిసికొంటున్నాడో; సః=అట్టివాడు; యత్=దేనిని; వేత్తి=తెలిసికొంటున్నాడో; తత్=దానిని; కురుతే=చేయుచున్నాడు; తస్య=అట్టి జ్ఞానికి; భయం=భీతి; న కుత్రచిత్=ఎక్కడాలేదు.

సద్గురుదేవా ! జీవేశ్వర ఐక్యమే అద్వైతం. ఇది నిశ్చయంగా తెలిసికొన్న

వాడు తనకు యోగ్యమైన కార్యాలు చేయటంలో భయపడడు. వెనుకంజ వేయడు. ఆ ప్రజ్ఞాని అద్వైత ప్రమాణంతో ద్వైత భావాన్ని అణచివేస్తాడు. ఆ పురుషుడు ద్వైతంవల్ల భయపడడు.

"తత్త్వమసి" అనే మహావాక్యంలో మొదటి 'తత్పదం' పరమేశ్వరమార్గం. రెండవ 'త్వమ్పదం' జీవమార్గం 'అసి' ఏకమగుచున్నది. వీటి పూర్తి తత్త్వం తెలిసిన రెండింటి అభేద తాదాత్మ్యసిద్ధాంతమే అద్వైతమార్గం. పరిపూర్ణ అద్వైత జ్ఞానం కలవాడే విద్వాంసుడు. ఆకారణఋషి అన్ని విశ్వకల్యాణకర కార్యకలాపాలు నిర్వహిస్తుంటాడు. ఆ ఋషి 'ఏకం సత్' అని నిశ్చయించుకొన్నాడు. ద్వైతభావం గలవాడికి భయంకానీ అద్వైతికి భయం ఉండదు.

తన నుండి బ్రహ్మన్ని వేరుగా భావించేవాడు పశుతుల్యుడు. అతడు పరబ్రహ్మన్ని కొంచెం కూడా తెలిసికోలేడు తానే బ్రహ్మనని భావన చేయాలి అట్టి బ్రహ్మజ్ఞాని 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' బ్రహ్మజ్ఞానవిదుడు తానే బ్రహ్మమై ప్రకాశిస్తాడు. "తరతిశోక మాత్మవిత్ ...." అట్టి ఆత్మవిదుడు సంసారశోక సాగరాన్ని తరించగలడు. ఆత్మవిదుడు అన్యం తలంచని అద్వైతమూర్తి. అద్వితీయుడితడు. "ఏకం సత్" ఆ ముని సర్వత్ర ఐక్య భావంగలవాడు. ఆ ముని చేసే గ్రహణ త్యాగాలు వేయించిన గింజలవంటివి. వాటివల్ల భవాంకురాలు మొలకెత్తవు.

# లయ యోగం

## అనాత్మపై అనాదరణ జ్ఞానం

అష్టావక్ర ఉవాచ -

న తే సంగోఽస్తి కేనాపి కిం శుద్ధస్త్యక్తు మిచ్ఛసి
సంఘాత విలయం కుర్వన్ ఏవమేవ లయం వ్రజ 66

తే=నీకు; కేనాపి=దేనితో గూడా; సంగః=సంబంధం; నాస్తి=లేదు (కనుక); శుద్ధః=పరిశుద్ధుడవైన నీవు; కిం=దేనిని; త్యక్తుం=త్యజించాలని; ఇచ్ఛసి=కోరుకుంటున్నావు?; ఏవమేవ=ఈ ప్రకారంగా; సంఘాత విలయం=దేహాభిమాన సంఘాత త్యాగం; కుర్వన్=చేస్తున్నవాడవై; లయం=మోక్షం; వ్రజ=పొందు.

అష్టావక్ర మహర్షి జనక మహారాజుకు లయయోగం ఉపదేశిస్తున్నాడు. ప్రియజ్ఞానార్థీ ! నీవు నా పరీక్షకు నెగ్గావు. కృతార్థుడవు ఇక నీకు దృఢోపదేశం చేస్తాను. ఇది మహాయోగాలలో శ్రేష్ఠతరమైనది దీనిని లయయోగం అని పిలుస్తారు. సావధానుడవై ఉపదేశం పొందు. ముందు దేహంపై అనాదరణం ఆత్మయందు ఆదరణ ప్రధానం. నీవు శుద్ధబుద్ధ స్వరూపుడవు. కనుక నీకు దేనితోటి సంగమం సంబంధం లేదు. పనికిమాలిన వస్తువును త్యజించినట్లు దేహాభిమానం వదలివైచి మోక్ష ప్రాప్తిపొందు. నీవు అన్నిటికి అధిష్ఠానమైన ఆత్మవు. పరమాత్మవు.

నీవు నీ గేహ దేహాదులపై వ్యామోహం వదులు. అహంకార మమకారాదులకు ఆస్పదమైన సంబంధం త్రెంచుకో. నీవు నీ నిజరూపం తెలుసుకో. నీవు పరిశుద్ధుడవు. అసంగుడవు అమృతమూర్తివి. చైతన్యమూర్తివి. నీకు త్యాగగ్రహణ విషయాలు అంటూ ప్రత్యేకంగా ఏవీలేవు. కనుక దైహిక విషయాలను లయంచేయి. ఈ దేహం నాది అనే మమకారం 'ఈ దేహం నేను' అనే అహంకారం అవశ్యం వదిలి స్వస్వరూప సంధానపరుడవై సుఖించు. ఇపుడు లయయోగం అవలంభించు. ఇందులో దేహాభిమాన త్యాగం మొదటి సాధన.

* *

"పదమాద్యమనాద్యంతం తస్యబీజం న విద్యతే తత్ర సంలీయతే సంవిత్ నిర్వికల్పంచ తిష్ఠతి బూ యో న వర్తతే దుఃఖైః"....

ఆది అంతము లేనిదానికి కారణమూ ఉండదు. అట్టిదానిలో నీ మనస్సు బుద్ధి లయంచేసి శాంతంగా ఉండు. అటువంటి యోగిని బాధలు ఎన్నడూ స్పృశింపవు.

\- అన్నపూర్ణోపనిషత్తు (46 69)

## ఏ కా త్మ జ్ఞా న ం

ఉదేతి భవతో విశ్వం వారిధే రివ బుద్బుదః
ఇతిజ్ఞాత్వైకమాత్మానం ఏవమేవ లయం వ్రజ 67

వారిధేః=సముద్రం నుండి; బుద్బుద ఇవ=బుడగవలె; భవతః=నీనుండి; విశ్వం=జగత్తు; ఉదేతి=ప్రాదుర్భవిస్తున్నది; ఇతి=అని; ఏకం=ఒకటియైన; ఆత్మానం=ఆత్మను; ఏవమేవ=ఇలా ఇలా; జ్ఞాత్వా=తెలిసికొని; లయం= ఉపశాంతిని; వ్రజ=పొందు.

శిష్యాగ్రణీ ! సముద్రం నుండి బుద్బుదాలు పుట్టినట్లుగా నీ నుంచే ప్రపంచో త్పత్తి జరుగుతున్నది. నీకు మూలం ఏకైక ఆత్మయే అని శాంతిపొందు. నీరధి నుంచి నీటి బుడగలు నీటి కెరటాలు పుట్టి పెరిగి విహరించి ఆ నీరధిలోనే లయమౌ తున్నాయి. ఈ బుద్బుదాలు తరంగాలు జలనిధికంటే వేరుకావుకదా ! అలానే మన స్సంకల్పంతో సంసారం ఆవిర్భవిస్తున్నది. చక్ర భ్రమణం అయిన కొన్నాళ్ళకు మరల మనస్సులోనే విలీనమౌతున్నది.

శుద్ధో ముక్తస్సదై వాత్మా న వై బధ్యేత కర్హి చిత్
బంధమోక్షౌ మనస్సంస్థౌ తస్మిన్ ఛ్ఛాంతే ప్రశామ్యతి

ఆత్మ అన్నివేళల శుద్ధమూ ముక్తము. అది ఎన్నడూ బంధం పొందదు. బంధ మోక్షాలు మనోధర్మాలు. మనస్సు లయం అయితే వెంటనే ఇవి కూడా శమి స్తాయి– అని దేవీ భాగవతం చెప్తున్నది.

ఈ ప్రకారంగా నీవు సజాతీయ విజాతీయ స్వగత భేదాలు లేనివాడవై ఆత్మను అవలోకనం చేయి. దైహిక భావాలు విడిచి విశాల విశ్వరూపంలో ఐక్యమైపో. లయ యోగంలో ఇది రెండవ మెట్టు.

## అ ద్వై త జ్ఞా న ం

ప్రత్యక్ష మప్య వస్తుత్వాత్ విశ్వం నా స్త్యమలే త్వయి
రజ్జు సర్ప ఇవ వ్యక్తం ఏవ మేవ లయం వ్రజ 68

వ్యక్తం=దృశ్యమానమవుతున్న; విశ్వం=సంసారం; ప్రత్యక్షమపి= కనిపిస్తున్నప్పటికీ; అవస్తుత్వాత్=వాస్తవంకానందున; అమలే=మలరహితుడవగు; త్వయి=నీయందు; రజ్జుసర్ప ఇవ=రజ్జువునందు సర్పంవలె; నాస్తి= జగత్తు లేదు; ఏవమేవ=ఈ ప్రకారం; లయం=శాంతి; వ్రజ=పొందు.

పవిత్రచ్ఛాత్రవర్యా ! వ్యక్తమై దృశ్యమానమై విశ్వమంతా ప్రత్యక్షమౌతున్నదికదా! ఈ విశ్వం వాస్తవంగా నీలోలేదు. ఇది రజ్జుసర్పభ్రాంతి కనుక నీవు శాంతించు. మనోలయం చేసికో. ప్రతి విషయంలో ప్రత్యక్ష ప్రమాణం పనిచేయదు. అపుడు శాస్త్ర ప్రమాణం స్వీకరించాలి. చంద్రుడు మనకు చాలా దగ్గరగా ఉన్నట్లు కనిపిస్తాడు. కానీ జ్యోతిషశాస్త్ర ప్రకారం చంద్రుడు భూమికి పదివేల యోజనాల దూరాన ఉన్నట్లున్నది.

అలానే కనిపించేది విశ్వం. దీని తత్త్వం తెలుసుకోవాలి అంటే శ్రుతులు గ్రహించాలి. వాస్తవంగా జగత్తు మూడుకాలాలలోనూ కనిపించదు. ఇలా భావించి చింతన చేయటంవల్ల జగద్భ్రమ తొలుగుతుంది. 'ఏకం సత్' అని ఏకాత్మభావం మననం చేయి. రజ్జువు పై ఆరోపింపబడిన సర్పం భ్రాంతికాలంలో నిజం అనిపిస్తుంది. కానీ పరిశీలిస్తే రజ్జువేకాని సర్పంలేదు.

అలానే నీవు సామాన్యుడవూ దేహంతోడి బొమ్మవు కాదు. నీవు శుద్ధుడవు. చిద్ఘన మాత్రుడవు. నీయందుతోచు విశ్వం భ్రాంతి కాలంలో కనిపించి క్షణంలో కనుమరుగై పోతుంది. ఇది అవిద్యాకల్పితం. ప్రబోధ సమయంలో ఇది ఉండదు. హేయోపాదేయమైన రెండవ వస్తువేలేదు. ఏకాత్మ అనుభవజ్ఞానం పొందు. ఇపుడు విశ్వం విడిచి ఏకాత్మభావం పొందటం లయయోగంలో మూడవ మెట్టు.

## బ్రహ్మ జ్ఞానం

సమ దుఃఖసుఖః పూర్ణః ఆశానైరాశ్యయోః సమః
సమ జీవిత మృత్యుః సత్ నేవ మేవ లయం వ్రజ 69

సమ దుఃఖసుఖః=దుఃఖ సుఖాలలో సమత్వంగలవాడవై: పూర్ణః= పూర్ణుడవై: ఆశానైరాశ్యయోః=ఆశానిరాశలందు: సమః=సమబుద్ధిగలవాడవై: సమజీవితమృత్యుః=జీవితమృత్యువులందు సమతగలవాడవై: ఏవమేవ=ఇలా ఇలా: లయం=శాంతి: వ్రజ=పొందు.

ఓ ప్రియాతిప్రియశిష్యా ! సుఖదుఃఖాలు - ఆశానిరాశలు - జీవన్మరణాలు సమానంగా భావించే బ్రహ్మజ్ఞాని బ్రహ్మలో లయమౌతాడు. నీవు ఆత్మానందంలో పరిపూర్ణుడవైనావు. దైవవశంగా వచ్చే సుఖదుఃఖాలలో ఆశానిరాశలలో జీవన్మరణాలలో సమదృష్టి సంతృప్తి గలవాడవైనావు. మంచిది. వీటియందు నిర్వికారుడవైనావు.

సుఖదుఃఖాదులు అనాత్మధర్మాలు. ఇవి అన్నీ మిథ్య. దేహాదులన్నీ మిథ్యాభూతాలే. జన్మకు ముందు దేహాదులులేవు. చనిపోయిన తర్వాతనూ లేవు. ఇవి మధ్యలో వచ్చే మాయాప్రతిబింబాలే. మాయాజనితాలు. ఇది స్వప్న ప్రపంచమే. అశాశ్వతం అస్థిరం ఈ ప్రపంచం.

శాశ్వతం సుస్థిరం ఒక్క బ్రహ్మమే. "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఈ సంపూర్ణ విశ్వం బ్రహ్మస్వరూపం. ఇలా చింతన చేయటమే లయయోగం. ఈ బ్రహ్మానంద పూర్ణ స్థితి లయయోగంలో నాల్గవమెట్టు. ఇదే పూర్ణస్థితి.

*      *

పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే

# స్వ స్వ రూ ప ం

## అ న ం త ద ను

జనక ఉవాచ -

> ఆకాశ వదనంతో౽హం ఘటవత్ ప్రాకృతం జగత్
> ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః 70

అహం=నేను; ఆకాశవత్=ఆకాశంవలె; అనంతః=అంతంలేనివాడను; జగత్=ప్రపంచం; ఘటవత్=ఘటంవలె; ప్రాకృతం=ప్రకృతిజన్యమైనది; తథా=ఆ కారణం వలన; ఏతస్య=దీనికి; న త్యాగః=త్యాగంలేదు; న గ్రహః=గ్రహంలేదు; ఇది జ్ఞానం=ఇది జ్ఞానము.

జనకమహారాజు అష్టావక్రమహర్షికి ఈ విధంగా విన్నవిస్తున్నాడు. శ్రీ గురుభ్యోనమః తమ ఉపదేశ ప్రబోధంవల్ల కృతార్థుడనయ్యాను. నేను ఆకాశం వలె అనంతరూపం పొందాను. నా తత్త్వం అపారం. ప్రకృతి జన్యమైన జగత్తు ఘటంవలె ఉంది. అది పరిమితం. ఇది త్యాజ్యముకాదు. గ్రాహ్యముకాదు. లయముకాదు. అని జ్ఞానం కలిగింది.

లయచింతన యోగం కూడా నాలో ప్రధానం కాలేకపోతున్నది. ఉత్పత్తి ఉన్నదానికేకదా లయస్థితి. త్రికాలాలలోనూ ఉత్పత్తి లేనప్పుడు ఇక లయం అనేది ఏమి ఉన్నది? జగత్తు కూడా పూర్వం ఉత్పత్తికాలేదు. భవిషత్తులో కాబోదు. వర్తమానంలో జనించటంలేదు మూడు కాలాలలోనూ లేనిదానిని లయచింతనం చేయటం ఎలా స్వామీ!

* *

> ఆదావంతే చయన్నాస్తి వర్తమానో౽పి తత్తథా
> వితథైః సదృశాః సంతో౽వితథా ఇవ లక్షితాః
> స్వప్నమాయే యథాదృష్టే గంధర్వనగరం తథా
> తథా విశ్వమిదం దృష్టం వేదాంతేషు విచక్షణైః

ఉత్పత్తి కాని వస్తువు భూతకాలంలో లేదు. భవిష్యత్తులో ఉండబోదు. వర్తమానంలోనూలేదు. అయితే మిథ్యారూపం వర్తమానంలో ఉన్నట్లుగా ప్రతీయమానమవుతుంది. వాస్తవంగాలేదు.

—మాండూక్యోపనిషత్తు

## ఉదధి వంటి వాడను

మహోదధి రివాహం స ప్రపంచో వీచి సన్నిభః
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః 71

అహం=నేను; మహోదధి రివ=మహాసాగరం వలె ఉన్నాను; సః=ఆ; ప్రపంచః=జగత్తు; వీచి సన్నిభః=ఒక వీచికవలె ఉన్నది; తథా=ఆ కారణం వలన; ఏతస్య=దీనికి; న త్యాగః=వీడవలసిందిలేదు; న గ్రహః=స్వీకరించవలసిందిలేదు; న లయః=లయమూలేదు.

మహోదయా! నమస్సులు. నేను మహోదధి వంటివాడను. ఈ మిథ్యా ప్రపంచ లీలలు నా మహోదధిలో తరంగాలు. ఈ కారణంగా నాకు త్యాజ్యామూ లేదు. గ్రాహ్యమూలేదు. ఈ విధమైన విచారధారను 'జ్ఞానం' అంటారు కదా!

ఆకాశం ఘటం రెండు భిన్నాలు. అలానే ఆత్మదేహం భిన్నాలు అని అనిపిస్తాయి. కానీ ఆత్మ ఆకాశంవలె అంభోధివలె సువిశాలం. దానిలోనిదే దేహం. ఆకాశంలోని చిన్ని భాగమే ఘటం అంభోధిలోనివే తరంగాలు. ఇది నిశ్చయజ్ఞానం. ఇలాంటి అనుభవజ్ఞానమే అద్వైతం అద్వైత జ్ఞానం గలవాడికి గ్రహణత్యాగాలు లేవు.

## శుక్తి వంటి వాడను

అహం సః శుక్తిసంకాశో రూప్యవత్ విశ్వకల్పనా
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహోలయః 72

సః=ఆ; అహం=నేను; శుక్తిసంకాశః=శుక్తివంటివాడను; విశ్వ

కల్పనా=ప్రపంచ కల్పనం; రూప్యవత్=వెండి వంటిది; తథా=ఆ కారణం వలన; ఏతస్య=దీనికి; న త్యాగః=త్యాజ్యమూలేదు; న గ్రహః=స్వీకృతీ లేదు; న లయః=లయమూలేదు.

గురుదేవా! నేను ముత్యం వంటివాడను. ఈ కల్పిత విశ్వం ముత్తెపు చిప్పలో మెరిసే వెండి డాలు వంటిది. ఈ కారణంగా నాకు స్వీకృతిలేదు. తిరస్కృతిలేదు. జననమూలేదు మరణమూలేదు. ఇది అద్వైత జ్ఞానం.

వికార భావాలు సావయవ పదార్థాలకే పరిమితం. ఆత్మ నిరవయవం. నిరవయవ పదార్థాలకు ఈ న్యాయం వర్తించదు. ముత్యం సత్యం. దానిలోని వెండి వెలుగు అసత్యం. దేహాదులతో కూడిన ప్రపంచానికి అధిష్ఠానం ఆత్మ. అధిష్ఠానం సత్యం. ఆ సత్య స్వరూపం నేను మిగులుగా కనిపించే ప్రపంచం నా ఛాయా బింబం. ఇది మిథ్య. కల్పితం. ముత్యపుచిప్పలో పైకి మెరిసే వెండివంటిది ఈ విశ్వం. ఈ మిథ్యాబింబం త్రికాల సత్యంకాదు.

నేను సహజ ప్రకాశం గల స్వయం జ్యోతిని. విశ్వ ప్రకాశం అసహజం. ఇది ప్రతిచ్ఛాయ. నేను పూర్ణానంద స్వరూపుడనైనాను. త్యాగం గ్రహణం లయం నాకు లేవు.

## సర్వాధిష్ఠానమును

అహంవా సర్వభూతేషు సర్వ భూతాన్యథోమయి
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః 73

అహం=నేను; వా=నిశ్చయంగా; సర్వభూతేషు=సమస్త భూతాలలోనూ; అథో=మరియు; సర్వభూతాని=సకల భూతాలు; మయి=నాయందు; సంతి=ఉంటున్నవి; తథా=ఆ కారణంగా; ఏతస్య=దీనికి; న త్యాగః=త్యాగమూలేదు; న గ్రహః=స్వీకృతీలేదు; న లయః=లయమూలేదు.

ఆచార్యాస్వామీ! నేను నిశ్చయంగా అన్ని భూతాలలోనూ ఉన్నాను. అన్ని ప్రాణులు నా అంశాలే. అన్ని జీవకోటులు నాలో ఉన్నాయి. అప్పుడు ఇక నాకు గ్రహణ త్యాగ లయాలు లేవు. ఇదే నా జ్ఞాన సారం. నేనే సంపూర్ణ జీవకోటిలో వ్యాపించాను. మణిమాలలో సూత్రంవలె వర్తిస్తున్నాను.

నేనే అన్నిటికీ అధిష్ఠానాన్ని. నేనే అన్నిటికి సత్తాస్ఫూర్తి ఇస్తున్నాను. నాలోనిదే ఈ యావత్ప్రపంచం. ఆకాశంపై కనిపించే నీలిమవలె మిథ్యా ప్రపంచం వ్యాపించి ఉంది. ఈ ప్రకారం వేదాంత సిద్ధజ్ఞానం ప్రబోధిస్తున్నది. ఆత్మతత్త్వం అనుభవ అద్వైత జ్ఞాన ప్రమాణం. కాబట్టి నాలో గ్రహణ త్యాగ లయాదులులేవు.

మాయ అంతా జడం. మాయాకార్యకలాపాలు జడాలు. మాయాకార్యం విశ్వం. ఈ మాయకూ ఈ విశ్వానికీ నా నుంచే సత్తా లేక స్ఫూర్తి లభిస్తున్నది. అయితే నా ఆత్మధర్మాలు ఈ విశ్వకలాపాలూకావు. కానీ అవి అన్నీ నా బలంవల్లనే జరుగుతున్నాయి నేనే సర్వ సృష్టికి అధిష్ఠానం. ఈ అధిష్ఠాన ఆత్మకు పైన మరొకటి లేదు. కనుక వేదాంత సిద్ధ సదాత్మకు ఈ త్యాగ గ్రహణాదులు లేవు.

ఈ సదుత్తరంలో "అహం సః" అనేవి మంత్ర బీజాలు. దీనిలోని 'అ' ప్రకృతి బీజం. 'హంసః' త్రిప్పిచదివిన 'సః అహం' అవుతుంది. "సోఽహం" పరమ మంత్రం. ఇదే హంస విద్య.

* *

"సర్వేంద్రియములచే ద
త్సర్వ విషయముల నెరుంగు చందంబున ద
త్సర్వజ్ఞు సర్వ గతునిన్
సర్వమయున్ దెలియవచ్చు సమరసదృష్టిన్"

—శ్రీ సీతారామాంజనేయ సంవాదం (3-94

# ఆత్మానంద అనుభవం

## అబ్ధి - నౌక

జనక ఉవాచ -

మయ్యనంత మహాంభోధౌ విశ్వపోత ఇత స్తతః
భ్రమతి స్వాంత వాతేన న మమా స్త్యసహిష్ణుతా 74

మయి=నా యందుగల ఆత్మ అనే; అనంత మహాంభోధౌ=అపార మహా సాగరంలో; విశ్వపోతః=ప్రపంచ నౌక; స్వాంత వాతేన=మనోరూప వాయువు చేత; ఇత స్తతః=ఇటుఅటు; భ్రమతి=తిరుగుతున్నది; మయి=నాకు; అసహిష్ణుతా=అసహనశీలత; న అ స్తి=లేదు.

జనకమహారాజు అష్టావక్రమహర్షితో ఇలా విన్నవించాడు- గురుస్వామీ ! నమామి ! నా ఆత్మాంభోధిలో విశ్వం ఒక నౌక. మనస్సు ఒక మహాప్రభంజనం. సంకల్ప వికల్పాలు వీచికలు. ఈ ప్రభంజన వేగానికి నౌక అటుపైపు కొంత ఇటు పైపు కొంత ఊగి ఒరుగుతూ లేస్తుంటుంది. కానీ నాకు ఏమాత్రం కష్టంలేదు. సాంసారిక విక్షేపాలు వీస్తున్నా జ్ఞానికి హానిలేదు. విశ్వనౌక మనఃప్రభంజనంలోపడి కొట్టుమిట్టాడుతున్నది. విశ్వం ఎలాభ్రమిస్తున్నా నాకు సహ్యమేకానీ అసహనీయం కాదు.

సముద్రంలో నావ పరుగులు తీస్తుంటే మాత్రం సముద్రానికి నొప్పా! అలానే మనోఝంఝూనిలంలో మునుగుతూ లేస్తున్న విశ్వనౌక ఆత్మసముద్రాన్ని ఏమీ బాధించలేదు. ఓడల పరిభ్రమణాన్ని అంబుధి శ్రమలేక సహించినట్లు చిదాత్మ స్వరూపుడనైన నేను విశ్వభ్రమణాన్ని శ్రమ కష్టం అనుకోనక సహిస్తుంటాను స్వామీ! మనస్సుకు ఎన్ని సంకల్ప వికల్ప మారుతాలు తాకిడిగా తగిలినా ఆత్మ చలింపదు కదా! ఇందు జగద్వ్యవహారం తీరు చెప్పబడింది.

## అం బు ధి — వీ చి క

మయ్యనంత మహాంభోధౌ జగద్వీచిః స్వభావతః
ఉదేతు వాస్తమాయాతు న మే వృద్ధిః న చ క్షతిః 75

అనంత=హద్దులులేని; మహాంభోధౌ=మహాసాగరం వంటి; మయి= నాయందు; జగద్వీచి=ప్రపంచం అనే కల్లోలం; ఉదేతు=ఉద్భవించుగాక; వా=లేకపోతే; అస్తం=లయం; ఆయాతు=పొందుగాక; మే=నాకు; న వృద్ధిః=అభివృద్ధిలేదు; న క్షతిః=హానిలేదు.

ఆచార్యదేవా ! నా మధురస్వభావ మహాంభోధిలో జగద్వీచికలు సహజంగానే ఉదయిస్తుంటాయి. లయిస్తుంటాయి. దీనివలన సముద్రానికి హానిలేదు. వృద్ధిలేదు. అవినాశి అయిన ఆత్మ సముద్రంలో విశ్వతరంగాలు పుడుతూ పెరుగుతూ లయిస్తూంటాయి. ఈ వృద్ధిక్షయాలు ఆత్మధర్మాలు కావు. కనుక ఆత్మ అనే అంబుధి అవినాశి. సముద్రాన్నైన నాలో ఆత్మ తాదాత్మ్యం పొందింది. జగత్తు అనే కెరటం పుడుతుంది గిడుతుంది నాలోనేపుట్టి లయమవుతుంది.

వృద్ధిక్షయాలు జగత్తుకే కాని ఆత్మకు కావు. పరమాత్మలో జనించిన జగత్తు మరల పరమాత్మలోనే కలుస్తుంది. ఆత్మ అంటే పరమాత్మ. పరమాత్మ నిర్వికారం నిశ్చలం. నిత్యం. నిరంజనం. తత్త్వజ్ఞానంతో అజ్ఞానం హరించిపోతే దానితోపుట్టిన భ్రమ కూడా హరిస్తుంది. ఈ భయమే మనస్సుగా మహాప్రపంచాన్ని గుర్తిస్తుంది.

*   *

నహ్యస్త్యవిద్యా మనసోఽతిరిక్తా మనోహ్యవిద్యా భవబంధహేతుః
తస్మిన్ వినష్టే సకలం వినష్టం విజృంభతేఽస్మిన్ సకలం విజృంభతే

మనస్సుకు మించిన అజ్ఞానం లేదు. మనస్సే అజ్ఞానమయం. మనస్సే పరిణామాత్మకమై సకల బాధలు భావాలు అనుభవాలు కలిగిస్తుంది: ఈ మనస్సు నశిస్తే విశ్వసృష్టి నశిస్తుంది. మనస్సు మేల్కొని పనిచేస్తే జగత్తంతా ప్రకాశిస్తుంది.

—శ్రీ శంకరాచార్య

## అంబుధి - భ్రమ

మయ్యనంత మహాంభోధా విశ్వం నామ వికల్పనా
అతిశాంతో నిరాకార ఏతదేవాహ మాస్థితః 76

అనంత మహాంభోధౌ = అపార పారావారమైన: మయి = నాయందు: నామ = నిశ్చయంగా: విశ్వం = జగత్తు: వికల్పనా = కల్పనా మాత్రం: అహం = నేను: అతిశాంతః = మిక్కిలి శాంత స్వరూపుడను: నిరాకార = ఆకారరహితుడను: చ = మరియు: ఏతదేవ = ఈ ఆత్మకు: ఆస్థితః = ఆశ్రయుడను.

ఆచార్యోత్తమా ! ఈ అనంత ఆత్మాంభోధిలో నిశ్చయంగా విశ్వం వికల్ప మాత్రం. నేను అత్యంత శాంత స్వరూపుడను. ఆకార రహితుడను. నేను ఆత్మా శ్రయుడను. ఆత్మ యొక్క వికారం విశ్వం కాదు. ఆత్మ వికారం చెందదు. ఆత్మ నిర్వికారం. నిరాకారం. ఈ ఆత్మాంభోధిలో జగద్కల్పన చేయటం భ్రమ. అంబుధి వంటి ఆత్మకు ఆద్యంతాలులేవు. వాస్తవంగా నా అనంత స్వరూపం నిరాకారం. నిరాకారం నుండి సాకారం ఉత్పత్తికాదు. ఆత్మలో నుండి జగత్తు యధార్థంగా జనించదు. అది భ్రమ మాత్రమే. ఆత్మతత్వ దృష్ట్యా విశ్వంలేదు.

నేను సుశాంతుడను. సుస్థితుడను. ఇట్టి లయయోగం తగునా ! అని సందేహం. మీరు నన్ను పరీక్షిస్తున్నారు అనుకొంటాను. ఈ ప్రపంచం వల్ల నాకేమీ ప్రమాదంలేదు. దీనితో సంబంధమేలేదు. నేను దానిపై ఆధారపడిలేను. నేను సాక్షీ మాత్రుడనే కానీ కర్తను భోక్తను కాను. నిరాకార నిరంజన నిర్మల నిశ్చలుడను. జ్ఞానస్వరూపుడను. జ్ఞానం మూర్తీభవించినవాడను.

## ఆత్మ అనంతం

నాత్మాభావేషు నో భావంత స్తత్రానంతే నిరంజనే
ఇత్యసక్తోఽస్పృహః శాంత ఏతదేవాహ మాస్థితః 77

ఆత్మా = ఆత్మ: భావేషు = దేహాది భావాలలో: న = లేదు: భావః = దేహాదిభావాలు: తత్ర = ఆ: అనంతే = అనంతమైన: నిరంజనే = ఉపాధిరహి

నైనాను. జగద్బలం మిథ్య. దీనికి స్వతసిద్ధంగా బలంలేదు. ఉన్నట్లు అద్దంలో పాప వలె కనిపిస్తుంది. అందువల్ల జ్ఞానికి త్యాగగ్రహణబుద్ధి కలుగదు.

జగిత్తుకు వేరు సత్తాలేదు. ఆత్మ సత్తాయే దీనికాధారం. జ్ఞానికి హేయో పాదేయాలు లేవు. హేయం విడిచిపెట్టుటకానీ ఉపాదేయం గ్రహించుటకానీ జ్ఞాని కుండవు. ఆత్మానుభవం పొందటానికి లయయోగం. ఆత్మ అనుభవం గలవానికి అదీ అవసరంలేదేమో! స్వామీ! అనుగ్రహించండి.

# బంధం - మోక్షం

## వాంఛలూ బంధాలూ

అష్టావక్ర ఉవాచ -

తదాబంధో యదాచిత్తం కించద్వాంచతి శోచతి
కించిన్ముంచతి గృహ్ణాతి కించిత్ హృష్యతి కుప్యతి 79

యదా=ఎప్పుడు; చిత్తం=చిత్తం; కించిత్=కించిత్తు; వాంఛతి= వాంఛిస్తున్నదో; శోచతి=శోకిస్తున్నదో; ముంచతి=వదులుతున్నదో; గృహ్ణాతి= గ్రహిస్తున్నదో; హృష్యతి=సంతోషిస్తున్నదో; కుప్యతి=కోపిస్తున్నదో; తదా=అప్పుడు; బంధః=బంధం.

అష్టావక్ర మహర్షి జనక మహారాజుకు బంధమోక్ష వ్యవస్థను నిరూపిస్తు న్నాడు— రాజశిష్యా! అనేక విధాల నీ అనుభవ జ్ఞానాన్ని పరీక్షచేసి చూచాను. నెగ్గావు. చాలా సంతోషం. "నేను అనంత ఆత్మస్వరూపుడను. ఈ త్యాగగ్రహణాలు కల్పనలు నాకు లేవు" అని నీవు అన్నది జ్ఞాన అనుభవసిద్ధికి అక్షరాల నిజం.

చిత్తం విషయాలను అపేక్షించి పదార్థ ప్రాప్తికి ఉరకలు వేస్తుంది. ఆ పదా ర్థాలు లభించకపోతే దుఃఖిస్తుంది. కష్టపడుతుంది. నష్టపడుతుంది. అవస్థలుపడి పడి ఖిన్నురాలై కృశించిపోతుంది. చిత్తంలో లోభం ఉత్పన్నమైనప్పుడు వస్తువు గ్రహించా

లని కోరిక పుడుతుంది. అది లభిస్తే హర్షం. ప్రాప్తించకపోతే క్రోధం. చిత్తం ఇలా అనేక వాసనలతో కూడి ఉంటుంది. జీవికి ఇదే బంధం. చిత్తం విషయ వాంఛను పొందినప్పుడు కొంచెంసేపు విచారిస్తుంది. కొంచెంసేపు త్యజిస్తుంది. కొంచెంసేపు గ్రహిస్తుంది. ఇంకా కొంచెం సంతోషిస్తుంది. మరి కొంచెం దుఃఖిస్తుంది. చిత్తం ఇలా అనేక వికారాలు పొందుతుంది. ఈ చిత్త లోభమే బంధం.

* *

బంధోహి వాసనాబంధో మోక్షః స్యాద్వాసనా క్షయః

వాసనాస్త్వం పరిత్యజని మోక్షార్థి త్వమపి త్యజ

రామా ! పురుషుల బంధకారణాలు చిత్తంలో జనించిన భోగ వాసనలే. భోగవాసనలకు మూల బీజాలు బంధ కారణాలు. కాన వాసనాక్షయమే మోక్షం. నీవు వాసనలు వదులుకొని సుఖించు. ఆకాంక్షలు అన్ని బంధాలకు మూల బీజాలు. మోక్షాకాంక్ష కూడా త్యాజ్యమే. ఆకాంక్ష అంతరిస్తే అమిత సుఖం లభ్యమానమవుతుంది. అని వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రుడికి జ్ఞానబోధ చేశాడు. లోభం పనికిరాదు అనేది ముఖ్యం.

— యోగవాసిష్ఠం

## వికార రహితం విముక్తి

తదా ముక్తిర్యదా చిత్తం న వాంఛతి న శోచతి

న ముంచతి న గృహ్ణాతి న హృష్యతి న కుప్యతి 80

యదా=ఎప్పుడు; చిత్తం=చిత్తం; న వాంఛతి=కోరదో; న శోచతి = శోకించదో; న ముంచతి=విడిచిపెట్టదో; న గృహ్ణాతి = గ్రహించదో; న హృష్యతి=సంతోషించదో; తదా=అప్పుడు; ముక్తిః=ముక్తి.

శిష్యచూడామణీ ! ఎప్పుడైతే చిత్తం వాంఛ వదలి శోకం త్యజించి తిరస్కృతులు పురస్కృతులు మాన హర్ష దుఃఖాలు సమంగా సంయమనంతో ఓర్పుకో గలుగుతుందో అప్పుడు ముక్తి ప్రాప్తిస్తుంది. భోగాలు శోకాలు వస్తుంటాయి

పోతుంటాయి. దీనికి హర్షించటం దానికి దుఃఖించటం రెండూ అవివేకమే. స్థిత ప్రజ్ఞ కలిగి ద్వంద్వాలను ఏకరసంగా అనుభవించాలి. సుఖదుఃఖాలు జయించినప్పుడే మోక్షం. చిత్త వికార నిరోధమే ముక్తి. హేయోపాదేయ వర్జనమే ముక్తి. జ్ఞాని విషయ వాంఛా వికారాలు విసర్జించాలి. ఇందు విజయ సిద్ధి లభించిందంటే ముక్తి లభించినట్లే. ఇదే జీవాత్మకు ముక్తి.

ఆనందం బాహ్యంగా ఉన్నది అత్యల్పం. ఆత్మలో ఉన్నది అనంత అపార ఆనందసాగరం. ఈ సంగతి తెలిసికొంటే మమతలు అనురాగాలు పెంచుకోడు మానవుడు.

*　　　　*

న మోక్షో నభసః పృష్ఠే న పాతాలో న భూతలే
సర్వాశ సంక్షయే చేతః క్షయో మోక్ష ఇతీష్యతే

ముక్తి భూనభోతాంతరాళాల్లో ఎక్కడాలేదు. కాంక్షోపశమనమైన ప్రశాంతి పొందిన మనస్సులోనే ముక్తి ఉంది. కామ విజయం వాంఛారాహిత్యం కలిగినప్పుడు ఆలోచనా ప్రవాహం ఆగిపోతుంది. అపుడు మనోలయంజెంది ఆత్మరూపంలో నిలిచి పోతుంది. అదే ముక్తి.

—అన్నపూర్ణోపనిషత్తు

## అనాత్మ - ఆత్మ

తదా బంధో యదాచిత్తం సక్తం కా స్వపి దృష్టిషు
తదా మోక్షో యదా చిత్తం అసక్తం సర్వదృష్టిషు 81

యదా=ఎప్పుడు; చిత్తం=మనస్సు; కాసు=ఎటువంటి; దృష్టిషు= విషయాలందు; సక్తం=ఆసక్తం అగుచున్నదో; తదా=అప్పుడు; బంధః= బంధం; అపిచ=మరియు; చిత్తం=మనస్సు; యదా=ఎప్పుడు; సర్వ దృష్టిషు=సకల విషయాలయందు; అసక్తం=అసక్తి చూపదో; తదా=అప్పుడు; మోక్షః=మోక్షం.

ఛాత్రవర్యా ! జీవుని చిత్తం విషయాసక్తం అయినప్పుడు జీవుడికి బంధం ఏర్పడుతుంది. విషయాసక్తం కాని చిత్తం గలవాడికి ముక్తి లభిస్తుంది. ప్రథమ శ్లోకంలో బంధ లక్షణాలు వివరించబడింది. రెండవ శ్లోకంలో ముక్తి లక్షణాలు బోధించాడు ఈ మూడవ శ్లోకంలో బంధం మోక్షం రెండింటిని గూర్చి వివరిస్తున్నాడు. చిత్తం అనాత్మ పదార్థాలలో అనాత్మ వృత్తి అవలంబిస్తుంది. అపుడు బంధాలలో చిక్కుపడిపోతుంది. విషయాలలో ఆసక్తి రహితంగా ఉన్నప్పుడు చిత్తం ఆత్మ తత్త్వంలో మగ్నమవుతుంది. అపుడు ముక్తి లభ్యం.

ఆత్మజ్ఞానం ప్రాప్తించినంతకాలం చిత్తం విషయ వలయంలో చిక్కి బంధాలలో చిక్కుపడుతుంది. తదుపరి ఆత్మవిచారణచేత విషయరహితమై దోషరహితమై పరిశుద్ధమై వాసనా బీజాలు కూడా నశిస్తాయి. అట్టి ముక్త పురుషుడికి ఇక బంధాలు ప్రాప్తించవు. బాధించవు. ఆ బీజాలు వేయించిన గింజలవలె విషయ అంకుర శక్తి కోలుపోతాయి. వాసనా బీజరహితుడికి మరో జన్మ అనేది ఉండదు.

దృశ్యం జడం. దేహాది ప్రపంచ సమూహం జడం. అనాత్మ భావప్రపంచం బంధహేతువు విషయాలు బంధాలు. ఆత్మానాత్మ వివేకం కలిగి అనాత్మ విషయాలపై లక్ష్యం లేకుండ నిస్పృహభావంతో సంచరించటమే ముక్తిపదం. అహంకార స్థితి బంధం. అహంకారత్యాగం మోక్షం. విషయ దృష్టి బంధం. విషయరాహిత్యమే ముక్తి.

## అ హం బం ధ నం

యదా నాహం తదా మోక్షో యదాహం బంధనం తదా
మత్వేతి హేలయా కించిత్ మా గృహాణ విముంచమా 82

యదా=ఎప్పుడు అహం=నేను అనే అహంకారంతో ఉంటానో; తదా బంధః=అప్పుడు బంధంలోపడిపోతాను; యదా=ఎప్పుడు; న అహం=అహంకృతి లేదో; తదా=అప్పుడు; మోక్షః=మోక్షం; ఇతి=అని; మత్వా=తలంచి; హేలయా=లీలగా; మా గృహాణ=స్వీకరించకు; మా విముంచ=విడిచివేయకు.

ప్రియాశిష్యా ! అహంకార ప్రవృత్తి బంధం; అహంకార నిర్మూలనం మోక్షం. ఈ భావం మన్నించి త్యాజ్యం గ్రాహ్యం పరిహాసానికి కూడా దరిజేర్చకుండా ఈ భావాలు రాకుండా నీ అద్వైతజ్ఞానసౌధం స్థిరంగా నిర్మించుకో ! అహంకారం ఏ విధమైనదైనా ముక్తికి ప్రబల శత్రువు. అది జాతి సంబంధంకానీ అధికార సంబంధంకానీ పనికిరాదు అహంకారి ముక్తికి అర్హుడు కాడు—

యావత్ స్యాత్ స్వస్య సంబంధోఽహంకారేణ దురాత్మనా
తావన్నలేశమాత్రాపి ముక్తివార్తా విలక్షణా—

ఈ జీవుడికి దురాత్మ అయిన అహంకారంతో సంబంధం ఉంటుందో అంత వరకు ముక్తి అణుమాత్రం కూడా ప్రాప్తంకాదు. జీవుడి శరీరాదులతో అహంకార అధ్యాస ఉన్నంతవరకు ముక్తి లభించదు. అహంకారధ్యాస నివృత్తి కాగానే ఆ జీవుడు శ్రమచేయకుండానే అకర్త అభోక్త అయి ముక్తి పొందుతాడు. ఇది తెలిసికొన్నావు మంచిది. త్యాగ గ్రహణ క్రియాదులు కర్తృత్వంలేనివాడవై లీలామాత్రుడవై చేయి. అకర్త్రాత్మజ్ఞానం వల్ల కర్తృత్వాభిమానం లేకుండా ఉన్నావు బాగుంది. ఇక ముక్తి స్వరూపం వివరిస్తాను తెలిసికో! అన్ని అనర్థాలకు మూలం అహంభావం. నీవు ఏకొంచమైనను ఏదైనను పరిగ్రహింపకు. ఏదియును పరిత్యజింపకు. దేనియందు కర్తృత్వం పెట్టుకోకు. అహంకారప్రవృత్తి బంధం అహంకార నివృత్తి మోక్షం. కర్తృత్వాభిమానం వదిలి మోక్షం పొందు.

నేను 'ఆత్మను అనాత్మను-జ్ఞానిని-అజ్ఞానిని. ఇది నేను చేస్తున్నాను-ఇది చేయటంలేదు. ఇది సాధ్యం చేయగలను. ఇది చేయలేను నేను నిశ్చలుడను అనిశ్చలుడను పండితుడను-పామరుడను. ఈ మొదలైన విషయాలందు అభిమాన శూన్యుడవై సదా సచ్చిదానంద పరమాత్మవై విరాజిల్లుచుండు. ఇంద్రియ వ్యాపారాలు తమంతట జరుగుతుంటాయి. దానికి నీ ప్రయత్నం నీ ప్రమేయం అవసరంలేదు. నీవు నిష్క్రియుడవై నిస్పృహుడవై నిశ్చలుడవై నిర్మలుడవై నిత్యానందుడవై ఉండుము.

# నిర్వేదం

## ద్వంద్వ త్యాగం

అష్టావక్ర ఉవాచ -

కృతాకృతేచ ద్వంద్వాని కదా శాంతాని కస్యవా
ఏవం జ్ఞాత్వేహ నిర్వేదాత్ భవ త్యాగపరోఽవ్రతీ! 83

కృతాకృతే=కర్తవ్యాకర్తవ్యాలు; ద్వంద్వాని=సుఖదుఃఖాది ద్వంద్వాలు; కస్య=ఎవనికి; కదా=ఎప్పుడు; శాంతాని=శాంతిస్తున్నవో (అప్పుడు); ఏవం=ఈ ప్రకారం; వా=నిశ్చయంగా; జ్ఞాత్వా=తెలిసికొని; ఇహ=ప్రపంచంపై; నిర్వేదాత్=హేయభావం వలన; అవ్రతీ=ఆగ్రహంలేనివాడవై; త్యాగపర=త్యాగపరుడవు; భవ=అగుము.

శ్రీ మహోదయా ! భక్తుడు కృత అకృత కర్మకలాపాలు సుఖదుఃఖ ద్వంద్వాలు శాంతించినప్పుడు జ్ఞానియై సంశయరహితుడై వైరాగ్యవ్రతం లేకుండగనే త్యాగపరాయణుడౌతాడు. అవశ్యం ఈ కార్యం చేయటం నా కర్తవ్యం- ఇది చేయరానిది అనుకొనే ద్వంద్వాలు కృతాకృతాలు సుఖదుఃఖాలు దేహధారికి శాంతించవు. అభిమానంపోదు.

జనకరాజా ! నీవు కృతాకృత ద్వంద్వాదులు త్యజించి వైరాగ్యాన్ని పొందావు. నీవు వ్రతం పట్టుకుంటానే పట్టుదలతో జ్ఞాన శిఖరాన్ని చేరుకొన్నావు. దేనియందు మనసు తగలనివాడవైనావు మంచిది. నిర్వేదం అంటే తత్త్వజ్ఞానదుఃఖ ఈప్సితముల యెడల హేయబుద్ధి. అది గలవాడవై రాజయోగివైనావు. నిర్వేదం వలన వైరాగ్యం వలన త్యాగపరుడవుగమ్ము. సుఖదుఃఖాల యెడల వైరాగ్యం పొందు. ఆత్మలోనే ఆనందించు. ఆత్మతో క్రీడించు. ఆత్మవై ప్రకాశించు. బ్రహ్మానంద స్వరూపుడవై బ్రహ్మానందం పొంది సుఖించు. సుఖీభవ.

* *

నా కృతేన కృతేనార్థో న శ్రుతి స్మృతి విభ్రమైః
నిర్మందర ఇవాంబోధిః స తిష్ఠతి యథా స్థితః

శ్రుతులు స్మృతులు విధించిన ధర్మాచరణపట్ల ఉదాసీనత కలిగినవాడై నిశ్చల గంభీర సముద్రంవలె చైతన్యమయమైన తన స్వస్వరూపస్థితి కలిగి జ్ఞాని శాంతంగా ఉంటాడు.

—మహోపనిషత్తు

# వై రా గ్యం

కస్యాపి తాత! ధన్యస్య లోకచేష్టావలోకనాత్
జీవితేచ్ఛా బుభుక్షాచ బుభుత్సోపశమం గతా 84

తాత !=నాయనా: లోకచేష్టావలోకనాత్=లోక స్వభావకృత్యాలు చూచుట వలన: కస్య=ఒకానొక: ధన్యస్యాపి=ధన్యజీవనుడికి మాత్రమే: జీవితేచ్ఛా= బ్రతుకుకోరికలపైన: బుభుక్షా=భోగాకాంక్షలపైన: ఉపశమం=ఉపశమనం; గతా=కలుగుతున్నది.

ప్రియ అంతేవాసీ ! జననమరణాలు పాపపుణ్యాలు పూర్తిగా లోకవికారాలు. అవలోకనం చేసినచో అతి ధన్యాత్ముడికి కూడా జీవితేచ్ఛ భోగేచ్ఛ జ్ఞానేచ్ఛాదులు ఉపశమిస్తాయి. సహస్రాధిక భాగ్యశాలులలో ఏ ఒక్కనికో వైరాగ్యభావం ఉద్భవిస్తుంది. అతడికి క్రమంగా భోగేచ్ఛ జీవితేచ్ఛ నివృత్తి అవుతుంది. అసలు ఇచ్ఛ నశిస్తుంది.

లౌకికవస్తుగ్లాని వస్తుజాలంపై దోషదృష్టి కలగటమే వైరాగ్యం. ప్రపంచ పదార్థాలన్నింటిలోను ఉద్భవ లయదోషం తగిలిఉంది. దేహేంద్రియాదులపైన పుత్ర మిత్ర కళత్రాదులపైన ధన సంపదలపైన అందరికీ ప్రేమ ఉంటుంది. ఈ ఇంద్రియ సుఖాల లోలత్వంలోపడి జీవుడు అనేక అనర్థాలకు పాలుపడతాడు. ఇవే జీవుడికి బంధాలు. ఇవి వైరాగ్య నిరోధకాలు. వైరాగ్యంలేనిదే మోక్షభాగ్యం కలలోనిమాట. వైరాగ్యం కలగటానికి ఇంద్రియాల ఎడల వైముఖ్యం కలగాలి. ఇంద్రియ దోషాలు ఇవి—

గర్భే దుర్గంధి భూయిష్ఠే జఠరాగ్ని ప్రదీపితే
దుఃఖం మయాప్తం యత్తస్మాత్ కనీయః కుంభిపాకజమ్

జీవుడు దుర్గంధ భూయిష్ఠ మాతృగర్భంలో జఠరాగ్ని కీలంమధ్య యమ యాతనలు పొందుతుంటాడు. కుంభీపాక నరకాలు అనుభవం అవుతాయి, దుఃఖమే దుఃఖం అని యోగవాసిష్ఠం చెప్తున్నది.

గర్భోపనిషత్తులో గర్భ నరక వర్ణన ఇలాఉంది- జీవుడు గర్భయాతనలు సహించలేక ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తాడు. ఈశ్వరా ! నన్నుద్ధరించు. ఈ నరకయాతనలు భరించలేను. ఈ దుర్గంధకూపంలో నిలువలేను. ఓ మహాదేవా! మహానుభావా! మహేశ్వరా! ఈ భవ బంధాలు భరింపలేకున్నాను. నారాయణప్రియా! నాగభూషణా! నటరాజా! నన్నుకరుణించు. జగన్నాథా! ఈ జన్మలో నాకు జ్ఞానసిద్ధి కలుగజేయి. సద్బుద్ధులు ప్రసాదించు. సదాలోచనలు కలిగించు. సత్వరం జన్మ సార్థకం చేసికొని మళ్ళీ ఈ జననమరణాలు లేకుండ నీ వద్దకువచ్చి సేవించుకొంటాను. కానీ పుట్టగానే అన్నీ మరచి మాయలోపడి మమతల ఊబిలో దిగబడిపోతాడు. పునరపి జననం పునరపి మరణం ఇంతే. మరణ సమయం ఇలా ఉంటుంది—

హాకాంతే! హా ధనం పుత్రాః క్రందమానః సుదారుణమ్
మండూక ఇవ సర్పేణ మృత్యునా గీర్యతే నరః

ఓ కళత్రమా! ఓ ధనరాశీ! ఓ సంతానమా! మృత్యువు వచ్చింది, నన్ను లాగుకొని వెళుతున్నది మీరైనా మీరైనా నన్ను రక్షించండి- అని జీవుడు మరణా సన్నసమయంలో సర్పం నోట్లోపడ్డ కప్పవలె కేకలుపెట్టి ఏడుస్తాడు. ఎవరూరక్షించే వారులేరు. జీవుణ్ణి ఇటు బంధుపాశాలు అటు కాలపాశాలు అటు ఇటు లాగిబిగిస్తాయి. బాధిస్తాయి కానీ సుఖం చేకూర్చవు—అని శివగీత

యా మాతా సా పునర్భార్యా యా భార్యా జననీ హి సా
యః పితా స పునః పుత్రో యః పుత్రః స పునః పితా

పూర్వజన్మలో తల్లి మరుజన్మలో ఆ ప్రేమపాశం వలన అతడికే భార్య అవుతుంది. పూర్వజన్మలోని భార్య ప్రేమచేత ఉత్తరజన్మలో జనని అవుతుంది.

అలానే పూర్వం తండ్రి మరోజన్మలో పుత్రుడౌతాడు. ఈ జన్మలోని పుత్రుడు రాబోయే జన్మలో తండ్రి అవుతాడు. ఇదే సృష్టిరహస్యం.

## అ ని త్యం

అనిత్యం సర్వమేవేదం తాపత్రితయ దూషితమ్
అసారం నిందితం హేయం ఇతి నిశ్చిత్య శామ్యతి 85

ఇదం=ఈ; సర్వం=సమస్త విశ్వం; అనిత్యం=అశాశ్వతమైనది; తాపత్రితయ దూషితం=తాపత్రయం చేత దూషితమైనది; అసారం=సారహీనమైనది; నిందితం=నిందనీయమైనది; హేయం=హీనమైనది; ఇతి=అని; నిశ్చిత్య=నిశ్చయించుకొన్న జ్ఞాని మాత్రమే; శామ్యతి=శాంతిని పొందుతున్నాడు.

బ్రహ్మజ్ఞానీ ! ఈ సర్వం అనిత్యం. ఇది తాపత్రయ దూషితం. సార రహితం. సంసారం అతి నిందనీయం. హేయం. ఇది నిశ్చయం. శాంతి పొందు. దృశ్యప్రపంచం విషయి ప్రపంచం అంతా అనిత్యం. మిథ్య. ఇది అంతా సత్య చైతన్యంలోని ఆభాసం. అధి భౌతిక అధిదైవిక ఆధ్యాత్మికం అని తాపత్రయం. విష జంతువులవల్ల కలిగే దుఃఖం అధిభౌతికం. దైవికంగా సంభవించే ప్రళయాగ్ని వాయూపద్రవాదులు యక్ష రాక్షస భూత పిశాచాలవల్ల కలిగే దుఃఖం అధిదైవికం. దైహిక మానసిక రుగ్మతలవల్ల కలిగే దుఃఖం ఆధ్యాత్మికం.

సంసారంలో ఈ మూడు ప్రవేశించి సంసారాన్ని నిస్సారం చేస్తుంటాయి. ఈ త్రయం జొరబడకుండా సంసారముండదు. అందువల్ల అది అసారం అవుతుంది సంసార జీవులు నిస్సారులౌతున్నారు. దుఃఖభూయిష్ఠమైన ఈ ప్రపంచం నిందనీయం, హేయం అని జ్ఞానులు. నిత్య సుఖం కూర్చే పరమానందాత్మ తత్త్వ రాజ్యం కోరుకొంటారు. ఇచ్ఛారహితుడవై నావు చాలా సంతోషం. సంసారవృక్షానికి ఆత్మ సత్తా కంటే మరొక సత్తాలేదు. నీవు జ్ఞానివై ఇది తెలిసికొన్నావు.

"విషయవాసనలకు లోనయి 'దేహమేనేను' అని భ్రాంతిలోపడి దైవాని! దూరమవుతున్నాడు నరుడు. ప్రబల ప్రయత్నంతో విషయ వాసనలు దూరంచేయి.'

—శ్రీ సత్యసాయిబాబా

## ఉపేక్ష

కోఽసౌకాలో వయః కిం వా యత్ర ద్వంద్వాని నో నృణామ్
తాన్యుపేక్ష్య యథా ప్రాప్త వర్తీ సిద్ధి మవాప్నుయాత్ 86

యత్ర=దేనియందు; నృణాం=నరులకు; ద్వంద్వాని=సుఖదుః ద్వంద్వాలగూర్చి; నో=లేవో: అసౌ కాలః=ఈ కాలం; కః=ఏది; వయః వయస్సు అనేది; కిం అపితు=ఏవయితే; నకోఽపి=ఏదీలేదు; ఇతి=ఇ అని; తాని=వాటినన్నిటినీ; ఉపేక్ష్య=ఉపేక్షించి; యథాప్రాప్తవర్తీ=ప్రాప్తి చిన భోగాలు పొందుతూ; సిద్ధం అవాప్నుయాత్=సిద్ధిపొందుతున్నాడు.

ఆత్మజ్ఞానీ ! నరులకు ద్వంద్వాలైన సుఖదుఃఖాలు ఎప్పుడుండవు? దానికొ కాలం అనికానీ ఋతువు అనీ వయస్సు అనీ ఉండదు. సదా ఉంటూనే ఉంటాయి ఆ ద్వంద్వాలను ఉపేక్ష వహించి యథాప్రాప్త వర్తి మోక్షసిద్ధి పొందుతాడు. దేహ ధారికి సుఖదుఃఖాలు సర్వకాలాలలోను సర్వావస్థలలోనూ ఉంటాయి.

సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్
ద్వయ మేతద్ధి జంతూనాం అలంఘ్యం దినరాత్రివత్

సుఖం అనంతరం దుఃఖం దుఃఖం అనంతరం సుఖం ఈ రెండూ జీవుడి తప్పకుండా వస్తుంటాయి. ఈ క్రమం దినరాత్రులవలె అలంఘ్యం.

సుఖమధ్యే స్థితం దుఃఖం దుఃఖమధ్యే స్థితం సుఖమ్
ద్వయ మన్యోన్య సంయుక్తం ప్రోచ్యతే జల పంకవత్

సుఖకాలం మధ్యలో దుఃఖం, దుఃఖకాలం మధ్యలో సుఖం వస్తుంటాయి.

ఈ సుఖదుఃఖద్వయం కలిసిమెలిసి ఉంటాయి. బురదనీరు మిశ్రమమై ప్రవహిస్తున్నట్లుగా కాలప్రవాహంలో ఇవి రెండూ ఉంటాయి- అని అధ్యాత్మరామాయణం.

* *

సంతోషామృత పానేన యే శాంతాః తృప్తిమాగతాః
ఆత్మారామా మహాత్మనః తే మహాపదమాగతాః

సంతోషామృతం పానంచేసి మహాత్ములు శాంతినీ, తృప్తినీ సాధిస్తారు. వారు ఆత్మారాములు. ఆత్మజ్ఞానంలో ఆత్మనిష్ఠులై విరాజిల్లుతారు.

—మహోపనిషత్తు (4-35)

## అనాసక్తి

నానామతం మహర్షీణాం సాధూనాం యోగినాం తథా
దృష్ట్వా నిర్వేదమాపన్నః కోన శామ్యతి మానవః 87

మహర్షీణాం=మహర్షుల యొక్క; సాధూనాం=సాధుపురుషుల యొక్క; యోగినాం=యోగుల యొక్క; నానా మతం=పలుమతాభిప్రాయాలు; తదా= అలానే; దృష్ట్వా=చూచి; నిర్వేదం=వైరాగ్యం; ఆపన్నః=పొంది; కః= ఏ; మానవః=మానవుడు; న శామ్యతి=శాంతిపొందడు?

విజ్ఞానీ ! మతాలు నానావిధాలు. అభిమతాలు అనేకం. కొందరు మహర్షులు మహాయోగులు ఇవి ఆలోచించిచూచి నిర్వేదమైన వైరాగ్యాన్ని ఆశ్రయించారు. ఇక శాంతి ఎందుకు లభించదు. తర్క శాస్త్రాలలోనూ కర్మ కాండలోనూ ప్రవేశించకుండా ఆత్మజ్ఞానంలోనే నిష్ణాతుడివి కావాలి. తర్కశాస్త్రాలు బుద్ధిని భ్రష్టుపట్టిస్తాయి.

సాంఖ్యం చార్వాకం లోకాయితం మీమాంసం వైశేషికం పాశుపతం శైవం జౌహాష్ట్రియం శాక్తేయం బౌద్ధం జైనం సౌత్రాంతకం అక్షపాదం ఈ మొదలైన మతాలు వ్రతాలు మతభేదాలు యోగాలు శతాధికాలు. ఇందులో కపిల కణాద గౌతమ పతంజలి జైమిని బాదరాయణాదులు ప్రతిపాదించు షడ్దర్శనాది శాస్త్రాధారాలుకొన్ని. ముఖ్యం మూడు ద్వైత అద్వైత విశిష్టాద్వైత మతాలు.

కొన్ని వేద సమ్మతాలు మరికొన్ని అవైదికాలు. చార్వాక గౌతమ నైయాయి కాదుల సిద్ధాంతాలు వేద ప్రమాణాలకు విరుద్ధాలు. వారి సిద్ధాంతసారం ఇది- "ఈశ్వరాత్మ జీవాత్మలు జడపదార్థాలు. జ్ఞాన ఇచ్ఛాదులు ఆత్మగుణాలు. ఈశ్వరాత్మ గుణాలు నిత్యాలు. జీవాత్మ గుణాలు అనిత్యాలు. జ్ఞాన కారణం ఆత్మసంయోగం. పరమాణువులు జగదుత్పత్తికి మూలం. అట్టి పరమాణువు నిరవయవం.

ఈశ్వరాత్మ జీవాత్మలు జడాలుకావు. ఏలననగా "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని శ్రుతి. బ్రహ్మ అంటే ఆత్మ. ఆత్మ సత్యం. ఆత్మస్వరూపం జ్ఞానం. అట్టి ఆత్మ సర్వవ్యాపకం. ఆనందమయం. ఆత్మ జడం అయితే జగత్తు అంధప్రాయ మవుతుంది. కర్మ జడం ఆత్మజడం ఈశ్వరాత్మ జడం అయితే కర్త భోక్త ఫల ప్రదాత ఎవరూ ఉండరు. జడంనుండి కర్తృత్వ భోక్తృత్వాది శక్తులు లుద్భవించవు. జడ పదార్థ గుణాలు జ్ఞాన చైతన్యాలను ప్రసాదించలేవు. గుణి గుణాల భేదం కనిపించదు.

అగ్ని నుండి ఉష్ణం ప్రకాశం హరిస్తే అగ్నికి మిగిలేదేమీలేదు. రెండూజడాలే కదా ! అగ్ని స్వభావాలు ఉష్ణం ప్రకాశం ఆత్మ స్వభావాలు జ్ఞానం చైతన్యం. గుణీ గుణాల భావాలు ఆత్మకున్నట్టులేదు. చైతన్యం జడ పదార్థ ధర్మమని ఎక్కడా దృష్టాంతంలేదు. కావున నైయాయిక కథనం అసంగతం

జీవాత్మలకు సర్వ వ్యాపకత్వ శక్తులు లేవు. సర్వ వ్యాపకత్వం ఉంటే సర్వ జ్ఞత్వం కూడా ఉండాలి. సర్వులూ సర్వజ్ఞులు కావాలి. అలా జరగటంలేదు. పర మాణువుల నుండి జడ జగత్తు పుట్టదు. నిరవయవ పరమాణువులు పరస్పరం సంయోగం జెందవు. సావయువ పదార్థాలలోనే పరస్పర సంయోగ శక్తి ఉంది. అందువల్ల నైయాయిక సిద్ధాంతాలు యుక్తి యుక్తాలు కావు. కర్మకాండ కలాపాలు విషయంలో కూడా అనేక మతభేదాలున్నాయి.

కర్మణా బధ్యతే జంతు ర్విద్యయా చ విముచ్యతే
తస్మాత్కర్మ న కుర్వంతి యత్తయః పారదర్శినః

కర్మకాండ చేసి జీవుడు బంధాలు తెంచుకొంటున్నాడు. ఆత్మ విద్య అభ్య సించి అపవర్గం అధిరోహిస్తున్నాడు. విద్వాంసుడు కర్మలు త్యజించి ఆత్మజ్ఞానంలో ఆత్మ విద్యను అభ్యసిస్తున్నాడు. ఆత్మనిష్ఠలో నిమగ్నమై ఉంటున్నాడు.

జైమిని 'ఆత్మను జడచైతన్య ఉభయం-స్వర్గమే మోక్షం' అంటాడు. ఒకే పదార్థంలో జడ-చైతన్య ధర్మాలు రెండూ ఉన్నట్లు ఏ ప్రమాణాలు లేవు. చైతన్యం నిరవయవం నిత్యం. జడం సావయవం. అనిత్యం శైత్యం ఉష్ణం పరస్పర విరోధ జనకాలు. అలానే జడ చైతన్యాలు. వేదంలో కూడా ఆత్మ ద్వివిధాలు అని అనలేదు. స్వర్గం మోక్షం మాత్రం కాదు.

తద్యథేహ కర్మచితో లోకః క్షీయత
ఏవ మముత్ర పుణ్య చితో లోకః క్షీయతే

ఈ శ్రుతి వాక్యం చూపుతాడు జైమిని మహర్షి. ఈ లోకంలో కృషిచేసిన తరువాత పొలం పంటనిచ్చి ఈటు పోతుంది. అలానే పుణ్యకర్మలు చేసిన తరువాత భోగాలిచ్చి స్వర్గం కూడ నష్టమవుతుంది. దీనివల్ల స్వర్గం అనిత్యం అని తేలింది. స్వర్గం అనిత్యమైతే ముక్తి కూడా అనిత్యమే అవుతుంది. కావున జైమిని మతం కూడా ఆత్మ విదులకు సమ్మతంకాదు.

కర్మిష్ఠులు అనేక రకాలు. యజ్ఞయాగాది నిత్యాగ్నిహోత్ర తత్పరులు కొందరు. ఇష్టదేవతా జప తత్పరులు కొందరు. కృచ్ఛ్ర చంద్రాయణాదివ్రతులు మరికొందరు. ఇంక అష్టాంగయోగ సాధకులు కొందరు. హఠయోగులు మరి కొందరు. రాజయోగులు లయయోగులు ఇలా బహుమతాలు. ఈ శాస్త్రజ్ఞానం అంతా ప్రతివాదిని జయించటం కోసమే. ముముక్షువుకివి అనవసరం. కేవలం ఆత్మాను సంధానం వల్లనే ముక్తి సులభం. ఆత్మాను సంధానమే ముక్తికి రాజ ఘంటాపథం.

* *

శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణ కారణం
అతః ప్రయత్నాజ్ఞాతవ్యం తత్త్వజ్ఞ స్తత్త్వమాత్మనః

శబ్ద ప్రపంచం శాఖోప శాఖలుగా అనేక తర్క-వ్యాకరణ మీమాంసన్యాయాది శాస్త్ర వృక్షాలతో తత్త్వశాస్త్రం గూడా క్రమ్మి మహారణ్యమైపోయింది. ఇందులో చిత్తం భ్రమిస్తోంది. ఈ అడవి నుండి బయట పడటం చాలా కష్టం. ఇందులోపడి

పతిభ్రష్టులు కాకుండా సాధకులు చైతన్య స్వరూపమైన ఆత్మతత్త్వం తెలిసికొని గమ్యం సాధించుకోవాలి.

—శ్రీ శంకరాచార్య

## ప రి జ్ఞా నం

కృత్వా మూర్తి పరిజ్ఞానం చైతన్యస్య న కిం గురుః
నిర్వేద సమతాయుక్త్యా యస్తారయతి సంసృతేః 88

నిర్వేదం=వైరాగ్యం చేత; సమతా=సమత్వం చేత; యుక్త్యా= సూక్తుల చేత; చైతన్యస్య=చైతన్యంయొక్క; మూర్తి పరిజ్ఞానం=స్వరూప విజ్ఞానం; కృత్వా=అభ్యాసంచేసి; యః=ఎవడు; సంసృతేః=సంసారం నుండి; తారయతి=తరిస్తున్నాడో; కిం=ఏమి; సః=ఆతడు; గురుః న= గురువు కాదా?

ప్రియ శిష్యా ! నిర్వేద సమతాముక్తి ద్వారా చైతన్య మూర్తి తత్త్వాన్ని తత్త్వజ్ఞానం తెలుసుకొన్నవాడు తాను సంసార సాగరాన్ని తరిస్తాడు. వానికిక గురు వేల ! విషయ వాసనలు త్యజించినవాడు శత్రు మిత్రుల యెడ సమబుద్ధి గలవాడు తనకుతాను శ్రుత్యనుకూల సూక్తుల ద్వారా సచ్చిదానంద రూపమైన ఆత్మ సాక్షాత్కారం పొందుతాడు. ఆ యోగికి స్వరూప అనుభవం కలుగుతుంది. ఆ సన్యాసి సంసారం నుండి తాను స్వయంగా ఉద్ధరింపబడతాడు.

లోకంలో ఎక్కువ జనం మిక్కిలి అశాజీవులు. ఇందుకు కారణం అజ్ఞానం. అజ్ఞానం వల్ల సూక్తులలోని అసలు మూల అర్థాలు అవగాహన చేసికోలేకపోతున్నారు. ఇందుమూలంగా అన్ని మతాలవారూ అంతే. గురువు అంటే ఆత్మజ్ఞానోపదేశం చేత మాయామోహ బంధాలు త్రెంచి సందేహ నివృత్తి చేసి ఆత్మానందం కలుగజేసే మహాత్ముడే గురువు. శతాధిక శంకలకు సదుత్తరం పొంది సంశయ నివృత్తుడై శ్రీరామచంద్రుడు వసిష్ఠ మహర్షిని గురువుగా గ్రహించాడు.

శ్రీకృష్ణుని ముందు సహస్రాధిక సందేహాలు విన్నవించుకొని చివరకు విశ్వ

విరాట్ స్వరూపం దర్శించితేగాని అర్జునుడు కృష్ణభగవానుని గురువుగా ఒప్పుకో లేదు. ఇలా అజ్ఞానం చిత్తం నుండి పోగొట్టినవారినే గురువుగా స్వీకరించాడు కాని కేవలం ఒక్క చెవిలో మంత్రం చెప్పించుకొని ఊరుకోలేదు. నిజమైన గురువులు ఇరువురు. అక్షర విద్యాగురువు ఆత్మ విద్యా గురువు. అక్షర పునాదులపై లౌకిక పారలౌకిక వృద్ధి జరుగుతుంది. క్షరం కానిది అక్షరం. అవి వర్ణక్రమమైనా విద్యార్థి సువర్ణం అవుతాడు. అక్షయమైన అక్షరమైన జ్ఞానం కలిగితే గురువు అవసరంలేదు. ఆత్మజ్ఞానంతో భేద బుద్ధి పోతుంది కదా !

## జ్ఞా నో పా య ం

పశ్యభూత వికారాం స్త్వం భూతమాత్రాన్ యథార్థతః
తత్ క్షణాత్ బంధనిర్ముక్తః స్వరూపస్థో భవిష్యసి 89

భూత వికారన్ = వికారాలైన దేహేంద్రియాదులను; యథార్థతః = వాస్తవంగా; భూతమాత్రాన్ = భూతమాత్రాలుగా; త్వం = నీవు; పశ్య = చూతువుగాక!; తతక్షణాత్ = అలా చూచిన వెంటనే; బంధనిర్ముక్తః = బంధాలనుండి; స్వరూపస్థం = విడివడినవాడవై ; స్వరూపస్థితిలో ఉన్నవాడవు; భవిష్యసి = అగుచున్నావు.

వికారదూరా ! భూతవికారాలు దేహేంద్రియ మనో వికార కార్యాలే. యథార్థంగా భూత మాత్రా విన్యాసాలు చూచి ఆలోచించినట్లయితే వెంటనే తక్షణం వైరాగ్యం కలిగి బంధాలు విడిపోతాయి. నీవు నీ స్వరూపస్థితి పొందు. నీ స్వరూప స్థితి ఆత్మానందమే. భూత వికారాలైన దేహేంద్రియాలను ఆత్మ రూపాలుగా తలంచ బోకు. శరీరాదులు వేరు ఆత్మవేరు అని భావనచేయి. దేహ భూత చేష్టలకు సాక్షివిగా ఉండు. నీవు వీటికి సాక్షిభూతుడవైనప్పుడు ఆత్మతత్త్వజ్ఞానం హస్తామలకం అవుతుంది.

పంచ భూతవికారాలు దేహేంద్రియాదులు. పృథివి నీరు అగ్ని వాయువు జడాలు. ఇవి ఆత్మ స్వరూపాలుకావు శరీరాహంభావ నిర్ముక్తుడవు. ఆత్మరూపుడవు. సచ్చిదానంద చైతన్య స్వరూప పరిజ్ఞానం పొందటానికి ఇదే ఉపాయం ఉపదేశం.

* *

అనహంకారుడు-అక్రో
ధనుడు-అతృష్ణుండునై అతడు శుభ మశుభం
బను భేదము పొరయడు విడు
పున సమతా సుఖమయత్వముం గనుచుండున్
—తిక్కన (భారతం-శాంతిపర్వం)

## ఆ త్మ ని ష్ఠ

వాసనా ఏవ సంసార ఇతి సర్వా విముంచతాః
తత్త్యాగో వాసనా త్యాగాత్ స్థితిరద్య యథా తథా 90

వాసనాఏవ=వాసనలే; సంసారం=సంసారం; ఇతి=ఇలా అని; జ్ఞాత= తెలిసికొని; తాః సర్వాః=ఆ వాసనల నన్నిటినీ; విముంచ=విడువుము; వాసనా త్యాగాత్=వాసనాత్యాగంవల్ల; తత్త్యాగః=ఆ సంసారత్యాగం కూడా కలుగుతుంది; అద్య=ఇట్లయిన తరువాత; యథా=ప్రారబ్ధం ఎలాఉంటే; తథా= అలా; స్థితిః=శరీరస్థితి ఉంటుంది.

వాసనాత్యాగీ ! వాసనా సముదాయమే సంసారం. ఇది గ్రహించి వాసనలు వర్జించు. వాసనా త్యాగం వలన త్యాగసంస్కారం కలుగుతుంది. శరీర స్థితులు ప్రారబ్ధ కర్మలను అనుసరించి జరుగుతూంటాయి.

విషయ వాసనలు సాంసారిక బంధనాలు. వాసనలు ముఖ్యంగా మూడురకాలు.

లోకవాసనయా జంతోః శాస్త్రవాసనయాపిచ
దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే

ఒకటి లోకవాసన- 'స్వర్గాదిలోక సుఖాలు నాకే లభిస్తాయి'. రెండవది శాస్త్ర వాసన- 'అన్ని శాస్త్రాలు చదివిన సాటిలేని బుధుణ్ణి నేను'. మూడవది దేహవాసన- నా శరీరం అందంగా బలంగా ఉన్నది- అని యోగవాసిష్ఠం. ఈ వాసనలు వదిలితే బంధాలుపోయి చిత్తం ఆత్మలో ఆనందంగా ఉంటుంది.

బాలుడు, పిచ్చివాడు ప్రారబ్ధం అనుసరించి బ్రతుకుతుంటారు. జ్ఞానులు

వాసనలు వదిలి వైరాగ్యభావం కలిగి తెలిసి తత్త్వనిష్ఠగలవారై ఆశారహితులై బ్రతుకుతుంటారు. లోకం దృష్టిలో బాలుడు పిచ్చివాడు జ్ఞాని సమానమే.

వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధాచ మలినా తథా
మలినా జన్మహేతుః స్యాత్ శుద్ధా జన్మ వినాశినీ

వాసనలు రెండు విధాలు. ఒకటి శుద్ధవాసన రెండవది మలిన వాసన; "ముక్తి కావాలి ఆత్మసాక్షాత్కారం పొందాలి. జ్ఞానం లభించాలి. పవిత్రజీవనం గడపాలి." అనే అభిలాషతో కూడినవి శుద్ధవాసనలు. "భోగాలు పొందాలి పదవులేలాలి ధనం ఆర్జించాలి కీర్తి లభించాలి స్త్రీ సుఖం కావాలి" అనేవి మలిన వాసనలు. శుద్ధ వాసన జన్మ నివృత్తి హేతువు. మలినవాసన జన్మ ప్రవృత్తి హేతువు- అని వాల్మీకి అంటారు.

వాసనలు వర్జించు అంటే మలిన వాసనలు వర్జించు అనే భావం. జ్ఞానులు ముముక్షువులు కోరేది జన్మరాహిత్యమేకదా. శుద్ధ వాసన శుభకరం. వదలరానిది. జీవన్ముక్తికి అన్ని వాసనలు వదలి మనోలయం చేసికోవాలి. ఈ వాసనా త్యాగస్థితియే సచ్చిదానందస్థితి ఇదే ఉపదేశసారం.

# ఉపశమనం

## అనాదరం కురు

అష్టావక్ర ఉవాచ -

విహాయ వైరిణం కామం అర్థం చానర్థ సంకులమ్
ధర్మ మప్యేతయోః హేతుం సర్వత్రా నాదరం కురు 91

వైరిణం=వైరరూపమైన; కామం=కామమును; చ=మరియు; అనర్థ సంకులం=అనర్థాలతో కూడిన; అర్థం=ధనమును; విహాయ=విడిచి; ఏతయోః=ఈ రెండింటికీ; హేతుం=కారణమైన; ధర్మమపి=ధర్మాన్ని; విహాయ=విడిచి; సర్వత్ర=సర్వ స్థానాలలోనూ; అనాదరం కురు=అనాదరం చూపు.

శిష్యవర్యా! అన్నిటికీ బద్ధశత్రువైన కామాన్నీ, అనర్థాలకు మూలమైన అర్థాన్నీ, కామార్థదాయకమైన ధర్మాన్నీ విడిచి వాటిని అనాదరించు. అన్నిటికీ అధిష్ఠానమైన ఆత్మానంద పీఠం అధివసించు. కామం జ్ఞానికి శత్రువు. ఈ కామం గర్వ అనర్థాలకు మూలం. ఇది దుర్జయం.

నీవు ధర్మార్థకామాలు త్యజించి మోక్ష విద్యలో దిగావు. మోక్షార్థివై ధర్మ అర్థ కామాలు త్యజించాలి. నీకు శుభం కలుగుగాక!

* *

దుఃఖ మాగంతకంబయి తోచుమందు
సుఖము స్వాభావికము నాకు సూరివర్య!
అట్లు గావున నిరతిశయాప్రమేయ
నిరుపమానంద మయుడను నేనుపుత్ర!

—సీతారామాంజనేయ సంవాదం (2-166)

## ఇహం ఇంద్రజాలం

స్వప్నేంద్ర జాలవత్ పశ్య దినాని త్రీణి పంచవా
మిత్ర క్షేత్ర ధనాగార దార దాయాది సంపదః 92

మిత్రక్షేత్ర ధనాగార దార దాయాది సంపదః=స్నేహితులు పొలాలు ధనాలు భార్య జ్ఞాతులు అనే సంపదలన్నీ: స్వప్నేంద్ర జాతవత్=స్వప్నదృశ్యాలవంటివనీ; త్రీణీ=మూడు; వా=లేక; పంచ=ఐదు: దినాని=రోజులుమాత్రం ఉండేవని పశ్య=ఆలోచించు.

రాజా ! మిత్రులు భూములు ధనాలు గృహాలు భామలు భ్రాతలు ఈ మొదలైన సంపదలు అన్నీ స్వప్న ఇంద్రజాలాలు. మూణ్ణాల ముచ్చట్లు. క్షణభంగురాలు. అశాశ్వతాలు. ఆలోచించు. యద్దృశ్యం తన్నశ్యం కనిపించేవన్నీ నశించేవే. ఈ సంపదలపై మమతా త్యాగం యోగికి అత్యవసరం.

విష్ణుస్మరణం మోక్షప్రదం. భగవంతుడు సర్వవ్యాపకుడు శాశ్వతుడు.

## తృష్ణ వదులుకో

యత్ర యత్ర భవేత్ తృష్ణా సంసారం విద్ధి తత్రవై
ప్రౌఢ వైరాగ్య మాశ్రిత్య వీత తృష్ణః సుఖీభవ! 93

యత్ర యత్ర=ఏఏ విషయాలందు; తృష్ణా=కోరిక; భవేత్=కలుగునో; తత్ర=అక్కడ; సంసారం=సంసారం; విద్ధివై=నిశ్చయం చేసికో; ప్రౌఢ వైరాగ్యం=అసాధారణ వైరాగ్యం; ఆశ్రిత్య=ఆశ్రయించి; వీత తృష్ణః=తృష్ణారహితుడవై; సుఖీ భవ=సుఖివికమ్ము.

వత్సా ! ఏఏ వస్తువులపై తృష్ణ కలుగుతుందో ఆయా వస్తువులు సంసార సంబంధాలు అని తెలిసికొని నిశ్చయంచేసికొని అసాధారణ వైరాగ్యం ఆశ్రయించు. తృష్ణారాహిత్యం పొందు. సుఖవంతుడివి కమ్ము. ప్రబల విషయాలవల్ల మనస్సులో తృష్ణ పుట్టుకొస్తుంది. విషయాలు సంసార హేతువులు.

మనోరథ రథామాఢం యుక్త మింద్రియ వాజిభిః
భ్రామ్యతేవ జగత్ కృత్స్నం తృష్ణా సారథి చోదితమ్

మనోరథం పెద్దరథం. ఇంద్రియాలు రథానికి బూన్చిన గుఱ్ఱాలు. తృష్ణ సారథి. క్షణం క్షణం ఆ సారధి ఆ రథం ఎక్కి లోకాలన్నీ తిరిగివస్తుంటాడు.

యథా హి శృంగ గో కాలే వర్ధమానేన వర్ధతే
ఏవం తృష్ణాపి చిత్తేన వర్ధమానేన వర్ధతే

ఆవు రెండు కొమ్ములు ఆవు శరీరంతో క్రమంగా పుట్టి పెరుగుతాయి. అలానే తృష్ణ కూడా చిత్తంలోపుట్టి విరివిగా పెరిగిపోతుంది-అని యోగవాసిష్ఠం.

ప్రాప్తించిన వస్తుభోగాలు చాలలేదనీ అప్రాప్తాలు లభించలేదనీ కొరతలు లేకుండా ఉండు. అహరహం ఆత్మనిష్ఠగలవాడు సుఖి. కనుక నీవు అట్టి సుఖం పొందుతున్నావు.

* *

ఆశాహి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖం
యథా సంఛిద్య కాంతారం సుఖం సుష్వాపి పింగలా!

ఆశలే దుఃఖమూలాలు. ఆశారాహిత్యమే ఆనందహేతువు. పింగల తన వాంఛావనం ఛేదించుకొని సుఖంగా నిద్రపోగలిగింది.

—భాగవతము

## తుష్టిగా వుండు

తృష్ణా మాత్రాత్మకో బంధః తన్నాశో మోక్ష ఉచ్యతే
భవా సంసక్తి మాత్రేణ ప్రాప్తి తుష్టి ర్ముహుర్ముహుః 94

తృష్ణామాత్రాత్మకః=తృష్ణామాత్రరూపమే; బంధః=బంధం; తన్నాశః= ఆ తృష్ణానాశమే; మోక్షం=మోక్షం అని; ఉచ్యతే=చెప్పబడుతున్నది; భవ=

సంసార విషయాలపై; అనాసక్తి మాత్రేణ=అనాసక్తి మాత్రంచేత; ముహు ర్ముహుః=మాటిమాటికి; ప్రాప్తితుష్టిః=తృప్తి కల్గుతున్నది.

తృష్ణామాత్ర స్వరూపం బంధం. తృష్ణ నశించటమే మోక్షం. అనిశిష్టవచనం సంసార సంగ రాహిత్యం. ఆత్మతృప్తి ఆత్మప్రాప్తి కలుగజేస్తుంది.

చ్యుతా దంతాః సితాః కేశా దృఙ్నిరధో పదే పదే
యాతసజ్జ మిమం దేహం తృష్ణా సాధ్వీ న ముంచతి

మానవుడి దంతాలూడిపోతున్నాయి. తల పండి పోయింది. దృష్టి మంద గించింది. అడుగులు తడబడుతున్నాయి. అయినా తృష్ణ అనే స్త్రీ తగులుకొని విడిచి పెట్టటంలేదు.

తృష్ణే దేవి నమస్తుభ్యం ధైర్య నిష్లవకారిణీ
విష్ణు స్త్రైలోక్య పూజ్యోఽపి యత్త్వయా వామినీకృతమ్

ఓ తృష్ణాదేవతా ! నమస్కారం. నీవు ఎట్టి పురుషపుంగవుడి ధైర్యమైనా తృటిలో త్రుంచివేస్తావు. విశ్వ విరాణ్మూర్తి విష్ణుదేవుడు మూడు లోకాలలో పూజ లందుకొంటున్నాడు. అట్టి వాడిని నీవు పట్టుకొని వామనుణ్ణి చేశావుకదా!-అని యోగవాసిష్టం.

## విశ్వ జడం

త్వమేక శ్చేతనః శుద్ధో జడం విశ్వమసత్తథా
అవిద్యాపి న కిం చిత్సా కా బుభుత్సా తథాపి తే 95

త్వం=నీవు; ఏకః=అద్వితీయుడవు; శుద్ధః=పరిశుద్ధుడవు; చేతనః= చైతన్యమూర్తి వి; విశ్వః=ప్రపంచం; జడం=జడ భూయిష్ఠము; చ=మరియు; అసత్=అసత్పదార్థం; తథా=ఆ ప్రకారంగా; సా అవిద్యాఅపి=అది అవిద్య కూడా; నకించిత్=మరి ఏమీలేదు; తథాపి=అయినా కూడా; తే=నీకు; బుభుత్సా=బోధకావాలనే కోరిక; కా=ఎక్కడ?

నీవు ఒక శుద్ధ చైతన్యరూపానివి. సంసారం జడం. అది అసత్తు. అవిద్యాజ్ఞానుల సృష్టి ఆ సంసారం కించిత్తు కూడా విలువలేనిది. అందు నీకు ఏమి తెలిసికొనవలసివుంది? విను. ముఖ్యమైన పదార్థములు మూడు. ఒకటి ఆత్మ. రెండవది జగత్తు మూడవది అవిద్య.

ఆత్మ లక్షణం— స్థూల సూక్ష్మ కారణ శరీరాలకు భిన్నంగా ఉండేది, జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలకు సాక్షీ మాత్రంగా ఉండేది, సచ్చిదానంద స్వరూపమై ఉండేది ఆత్మ.

జగత్తు లక్షణం—సదా గమన శక్తి స్వభావంగలది జగత్తు. నదీప్రవాహం వలె నడుస్తూంటుంది. ఇది అసత్తు.

అవిద్య లక్షణం— "అనాది భావత్వే సతి జ్ఞాన నివర్తత్వే మజ్ఞానత్వమ్" అనాదీ భావరూపం, ఆత్మజ్ఞాన విరుద్ధం, అజ్ఞానం. ఇదే అవిద్య.

నీవు ఈ మూడు పదార్థాలలో పరిశుద్ధ ఆత్మవు. ఆత్మనే పూర్ణమూర్తిగా నిశ్చయించి అందు రమించు. జగత్తు అసత్తు అని నిశ్చయం చేసికో. అవిద్య సత్తు అసత్తుల కంటె విలక్షణమైనది. దీని కార్యరంగ స్థలమైన జగత్తు అనిర్వచనీయం. కనుక జగత్తు గూర్చి అవిద్య గూర్చి తృష్ణ వహించటం అనుచితం. రెండు మిథ్యలే. జ్ఞాని ఆత్మజ్ఞానానికై తృష్ణ వహిస్తాడు. అజ్ఞాని అసత్తు అవిద్యలకై తృష్ణవహిస్తాడు.

## భా ర్యా పు త్రు లు

రాజ్యం సుతాః కళత్రాణి శరీరాణి సుఖానిచ
సంసక్తస్యాపి నష్టాని తవ జన్మని జన్మని 96

రాజ్యం=రాజ్యం; సుతాః=పుత్రులు; కళత్రాణి=భార్యలు; శరీరాణి=శరీరాలు; చ=మరియు; సుఖాని=సుఖాలపై; సంసక్తస్య=ఆసక్తిగలవాడికి అపి; నష్టాని=నష్టం అవుతూనే ఉన్నాయి; తే అపి=నీకుకూడా; ఏతే=ఇవి; జన్మ జన్మని=ప్రతిజన్మయందు; నష్టాని=వస్తూ నశిస్తూన్నవి.

రాజ్యాలు భోగాలు ఆలుబిడ్డలు ఐహిక సుఖాలు విషయాసక్తులకు జన్మ జన్మ

లోనూ నష్టమౌతుంటాయి. నీకు అంతే. జన్మజన్మకు ఇవి కలుగుతూ వీడిపోతూ ఉంటాయి. జన్మ జన్మకు ఇవి అనుబంధాలు. ఇవి కాల ప్రవాహంలో కొంతసేపు కర్మప్రారబ్ధానుసారంగా కలుస్తూ ఎడబాటవుతూ ఉంటాయి- ఈ బంధాలు అనిత్యాలు అసత్పదార్థాలు. ఇవి అక్షయాలుకావు క్షయాలు. అక్షరాలు కావు క్షరాలు. అమృతాలు కావు మృతాలు- ఇవి మునిజన సమ్మతాలు కావు అసమ్మతాలు: జగత్తు అసత్తు.

ఇవి స్వాప్నికాలు. స్వప్న జాగ్రత్ సుషుప్తులు ఒకదాని కొకటి పడదు. వ్యతిరేక భావాలు గలవి. అన్యులకు జాగ్రదవస్థలో స్వప్నసుషుప్తులు అసత్పదార్థాలు స్వప్నావస్థలో జాగ్రత్సుషుప్తులు అసత్పదార్థాలు. ఈ మూడు అవస్థలు అజ్ఞాన జనితాలు. ఈ అజ్ఞాన స్థితి దాటి జ్ఞానభూమిని జేరాలి మానవుడు. ఇది మానవ జీవన గమ్యం.

సత్యం త్రికాల నిత్యం. అది సత్పదార్థం. సాంసారిక పదార్థాలన్నీ అసత్యాలు అనిత్యాలు. సాధకుడు సాధ్యం కంటే వేరుకాదు. ఆత్మరూపుడు. ఈ సాధకుడికి ప్రపంచంతోకానీ అజ్ఞానంతోకానీ ప్రమేయంలేదు,

## సంసారం కాంతారం

అలం అర్థేన కామేన సుకృతేనాపి కర్మణా
ఏభ్యః సంసారకాంతారే న విశ్రాంత మభూత్ మనః 97

అర్థేన=అర్థం ధనంచేత: కామేన=కోరికచేత; సుకృతేన=సత్ కర్మల చేత; అలం=చాలును; తథాఽపి=అయినప్పటికీ; ఏభ్యః=ఈ మూడింటి నుండి; సంసార కాంతారే=సంసార అరణ్యంలో; మనః=మనస్సు; విశ్రాంతం నభూత్=విశ్రాంతిని పొందుననదిగాలేదు.

అర్థ కామ సుకృత కర్మలు పెక్కు చేశావు. ఇక చాలు. వీటితో సంసార కాంతారంలో భ్రమించి శ్రమించి చిత్తం విశ్రాంతి పొందలేకపోతున్నది. చూశావా! జీవన్ముక్తి కోరేవాడు మోక్షం ఒక్కటే లక్ష్యంలో ఉంచుకొని, దానికోసమే జ్ఞాన వీధిలో ప్రయాణిస్తూ ఈ ధర్మార్థకామాలు మరచిపోవాలి. దానాలు పుణ్యాలు అంటే ధర్మార్థకామాలు బంధహేతువులు. ప్రవృత్తి జనకాలు. నివృత్తిలో ఉన్నవాడికి మోక్ష

విద్యయే సర్వస్వం. ఆత్మజ్ఞాని 'శివోఽహం' అని స్మరించి స్మరించి శివుడేఅయినాడు శివుడు నిష్క్రియుడు నిస్పృహుడు నిరంజనుడు నిశ్చలుడు.

పృథివీం ధనపూర్ణాం చేత్ ఇమాం సాగరమేఖలాం
ప్రాప్నోతి పునరప్యేష స్వర్గ మిచ్ఛతి నిత్యశః

పృథివీ సాగర మేఖం పర్యంతం నిండిన ధనసంపదలు భోగాలు కలిగిన మానవుడు తృప్తిలేక స్వర్గ సౌఖ్యాలకోసం అర్రులుచాస్తుంటాడు. నిత్యం ఆకాంక్షలు ఆకాశాన్ని అధిగమిస్తుంటాయి. అర్థాపేక్ష అలాంటిది కామం సంగతి చూడు—

న పశ్యతిచ జన్మాంధః కామాంధో నైవ పశ్యతి
మదోన్మత్తా న పశ్యంతి హ్యర్థీ దోషం న పశ్యతి

కామాంధుడు కన్నులుగల గ్రుడ్డివాడు. స్త్రీలను అసలు గుర్తించలేడు. ఏ స్త్రీని ప్రేమించాలో, ఎవరు ఎవరో ఏమీ చూడలేడు. వావివరసలు, మంచిచెడ్డలు, పుణ్యపాపాలు వాడి కంటికి కనిపించవు.

కనుక ఓ జ్ఞానీ! ధనాదులు త్యజించి వివేకివై విజ్ఞానమార్గంలో పయనించు. సంసార కాంతారం చాలా గహనమైనది. అందులో చిక్కుకొంటే మనస్సు ధర్మార్థ కామ జంజాటంలోపడి వ్యాకులమౌతుంది. శాంతి పొందలేదు.

## కర్మ

కృతం న కతి జన్మాని కాయేన మనసా గిరా
దుఃఖ మాయాసదం కర్మ తదద్యా ప్యుపరమ్యతామ్ 98

కతి=ఎన్ని; జన్మాని=జన్మలనుండి; కాయేన=శరీరంచేత; మనసా=మనస్సుచేత; గిరా=వాక్కుచేతా; దుఃఖం=దుఃఖమూ; ఆయాసదం=శ్రమకరమూ అయిన; కర్మ=కార్యం; న కృతం=చేయబడలేదా!; ఇతి=ఇలా అని నిశ్చయించుకొని; తత్=ఆ కర్మజాలం నుండి; అద్యాపి=ఇప్పుడైనను; ఉపరమ్యతాం=విరమింపబడునుపుగాక.

అసంఖ్యాక జన్మల నుండి కర్మ సంకులంలోపడి కొట్టుకొంటున్నావు. శారీరకంగా మానసికంగా వాచికంగా అనేక కార్యాలు చేస్తూ వచ్చావు. శ్రమించి ఆయాసపడి అశపడి సుఖాలు అనుకొని దుఃఖాలు కొనుక్కొని అనుభవిస్తూవచ్చావు. ఇక అన్ని విరమించి ఇపుడు విశ్రాంతి పొందు.

స్వార్థ కర్మ ఫలాలు జనన మరణ చక్రభ్రమణంలో పడి పొంది భోగించావు. కష్టాలు తెచ్చుకొన్నావు. ఆత్మసుఖం తృప్తి ఏమాత్రం మంచుకైనా లభించలేదు. ఇక కర్మ విరమించి శాంతి పొందితేనే జీవన్ముక్తి లభిస్తుంది.

స్వార్థ రహిత ధర్మ కర్మల వలన సత్వగుణం వృద్ధిచెంది మనస్సుశాంతంగా ఉంటుంది. శాస్త్రం గ్రహిస్తుంది. ధ్యానం చేసుకోగలుగుతుంది. అయినా ఇవి అనిత్యమైనవే. మిధ్యలో భాగాలే అని తెలిసికొని జ్ఞాని వాటిపై వైరాగ్యభావం పొంది ఉంటాడు. మహాతత్త్వ బోధకులు ఎప్పటికప్పుడు ఇకనుంచైనా నీ ప్రయత్నాలు మానుకో! అంటుంటాడు.

*　　　*

వేల సంవత్సరాలు విషయభోగాలు అనుభవించినా బ్రహ్మ నుండి గడ్డిపోచ వరకూ ఎవరూ తృప్తిపడలేదు. సామ్రాజ్యాలు ఏలినా, వధూగణంతో విహరించినా శత్రు సంహారం చేసినా సంపదలనుభవించినా చివరికి లభించేది ఏముంది? దేనిని సంపాదిస్తే మరి దేనినీ సంపాదింప నవసరంలేదో అట్టి ఆత్మపదాన్ని పొందడానికి సర్వప్రయత్నాలు చేయి. ఆ యత్నానికి జీవితం అంకితంచేయి.

—యోగవాసిష్ఠం

# అభినందనం

## భావాభావాలు వికారాలు

అష్టావక్ర ఉవాచ -

భావాభావ వికారశ్చ స్వభావాదితి నిశ్చయీ
నిర్వికారో గతక్లేశః సుఖేనైవోపశామ్యతి 99

భావాభావ వికారః=భావఅభావ వికారాలు మార్పులు; స్వభావాత్=స్వభా వల్లనే; ఇతి=ఇట్లని; నిశ్చయీ=నిశ్చయంగలవాడు; నిర్ వికారః=విశా రహితుడై; గతక్లేశః=కషాలు పోయినవాడై; సుఖేన=సుఖంగా; ఉపశామ్యతి శాంతిని పొందుతున్నాడు.

జనకమహారాజు పొందిన ఆత్మానుభవాన్ని అష్టావక్రమహర్షి అభినందిస్తున్నా

'భావాభావ వికారాలు స్వభావం జనిస్తాయి'. అని నిశ్చయ బుద్ధిగలవా వికారాలు క్లేశాలు ఏమీ ఉండవు- అట్టివాడే సుఖశాంతులు పొందుతాడు. చిత్తశాం ఆత్మజ్ఞానం వల్లనే కలుగుతుంది. మరొకదానివల్ల శాంతి సుఖం లభించదు. స్థూ సూక్ష్మ కార్యాలన్నీ మాయనుండియే ఉత్పన్నమవుతున్నాయి. మాయవల్లనే కా కార్యాలు జరుగుతున్నాయి. నిశ్చలమైన నిర్వికారమైన ఆత్మనుండి ఏ వికార పుట్టదు. సూదంటురాయి శక్తి వలన లోహంలో చలనం కలుగుతుంది. సూదం రాయిలో ఏ చలనమూలేదు. అలానే చైతన్య శక్తి కారణంగా మాయనుండి జగ కార్యాలు జరుగుతుంటాయి. చిత్‌శక్తి సూదంటురాయి వలె నిర్వికారం. నిర్మలం నిశ్చలం.

శరీరం సంగం, వికారం, నాశనశీలం, జడం. ఆత్మ అసంగం, అవికారం అవినాశి, చైతన్యశీలం. అలాంటి విశ్చయజ్ఞానం కలవాడు పరిశ్రమించకుండా పరప సుఖం పొందుతాడు. నిశ్చయాత్మకా బుద్ధిః బుద్ధిని సరిగా ఉపయోగిస్తే చక్క నిర్ణయం తీసుకొంటుంది.

## నిర్మాత

ఈశ్వర స్సర్వనిర్మాతా నేహాన్య ఇతి నిశ్చయీ
అంతర్గళిత సర్వాశః శాంతః క్వాపి న సజ్జతే 100

ఇహ=ఈ ప్రపంచం; సర్వ నిర్మాతా=సమస్త నిర్మాణం చేసేవాడు; ఈశ్వరః=ఈశ్వరుడు; న అన్యః=ఇతరుడెవ్వడూలేడు; ఇతి=ఇలా అని; నిశ్చయీ=నిశ్చయంగలవాడు; అంతర్గళిత సర్వాశః=అంతఃకరణలో నశించిన సమస్త ఆశలుగలవాడై; శాంతః=శాంతిని; క్వ అపి=ఎక్కడైనా కూడా; న సజ్జతే=ఆసక్తుడు కాడు.

ఈ విశ్వంలో సకలప్రపంచ నిర్మాత, సర్వ సృష్టికర్త ఈశ్వరుడు మరొక డెవ్వడూలేడు. అని నిశ్చయజ్ఞానం గల మహాత్ముడు అంతఃకరణంలో సర్వ ఆశలు విసర్జించి మరొక ఆసక్తి లేకుండా నిర్మల మనశ్శాంతి పొందుతాడు. ఆత్మ రెండు విధాలు. పరమాత్మ జీవాత్మ. పరమాత్మ ఉపాధి విరాడ్విశ్వం. జీవాత్మ ఉపాధి శరీరం. పరమాత్మోపాధి అపరిచ్ఛిన్నం. హద్దులు లేనిది అనంత జీవాత్మ శరీరం పరిచ్ఛినం. పరిమితం. అల్పం.

పరమాత్మ అంటే పరమేశ్వరుడు. ఈశ్వరుడు. ఈశ్వరుడు సర్వవ్యాపకుడు. సర్వేశ్వరుడు. మహాప్రభువు. ఈశ్వర శరీరం మాయ. మాయ చాలా పెద్దది. అందు వల్ల ఈశ్వరసృష్టి సర్వత్ర అనాయాసంగా అతివేగంగా జరిగిపోతూంటుంది.

## తృప్తితో ఉండు

ఆపదస్సంపదః కాలే దైవాదేవేతి నిశ్చయీ
తృప్త స్స్వస్థేంద్రియో నిత్యం న వాంఛతి న శోచతి 101

కాలే=కాలం కలిసివచ్చినప్పుడు; ఆపదః=ఆపదలు; సంపదః=సంపదలు; చ=మరియు; దైవాత్=దైవికంగానే; భవతి=కలుగుతున్నాయి; ఇతి=ఇలా అని; నిశ్చయీ=నిశ్చయ బుద్ధి గలవాడు; నిత్యం తృప్త=సదా సంతృప్తి గలవాడై; స్వస్థేంద్రియః=ఉపశమించిన ఇంద్రియాలు గలవాడై, న వాంఛతి=అప్రాప్తవస్తువులు కోరడు; న శోచతి=లేనిదానికి దుఃఖింపడు.

ఇట్టి నీవంటి జ్ఞానులు ఫలాకాంక్షారహితులై నిష్కామ్యంగా ఈ జ్ఞానకర్మ యజ్ఞం సాగిస్తుంటారు. ఈ కారణాలవల్ల వారికి కర్మ బంధం అంటదు. ఇంద్రియాహంకార రహితులకు కర్తృత్వ భోక్తృత్వ బుద్ధి కలుగదు. సాధారణ జీవులు సుఖ దుఃఖాలు ప్రారబ్ధవశంచేత అనుభవిస్తారు. యోగపుంగవులు ప్రారబ్ధ కర్మ బంధావధులు దాటి సత్కర్మలు అసత్ కర్మలు వదలి సుఖిస్తారు

## సు ఖీ శా ౦ త

చింతయా జాయతే దుఃఖం నాన్యథేహేతి నిశ్చయీ
తయాహీనః సుఖీ శాంతః సర్వత్ర గళిత స్పృహః 105

ఇహ = ఈ ప్రపంచంలో; చింతయా = చింతలచేతనే; దుఃఖం = దుఃఖాలు; జాయతే = పుట్టుతున్నాయి; అన్యథా = మరొక విధంగా; న = కాదు; ఇతి = ఇట్లని; నిశ్చయీ = నిశ్చయించుకొన్నవాడు; సుఖీ = సుఖవంతుడు; శాంతః = శాంతుడు; సర్వత్ర = అన్నివేళల అన్నిస్థానాలలోనూ; గళితస్పృహః = కోరికలు లేనివాడై; తయా = ఆ చింతలనుండి; హీనః = రహితుడౌతున్నాడు.

"చింతలవల్లనే దుఃఖం కలుగుతున్నది. దుఃఖానికి మరొక కారణంలేదు. చింత మానవుణ్ణి క్రుంగదీస్తున్నది"—అని తెలిసికొన్న జ్ఞాని జీవనం సరిదిద్దుకొని సుఖిస్తాడు. మానవుడికి చింత ప్రపంచంలో సాంసారిక యాతనల వలన ఆకాంక్షల వలన కలుగుతుంది. కోరికలను గూర్చి చింతించటమే చింతకు మూలం. తత్త్వ చింతన వలన సుఖమే కలుగుతుంది.

తత్త్వ చింతన వలన మానవుడు మాధవుడై మహనీయుడౌతాడు. ఆత్మ సుఖం అందుకొంటాడు. కనుక సాధనాపరుడు చింతారహితుడు కావాలి. చింతారహితుడికి అంతఃకరణం సుస్థిరంగా ఆనందమయంగా ఉంటుంది. 'చితి' చనిపోయిన తరువాత దేహాన్ని దహిస్తుంది. 'చింత' చనిపోకముందునుంచే శరీరాన్ని కాల్చివేస్తుంది. చింతవల్ల జీవి బ్రతికున్న శవం అవుతాడు. ఆ జీవి చింత లేకపోతే శివం అయ్యేవాడు పాపం!

ప్రారబ్ధవశం చేత ప్రాప్తమయ్యే దుఃఖాలను గూర్చి చింతించటం అజ్ఞాని లక్షణం. చింతను జయించినవాడు నిస్పృహుడు సర్వత్ర సంతోషంతో ఉంటాడు. చింతను జయించటానికి పరమౌషధం నిస్పృహత్వమే. అనగా దానిని గూర్చి పట్టించుకోని మనోనిబ్బరం. మనోనిశ్చలం. విషయాలను అపేక్షించకుండుటే దానికి తగిన దివ్యౌషధం. ఇది పరమ సుఖ సాధనం.

* *

అకాండ పాతజాతానాం అర్ద్రాశ్రీణాం మర్మభేదినామ్
గాఢశోక ప్రహారణాం అచింతైవ పరమౌషధమ్

## నాహం దేహః

నాహందేహో న మే దేహో బోధోఽహ మితి నిశ్చయీ
కైవల్యమివ సంప్రాప్తో న స్మరత్యకృతం కృతమ్ 104

అహం=నేను; న దేహః=ఈ శరీరంకాను; మే=నాకు; న దేహః= ఈ శరీరం లేదు; అహం=నేను; బోధః=శుద్ధ జ్ఞానస్వరూపుడను; ఇతి=ఇలా అని; నిశ్చయీ=నిశ్చయంగలవాడు; కైవల్యం=విదేహముక్తిని; సంప్రాప్తం= పొందినవాడై; అకృతం=చేయబడనిదానిని; కృతం=చేయబడినదానిని; న స్మరతి=స్మరింపడు.

నేను ఈ దేహాన్నికాను. ఈ దేహం నాదికాదు. నేను నిత్యబోధస్వరూపుడను అని నిశ్చయించుకొన్న జ్ఞానికి కైవల్యప్రాప్తికరతలామలకం. ఈ విదేహముక్తుడికి కృత్య అకృత్యస్మరణే ఉండదు. ఆ ఋషి ఆత్మానందంలో తన్మయుడై యుంటాడు. దేహ స్పృహ ఉన్నా లేనట్లుంటాడు. ఆ ఋషి కర్తకాదు భోక్తకాదు నిత్యానంద సమాధిమగ్నుడు. నిత్య సత్యమూర్తి. నిరహంకారి. నిరంజనుడు- ఆత్మ జ్ఞాన ప్రకాశంచేత చీకటి కారుమబ్బుల వంటి అస్థిర దేహేంద్రియాలను వాటి ప్రభావాలను దాటి జ్ఞాన భూమిక చేరుకొన్నాడు.

ఆ ఋషికి అహంకార మమకార అభిమాన గర్వాదులుండవు. దేహేంద్రి

యాదులు చేసే కృతాకృతాలు తన సంకల్పం లేకుండానే జరిగిపోతుంటాయి. ఆ మహర్షులకు కర్తవ్యాలు అకర్తవ్యాలు ఉండవు. వాటిని గూర్చి ఆలోచనే ఉండదు.

విదేహ కైవల్యం పొందినవాడివలె జీవన్ముడు కూడా కృత్యాకృత్యాలు స్మరింపడు. మహర్షుల ఆలోచనలు వేరు. ఆత్మానందం తప్పించి మరొక దానిమీదకు వారి మనస్సు పోదు.

ఒక ఉదాహరణగా ఒక కథ వినండి—

ఒక మఠంలో ఒక సాధుపుంగవుడు నివసిస్తున్నాడు. ఆ సాధువు ఆత్మ జ్ఞానంలో పడిపోయాడు. వయోవృద్ధుడూ అయినాడు. ఆ సాదువు దైహిక నిత్య కృత్యాలు కూడా నెరవేర్చుకోలేని స్థితిలో ఉన్నాడు. కొందరు శిష్యుల వంటివారు జోకి భోజనం పెట్టి స్నానం చేయించి కూర్చోబెట్టి సేవలు చేస్తున్నారు. ఆ తపస్వి ఆత్మ జ్ఞాన భూమికలు అధిగమించి సమాధి నిష్ఠుడవుతూండేవాడు.

ఒక మధ్యాహ్నవేళ వృద్ధ మహర్షి 'విశ్రాంతి తీసికొంటున్నాడు' అని వారు పనులపై పొరుగూరు వెళ్ళారు. ఆ వృద్ధుడు ఆత్మానందంలో తన్మయుడై సమాధిలో ఉండిపోయాడు. ఇంతలో మఠంలోనికి దుండగులైన పిల్లలు వచ్చి ఆటలు ఆడుతూ మహర్షికి రాళ్ళు తగులుతాయి అనే జ్ఞానం లేకుండా మహర్షిపై కూడా రాళ్ళు విసిరారు. ఆ రాతి దెబ్బలకు శరీరం చిట్లి నెత్తురు కారసాగింది శిష్యులు వచ్చి చూచి కన్నీరు పెట్టుకొని మందులువేసి కట్లు కట్ట జూచారు. ఆ మహర్షి ఇది గమనించి 'అలాంటి చికిత్సలు నా శరీరానికి ఏమీవద్దు' అని వారించారు.

మరికొన్ని రోజులకు ఆ గాయాలు సెలవేసి చీములుపట్టి పెద్దవైనాయి. అయినా ఆ మహర్షి చికిత్సకు ఒప్పుకోలేదు. మహర్షి ముఖం మాత్రం బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోతూంది. వారి శిష్యులు ప్రక్క-గ్రామంలోని ఒక మహాత్మునితో ఈ సాదువు సంగతి వివరించి చికిత్సకు సాధుపుంగవుని 'ఒప్పించండి' అని వేడుకొన్నారు.

ఆ మహాత్ముడు ఈ సాధువుంగవుడికి ఇలా ఒక లేఖ పంపాడు— "మహర్షులకు నమోవాకాలు. తమరు దేహమందిరాన్ని విస్మరించినట్లు విన్నాము. తమకు ఏమి చెప్పగలము? మనుష్యులున్నంతవరకు ఇల్లు శుభ్రంగా ఉంచుకోవలె కదా! .... ఇట్లు."

ఈ మహర్షి ఇది అందుకొని ఇలా ప్రత్యుత్తరం చెప్పి పంపాడు- "నమో వాకాలు. మనం తీర్థయాత్రలో ఉన్నాము. రాత్రులందు ధర్మశాలలందు బస చేస్తున్నాము. ధర్మశాలలు జీర్ణావస్థల్లో ఉన్నాయి. రాత్రి అయిపోయి తెల్లవారవచ్చింది. ప్రయాణం సాగించాలి. కానీ ధర్మశాలలను బాగుచేసుకొంటూ కూర్చోముకదా! .... ఇట్లు...."

ఇది జరిగిన కొద్ది రోజులలోనే ఆ సాధుపుంగవుడు దేహ త్యాగంచేసి జీవన్ముక్తుడైనాడు. మహాపురుషుల మనోనిశ్చయాలు ఇలా ఉంటాయి.

*　　*

యదా పంచావ అష్ఠంతే జ్ఞానాని మనసా సహ
బుద్ధిశ్చ నవిచేష్టతే తామాహుః పరమాంగతిమ్

మనస్సూ పంచేంద్రియాలూ విశ్రాంతిగా ఉండాలి. బుద్ధి భావనాతరంగరహితమై నిశ్చలంగా ఉండాలి. ఇలా చేయడమే మహోన్నత ఆత్మానుభవస్థితి.

—కఠోపనిషత్తు

## శుచి శ్శాంతః

ఆబ్రహ్మస్తంబ పర్యంతం అహమేవేతి నిశ్చయీ
నిర్వికల్పశ్శుచి శ్శాంతః ప్రాప్తాప్రాప్త వినిర్వృతః　　105

ఆబ్రహ్మస్తంబ పర్యంతం=బ్రహ్మ మొదలు తృణం వరకూ; అహం ఏవ=నేనే ఉంటున్నాను; ఇతి=ఇట్లని; నిశ్చయీ=నిశ్చయం గలవాడు; నిర్వికల్పః=సంకల్పరహితుడై; శుచి=నిర్మలుడై; చ=మరియు; శాంతః=శాంతుడై; ప్రాప్తాప్రాప్త వినిర్వృతః=ప్రాప్త అప్రాప్తాలకు సంతుష్టుడై; సుఖీ భవతి=సుఖి అవుతాడు.

విశ్వం నా స్వరూపం. విశ్వంలోగల బ్రహ్మం పదార్థం నేనే. తృణమూనేనే. సర్వం నేనే. సర్వంసహా నేనే. పంచభూతాలు కరాచరాలు అన్నీ నా అంశాలే. ఇదంతా నా స్వరూపంలోని భాగమే. నా స్వరూపం అనంతం. నేనే సర్వదేవతల

రూపాన్ని. ఆకాశం భూమి పాతాళం రూపసందాల్చి త్రివిక్రముణ్ణి అయినాను- అని నిశ్చయించుకొన్న మహాపురుషుడు విశ్వమయుడై వెలుగొందుతుంటాడు.

ఆ విశ్వయోగి శుద్ధుడు బుద్ధుడు శాంతుడు నిర్వికల్పుడు ప్రాప్తాప్రాప్తాదీ నివృతుడు ఆ పురుషోత్తముడు. లాభాలాభాలు పరిగణింపడు. ఆ యోగి నిర్వికల్ప సమాధిలో నిత్యం విరాజిల్లే జీవన్ముక్తుడు. విషయ వాసనా మల జాడ్య రహితుడు. అతడు ఇచ్ఛా త్యాగశీలి. అతడు పరమ సంతోషి. అతులిత ఆత్మానంద పరిపూర్ణుడు. నిశ్చల అంతఃకరణుడు.

* *

అచింత్యావ్యక్త రూపాయ నిర్గుణాయ గుణాత్మనే
సమస్త జగధాధార మూర్తయే బ్రహ్మణేనమః

## ఈ విశ్వం

నానాశ్చర్య మిదం విశ్వం న కించిదితి నిశ్చయీ
నిర్వాసనః స్ఫూర్తిమాత్రో న కించిదివ శామ్యతి 106

ఇదం విశ్వం=ఈ ప్రపంచం; నానా=అనేక విధాలైన; ఆశ్చర్యం=ఆశ్చర్య విషయాలతో కూడినది; న కించిత్=మరేమీలేదు; ఇతి నిశ్చయీ=ఇట్లని నిశ్చయం గలవాడు; నిర్వాసనః=వాసనారహితుడై; స్ఫూర్తిమాత్రః=కేవలం జ్ఞాన స్ఫూర్తి మూర్తీభవించినవాడై; న కించిత్ ఇవ=లోకరీతులు ఏమీ పట్టించుకోనివాడై; శామ్యతి=శాంతిని పొందుతున్నాడు.

"నానా ఆశ్చర్యాలు కలుగజేసే ఈ విచిత్ర విశ్వం అంతా మిథ్య" అని నిశ్చయించుకొన్న బ్రహ్మజ్ఞాని వాసనారహితుడై రాణిస్తాడు.

కార్య కారణ ఉపాధి నిర్ముక్తుడై ఆ మహాజ్ఞాని ఆత్మానందంలో తన్మయుడై యుంటాడు. బోధస్వరూపం సర్వం తెలిసి స్ఫూర్తి కలిగి విశ్వాన్ని స్వప్నంగా తలంచి మనశ్శాంతిని ఆత్మశాంతిని అనుభవిస్తాడు.

సకల జగదధిష్ఠానం పరమాత్మ. ఆ పరమాత్మ సాక్షాత్కారం కలిగినపుడు

ఈ విచిత్ర విశ్వం మిథ్య అని తెలుస్తుంది. అపుడు ఆత్మ కంటే వేరైన వస్తువు ఏదీలేదని తేలిపోతుంది సర్వత్ర స్వస్వరూపం సాక్షాత్కరిస్తుంది.

ఈ దృశ్య జగత్తు మిథ్య అని చూచి తేలిపోయిన విషయ పరిజ్ఞానానుభవాన్ని 'బాధ' అంటారు. అది లయస్థితి. అపుడు ఆత్మజ్ఞానిలోని సర్వ సంకల్ప వికల్పాలు లయమవుతాయి. నాశం రెండు రకాలు. 1. బాధారూపనాశం 2. నివృత్తి రూప నాశం. ఉపాదాన కారణ సహితంగా జరిగే కార్య నాశనం 'బాధ'. ఉపాదానం విద్య మానమవుతూ జరిగే కార్య నాశనం 'నివృత్తి'.

బ్రహ్మజ్ఞాని జగత్తు యొక్క విభ్రమాశ్చర్యాలు చిత్ర విచిత్ర చర్యలు చూచి పరికించి ఆలోచించి ఇది అంతా మిథ్యకదా! బ్రహ్మసత్యం జగన్మిథ్య. జగచ్ఛక్తి హీనమైనది బ్రహ్మశక్తితో ఇది ప్రకాశిస్తున్నది. సత్యంగా భాసిస్తున్నది. కానీ ఈ జగత్తు వాస్తవంకాదు. బ్రహ్మం ఒక్కటే త్రికాల సత్యం. మిగిలిన ఈ కనిపించే వన్నీ మిథ్యా ప్రతిబింబాలు. ఆత్మశక్తి కంటే అన్యశక్తి దృశ్య వస్తువులకు లేదు. అని బ్రహ్మభావంతో నిర్ణయించుకొంటాడు.

* *

"వైరాగ్యం అంటే కర్మలు విసర్జించటంకాదు. ఇల్లువాకిలీ విడిచి అడవిలో గుహలో నివసించటం కాదు. కేవలం కర్మత్యాగం ఎన్నటికీ వైరాగ్యం అనిపించు కోదు. విషయవాంఛలు తగ్గించుకోవటమే వైరాగ్యం అనిపించుకొంటుంది. ఇట్టి వైరాగ్య లబ్ధికి రామాయణాది గ్రంథాలు తోడ్పడతాయి. రాముడు త్యాగపురుషుడు. "త్యాగేనైకే అమృతత్వమానశుః" అధికారం పొందటానికి సర్వశక్తి సామర్థ్యాలు ఉండిననూ దానిని త్యాగం చేశాడు ఆనాడు రాముడు."

—శ్రీ సత్యసాయిబాబా

# ఆత్మనిష్ఠ

## కాయం-వాక్కు-మనస్సు

జనక ఉవాచ -

కాయకృత్యాసహః పూర్వం తతో వాగ్విస్తరాసహః
అథ చింతాసహస్తస్మాత్ ఏవ మేవాహమాస్థితః 107

పూర్వం=ఇదివరకురోజులలో; కాయకృత్య అసహ=శారీరక కర్మలు సహింపనివాడనై; తత=తరువాత; వాగ్విస్తర అసహ=జతతప నిందాస్తుతులు ప్రశంసలు సహింపనివాడనై: అథః=అటు తరువాత; చింత అసహ=మానసిక కర్మలు ఊహలు కూడా సహింపనివాడనై ఉండసాగాను; తస్మాత్=అకారణంవల్ల; అహం ఏవ=నేను ఆత్మ నిష్ఠుడనై: అస్థితః=ఉండసాగాను.

తనను అభినందించిన అష్టావక్రమహర్షితో జనకమహారాజు ఇలా అంటున్నాడు ఆచార్యదేవా! మహానుభావా! శారీరక కృత్యాలు చేసి చేసి సహించలేక క్రమ క్రమంగా త్యజించాను. తరువాత వాచక జపతపాదులు కూడా ఇలానే వదలిపెట్టాను. చివరికి చింతన మానసిక కార్యాలు కూడా సన్యసించాను. ఈ కారణంగా నేను ఇప్పుడు సుస్థితంగా ఉన్నాను.

స్వామీ! ప్రథమంలో శరీరధర్మాలు అని ఉపవాసాలు జపాలు చేశాను. యజ్ఞాలు చేశాను. పెద్దపెద్ద క్రతువులు నిర్వహించాను. ప్రదక్షిణలు చేశాను. శరీరం శుష్కింపజేశాను. కర్మ జంజాటంలోపడి ఆత్మానందం అందుకోలేకపోయాను. అవి ఆత్మకు సహాయకారి కావు అని గ్రహించాను. అందువలన ఆ కృత్యాలు మాని వేశాను.

గురుదేవా! మరికొన్నినాళ్ళు సంకీర్తనలు గావించాను. భాష్యాలు వివరించాను భాషా విశేష విన్యాసాలు ఉచ్ఛస్వరం ఉపన్యసించాను. కథా గానాలు చేశాను. శతఘంట అవధానాల వంటివి అనేకం. జిగీష పెరిగి నిందాస్తుతులతో వాటిని వ్యర్థ పరచాను. అవి కూడా ఆత్మను ఆనందపరచలేక పోయాయి. అందుచేత వాటిని విరమించాను.

ఆచార్యవర్యా ! అదే రీతిలో మానసిక స్థితి మారుతూ వచ్చింది. లోగడ ఏవో ఏవో తలంపులు-ఆలోచనలు. ఆరాటాలు. ఆందోళనలు. ఏవో చేయాలని సంకల్పాలు. అవి కూడా ఆత్మకు తృప్తి కలిగించలేకపోయాయి అందుచేత వాటిని సంకల్పించటమే త్యజించాను.

క్రమంగా కాయక వాచక మానసిక కార్యకలాపాలు నన్ను వదలిపోయాయి. ఇవి అన్నీ విడనాడిన తరువాత నాకు శాంతి కలిగింది. అప్పుడు ఆత్మానందం రుచి చూచాను. ఇప్పుడు ఆనంద స్థితిలో స్థిరపడ్డాను. నిర్వ్యాపారంలోనే నిర్మలానందం ఉంది. స్వస్వరూప నిరతుడనై నిశ్చలానందం అనుభవిస్తున్నాను.

## ని ర్వ్యా పా ర త

ప్రీత్యభావేన శబ్దాదేః అదృశ్యత్వేన చాత్మనః
విక్షేపైకాగ్ర హృదయః ఏవమేవాహ మాస్థితః 108

శబ్దాదేః=శబ్దాదులయొక్క; ప్రీతి అభావే=ప్రీతి లేకపోవటం వల్ల ; ఆత్మనః=ఆత్మ; అదృశ్యత్వేవ=అదృశ్యమవటంచేత; విక్షేప ఏకాగ్రహృదయః= విక్షేపాలనుండి ఏకాగ్రహృదయుడనై ; అహం=నేను ఆత్మరూపుడనై ; ఏకంఏవ= ఈ ప్రకారంగా సంకల్పరహితంగా; ఆ స్థితః=ఉంటున్నాను.

గురువర్యా ! ఇపుడు నా స్థితి చాలాబాగుంది. పూర్వం నాకు శబ్ద సౌందర్యం శైలీమాధుర్యం ప్రాణతుల్యంగా ఉండేది. శబ్దవిన్యాసాలు రాజ్యం చేసేవి. ఇపుడు కవితాప్రీతి తగ్గి అంతస్సౌందర్యం లక్షిస్తున్నది. శబ్దాలంకార మమకార వ్యామోహం వదిలిపోయింది. అలానే వాగాడంబరం, భావాడంబరం కూడా పోయింది.

ఆత్మ అదృశ్యం. అన్నిటికీ మూలం. ఈ కాయక వాచక మానసిక కర్మలు మనస్సు ఏకాగ్రత విషయంలో విక్షేపాలు కలుగజేస్తాయి. స్వర్గలోకం మరో లోకం ప్రాప్తించాలనీ, ఉత్తమగతులు కలగాలనీ, పుణ్యఫలాలు దక్కాలనీ చేసే యజ్ఞ యాగాలు రాజసూయాదియాగాలు. పుణ్యక్రతువులూ చాంద్రాయణాది వ్రతాలు అష్టాంగయోగాదులు ఈ మొదలైన కర్మ కలాపాలు శారీరక విక్షేపాలకు మూలాలు.

శరీరంలో విక్షేపాలు కలగటం వలన మనో నిశ్చలత కుదరదు. మనస్సు చలిస్తుంది. మనో ఏకాగ్రత కొరవడుతుంది.

నిందాస్తుతుల వలన వాక్‌శక్తి వ్యర్థమై మనోబలం క్షీణిస్తుంది. మనోనిరోధక శక్తి కోలుపోవలసివస్తుంది. మనోధర్మాలైన జప తపాదులుకూడా మానసిక విక్షేపాలకు మూలకారణాలే. ఆసనాదికాయిత విక్షేపం జపతపాదీ వాచక విక్షేపం. ధ్యానాది మానసిక విక్షేపం లేకుండా యోగినై భద్రపడ్డాను.

ఆత్మానందంలో మగ్నమైయున్నాను. ఇపుడు నాకు ఏ విధమైన విక్షేపాలు లేవు. స్వస్వరూపంలో సుస్థితుడనైయున్నాను.

*  *

శీలంబు-మైత్రి-కరుణ-అ
లోలుపభావము-తితిక్ష-లోనగు మునిలో
కాలంబనీయ సద్గుణ
జాలంబు దమంబు రూపసంపద నధిపా!

—తిక్కన (భారత-శాంతిపర్వం)

## విక్షేపమూ లేదు-సమాధీ లేదు

సమాధ్యాసాది విక్షేపౌ వ్యవహారః సమాధయే
ఏవం విలోక్య నియమం ఏవ మేవాహమాస్థితః 109

సమాధ్యాసాది విక్షేపౌ=అధ్యాసాదుల వలన విక్షేపం కలుగుట వలన; సమాధయే=సమాధి కొరకు; వ్యవహారః భవతి=వ్యవహారం జరుగుతున్నది; ఏవం=ఇటువంటి; నియమం=నియమం; విలోక్య=విలోకించి; ఏవమేవ= ఇలానే సమాధిరహితుడనై; అహం=నేను; ఆస్థితః=ఉంటున్నాను.

స్వామీ ! సమ్యక్ అధ్యాసాదులకు విక్షేపాలు కలుగుతుంటే సమాధి వ్యవహా

రాలు అవసరం. కానీ నాకు అనవసరం. ఈ నియమాలెరిగి సమాధి రహితుడనై నాను. సుస్థిరంగా ఉన్నాను.

కర్తృత్వ భోక్తృత్వాది అనర్థాల కారణంగా అధ్యాసాది విక్షేపాలు జరుగు తుంటాయి. ఆ విక్షేప దోషాలు దూరం చేసికొనటానికి సమాధి నిష్ఠలు మనో నియ మాలు మొదలైన వ్యవహారాలు ఆచరించాలి. కానీ విక్షేపమే లేనప్పుడు ఇవి అవ సరం లేదు. ఈ సంగతి తెలిసే మొదటలోనే అధ్యాసాన్ని దూరం చేసికొన్నాను కాయక వాచిక మానసిక ప్రయత్నాలు అవసరం అనిపించలేదు. సమాధి రహితంగా ఆత్మజ్ఞానానందంలో స్థిమితంగా ఉండిపోతున్నాను.

ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైక గోచరా
నివాతదీపవ చ్చిత్తం సమాధి రభిధీయతే

ధ్యాతృధ్యానాలు విడిచి బ్రహ్మంపై చిత్తం నివాత దీపశిఖవలె నిలపటమే సమాధి. సమాధి అంటే ఒక యోగం. ఆత్మజ్ఞాని ఆ స్థితిని దాటి చిద్రూపంలో సుస్థిరుడు కావాలి. ఆ స్థితి ఉత్తమం—అని వేదాంత పంచదశి చెప్తున్నది.

సమాధి సమాధి కొరకేకాని ఆత్మావలోకన హేతువుకాదు. సమాధి కొంత వరకే అవలంబనీయం. అధ్యాస అంటే అసత్యదర్శనమే. త్రాడును చూచి పాము అనుకొనుట అసత్యారోపణమేకదా ! అట్టిదే ఆత్మయందు జగత్తును ఆరోపించుట.

ధ్యాన ధారణ సమాధులు యోగాభ్యాసంలో ముఖ్యమైన మూడు దశలు. ఈ దశలలో చిత్తం సత్యాన్ని నిరసించి అసత్యధారణచేసే ప్రమాదం ఉంది. అందుకని ఆత్మజ్ఞాని సమాధిశూన్యుడై ఆత్మ తాదాత్మ్యస్థితిలో ఉంటాడు. యోగశాస్త్రం ప్రకారం హఠయోగం రాజయోగం లయయోగం అని మూడు యోగ మార్గాలు న్నాయి. ఇందులో లయయోగం వైరాగ్యసిద్ధిప్రదం కదా! ఇది సుసాధ్యం కూడా. రాజయోగం హఠయోగం ఇంత సులభంకాదు. ఇవి సాధనలేకాని ఆత్మానుభవ హేతువులు కావు. ఇపుడు ఆత్మజ్ఞానస్థితి పొందగలిగాను.

*　　　　*

"మనస్సు అన్నది వేరేలేదు సంకల్పముల సమూహమే మనస్సు."

—శ్రీ సత్యసాయిబాబా

## హే యో పా దే యం లే దు

హేయోపాదేయ విరహాత్ ఏవం హర్ష విషాదయోః
అభావాదద్య హేబ్రహ్మన్! ఏవమేవాహ మాస్థితః 110

హే బ్రహ్మన్=ఓ పరబ్రహ్మమూర్తీ; హేయ ఉపాదేయ=త్యాజ్య గ్రాహ్యములయొక్క; విరహాత్=వియోగం వలన; ఏవం=ఇట్లే; హర్ష విషాదయోః=హర్ష విషాదాలయొక్క; అభావాత్=అభావం వలన; అద్య= ఇప్పుడు; అహం=నేను; ఏవం ఏవ=యథార్థరూపుడుగా; ఆస్థితః=ఉంటున్నాను.

ఆచార్యా! బ్రహ్మదేవా! హేయ వస్తువులు ఉపాదేయప్రీతి వస్తువులు ఉన్నా పోయినా ఆలానే హర్షాలు విషాదాలు ఏవి ప్రాప్తించినా దిగులూలేదు. సంతోషమూ లేదు. ఇపుడు సుస్థిరంగా ఉంటున్నాను. ఆత్మానందమే అనుభవిస్తున్నాను. నేను పూర్ణాత్మదర్శిని.

నాకు ఏదీ త్యాజ్యమూలేదు. ఏదీ గ్రాహ్యమూలేదు. ఆత్మజ్ఞానం ప్రాప్తించిన తరువాత సమస్థితి లభిస్తుంది. ఇక హర్ష విషాదులు లేవు. నేను స్వస్వరూపంలో రమిస్తున్నాను. హేయవస్తువులు నీచమైనవి అవి పోతేనే సంతోషం-ఇపాదేయ వస్తువులు అనుభవించదగినవి ఆనందకరమైనవి. అవి ప్రాప్తిస్తే మహాసంతోషం. అది పోతే విషాదం ఇది లోకరీతి. స్వస్వరూపస్థితి గల ఋషికి హర్ష విషాదాలు రెండూ సమానం. ప్రాప్తాప్రాప్తవులను గూర్చి సంతోష విషాదాలు పొందరాదు. నేను పరిపూర్ణ ఆత్మదర్శిని.

* *

గుహయందు నిహితమనియెదు
మహనీయబ్రహ్మ పదము మహిత దమత్వో
పహతుండగువానికి స
న్నిహితంబని చెప్పుదురు మనీషి జనంబుల్

—తిక్కన (భారతం-శాంతిపర్వం)

## స్వ స్వ రూ ప ం

అశ్రమానాశ్రమం ధ్యానం చిత్త స్వీకృత వర్జనమ్
వికల్పం మమ వీక్ష్యైతైః ఏవమేవాహ మాస్థితః 111

ఆశ్రమానాశ్రమం=ఆశ్రమ అనాశ్రమాలను; ధ్యానం=ధ్యానాన్ని: చిత్త స్వీకృత వర్జనం=చిత్తంచేత స్వీకరించబడిన వస్తుత్యాగ చర్యనూ; మమ=నా యొక్క; వికల్పం=వికల్పస్థితినీ; వీక్ష్య=చూచి; అహం=నేను; ఏవం ఏవ= ఈ మూడింటికంటె భిన్నుడనై; ఆస్థితః=ఉంటున్నాను,

మహాత్మా ! వివిధ ఆశ్రమ ధర్మాలు-అనాశ్రమ ధర్మాలు-ధ్యానాదులు-చిత్తం స్వీకరించిన వస్తుజాలమూ త్యజించాను. వీటి వలన జనించే వికల్పాలు గమనించాను. ఇక త్రివిధ ఆశ్రమాది బంధాలనుండి వీడి స్వేచ్ఛావిహారినైనాను. ఆత్మభూమికపై సుస్థిరంగా ఉన్నాను.

గురుదేవా ! ఆశ్రమాలు ప్రధానంగా నాల్గు విధాలు. బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థసన్యాసం. వీనికి ధర్మాలు అనేకం. అనాశ్రమాలు ఈ ఆశ్రమాలు కాక యతి అవధూత పరమహంస మొదలైనవి. ఈ అనాశ్రమ ధర్మాలు కూడా అసంఖ్యాకం. ధండ ధారణాది ధర్మాలు. ఈ ఆశ్రమ అనాశ్రమధర్మాలు త్యజించాను. యోగుల ధర్మాలైన ధ్యాన జపతపాదులు కూడా విర్జించాను. ఇవి అన్నీ అజ్ఞానులకు ఏర్పడినాయి.

శరీర ఇంద్రియాదులకు భిన్నమైనదీ- శరీరాదులకు సర్వసాక్షియైనదీ- విజ్ఞాన మయమైనదీ- సుఖస్వరూపమైనదీ- స్వయంప్రకాశమానమైనదీ- పారమార్థికమైనదీ- పరమూ- తత్త్వమూ ఐన తన ఆత్మను గుర్తించిన మహాపురుషుడు 'అతివర్ణాశ్రమి' అని పెద్దలు భాషిస్తారు.

అన్ని వర్ణాశ్రమాల కంటె ఆత్మజ్ఞాని గొప్ప. ఆ పురుషుడు సర్వసాక్షి. చిద్రూపుడు అట్టి ధ్యానధారణ సమాధి విధానాలు. సంకల్పాలు లేని స్థితిని అందాను.

# కర్మ రాహిత్యం

కర్మానుష్ఠాన మజ్ఞానాత్ యథైవో పరమ స్తథా
బుధ్వా సమ్యగిదం తత్త్వమ్ ఏవమేవాహ మాస్థితః 112

యథా=ఏవిధంగానయితే; కర్మానుష్ఠానం=కర్మాచరణ; అజ్ఞానాత్=అజ్ఞానం వలన; భవతి=జరుగుచున్నదో; తథా=అట్లే; ఉపరమః ఏవ=కర్మ త్యాగం కూడా; ఇదం తత్త్వం=ఈ తత్త్వం జరిగింది; సమ్యక్=బాగుగా; బుధ్వా=తెలిసికొని; అహం=నేను; ఏవంఏవ=కర్మ చేయుటలోని ఇచ్ఛ త్యజించి; అస్థితః=ఉంటున్నాను.

ఆచార్యోత్తమా ! కర్మానుష్ఠానం అజ్ఞానజన్యం. అలానే కర్మ త్యాగంకూడా. కర్మానుష్ఠానమూ, కర్మ త్యాగమూ వదలి సమ్యక్ జ్ఞాన జన్యమైన బుద్ధితో నేను నిర్ణయం తీసికొని నిష్కామ్యంగా నిరపేక్షంగా నిశ్చలంగా ఆత్మానందంలో మగ్నమై యుండిపోయాను.

కర్మానుష్ఠానం అజ్ఞానులు చేస్తారు. వారికి ఆత్మస్వరూపం గూర్చి యథార్థ జ్ఞానంలేదు. వారు స్వర్గప్రాప్తికై ఈ కర్మకాండ ఆచరిస్తారు. ఆత్మజ్ఞానం వల్లనే కర్మ జంజాట విముక్తి కలుగుతుంది.

ఆత్మ సాక్షాత్కారం కలిగిన తరువాత కర్మలు చేసినా కర్మలు త్యజించినా ఒక్కటే. ప్రారబ్ధవశంగా దైహిక కర్మలు జరుగుతూంటాయి. దైవ వశాత్తు ఆగిపోతుంటాయి. ఆత్మజ్ఞాని ఇవి లక్షించకుండా సత్యమైన నిత్యానంద స్వరూపంలో సుస్థిరంగా ఉంటారు

* *

జలమున మీను-ఉదుంబర
ఫలమున మశకములబోలె ప్రకృతిం దాని
మ్ముల నునికి తెలిసి వేర్పా
టలవరచిన పురుష డవ్యయత్వము పొందున్

—తిక్కన (భారతం-అనుశాసనికపర్వం)

## భా వ నా ర హి త ం

అచింత్యం చింత్య మానోఽపి చింతారూపం భజత్యసౌ
త్యక్త్వా తద్భావనం తస్మాత్ ఏవమేవాహ మాస్థితః 113

అచింత్యం=చింతింపశక్యంగాని బ్రహ్మాన్ని; చింత్య మానోఽపి=చింతిస్తున్నవాడై; అసౌ=ఈ పురుషుడు; చింతారూపం=చింతారూపాన్ని; భజతి=పొందుతున్నాడు; తస్మాత్=ఆ కారణం వలన; తద్భావనం=ఆ చింతితభావాన్ని; త్య క్త్వా=విడిచి; అహం=నేను; ఏవమేవ=భావనారహితుడనై మాత్రమే; ఆ స్థితః=ఉంటున్నాను.

గురుమహేశ్వరా ! అచింత్యమానుడైన పరబ్రహాన్ని గూర్చి చింతన చేస్తూ ఈ పురుషుడు చింతారూపం వదులుకోలేకపోతున్నాడు. ఇది గమనించి ఈ చింతా భావనం త్యజించాను. నేను చింతాభావనారహితుడనైనాను. ఆత్మజ్ఞానంలో సుస్థితుడనైనాను.

బ్రహ్మం అచింత్యం. మనో వాక్కులకు అందని తత్త్వం పరబ్రహ్మంది. అది ఆత్మవర్గం. అచింత్యరూపం. చింతనం చేస్తున్నాము అంటే అది అవివేకం. చింతన అనే చింత త్యజించి భావనారూపచింతనాన్ని వదులుకొన్నాను. ఆత్మలోనే మగ్నమై స్థిరమై స్థితమై ఉండిపోయాను.

యతి-అవధూత-సన్యాసి-పరమహంస ఇత్యాది ఆశ్రమ ధర్మపాలన వలన కాయిక విక్షేపం— జపతపాదులవల్ల వాచిక విక్షేపం— ధ్యాన ధారణాదులవల్ల మానసిక విక్షేపం— మొదలైన చంచల విక్షేపాలు కలుగుతుంటాయి. కనుక ఈ త్రివిధ విక్షేపలక్ష్యాలు కలుగకుండా నిశ్చలంగా కేవలం పరిపూర్ణ ఆత్మపీఠమందే లక్ష్యముంచటం అచింత్య బ్రహ్మభావనం, చింతారహితంగా అచింత్య బ్రహ్మాన్ని చింతించాలి. పరమాత్మ ఎలాంటి భావాభావజాలానికి తగలనివాడు. అది పరిపూర్ణ వస్తువు. నిర్మలమైన ఆ పరిపూర్ణ పరబ్రహ్మపదార్థం నేనే.

## ప రి పూ ర్ణా వ స్థ

ఏవమేవ కృతం యేన స కృతార్థో భవేదసౌ
ఏవమేవ స్వభావో యః స కృతార్థో భవేదసౌ 114

యేన=ఎవనిచేత; ఏవమేవ=ఇలాక్రియారహితంగా; సాధనవశాత్= సాధన మూలంగా; కృతం=చేయబడినది; సః అసౌ=అట్టి ఇతడు; కృతార్థః= కృతార్థుడుగా; భవేత్=అగును; యః=ఎవడు; ఏవమేవ=ఈ ప్రకారం స్వతస్సిద్ధంగానే; స్వభావః=స్వభావంగలవాడవుతున్నాడో; సః=అతడు; కృతార్థః=కృతార్థుడు; భవేత్=అవుతున్నాడు.

మహామహోపధ్యాయా ! 'ఏవమేవ' అనేది పూర్ణావస్థ అట్టి స్థితిలో సర్వ క్రియారహితుడై స్వరూప సాధనాభ్యాస పరుడైనవాడు కృతార్థుడు. ఇలాంటి పరి పూర్ణ స్వతస్సిద్ధమైన స్వభావంగలవాడు కృతకృత్యుడు. ధన్యుడు. అలాంటి నిశ్చల నిర్మల సంపూర్ణ క్రియారహితుడై స్వస్వరూప జ్ఞానంగలవాడు ఉత్తమోత్తమ యోగీశ్వరుడు కదా స్వామీ! వాడే జీవన్ముక్తుడు. ఆ స్థితి అందుకొన్నాను స్వామీ !

సాధనచేపి క్రమంగా సంపూర్ణ దేహేంద్రియక్రియలు పరిత్యజించి ఆత్మానం దానుభవం పొందినవాడు జీవన్ముక్తుడు. ఆ దశలో ఉన్నాను దేవా!

# యథా సుఖం

## ఆసక్తి రాహిత్యం

జనక ఉవాచ -

అకించన భవం స్వాస్థ్యం కౌపీనత్వేఽపి దుర్లభమ్
త్యాగాదానే విహాయాస్మాత్ అహమాసే యథా సుఖమ్ 115

అకించన భవం=బ్రహ్మతప్ప అన్యం లేదనెడి విచారణ వలన జనించిన; స్వాస్థ్యం=చిత్త స్థైర్యం; కౌపీనత్వేఽపి=కౌపీన ధారణం చేసిననూ; దుర్లభం= అసాధ్యం; అస్మాత్=ఈ కారణంగా; త్యాగ ఆదానే=త్యాజ్యగ్రహణాలు; విహాయ=విడిచి; అహం=నేను; యథా సుఖం=సుఖం పూర్వకంగా; ఆసే= ఉంటున్నాను.

పరమ గురుమూర్తీ ! ఏవమేన అవస్థాదశకు ఫలంగా సుఖావస్థ వివరిస్తు న్నాను స్వామీ! 'నేతి నేతి' ఇదికాదు ఇదికాదు అనే విచారధార నుండి జనించిన చిత్త స్వాస్థ్యం కౌపీనధారణ చేసేవారిలో కూడా దుర్లభమైపోయినది ఈ కారణంగా త్యాగ స్వీకారాలు విసర్జించి నేను సుఖంగా ఉన్నాను.

విషయములందుగల ఆసక్తిని త్యజించటానికి చిత్తానికి స్వాస్థ్యం ఉండాలి. ఆ స్వాస్థ్యం సుస్థిరతకు బలం. కనుక పదార్థ స్వీకృతి తిరస్కృతి ఎడల గల వాంఛను వదులుకొంటున్నాను. ఆత్మానందంలో మగ్నమై ఉన్నాను.

* *

"యథా న జాయతే కించిత్ జాయమానం సమంతః...."

—మాండూక్యోపనిషత్తు

## మనో వాక్క్రియా రాహిత్యం

కుత్రాపి ఖేదః కాయస్య జిహ్వా కుత్రాపి ఖిద్యతే
మనః కుత్రాపి తత్త్యక్త్వా పురుషార్థే స్థితః సుఖమ్ 116

కుత్రాపి=ఒకచో ఒక విషయం గూర్చి; కాయస్య=శరీరానికి; ఖేదః= దుఃఖం; కుత్రాపి=ఒకచో మరొక విషయం గూర్చి; జిహ్వా=నాలుక; ఖిద్యతే= లాలస పడి దుఃఖిస్తున్నది; కుత్రాపి=ఒకచో వేరొక విషయంగూర్చి; మనః= మనస్సు; ఖిద్యతే=దుఃఖిస్తున్నది; అతః=ఈ కారణం వలన; తత్=ఆ మూడింటినీ; త్యక్త్వా=విడిచి; పురుషార్థే=పరమ పురుషార్థమైన ఆనందంలో; స్థితః=ఉంటున్నాను.

ఆచార్యవర్యా ! ఒక్కొకసారి ఒక్కొకచోట దైహికదుఃఖాలు మరొకసారి వాచిక దోషాలు పైఫల్యాలు ఆడంబరాలు- ఇంకొకసారి మానసిక శోభలు ఖేదాలు ఇవి భరించి భరించి విసిగి వేసారి ఈ త్రివిధ వ్యధలు పరిత్యజించి ఏ బాధ మనసున కంటనీయక ఇపుడు చాలా సుఖంగా ఉన్నాను.

దైహిక కృత్యాలు గమించటం. శ్రమించటం నిద్రించటం. మేలుకొని యుండటం స్వీకరించటం తిరస్కరించటం ఈ మొదలైనవి శరీర కర్మలు దుఃఖ జనకాలు. జిహ్వాదోషాలు అసత్య భాషణలు ప్రగల్భాలు కఠినోక్తులు మిథ్యావాదాలు ప్రశంసలు అప్రశంసలు వాగ్యుద్ధాలు ఈ మొదలైనవి జిహ్వాఖేద కారణాలు. వాచిక కర్మలు జిహ్వకు బాధాకరాలు.

మనోవ్యధలు సంకల్పాలు వికల్పాలు ధ్యానాలు ధారణాదులు కోరికలు ఆశయాలు ఆకాంక్షలు ఈ మొదలైనవి క్లేశ ప్రేరకాలు. కనుక ఇవి త్యజించి ఆత్మ సుఖంలో స్థిరపడ్డాను. ధానాదికర్మలు మానసిక వ్యధామూలకాలు. కనుక ఈ మూడు విధాలైన కర్మలు త్యాజ్యాలే సుమా!

## కర్మ జంజాటం

కృతం కిమపి నైవస్యాత్ ఇతి సంచింత్య తత్త్వతః
యథా యత్కర్తుమాయాతి తత్కృత్వాఽసే యదా సుఖమ్ 117

కృతం=శరీరాదులచే చేయబడిన కర్మ; కిమపి=ఏ కొంచం కూడా; ఆత్మ కృతం=ఆత్మవలన చేయబడినది; నైవక్యాత్=కానేకాదు; ఇతి తత్త్వతః=ఇలా అని యథార్థం; సంచిత్య=విచారించి; యేనా యత్=ఎప్పుడు ఏ కొంచమైన కర్మనైన; కర్తుం=చేయుటకు; ఆయాతి=అవసరం కల్గుతున్నదో; తదా తత్= అప్పుడు దానిని; కృత్వా=చేసి; యథా సుఖం ఆసే=సుఖపూర్వకంగా ఉంటున్నాను.

మహర్షి ! శరీర కృతాలైన కర్మలు వాస్తవంగా ఆత్మకృతాలుకావు. అని తత్త్వదృష్టితో యోచించి దైహిక ధర్మాలు కార్యాలు ఆత్మదృష్టితో కాకుండా నెర వేరుస్తూ ఆత్మ తత్త్వజ్ఞానంలో సుఖినై సుస్థిరంగా ఉండిపోతున్నాను.

శరీర ఇంద్రియ కృత్యాలు ఆత్మకృత్యాలు కావు. ఇలా చింతనచేసి అన్న పానాలు నిత్యకృత్యాలు అహంకార రహితంగా నిష్కామంగా కర్తృత్వరహితంగా తాను చేయకుండా తన ప్రమేయం లేకుండా జరిగిపోతుంటాయి.

## నైష్కర్మ్యం

కర్మ నైష్కర్మ్య నిర్బంధ భావాదేహస్థ యోగినః
సంయోగాయోగ విరహాత్ అహమాసే యథా సుఖమ్ 118

కర్మ నైష్కర్మ్య నిర్బంధ భావాః=కర్మల యొక్క నైష్కర్మ్యముల యొక్క బంధన మిశ్రిత భావపరులు; దేహస్థయోగినః=దేహశక్తి గల యోగులుగా ఉన్నారు (కనుక); అహం=నేను; సంయోగ వియోగ=దేహసంయోగ వియోగాదులు; విరహాత్=విడిచిపైచి; యథా సుఖం=సుఖ పూర్వకంగా; ఆసే=ఉంటున్నాను.

దేహభ్రాంతి గలవారలకు అహంకార మమకార వ్యామోహాలు గలవారలకు

ఇది సత్కర్మ. ఇది చేయతగింది. ఇది దుష్కర్మ: ఇది చేయతగనిది. ఇదీ నైష్కర్మ అని భేదాలు వాదాలుంటాయి. ఇచ్ఛలు పనిచేస్తుంటాయి. దేహభ్రాంతి లేనివారికి ఆసక్తి పట్టువల వాంఛ అపేక్ష ఉండవుకదా!

## అర్థానర్థాలు

అర్థానర్థౌ న మే స్థిత్యా గత్యా నా శయనేన వా
తిష్ఠన్ గచ్ఛన్ స్వపన్ తస్మాత్ అహమాసే యథా సుఖమ్ 119

మే=నాకు; స్థిత్యా=ఉండుటచేతకానీ; గత్యా=వెళ్ళుటచేతకానీ; వా=లేక; శయనే=పరుండుటచేతకానీ; న అర్థానర్థౌ=అర్థానర్థాలులేవు; తస్మాత్=కనుక: అహం=నేను; తిష్ఠన్ గచ్ఛన్ స్వప్నన్=కూర్చున్నా, నడుస్తున్నా, పడుకొన్నా: యథాసుఖం ఆసే=సుఖంగా ఉంటున్నాను.

నాకు ఏ స్థితిలోనూ నడిచేటప్పుడుకానీ పడుకొన్నప్పుడుకానీ అర్థానర్థాలు ఏమీలేవు. అందువల్ల స్థిరభావంతో చరిస్తుంటాను. శయనిస్తుంటాను. సదా సుఖంగానే ఉంటుంది. లౌకిక వ్యవహారాలైన తినటం తిరగటం నిద్రించటం కూర్చొనటం ఈ మొదలైన నిత్యకృత్యాల వలన నాకు హానీలేదు. లాభమూలేదు నేనాస్థితిలో స్థిరంగా ఉండగలను.

* *

## హానివృద్ధులు

స్వపతో నాస్తి మే హానిః సిద్ధిర్యత్నవతో న వా
నాశోల్లాసౌ విహాయస్మాత్ అహమాసే యథా సుఖమ్ 120

మే=నాకు; స్వపతః=నిద్రిస్తున్నా: హానిః నాస్తి=హానిలేదు; వా=లేక; యత్నవతః=ప్రయత్నిస్తున్నా: మే=నాకు; న సిద్ధిః=సిద్ధిలేదు; అస్మాత్=ఈ కారణం వలన; అహం=నేను; నాశోల్లాసౌ=హాని వృద్ధులందు రెంటినీ;

విహాయ=విడిచి; యథా సుఖం=సుఖపూర్వకంగా; ఆసే=ఉంటున్నాను.

యత్నరహితంగా నేను శయనించియున్నా నిద్రిస్తున్నా హానిలేదు. మెలకువతోయున్నా సంచరిస్తున్నా యత్నిస్తున్నా నాలో వృద్ధిలేదు. హానివృద్ధులులేని నాకు నిత్య సుఖం ప్రాప్తిస్తున్నది. ఫల విశేషాశక్తి నాలో హరించింది. ఏదైన సిద్ధించిందీ అనే సంతోషమూ లేదు. ఏదైనా పనికాలేదే అని దిగులూ లేదు.

*      *

## సు ఖా సు ఖా లు

సుఖాదిరూపా నియమం భావే ష్వాలోక్య భూరిశః
శుభాశుభే విహాయాస్మాత్ అహమాసే యథా సుఖమ్ 121

భావేషు=భావాలయందు (అనేక జన్మలందలి); సుఖాది రూప అనియమం= సుఖాదుల స్వరూపం యొక్క అనిత్యతను; భూరిశః=పలువిధాల: ఆలోక్య= చూచి; శుభాశుభే=శుభాశుభకర్మలు; విహాయ=విడిచి; అస్మాత్=ఈ కారణంగా; యథా సుఖం=యథా సుఖంతో; ఆసే=ఉంటున్నాను.

జన్మ పరంపర నుండి సుఖాదుల అనిత్య అస్థిరాదుల గమనం చూచిచూచి ఇక శుభా శుభాలు విడిచిపెట్టి సుఖంగా ఉన్నాను. ఎన్నో జన్మలు అనుభవించాను. సుఖాలు దుఃఖాలు వరుసక్రమం వస్తూనే ఉన్నాయి. అన్నీ అనిత్యాలు. అస్థిరాలు. కష్టసుఖాలు ఇట దేహధారికి సహజాలు.

*      *

# ఓం శాంతిః

## * శూన్య చిత్తుడు సుఖి *

ప్రకృత్యా శూన్యచిత్తోయః ప్రమాదాద్భావభావనః
నిద్రితో బోధిత ఇవ క్షీణ సంస్మరణోహి సః 122

యః = ఏపురుషుడు; ప్రకృత్యా = స్వాభావికంగా; శాంత చిత్తః = శాంత చిత్తుడైయున్నాడో; నిద్రితః = పరున్నవాడు; బోధితఇవ = మేల్కొన్నవానివలె; ప్రమాదాత్ = ప్రమాదం వలన; భావ భావనః = పూర్వవిషయాలు భావించువాడు; సఃహి = అట్టిభావాలు పొందినవాడే; క్షీణ సంసరణః = క్షీణించిన సంసారంగలవాడు.

శాంతి ప్రదాతా ! పునీతా ! స్వభావసిద్ధంగా శూన్యచిత్తుడైన మహాపురుషుడు ప్రమాదవశాత్తు విషయభోగ జంజాటంలోపడినా వారికి హానివృద్ధులు ఇతర దోషాలు అంటవు. ఆ ఋషి నిద్రిస్తున్నా మేలుకొన్నా సమానమే. ఆ యోగి సంసార దోష రహితుడే సుమా! ప్రారబ్ధవశంగా పూర్వవిషయానురాగాలవాడు భావభావనుడు

రాగద్వేషాలు చిత్తధర్మాలు ఆత్మధర్మాలు కావు. యోగి స్వతః రాగద్వేష రహితుడు. ఆ పురుషుని చిత్తం పరమపరిశుద్ధం. రాగద్వేషరహితం ప్రారబ్ధవశం వల్ల విషయ వాసనలలోపడి భోగాలు అనుభవిస్తున్నా ఆ మహాత్మునికి ఏ దోషం సోకదు

ఇచ్ఛా పూర్వకంగా ప్రయత్నశీలంగా మనస్సు ఉంచి కర్మలు ఆచరిస్తేనే ఫలాలు అనుభవిస్తాడు. కష్టానష్టాలు పొందుతాడు. ఒకడు గృహం కట్టిస్తున్నాడు, అందులో బాగోగులు యజమానికేగాని కూలివానికేమి లేదుకదా! కూలివానికి ఆ నాల్గు గంటల వరకే సంబంధం. శూన్యచిత్తుడనిన అంతే. అలానే జ్ఞాని తాను ఇచ్ఛకంగా విషయ లంపటంలో చిక్కుకోలేడు. ప్రారబ్ధవశంగా అవి అలా జరిగిపోతున్నాయి. కనుక దోషాలు ఆ ఆత్మజ్ఞానికి అంటవు. ఇతరులచే ప్రబోధితుడై పూర్వవిషయ స్ఫురణ కలిగిన వాడైననూ విషయాసక్తుడు సంసారికాడు.

## * ధనాదులేల ? *

క్వ ధనాని క్వ మిత్రాణి క్వ మే విషయదస్యవః
క్వ శాస్త్రం క్వ చ విజ్ఞానం యదా మే గలితా స్పృహా 123

యదా=ఎప్పుడైతే; మే=నాకు; గళితాస్పృహా=వాంఛలు వదిలిపోయాయో; తదా = అప్పుడు; మే = నాకు; ధనాని క్వ = ధనాలెక్కడ?; మిత్రాణి క్వ = మిత్రలెక్కడ?; విషయదస్యవః క్వ = విషయదస్యులు ఎక్కడ?; చ = మరియు; శాస్త్రం క్వ=శాస్త్ర మెక్కడ?; విజ్ఞానం క్వ=విజ్ఞాన మెక్కడ?.

స్వామీ ! నా ఇచ్ఛ హరించిపోయినది. ఇచ్ఛా శూన్యచిత్తుడికి ఏమీ పట్టవు కదా ! నాకు సాధనాలు, ధనాలు, భవనాలు, భోజనాలు అక్కరలేదు. కోరికలపై స్పృహలేదు. ఆ విషయలాలసలు జారిపోయాయి. చిత్తం నిర్మలంగా నిశ్చలంగా ఉంది. నాకు మిత్రులూ లేరు శత్రులూ లేరు. జారులూ లేరు చోరులూ లేరు. విజ్ఞానమూ లేదు విషయజ్ఞానమూ లేదు. శాస్త్ర విమర్శలూ తర్కాలు వితర్కాలూ లేవు. అంతా నిరామయం. ఇపుడు దేనిమీదకూడా ఏ విధమైన ఆస్థా లేదు. అపేక్ష లేదు. పరిపూర్ణ ఆత్మానందమే అనుభవిస్తున్నాను

* * *

యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః

వరదవచ్చి అంతటా ఉదకం నిండిపోతే చిన్నచిన్న కొలనులతో ఏమి ప్రయోజనం? అలానే గొప్ప బ్రహ్మవిదుడికి చిన్నచిన్న వేదభాగాలతో ప్రయోజనం ఉంటుందా?

— భగవద్గీత 2-46

* వలు మాట లేల? *

విజ్ఞాతే సాక్షిపురుషే పరమాత్మని చేశ్వరే
నైరాశ్యే బంధమోక్షేచ న చింతా ముక్తయే మమ 124

సాక్షి పురుషే = సాక్షిమాత్రుడు; పరమాత్మనిచ = పరమాత్మ అయిన; ఈశ్వరే = ఈశ్వరుడు; విజ్ఞాతే సతి - తెలియబడుచుండగా; బంధ మోక్షే = బంధ విముక్తుల యందు; మమ = నాయొక్క; ముక్తయే = ముక్తికొరకు మరొక, న చింతా = చింత లేదు.

ఆచార్య దేవా! సాక్షి పురుషుడు 'త్వమ్' పదవాచ్యుడైన జీవుడు. పరమాత్మ 'తత్' పదవాచ్యుడు ఈ జీవుడు ఈశ్వరుడైన పరమాత్మను తెలిసికొన్న

తర్వాత ఆకారరహితుడవుతాడు. ఈ జీవునికిక బంధ మోక్షాలుండవు. ముక్తి గూర్చి చింతయే ఉండదు. దేహేంద్రియాలకు సాక్షీ భూతుడు జీవుడు. ఈశ్వరుడు పరమాత్మ. జీవ ఈశ్వర తత్వార్థం లక్ష్యార్థం 'తత్త్వమసి' మహావాక్యం.

ఇది బాగా అర్థంచేసికొని మననం చేసి జ్ఞానం పొందినప్పుడు ఆత్మ సాక్షాత్కారం కలుగుతుంది. బంధ మోక్షాల పై అపేక్షలు అంతరిస్తాయి. ఆ ఉన్నత స్థితిలో ముక్తికి కూడా వాంఛించడు. వేదాలలో రెండు విధాల వాక్యాలున్నాయి. అవాంతర్వాక్యం. మహా వాక్యం. "స్వరూప బోధకం వాక్య మవాంతర్వాక్యం" ఇది ఆత్మస్వరూప బోధకం. ఉదాహరణం - "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "ఆత్మ అనంత స్వరూపం-" ఈ వాక్యాలు ఆత్మ స్వరూపాన్ని వివరంగా బోధిస్తాయి. కనుక ఇవి అవాంతర్వాక్యాలు.

"అభేద బోధకం వాక్యం మహావాక్యమ్" ఈశ్వర జీవ అభేద బోధక వాక్యాలు మహావాక్యాలు. ఉదా :- "బ్రహ్మాహమస్మి" నేనే బ్రహ్మను. "అయమాత్మా బ్రహ్మ" ఈ నా ఆత్మయే బ్రహ్మ "తత్త్వమసి" తత్ త్వమ్ అసి- 'తత్' ఈశ్వరుడు 'త్వమ్' నీవు అసి అగుచున్నావు. ఇవి మహావాక్యాలు. జీవ ఈశ్వర అభేదాన్ని బోధిస్తాయి సూచిస్తాయి.

'తత్త్వమసి' ఇంకా విచారణ చేస్తే కొంత తెలుస్తుంది. 'తత్' పదం సర్వజ్ఞ సూచకం. ఇది సర్వ చైతన్య బోధకం. ఇది ఈశ్వర ప్రతీకం సర్వశక్తి చిహ్నితం. పరమాత్మ పరమేశ్వరుడు. స్వామి. 'త్వమ్' పదం అల్పజీవ ప్రతీకం. జీవ చైతన్య మాత్రం. ఆ సర్వజ్ఞ జీవాత్మత్వం ఈ అల్పత్వం రెండూ చైతన్యబోధకాలే. ఈ విషయంలో భేదం లేదు. రెండూ ఏకైక చైతన్యస్థితిద్యోతకాలే. చిన్న పెద్ద తేడామాత్రం. రెండూ ఒక్కటే ఇదే తత్త్వరహస్యసూత్రం ఈ జీవేశ్వర భేదం చైతన్య పరిపూర్ణంలోనే. ఈ జీవేశ్వర అభేదతత్త్వరహస్యం విచారణచేసి పూర్తిగా తెలిసికొన్న మహర్షికి ముక్తిని గూర్చి జిజ్ఞాస యుండదు.

* పైకి పిచ్చివాడు *

అంతర్వికల్పశూన్యస్య బహిః స్వచ్ఛందచారిణః
భ్రాంతస్యేవ దశాస్తాస్తాః తాదృశా ఏవ జానతే 125

అంతర్వికల్ప శూన్యస్య = అంతఃకరణమందు వికల్పాలు లేనివాడు; బహిః = పైకి బాహ్యానికి మాత్రం; భ్రాంతస్య ఇవ = భ్రాంతుడు వలె పున్న:

స్వచ్ఛందచారిణః = స్వేచ్ఛా సంచారి యొక్క: తాస్తాః=ఆయా; దశాః = అవస్థలను; తాదృశా ఏవ = అట్టివారే; జానతే = తెలిసికొంటారు.

ఆత్మతత్త్వజ్ఞనిధీ! వికల్ప శూన్య అంతఃకరణం గల యోగి పైకి బాహ్యాని! భ్రాంతుడువలె ఉన్మత్తుడివలె, స్వచ్ఛంద శీలుడువలె సంసారివలె పిచ్చివాడివలె కని పిస్తాడు. కానీ ఆ యోగ పురుషుణ్ణి గూర్చి మరల అంతటి జ్ఞానికే అర్థమవుతుంది. అల్పులకు ఆ వికల్పశూన్య చిత్తుణ్ణి గూర్చి ఏమీ తెలియదు. రత్నపరీక్ష రత్నవ్యాపారులకే సాధ్యం కదా!

• • •

సంశాంతాంతః కరణో
గలిత వికల్పః స్వరూప సారమయః
పరమ శమామృత
తృప్తస్తిష్ఠతు విద్వాన్నిరావరణః

బాహ్యోద్వేగాలు ఉపశాంతి నొంది, వికల్పాలు మనోబుద్ధులు శాంతించి, మాయ అవనికను ఛేదించి, అనంత శాంత్యమృతాన్ని పానంచేస్తూ సంతృప్తుడైన సంయమీంద్రుడు సదాశాంతుడై జగల్లీలకు సాక్షీభూతుడుగా మాత్రమే విరాజిల్లుతుంటాడు. అట్టి మహాజ్ఞాని మానవులకు మార్గదర్శియై ధృవతారయై మహాకాశంలోనూ చిదాకాశంలోనూ ప్రకాశిస్తుంటాడు.

— యోగవాసిష్ఠం

# తత్త్వోపదేశం

## • సత్త్వబుద్ధి •

అష్టావక్ర ఉవాచ—

యథాతథోపదేశేన కృతార్థః సత్త్వబుద్ధిమాన్
ఆజీవమపి జిజ్ఞాసుః పరస్తత్ర విముహ్యతి 126

సత్త్వ బుద్ధిమాన్=సాత్విక బుద్ధిశాలి; యథా తథోపదేశేన=ఏ కొంచం ఉపదేశం వలననో; కృతార్థః భవతి = కృతార్థుడగు చున్నాడు; పరః=బుద్ధిలేని వాడు; ఆ జీవం=జీవితాంతం; జిజ్ఞాసురపి=జ్ఞానాకాంక్షగలవాడై కూడా; తత్ర= అలానే; విముహ్యతి=మోహం పొందుతున్నాడు.

అష్టావక్ర మహర్షి జనకమహారాజుకు ఇలా బోధిస్తున్నాడు– ఆత్మవిద్యార్థీ ! సత్త్వ బుద్ధిమంతుడు తాను పొందిన ఒక్క ఉపదేశంచేత కృతార్థుడవుతాడు. అట్లు కాని అల్పుడు జీవిత పర్యంతం జిజ్ఞాసువై కూడా మోహజాలంలో చిక్కుకొని మధన పడుతూనే ఉంటాడు.

జ్ఞానస్థితిని గూర్చి చెప్పిందే తడవతడవకు చెప్పుతుండాలి. పునః పునః ఉప దేశం అవసరం. ఆలకించు. 'ఛాందోగ్యోపనిషత్తు'లో ఇలా ఉంది- పూర్వం ఉద్దాలకమహర్షి తన కుమారుడయిన శ్వేతకేతువుకు తొమ్మిది పర్యాయాలు ఆత్మ తత్త్వం బోధించాడు. ఆత్మతత్త్వం అనేక పర్యాయాలు శ్రవణం మననం చేయాలి.

గురువు జ్ఞాన బోధకు అధికారిని ఎన్నుకోవాలి. 'ఈ శిష్యుడు జ్ఞానప్రాప్తికి అర్హుడు అవునా! కాదా!' అని నిర్ణయం చేసికోవాలి ఉత్తమాధికారి అయిన శిష్యుడు సామాన్య ఉపదేశం ఒకసారి పొందగానే గ్రహించి నియమాలు పాటించి కృతార్థుడవుతాడు. సత్యయుగంలో ఒక్కసారి ఓంకార ఉపదేశం పొంది ఉత్తమ శిష్యుడు చరితార్థుడయ్యేవాడు. నికృష్ట విద్యార్థి జీవన పర్యంతం ఎన్నిసార్లు ఉప దేశాలు పొందినా వాడి మనస్సుకు పట్టదు. యథార్థబోధ జరగదు. పూర్వం బ్రహ్మ దేవుడంతటివాడు విరోచనుడు అనే తన శిష్యుడికి వేలసార్లు బోధించాడు. అయినా శిష్యుడు వ్యర్థుడే అయినాడు.

జ్ఞానార్థులు మూడు రకాలు ఉత్తమ- మధ్యమ- అధమ- ఉత్తమాధికారి ఒక్కసారి మహావాక్యం ఉపదేశం పొందగానే గ్రహించి ఉత్తీర్ణుడవుతాడు. మధ్యమాధికారి- కొన్నిసార్లు మహోపదేశాలు శ్రవణం చేయగాచేయగా కృతార్థుడవుతాడు. అధమాధికారి- నికృష్టుడు ఎన్నిసార్లు శ్రవణంచేసినా గ్రహించలేడు. చివరికెప్పుడో! ఏమో! చెప్పజాలము.

* ఇదే విజ్ఞానం *

మోక్షో విషయవైరస్యం బంధో వైషయికో రసః
ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథాకురు 127

విషయ వైరస్యం = విషయ వైరాగ్యమే: మోక్షః = మోక్షం; వైషయికః = విషయ సంబంధమైన: రసః = రసం: బంధః = బంధం; విజ్ఞానం = విజ్ఞానమంతా; ఏతావత్ ఏవ = ఇంతమాత్రమే: యథేచ్ఛసి = ఎట్లు అభిలషిస్తావో: తథా కురు = ఆ ప్రకారంచేయి.

ఆత్మ విజ్ఞానార్థీ ! విషయ వైరాగ్యమే మోక్షం, విషయ సంబంధమే బంధం. ఇదే జ్ఞానం. నీ అభిమతం ప్రకారం నడుచుకో ! ఇది మోక్షోపాయ రహస్యం. విషయాలపై ఆసక్తి కలిగి విషయభోగసుఖాల లంపటంలో పడటం బంధం, సంసారబంధం. అజ్ఞాన పాశ బంధాలలో చిక్కుకుపోవటం తగదు.

విషయ సుఖాలపై భోగాలపై వైరాగ్యం కలగటం మహాభాగ్యం కలుగుచే సుమా. ఈ వైరాగ్య భావం మోక్ష హేతువు. వైరాగ్యం అలవరచుకో మంచిది.

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్"

మానవుడికి కేవలం మనస్సు మాత్రమే బంధ మోక్షాలకు కారణం. విషయాసక్తమైన మనస్సు బంధహేతువు. విషయ వైరాగ్యంగల మనస్సు మోక్షహేతువు. విషయ రాహిత్యమే ముక్తి హేతువు. ఇదే జ్ఞానం. నీ ఇష్టం. విషయానురాగం బంధం. విషయ విరాగం మోక్షం. ఈ తారతమ్యం తెలిసికొనటమే గొప్పజ్ఞానం.

* తత్త్వబోధ *

వాగ్మి ప్రాజ్ఞమహోద్యోగం జనం మూకజడాలసమ్
కరోతి తత్త్వబోధోఽయం అతస్త్యక్తో బుభుక్షుభిః 128

అయం = ఈ; తత్త్వబోధః = తత్త్వజ్ఞానం; వాగ్మి = గొప్పవక్తను; ప్రాజ్ఞః కు తెలిసిన పండితుని; మహోద్యోగం = ప్రయత్నశీలంగల; జనం = మహామానవులను; మూకజడాలసం = మూగవానిగా, జడునిగా, అలసునిగా; కరోతి = చేయును; అతః = కనుక; బుభుక్షుభిః = భోగేచ్ఛగల వారలచేత; అయం = ఈ తత్త్వబోధ; త్యక్తః = త్యజింపబడుచున్నది.

రాజా ! ఈ తత్త్వజ్ఞానం మిక్కిలి పాండిత్యంగల మహావిద్వాంసుణ్ణి సైతం మూగవాణ్ణిగా జేస్తుంది. జడుణ్ణి జేస్తుంది. ఏమీ తెలియని వాణ్ణిచేస్తుంది. అన్ని అహంకారాలు వదిలిస్తుంది తత్త్వజ్ఞాన ఉపాయంతో కాక మరొక సాధనంతో విషయాభిలాషలు హరించవు బాబూ ! ఆత్మబోధ అతిచతుర భాషిని సైతం స్తబ్ధుణ్ణి చేస్తుంది. తపస్విగా మారుస్తుంది. మహాబుద్ధి చాతుర్యంగల జ్ఞానిని సైతం జడుణ్ణి చేస్తుంది. మౌనిని చేస్తుంది. నిత్య క్రియాశీలుణ్ణి క్రియారహితుణ్ణి చేస్తుంది. ఆలోచనా మగ్నుణ్ణి చేస్తుంది

అంతరాత్మవైపు సర్వేంద్రియాలు ప్రయాణించి అలసి తమతమ శక్తి యుక్తుల్ని కోలుపోతాయి. ఇది ఆత్మబోధలోగల అనంత అద్భుతప్రభావం. తత్త్వ బోధ మహావాక్యాలు ఇంద్రియ శక్తులను అణచివేస్తాయి. విషయ భోగాభిలాషి ఆత్మ బోధ దేవాలయ ప్రాంగణం అడుగు మోపలేడు. ఆత్మజ్ఞాన కాంతులకు వాడు అనర్హుడు, వాడు సహింపలేడు.

* నిరపేక్షి సుఖి *

న త్వం దేహో నతే దేహో భోక్తాకర్తా న వా భవాన్
చిద్రూపోఽసి సదా సాక్షీ నిరపేక్షః సుఖం చర 129

త్వం = నీవు; న దేహః = శరీరంకావు; తే = నీకు; న దేహః = దేహం లేదు; వా = అయితే; భవాన్ = నీవు; న భోక్తా = భోక్తవుకాదు; న కర్తా = కర్తవుకాదు; కింతు = మరేమంటే; చిద్రూపః = జ్ఞానస్వరూపుడవు; సదాసాక్షీ = ఎల్లప్పుడు సాక్షివి; నిరపేక్షః అసి = వాంఛారహితుడవు అగుచున్నావు; సుఖం చర = సుఖంగా మెలగుము

ప్రియదర్శీ ! నీవు ఈ శరీరంకాదు. నీవు కర్తవు భోక్తవుకావు. నీదీ శరీరంకాదు. నీవు చిద్రూపుడవు. నిత్య చైతన్యమూర్తివి. నీవు సాక్షిమాత్రుడవు. ఇచ్ఛారహితుడవు. సుఖంగా ఉండు. ఇది తత్త్వం. ఇది తత్త్వరహస్యం. ఈ

శరీరం పంచభూతాత్మకం. ఇది జడం. అనిత్యం. నీవు ఆత్మవు. నిత్యుడవు. నిర్మలుడవు. నిశ్చలుడవు. చైతన్యం మూర్తీభవించిన వాడవు.

నీ శరీరంతో నీకు సత్సంబంధం ఏమీలేదు. ఉన్న సంబంధం తాత్కాలికం. అనిత్యం అల్పం. "అసంగోఽహ్యయం పురుష"అని శ్రుతి. ఈ పురుషుడు జీవాత్మ, అసంగుడు, దేహాదులతో బంధంలేనివాడు. సంయోగాది సంబంధాలు ఏమీ నీకులేవు అని శ్రుతి ప్రమాణం.

నీవు కర్తవూకాదు. భోక్తవూకాదు. కర్తృత్వ భోక్తృత్వాది బాధ్యతలు నీకు లేవు. నీవు నిస్సంగుడవు. ఈ కర్తృత్వ భోక్తృత్వాదులు అంతః కరణ ధర్మాలు. నీవు వీటికి సాక్షీభూతుడవు. సాక్షి అన్నిటినీచూస్తూ ఎవరితో సంబంధం లేకుండా ఉంటాడు. ఘటానికి సాక్షి ఘటంకంటే వేరుకదా ! కర్త భోక్త అంతఃకరణ సంబంధీకులు. వీటికి ఆత్మ వేరుగా ఉంటాడు.

నాటకశాలలో విద్యుద్దీపాలు సభాపతిని సభాసదులను నటీనటులను ఇతర వస్తుజాలాన్ని సమానంగా ప్రకాశమానం చేస్తుంటాయి. తన కాంతి ప్రసారంలో వ్యత్యాసం ఏమీ ఉండదు. వారివారి హావభావ ఆహార్యాదులనుబట్టి ప్రతిఫలిస్తుంటారు. అలానే దేహం ఒక నృత్యమందిరం. అహంకారం సభాపతి. విషయేంద్రియాదులు సభాసదులు. సభ్యులు ప్రేక్షక మహాశయులు. బుద్ధి నాట్యకత్తె. వాద్యగాండ్రు ప్రధాన ఇంద్రియాలు. చైతన్యఆత్మ సర్వసాక్షి. ప్రయోక్త. ప్రకాశకుడు.

ఆత్మ సాక్షీభూతుడు. సర్వాధిష్ఠానమూర్తి. అచలుడు. అందరికీ శక్త్యుత్సాహాలు వీక్షణ మాత్రంలో అందిస్తుంటాడు. కనుక జనకరాజా ! దేహేంద్రియ అహంకారాదులకు నీవు సాక్షీమాత్రుడివిగా ప్రకాశించు కాంతి అనుభవించు.

* నిర్వికల్పుడు *

రాగద్వేషౌ మనోధర్మౌ న మనస్తే కదాచన
నిర్వికల్పోఽసి బోధాత్మా నిర్వికారః సుఖంచర

రాగద్వేషౌ = రాగద్వేషాలు; మనోధర్మౌ = మనోధర్మాలు; మనః = మనస్సు; తే = నీకు; కదాచన = ఎన్నడునూలేదు; త్వం = నీవు; నిర్వికల్పః = వికల్పరహితుడవు; నిర్వికార = వికారరహితుడవు; బోధాత్మా = జ్ఞానమయమైన ఆత్మస్వరూపుడవు; అసి = అయియున్నావు; అతః = కనుక; సుఖంచర = సుఖంగా ఉండు.

అబ్బాయీ! రాగద్వేషాలు మనోధర్మాలు. రాగద్వేషాలు నీవికావు. మనస్సు నీవు కావు. నీదికాదు. నీవు నిర్వికల్పుడవు. నిర్వికారుడవు. బోధాత్మ స్వరూపుడవు. రాగద్వేషాదులు ఆత్మధర్మాలు కాదు. ఇవి ఆత్మకు సంబంధించినవికావు.

శత్రుర్మిత్ర మదాసీనో భేదాః సర్వే మనోగతాః
ఏకాత్మత్వే కథం భేదః సంభావేద్ద్వైత దర్శనాత్

వీడు నా శత్రువు వీడు నా మిత్రుడు వీడు శత్రువుకాదు. వీడు మిత్రుడుకాదు. ఈ భావాలన్నీ మనోధర్మాలు అద్వైతదర్శి దృష్టిలో నీ నా అనే భేదం అనేదే లేదు కదా! ద్వైత దృష్టిగల వారికే ఈ భేదాలు. ఈ రాగద్వేషగుణాదులకు మనస్సుకు సంబంధం. ఆ మనస్సుకు ఆత్మ స్వరూపుడవైన నీకూసంబంధంలేదు. మనో అధ్యాస వలన నీవురాగాదులతో అధ్యాస కల్పించుకోవద్దు. నీవు జ్ఞాన స్వరూపుడివి కనుక నీకు రాగాదులతో సంబంధంలేదు. నీవు పరిశుద్ధుడవు.

ఎర్రని పుష్పంఉంది ఎర్రదనం పుష్పధర్మం. ఈ పుష్పం పాలరాయి వద్ద ఉంచితే రాయి ఎర్రగా కనిపిస్తుంది. పుష్పం తీస్తే రాయి తెల్లగానే ఉంటుంది. అది పాలరాయి ధర్మంకాదు. అలానే ఆత్మలో మనో ధర్మాలు, అంతఃకరణ ధర్మాలు ప్రతిఫలిస్తాయి. ఆత్మస్వచ్ఛం.

అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథాఽరస న్నిత్య మగంధ వచ్చయత్
అనాద్యనంత మహతః పరంధ్రువమ్
విచార్య తన్మృత్యు ముఖాత్ప్రముచ్యతే

ఆత్మ నిశ్శబ్దం. ఆత్మఅస్పర్శం - అరూపం. అవ్యయం. గంధరహితం. ఆత్మనిత్యం అనాది అనంతం. మహతో మహీయాన్ మహత్తుకంటే పరమైనది. ఇట్టి ఆత్మతత్త్వమెరిగి ఉపాసించి ఉత్తమ యోగిపుంగవుడు మృత్యుముఖం నుండి బైటపడతాడు.

బద్ధో ముక్తః సదైవాత్మా నవై బధ్యేత కర్హిచిత్
బంధ మోక్షౌ మనస్సంస్థౌ తస్మిఞ్ఛాంతే ప్రశామ్యతి

ఆత్మ శుద్ధం - ముక్తం - బంధరహితం - బంధ మోక్షాలు మనోధర్మాలు-మనస్సంబంధాలు - మనోజనితాలు - మనస్సు శనుక శాంతిస్తే అన్నీ సద్దుమణుగుతాయి — అని శ్రుతి వచనాలు.

* నిరహంకారి *

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని
విజ్ఞాయ నిరహంకారో నిర్మమః త్వం సుఖీభవ! 131

సర్వ భూతేషు = సమస్త భూతకోటియందు; ఆత్మానం = ఆత్మవైన నీవు; ఆత్మని = తన ఆత్మయందు; సర్వభూతాని = సర్వభూతాలను; విజ్ఞాయ = తెలిసికొని; నిరహంకారః = అహంకారం లేనివాడవై; నిర్మమః = మమతలు లేనివాడవై; త్వం = నీవు; సుఖీభవ = సుఖంగా ఉండు.

వత్సా! సర్వభూత కోటిలో ఆత్మను ఆత్మలో సర్వ భూతాలను దర్శించి తత్త్వం గ్రహించి అహంకార రహితుడవై మమతాశూన్యుడవై సుఖివి కమ్ము. బ్రహ్మ మొదలు చీమవరకు గల అన్ని జీవులలోనూ ఆత్మ ప్రకాశిస్తున్నది ఆత్మలో సర్వ జీవరాశి ప్రకాశిస్తున్నది. ఇది తెలిసి అందరినీ ఆరాధించు పూజించు ప్రేమించు నీవు ఆత్మజ్ఞుడవై ఆత్మానందం పొందాలంటే ఇదే మార్గం. సుఖపడాలంటే ఆత్మ జ్ఞానం తెలిసికో.

సర్వభూతస్థ మాత్మానం సర్వ భూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శినః

యోగ బలంతో యోగీంద్రుడు తనను సర్వప్రాణులలోనూ చూసుకొంటాడు. ఆ మనిషి సర్వసృష్టిని తనలో చూసుకొంటాడు. అతడే సమదర్శనుడు.

— భగవద్గీత 6-29

* ఇది తత్త్వం విను *

విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా ఇవ సాగరే
తత్త్వమేవ న సందేహః చిన్మూర్తే విజ్వరో భవ! 132

యత్ర = ఎక్కడైతే ఆత్మయందు; ఇదం విశ్వం = ఈ జగత్తు; సాగరే = సముద్రంలోని; తరంగా ఇవ = కెరటాలవలె; స్ఫురతి = తోస్తున్నదో; తత్ = అది త్వం ఏవ = నీవే; న సందేహః = సందేహం లేదు; చిన్మూర్తే = జ్ఞానస్వరూపమై ఆత్మవిషయసంబంధాల్కి; విజ్వరః భవ = సంతాపరహితుడవు అగుము.

ఈ విశ్వచిత్రాలు సముద్ర తరంగాల వలె స్ఫురించినప్పుడు అవి అన్నీ నీవే. నీ భ్రమలే. శాంతించు. నీవు చైతన్య మూర్తివై నిస్సందేహంగా సంతాపరహితుడవు కమ్ము. నీ ఆత్మ చైతన్య స్వరూపం. ఆది అధిష్ఠానచైతన్యంలో సకలప్రపంచం సముద్ర కల్లోలాలవలె స్ఫురణ కలుగుతుంది. అది అంతా నీ ఆత్మ స్వరూప విన్యాసమే.

* తత్త్వమసి *

శ్రద్ధత్స్వతాత! శ్రద్ధత్స్వ నాత్ర మోహం కురుష్వభోః!
జ్ఞానస్వరూపో భగవాన్ ఆత్మాత్వం ప్రకృతేః పరః 133

భోః తాత! = ఓ చిరంజీవి! నాయనా!; శ్రద్ధత్స్వ = శ్రద్ధవహింపుము; శ్రద్ధత్స్వ = శ్రద్ధ వహింపుము; అత్ర = ఈ విషయంలో; మోహం = మోహం; న కురుష్వ = చెందకు; త్వం = నీవు; జ్ఞానస్వరూపః = జ్ఞాన విజ్ఞానమూర్తివి; భగవాన్ = భగవంతుడయిన ఈశ్వరుడవు; ప్రకృతేః = ప్రకృతికి; పరః = పరుడవై యున్నావు.

సౌమ్యమూర్తీ ! ప్రియదర్శీ ! శ్రద్ధవహించు ! శ్రద్ధవహించు ! మోహం చెందబోకు - అజ్ఞానంలో పడబోకు. నీవు విజ్ఞానమూర్తివి. ఈశ్వరుడవు. పరమాత్మవు. ప్రకృతికంటె పరుడవు.

ఆత్మ చిద్రూపవంతం. అట్టి ఆత్మనుగూర్చి అహంభావనం విపరీత భావనం రారాదు. ఆత్మ జ్ఞాన స్వరూపం. చిద్రూపం అంటే తనకంటె భిన్నమైన సాధనాపేక్ష లేనిది. తన ప్రకాశంతో ఇతర పదార్థాలను ప్రకాశింపజేసేది చిత్తు. అజ్ఞానాన్ని హరించేదీ ఆత్మస్వరూపాన్ని ప్రకాశింపచేసేదీ ఆత్మజ్ఞానం.

* * *

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర సంయతేంద్రియః
జ్ఞానంలబ్ధ్వా పరాం శాంతిం అచిరేణాధి గచ్ఛతి

శ్రద్ధతో ఇంద్రియాలు నిగ్రహించేవారికే జ్ఞానం లభిస్తుంది. ఈ జ్ఞానం పరమ శాంతి ప్రసాదిస్తుంది.

— భగవద్గీత 4-39.

* శోకింపనేల? *

గుణైః సంవేష్టితో దేహ స్తిష్ఠత్యాయాతి యాతిచ
ఆత్మానగంతా నాగంతా కిమేన మనుశోచసి 134

గుణైః=గుణాలతో; సంవేష్టితః=చుట్టబడినదై; దేహః=దేహం; తిష్ఠతి=ఉంటున్నది; సః=అది; ఆయాతి=వస్తున్నది; యాతి=పోతున్నది; ఆత్మా=ఆత్మ; న గంతా=పోయేదికాదు; న ఆగంతా=వచ్చేదికాదు; కిం ఏనం=ఎందుకు దీనిని గూర్చి; అనుశోచసి=దుఃఖిస్తున్నావు.

ఆత్మజ్ఞానీ! శరీరం గుణాలతో చుట్టుకొని ఉన్నది అది వస్తూంటుంది పోతుంటుంది. ఆత్మ వెళ్ళేదికాదు వచ్చేదికాదు దేహం ఆత్మలనుగూర్చి ఆలోచించి ఆవేదన చెందటం ఎందుకు? భాగలక్షణంచేత నీవు చిన్మాత్రుడవు జ్ఞానివి.

దేహధర్మాలు ఆత్మధర్మాలుగా భావించి దుఃఖించటం మంచిదికాదు. అది నీ విషయంలో అధ్యస్తం. అధ్యస్తం అంతరిస్తే ఆవేదన చెందరాదు. నీవు అధిష్ఠాన అమర పురుషుడివి గమనాగమనాలు పరిచ్ఛన్న పదార్థ వస్తువులందే పరిమితం. వ్యాపకవస్తువులలో గమనాగమనాలుండవు. లింగశరీరం పరిచ్ఛిన్నం. అందువల్లనే గమనాగమనాలు. ఆత్మ సర్వవ్యాపకం. వ్యాపకజలంతో నిండి ఘటాన్ని దేశాంతరాలకు తీసికొని వెళ్ళవచ్చు. కానీ వ్యాపక ఆకాశాన్ని తీసికొని వెళ్ళలేము. వ్యాపక ఆకాశం సర్వత్ర నిండే ఉంటుంది

* చిన్మాత్రుడవు *

దేహస్తిష్ఠతు కల్పాంతం గచ్ఛత్వద్యైవ వా పునః
క్వవృద్ధిః క్వ చ వా హాని స్తవ చిన్మాత్ర రూపిణః 135

దేహః పునః=దేహం ఒకవేళ; కల్పాంతం=కల్పాంతంవరకూ; తిష్ఠతు=ఉండినాక; వా=లేక; అద్యైవ=ఇప్పుడే; గచ్ఛతు=పోవుగాక!; చిన్మాత్రరూపిణః=చిన్మాత్రమైన జ్ఞానస్వరూపుడవైన; తవ=నీకుమాత్రం; వృద్ధిఃక్వ=వృద్ధిఎక్కడ?; హానిః క్వ=హాని ఎక్కడ?.

చిన్మాత్ర రూపా! ఈ శరీరం ఒక్కొక్కసారి కల్పాంతం వరకూ ఉంటుంది. ఒక్కొక్కసారి మరునాడే మట్టిలో కలిసిపోతుంది. దీని స్థిరత్వం నమ్మకంలేదు. కానీ నీ చిన్మాత్రరూపం శాశ్వతం. దానికి వృద్ధిలేదు హానిలేదు. అది నిర్వికారం.

ద్రష్ట ద్రవ్యంకంటే వేరు. ఇదీ నియమం. దేహం ద్రవ్యం. నీవు ద్రష్ట. దేహంతో నీకు ఏ సంబంధంలేదు. నీ స్థూల శరీరం కల్పాంతం ఉండవచ్చు లేదా మరుక్షణంలో మరణించవచ్చు. దేహ స్థిరత్వంపై నీ స్థితి ఆధారపడిలేదు. దేహం పోయినా నీవు పోవు. దేహం వృద్ధిఅయిందని నీవు వృద్ధికావు. నీవు దేహంకంటె వరుడవు. దేహం మిథ్య- నీవు సత్యం. దేహానికి నీవు సత్తా స్ఫూర్తి ఇచ్చేవాడవు. దేహానికి నీవు సాక్షివి. నీవు ఈ నిశ్చయంతో జీవన్ముక్తుడివు కమ్ము.

* చిదంభోధివి *

త్వయ్యనంత మహాంభోధౌ విశ్వవీచిః స్వభావతః
ఉదేతు వాస్తమాయాతు న తే వృద్ధిః నవా క్షతిః 136

అనంతమహాంభోధౌ = అపారమహాసాగరాపావృతవగు; త్వయి = నీయందు; విశ్వవీచిః = ప్రపంచరూప తరంగాలు; స్వభావతః = స్వభావసిద్ధంగానే; ఉదేతు = ఉదయించునుగాక! ; వా = లేక; అస్తం ఆయాతు = అస్తమించును గాక! ; తే = నీకు; న వృద్ధిః = వృద్ధీలేదు; న క్షతిః = నాశనమూలేదు;

సత్యాత్మా! అనంత ఆత్మ మహాసముద్రంలో విశ్వం ఒక తరగం. ఈ తరంగాలు స్వాభావికంగా ఉదయిస్తుంటాయి. అస్తమిస్తుంటాయి. కాని నీకు వృద్ధీ లేదు. నాశమూలేదు. నీవు నిత్యం. సత్యాత్ముడవు చిన్మాత్రుడవు. నీ స్వరూపము అనంత చిన్మాత్రాంభోధి. నీ సముద్రంలో అవిద్య కామ్యకర్మలఫలంగా విశ్వం అనే అల ఆవిర్భవిస్తుంటుంది. నీ స్వరూపసాగరంలో విశ్వ తరంగాలు ఉద్భవిస్తూ అంతరిస్తుంటాయి. కానీ నీకు ఏమీ లాభంలేదు నష్టంలేదు. నీవు అధిష్ఠాన చైతన్య మూర్తివి. అధిష్ఠాన్ని అల్పకల్పిత వస్తువు హానిచేయలేదు. చిదాత్మనిత్యం. ఏకైకం, నిర్మలం. పరిపూర్ణం. అనంతం అనాది.

* ఇది భిన్నం కాదు *

తాత! చిన్మాత్రరూపోఽసి నతే భిన్నం ఇదం జగత్
అతః కస్య కథం కుత్ర హేయోపాదేయ కల్పనా 137

తాత! = నాయనా! నీవు; చిన్మాత్రరూపః = చైతన్యమూర్తివి; అసి = అగు చున్నావు; ఇదం విశ్వం = ఈ జగత్తు; తే = నీకంటే; న భిన్నం = వేరైనదికాదు;. అతః = కనుక; హేయోపాదేయ కల్పనా = త్యాజ్యగ్రహణాలయొక్క కల్పన; కస్య కథం = ఎవనికి ఎట్లు?; కుత్ర? = ఎక్కడ?

ఆనందమూర్తీ! నీవు చైతన్య మూర్తివి. ఆనందమూర్తివి. విశ్వనాథుడవు విశ్వమూర్తివి. విశ్వం నీవే. ఈ విశ్వం నీకంటె భిన్నమైనదికాదు. నీలోని భాగమే. కనుక ఈ జగత్తులో త్యాజ్యమేది! గ్రాహ్యమేది! అన్నీ నీవే. నీలోవే.

విచిత్ర వర్ణతా యద్వత్ దృశ్యతే కఠినాతపే
విచిత్ర శక్తితా తద్వత్ దేవేశే 'సదసన్మయా'

వేసవి మధ్యాహ్నంలో ఆకాశంలో అనేకరంగులు కనిపిస్తాయి. అదేవిధంగా సగుణనిర్గుణ స్వరూపుడైన ఈశ్వరుడిలో అద్భుతంగా అనేకలీలలు దృగ్గోచరమవు తుంటాయి.

— యోగవాసిష్ఠం

* శాంతిశ్రీవి *

ఏకస్మిన్నవ్యయే శాంతే చిదాకాశేఽమలే త్వయి
కుతో జన్మ కుతో కర్మ కుతోఽహంకార ఏవచ 138

ఏకస్మిన్ = ఒక్కడవైనటువంటి; అమలే = నిర్మలుడవైనటువంటి; అవ్యయో = నాశంలేనటువంటి; శాంతే = శాంతుడవైనటువంటి; చిదాకాశే = చిదాకాశ స్వరూపుడవైనటువంటి; త్వయి = నీయందు; జన్మ = జననం; కుతః = ఎక్కడ నుండి?; కర్మ కుతః = కర్మ ఎక్కడనుండి?; అహంకారః కుతః = అహంకృతి ఎక్కడ నుండి; భవతి = కలుగుతున్నది?

నిర్వికారమూర్తీ! నీవు ఒక అనుఋడవు - నిర్మలుడవు. అవ్యయుడవు. అవినాశివి. శాంతుడవు. చిన్మాత్రుడవు చిదాకాశానికి జన్మ ఎక్కడ? కర్మఎక్కడ? అహంకార మెక్కడ? నీవు చిదాకాశంవంటి వాడవు. అంతేకాదు చిదాకాశరూపుడవు.

నీవు సజాతీయ విజాతీయ స్వగత భేద శూన్యుడవు. ఏకరూపుడవు. జన్మ లేమ నాశవికార రహితుడవు కార్యసంబంధం లేనివాడవు చిదాకాశ నిర్మలుడవు. సర్వోపాధి శూన్యుడవు. నీ చిదాత్మ రూపానికి జన్మమరణాలు లేవు. కర్మ అహంకారాలు లేవు. ఇవి ద్వైత భావం గలవారికి ఉంటాయి. నీకు జన్మ వికారాలులేవు. కర్తృత్వాదులు నీకు లేవు. అహంకారంలేని శుద్ధబుద్ధమూర్తివి. నీ రూపం కేవలైక రస స్వరూపం.

* ఏ కః త్వ మే వ *

యత్త్వం పశ్యసి తత్రైకః త్వమేవ ప్రతిభాససే
కిం పృథక్ భాసతే స్వర్ణాత్ కటకాంగద నూపురమ్ 139

త్వం=నీవు: యత్=దేనిని: పశ్యసి=చూస్తున్నావో: తత్ర=అచ్చట: ఏకః=నీకైక మూర్తివైన: త్వమేవ=నీవే; ప్రతిభాససే=ప్రతిబింబిస్తున్నావు; కటకాంగదనూపురం=కడియాలు, అందెలు, ఆభరణాలు: స్వర్ణాత్=బంగారంకంటే; పృథక్=వేరుగా: భాసతే కిం=భాసించునా ఏమి?

విద్యార్థీ! నీవు ఏ కార్యం గూర్చి చూస్తున్నావో ఆకార్యానికి కారణం కూడా ఉంటుంది. ఏ విషయం ఆసక్తిగా పరిశీలిస్తున్నావో అందు నీవే భాసమానం అవుతావు. నీ ఆత్మ సర్వత్ర భాసిస్తుంది. సువర్ణంతో అనేక ఆభరణాలు చేస్తారు. ఆభరణాలు సువర్ణపు ముద్దకంటే వేరుగా కనిపిస్తాయా! కనిపిస్తాయా! రెండూ ఒకటే కదా! పేరులు మాత్రం వేరు ప్రతిదానిలోనూ కార్యమూ కారణమూ ఒక్కటే.

ఛాందోగ్యంలో ఆరవ ప్రపాఠం ఇలా ఉంది— అరుణఋషి తన పుత్రుడైన శ్వేతకేతుణ్ణి పిలిచి 'అబ్బాయీ! నీకు పన్నెండేళ్ళువచ్చాయి. ఇక గురుకులంలో చేరి వేదం చదువుకో' అని విద్యాధ్యయనానికి గురువులవద్దకు పంపాడు. శ్వేతకేతుడు తండ్రి మాటవిని గురువులవద్ద విద్యలు పూర్తిగా అభ్యసించాడు. గురువుల నుండి సెలవు తీసికొని ఇంటికి వచ్చాడు

శ్వేతకేతుడికి విద్యాగర్వం కలిగింది. నేను తండ్రికంటే పండితుణ్ణి. తండ్రి చదువు తక్కువ. కనుక తండ్రికి నమస్కరించ నవసరంలేదు అనుకొన్నాడు. గర్వంతో తండ్రికి ప్రణామం చేయకుండా పరిగడుపుకొంటూ ప్రవర్తించసాగాడు. ఇది తండ్రి గమనించి పుత్రుడికి విద్యాగర్వం కలిగింది చికిత్సచేయాలని ఇలా అడిగాడు —

వత్సా! నీవు గురువు నుండి ఏ ఉపదేశం వలన అశ్రుతం శ్రుతమవుతుందో అజ్ఞాతం జ్ఞాతం అవుతుందో ఆ ఉపదేశం పొందావా! శ్వేతకేతు తెల్లబోయాడు. గర్వం హరించి పోయింది. తండ్రికి క్షమాపణ చెప్పుకొని ఆ ఉపదేశం గురువువద్ద పొందలేదు. తమరే అనుగ్రహించవలసింది అని ప్రార్థించాడు.

పుత్రుడి పశ్చాత్తాపం గర్వహరణం వినయం చూచి ఆ మంత్రసారం ఇలా ఉపదేశించాడు. ఒక్క మట్టి నుంచే పాత్రలు అనేకం ఆవిర్భవించాయి. అన్నింటి లోని మూలపదార్థం మట్టి ఒక్కటే కదా. కారణంకంటె కార్యం భేదంగా ఉండదు. ఎన్ని నామ వికారాలున్నా అవి వాణీవికార విన్యాసాలే. కేవలం మృత్తిక సత్యం.

* సర్వం ఆత్మ *

అయం సోఽహమయం నాహం విభాగమితి సంత్యజ
పరమాత్మేతి నిశ్చిత్య నిఃసంకల్పః సుఖీభవ! 140

సః = ఆ; అయం = ఇతడు; అహం = నేను; అయం = ఇతడు; న అహం = నేను కాదు; ఇతి = అని; విభాగం = విభజనను; సంత్యజ = విడిచిపెట్టు; సర్వం ఆత్మా = సమస్తం ఆత్మస్వరూపం; ఇతి = అని; నిశ్చిత్య = నిశ్చయించుకొని; త్వం = నీవు; నిస్సంకల్పః సుఖీభవ = సంకల్పరహితుడవై సుఖివికమ్ము;

సర్వదర్శీ! ఇదీ-అదీ - ఇతడూ-అతడూ, అందరూ నేనే. ఇది నేనుకాదు అనే విభజనలేదు అందరూ భజనీయులే అందరూ ఆత్మస్వరూపులే. ఈ సర్వ దర్శన నిశ్చయంతో సంకల్పరహితుడవై సుఖంగావుండు. భేదభావం భేద దృష్టి త్యజించి సర్వసమన్వయ సర్వేశ్వర సందర్శనం చేసుకో. యోగి ఈ భావంతో నిశ్చయ బుద్ధితో ఉండాలి. నేనువేరు—అతడు వేరు-పేరు నావారు—వారు పరాయివారు అనే విభజన పనికిరాదు.

ద్వైతదృష్టి వలన మానవుడికి భయం కలుగుతుంది. అద్వైతం ఆప్యాయత పెంచుతుంది. అనుబంధం అనురాగం విశాలభావం అద్వైతం వల్లనే సాధ్యం. ఏకాంత ప్రవేశంలో ఆనంద భావప్రసారం జరిగినంతవరకూ అంతఃకరణలో భయ భూతాలు ఉత్పన్నంకావు. ద్వైత ప్రవృత్తి ఉత్పన్నంకాగానే భయం ప్రారంభమవుతుంది. నేనువేరు. వారువేరు అనే కల్పిత ద్వైతభావం దుఃఖజనకం అవుతుంది. నీ స్వభావం నిజంగా అద్వైత బ్రహ్మానంద సంభరితం. నీ స్వరూపం ఆనందమయం.

సర్వ కారణ రూపం ఆత్మ. ఈ నిశ్చయంతో స్థిరంగా ఉండాలి. సోఽహం నాహం ఇత్యాదిభేదాన్ని భ్రమను విడిచిపెట్టాలి ద్వితీయ వస్తువు ఉన్నదని భావిస్తేనే భయం. ఆత్మేతరం ఇంకొకటి ఉండనేలేదు కదా! ఎట్టి ప్రతిభాసం లేదు. సుఖంగాఉండు నీవు నిర్వికల్పుడవు. నిరంజనుడవు

* త్వమేకః *

త్వయ్యేవాజ్ఞానతో విశ్వం త్వమేకః పరమార్థతః
త్వత్తోఽన్యో నాస్తి సంసారీ నాసంసారీ చ కశ్చన 141

తవ అజ్ఞానతః ఏవ=నీ అజ్ఞానంవల్లనే; విశ్వం=ప్రపంచం; పరమార్థతః= యథార్థంగా (భాసిస్తున్నది); త్వం=నీవు; ఏకః=అద్వితీయుడవు; అతః=కనుక; త్వత్తః=నీకంటే; అన్యః=అన్యుడు; కశ్చన=ఒకానొకడు; సంసారీ=సంసారి; నాస్తి= లేడు (నీవుకాక); న అసంసారి=ఈశ్వరుడూ లేడు; న అన్యః = ఇతరుడూ లేడు.

విజ్ఞాని! నీ అజ్ఞానంవల్లనే విశ్వం వేరుగా కనిపిస్తున్నది. జీవుడు అసంసారి, పరమార్థ దృష్టితో చూస్తే నీవు ఒక్కడివే అంతానిండి యున్నావు. నీ వల్లనే అంతా జరుగుతున్నది. ఈశ్వరుడు అసంసారికాడు విశ్వమయుడు, విశ్వనాథుడు. విశ్వవిరాట్ స్వరూపుడు.

నీ అజ్ఞానంతో జగత్తు ప్రతీయమానమవుతున్నది. ఆత్మజ్ఞానంవల్ల అజ్ఞానం తొలిగి యథార్థం అర్థమవుతుంది. తత్త్వం తెలుస్తుంది. మూల పదార్థం అవగాహనకు వస్తుంది. "అనాదిభావత్వే సతి జ్ఞాన నివర్త్యవ మజ్ఞానమ్-" అజ్ఞానం అనాదివస్తువు. భావబంధురం. అభావరూపంకాదు. జ్ఞానరశ్మితో నివృత్తిఅవుతుంది.

"అజ్ఞాననాశకత్వే సతి, స్వాత్మబోధకత్వం జ్ఞానమ్-" జ్ఞానం అజ్ఞాననాశకం. తన ఆత్మ స్వరూప బోధకం జ్ఞానోదయం కాగానే పరమార్థదృష్టిలో నీవు ఒకడివే. నీకు సంసారి అసంసారి అనే భేదం కలుగదు.

* విశ్వభ్రాంతి *

భ్రాంతిమాత్ర మిదం విశ్వం నకించిదితి నిశ్చయీ
నిర్వాసనః స్ఫూర్తిమాత్రో న కించి దివ శామ్యతి 142

ఇదం విశ్వం=ఈ విశ్వం; భ్రాంతి మాత్రం=భ్రాంతి మాత్రం; న కించిత్= మరి ఏకొంచంకూడా లేదు; ఇతి=ఇట్లని నిశ్చయించేసికొన్నవాడు; నిర్వాసనః = వాసనారహితుడు; స్ఫూర్తిమాత్రః = ప్రకాశమానుడు; న కించిత్ ఇవ = ఏమీ వికారాలు లేనివాడై; శామ్యతి=శాంతి పొందుతున్నాడు.

ఈ ప్రపంచం భ్రాంతి మాత్రం. వేరే ఏమీలేదు. జగత్తు అంతా నాటకం. మిథ్య. ఇలా నిశ్చయించుకొన్నవాడు వాసనారహితుడై స్ఫూర్తి మాత్రుడై పరమ సుఖశాంతిని పొందుతాడు. సంసారం భ్రాంతిమూలం అని నిశ్చయించు. స్థిమితంగా ఉండు. ఆత్మసత్తా కంటె పృథక్ సత్తాలేదు జగత్తుకి తనదంటూస్వతంత్ర సత్తా ఏమీ లేదు. ఆనందంగా ప్రపంచయాత్ర చేయి. సర్వదా ఆత్మ స్ఫురణ గలవాడు సంకల్ప వికల్పాదులు లేనివాడు ముక్త పురుషుడు.

◆ ◆ ◆

తవ రూపమేవ తవ దుఃఖకరం యది తన్న పశ్యసి బహిర్ముఖధీః
తవ రూపమేవ తవ తృప్తికరం యది తత్ప్రపశ్యసి నివర్త్యతమః

నీ బహ్యాదృష్టివలన నీ ఆత్మను నీవు గుర్తించని కారణంగా నీరూపంగా కనబడే నీ ఉపాధి నీబాధలకు నాశనానికి హేతువు. అజ్ఞానావరణ తొలిగిపోయి నప్పుడు, ఆత్మను గుర్తించినప్పుడు నీ రూపం నీకు సంతోషకరంగా ఉంటుంది.

— సంక్షేప శరీరిక

## • నిత్యుడవు •

ఏక ఏవ భవాంభోధా వాసీదస్తి భవిష్యతి
న తే బంధోఽస్తి మోక్షోవా కృతకృత్యః సుఖంచర 143

భవాంభోధా = సంసార సముద్రంలో; ఏక ఏవ = ఆత్మస్వరూపుడొక్కడే; ఆసీత్ = ఉండెను; అస్తి = ఉంటాడు; భవిష్యతి = ఉండగలడు; త్వం = అట్టి ఆత్మ రూపుడవైన నీవు; కృతకృత్యః = కృతకృత్యుడవు: (ధన్యః = ధన్యుడవు); తే = అట్టి నీకు; న బంధః = బంధమూలేదు; చ = మరియు; న మోక్షః = మోక్షమూలేదు; సుఖంచర = సుఖంగా సంచరించు.

ఈ భవాంభోధిలో ఒక్కనీవే ఉంటావు. నీవే ఉన్నావు. కృతకృత్యుడవవుతావు. అయినావు. నీకు బంధమూలేదు మోక్షమూలేదు. నీవు సుఖంగా ఉండు. ఈ సంసారం ఒక సాగరం. ఈ సాగరస్థానంలో నీవు సదా ఒంటరివై యున్నావు. భవిష్యత్తులో ఉంటావు. ఇంతవరకూ నిన్ను నీవు ఎరుగక బంధ మోక్ష చక్రంలో పడి తిరుగు

తున్నావు. ఇప్పుడు ఆత్మజ్ఞానం తెలిసికొన్నావు. భవసాగరంలో అనుకూల్య వాతావరణంలో పడ్డావు. అధిష్ఠానం అసంగం సాక్షీ భూతం అని స్థిమితపడ్డావు. స్థిరంగా ఉంటావు. నీలోని ఈ సంసారం రజ్జుసర్పవత్ కల్పితం. నీకిక బంధాలులేవు. నీవు కృతకృత్యుడవైనావు.

◆ ◆ ◆

చిత్తోపరమముగల పురు
షోత్తముడు జగంబు మరచి యుండును — బాలో
న్మత్త పిశాచనిభుఁడై
యెత్తరి సుప్తుని కరణి నిరింద్రియుడగుచున్

— సీతారామాంజనేయ సంవాదం [3-176]

* చిన్మయుడవు *

మా సంకల్ప వికల్పాభ్యాం చిత్తం క్షోభయ చిన్మయ
ఉపశామ్య సుఖం తిష్ఠ స్వాత్మన్యానంద విగ్రహే 144

చిన్మయ=జ్ఞానస్వరూపా!; సంకల్పవికల్పాభ్యాం = సంకల్పవికల్పాలచేత; చిత్తం=మనస్సును; మా క్షోభయ=క్షోభ పెట్టకు; ఉపశమ్య=మనశ్శాంతి పొంది; ఆనంద విగ్రహే=పూర్ణ ఆనందవిగ్రహమైన; ఆత్మని=ఆత్మయందు; సుఖం= సుఖంగా; తిష్ఠ=ఉండు.

చిన్మయమూర్తీ ! సంకల్ప వికల్పాలలో చిత్తాన్ని సంక్షోభపెట్టకు. సంకల్పాలు వదులుకో. మనస్సును శాంతిగా ఉంచు. పూర్తి ఆనందంగా వుండు. పరమానందం పొందు. స్వాత్మలోరమించు. స్వస్వరూపంలో సుఖంగా సుస్థిరంగా ఆత్మారాముడవై విహరించు. సంకల్ప వికల్ప రహితంగా ఆనంద సహితంగా జీవ యాత్ర సాగించు. ధన్యుడవవుతావు.

◆ ◆ ◆

"మమేదమితి బంధాయ నాహ మిత్యేవ ముక్తయే
ఏతావన్మాత్ర కేవస్తు న్యాత్మాయత్తే కిమజ్ఞతా"

'ఇదినాది' అనే భావం బంధం 'నేను లేదు-నాదేమీలేదు' అనే భావం ముక్తి దాయకం. నీవు ఆత్మవు ముక్త పురుషుడవు. నీవు అజ్ఞానంలో పడబోకు. బాధపడబోకు. సంకల్ప వికల్పాలతో ఆలోచనలతో అవసరమేముంది? ఆలోచనలు అరికట్టు. ఆనందమయ ఆత్మస్వరూపుడవై హాయిగా సుఖంగా జీవించు.

— యోగవాసిష్ఠం

* నీకు ధ్యానం అవసరం లేదు *

త్యజైవ ధ్యానం సర్వత్ర మా కించిద్ధృది ధారయ
ఆత్మా త్వం ముక్త ఏవాసి కిం విమృశ్య కరిష్యసి 145

సర్వత్ర ఏవ=అంతటనూ; ధ్యానం=ధ్యానాన్ని; త్యజ=విడు; హృది=హృదయంలో; కించిత్=కొంచంకూడా; మా ధారయ=ధరింపకు; ఆత్మా=ఆత్మస్వరూపుడవయిన; త్వం=నీవు; ముక్త ఏవ=ముక్తుడవే; అసి=అవుతున్నావు; విమృశ్య=విమర్శించి; కిం కరిష్యసి=ఏమి చేయగలవు?.

పరిశుద్ధ హృదయా ! నీవు సర్వత్ర ధ్యానం త్యజించు. హృదయంలో ఏమీ ధారణచేయకు. నీవు ఆత్మస్వరూపుడవు ముక్త పురుషుడవు. నీవు దీర్ఘంగా విచారణచేసి ఏమి చేయగలవు. జ్ఞానార్థీ ! ధ్యానంకూడ మానుకో. ధ్యానం అజ్ఞానులకు చెప్పబడింది. ఆత్మబోధలేనివారు భేదభావంగలవారు ధ్యానాదులు చేసుకొంటారు. ధ్యానం చేయటం మనోధర్మం. ఆత్మ ధర్మంకాదు. నీవు పరమాత్మవు. అనాత్మవు కావు. సర్వదా నీ స్థితి ముక్తావస్థ.

ధ్యానంవల్ల నీకేమి ఫలం. ధ్యానం విడిచిపెట్టు. ఆనందంగా ఉండు. ధ్యానం మననం ఆత్మేతర వస్తువులు ఆత్మజ్ఞానికివి అనవసరాలు. నీవు నిత్యాత్ముడవు. సదా ముక్తుడవు. వాసనలు జనితమ ధ్యాన మననాదులు సకల సంకల్ప వికల్పాలు మాయికములు. ఇవి మానసిక వ్యాపారాలు. వీటిని విడు. నిత్య పరమానంద ఏకాత్మతా దాత్మ్యం పొందటమే ముక్తి.

# విశేషోపదేశం

* విస్మరణమే విముక్తి *

అష్టావక్ర ఉవాచ—

ఆచక్ష్వ శృణు వా తాత! నానాశాస్త్రాణ్యనేకశః
తథాపి న తవ స్వాస్థ్యం సర్వ విస్మరణాదృతే 146

తాత! = ఓ అబ్బాయీ!; అనేకశః = వివిధ విధాల; నానాశాస్త్రాణి = రకరకాల శాస్త్రగ్రంథాలు; ఆచక్ష్వ = బోధించు; వా శృణు = లేక విను; తథాఽపి = అలా అయినాకూడ; సర్వవిస్మరణాత్ ఋతే = సమస్తం విస్మరించకుండా; తవ = నీకు; న స్వాస్థ్యం = శాంతిలేదు.

చిరంజీవీ ! నీవు నానా విధాల శాస్త్రాలు విన్నావు నేర్చావు చిన్నవారికి బోధించావు. మాటిమాటికి మననంచేశావు చేస్తున్నావు. కానీ ఆత్మజ్ఞాని తాను నేర్చిన లౌకిక ధర్మశాస్త్ర విశేషాలు అన్నీ మరచి ఆత్మబోధలో మగ్నంకావాలి. అపుడే ఆ యోగికి శాంతి, ముక్తి. అలానే నీవు ఆత్మానందంలో తాదాత్మ్యం జెందు సుఖిస్తావు.

సంపూర్ణ తృష్ణానాశనం ముక్తి. ఎన్నిశాస్త్రాలు పఠించినా, శిష్యులకు ఎన్ని తత్త్వాలు బోధించినా, తాను సద్గురువులవద్ద అధ్యయనం చేసినా, ధర్మాలు శ్రవణం చేసినా ఆత్మజ్ఞానంలో మగ్నమై అన్నీ విస్మరించిన వివేక చూడామణికే విముక్తి లభ్యం.

గ్రంథ మభ్యస్య మేధావీ విచార్య చ పునఃపునః
పలాలమివ ధాన్యార్థీ త్యజేద గ్రంథ మశేషతః

ప్రథమంలో మేధావి గ్రంథాధ్యయనం చేసి మరల మరల ఆ విషయాలను విచారణచేస్తాడు తరువాత క్రమక్రమంగా బియ్యంలో గడ్డలు ఇతర వ్యర్థపదార్థాలు పారవైచి బియ్యం శుభ్రం చేసికొని స్వీకరించినట్లు జీవన్ముక్తి కోరుకొనే మేధావి తాను నేర్చిన గ్రంథస్థ విషయాలు వదిలి ఏకైక లక్ష్యమైన ఆత్మస్థ విద్యలో నిలిచి పోతాడు- అని పంచదశిలో వివరించబడినది.

విస్మరణ అంటే సుషుప్తిలో కలిగే విస్మరణ వంటిదికాదు. సుషుప్తిలో కొంతవరకే విస్మరణ కలిగేది. కొన్ని ఇంద్రియాలు పనిచేస్తూనే ఉంటాయి. కొందరికి మనోంతర్గతంగా అజ్ఞానం మేలుకొనే ఉంటుంది. అది పనిచేస్తుంటుంది. అన్ని జీవులకు సుషుప్తిలో విషయ విస్మరణ కలుగుతుంది. మరల జాగ్రదవస్థలో అజ్ఞాన చిహ్నా విషయ విస్మరణ కలుగుతూనే ఉంటుంది. జీవన్ముక్తుడు సుషుప్త్యాదులలో విషయ విస్మరణం, అజ్ఞాన విస్మరణం కలిగి అన్నీ మరచి చిన్మాత్రుడై ఉంటాడు.

* ఆశారహితంగా వాలి! *

భోగం కర్మసమాధిం వా కురు విజ్ఞ! తథాపి తే
చిత్తం నిరస్త సర్వాశ మత్యర్థం రోచయిష్యతి 147

విజ్ఞ=విశేషజ్ఞానంగలవాడా!; భోగం=భోగంతోకూడిన; కర్మ వా=కార్యం కానీ లేక; సమాధిం=సమాధిని కానీ; కురు=చేయి; తథా౽అపి=అలా అయినా కానా; తే=నీ యొక్క; చిత్తం=మనస్సు; నిరస్త సర్వాశం=తిరస్కరింపబడిన సర్వవాంఛలు కలదైనప్పుడే; అత్యర్థం రోచయిష్యతి=మిక్కిలి రుచిర తేజోరూపం అందగలదు.

విజ్ఞానమూర్తీ ! నీవు భోగభాగ్యాలు అనుభవించు. వివిధ కర్మలు ఆచరించు-సమాధిలో ఉండు- ఏమిచేస్తున్నా ఆశారహితుడవై నిష్కాముడవై నిస్వార్థ బుద్ధితో సర్వం శ్రీపరమేశ్వరార్పణ మస్తు అనే చిత్తంతో చేయి. ఆత్మజ్ఞాన ప్రభావంతో నిష్కల్మష చిత్తంతో నిర్మలంగా చేయి. చిత్తం శాంతి పొందుతుంది. పరమ ప్రశాంతి లభ్యమవుతుంది.

ఆశారహితంగా చేసిన కర్మకలాప బంధనహేతువుకాదు కామమే బంధన కారణం. ఏ విధమైన కామ్యం స్వార్థం ఆశా లేకుండా నీవు ఆసక్తి రహితంగా రాజ్యపాలనచేయి. నీకు ఆత్మసుఖం లభిస్తుంది. సర్వాశారహితమై సర్వవిస్మరణ పొందిన చిత్తం ఐశ్వర్యవృత్యాలు చూచి విరక్తి జెందుతుంది. స్వస్వరూపంలోనే అభిరుచి పొందుతుంది. స్వస్వరూపానుసంధానంగల ప్రాజ్ఞ శిఖామణీ! సుఖం అనుభవించు.

* ఆయాసం కూడదు *

ఆయాసాత్ సకలోదుఃఖీ నైవం జానాతి కశ్చన
అనేనైవోపదేశేన ధన్యః ప్రాప్నోతి నిర్వృతిమ్ 148

ఆయాసాత్ = శరీర జీవన నిర్వహణార్థశ్రమ వలన; సకలః = సమస్తజనం: దుఃఖీ భవతి = దుఃఖంగలది అవుతున్నది; ఏనం = ఈ విషయాన్ని; కశ్చన = ఏ ఒక్కడునూ; న జానాతి = తెలిసికోలేక యున్నాడు; అనేన ఉపదేశేన ఏవ = ఈ ఉపదేశం అలకించినంతనే; నిర్వృతిం = పరమసుఖం; ప్రాప్నోతి = పొందుచునాడు.

నిష్కామీ! పరిశ్రమచేసి ఆయాసపడి ఏవో అర్థంలేని ఆరాటపడుతూ దుఃఖాలు కొనుక్కొని తెచ్చుకొంటున్నారు ఎవరూ కామ్యము దుఃఖహేతువు అనే సంగతి గుర్తించలేకపోతున్నారు పరిశ్రమ బంధన హేతువు. కామ్యం కష్టకారణం అపేక్షలు ఆపదలకుమూలం నిష్కామ్యసేవ నిర్మల సుఖం ప్రసాదిస్తుంది ఈ ఉపదేశం వినిన సుకృతికి పరమ సుఖం సంప్రాప్తిస్తుంది.

లోకంలో ఎక్కువ మంది జీవన నిర్వహణకోసం జీవనభృతికోసం పరిశ్రమ చేసి చేసి సుఖంకాదు దుఃఖం పొందుతున్నారు. కష్టపడి పనిచేసి ఆశామోహాల కారణంగా దుఃఖాల పాలు అవుతున్నారు. “ఆశ ఆపదలకు మూలం కామ్యకర్మ కష్టాలకు కారణం” అనే జ్ఞానం లేదు. మహాపురుషులు ధన్యాత్ములు స్వార్థరహితంగా కర్తవ్యం నిర్వహిస్తారు కానీ తన కోసమై శ్రమపడరు. ప్రారబ్ధకర్మ శరీర రక్షణ చేస్తుంటుంది. దానికై ప్రయత్నించేయటం అనవసరం. ఇది తెలిసికొని పరమ సుఖం అనుభవించు.

* సుఖ హేతువు *

వ్యాపారే ఖిద్యతే యస్తు నిమేషోన్మేషయోరపి
తస్యాలస్యధురీణస్య సుఖం నాన్యస్య కస్యచిత్ 149

యః = ఎవడు; నిమేషోన్మేషయోః = కన్ను తెరచుట మూయుట అనే; వ్యాపారే = వ్యాపారంలో సైతం; ఖిద్యతే = దుఃఖిస్తున్నాడో; ఆలస్యధురీణస్య = నిష్క్రియాలలో శ్రేష్ఠుడైన; తస్య = అట్టి యోగికి; సుఖం భవతి = సుఖం కలుగు తున్నది; అన్యస్య = ఇతరుడైన; కస్యచిత్ = ఏఒక్కడికి కూడా; న సుఖం = ఆ సుఖంలేదు.

పరమ సుఖీ! చివరకు కనులు మూయడం, కనులు తెరవటం, కూడా శ్రమగా బాధగా భావించే మహాయోగి మహాసుఖం పొందుతాడు. ఇతరులకు ఆ సుఖం లేదు. అనాసక్తి సుఖహేతువు. జీవన్ముక్తులు అసక్తి రహితులు. వారి ధ్యేయం దృష్టి లక్ష్యం ఏక్షణానకూడ చలించదు. ఆ మహాయోగీశ్వరులు సకల మనోవ్యాపారాలను అదుపులో ఉంచి వాటిని లెక్కచేయకుండా నిశ్చల నిర్మల సమాధిలో నిలిచి ఉంటారు. ఆ పరమ సుఖసాగరాన వారు మగ్నులై యుంటారు. సుఖం అనేది వారికే లభ్యమానం.

వ్యాపారులకు ఆయాసమే కానీ ఆనందం ఎక్కడ. నిశ్చల భక్తియోగంలోని నిర్వ్యాపారులకే నిర్మలసుఖం సంప్రాప్తమయ్యేది. లోకంలో వ్యాపారవ్యగ్రులకు దుఃఖమేకానీ సుఖం ఎండమావులే. మనోవ్యాపారం తగ్గినవారికి పరిపూర్ణసుఖం పూర్ణాత్ పూర్ణం అవుతుంది. ప్రవృత్తి ఎక్కువైన కొద్దీ ఎక్కువదుఃఖమేగతి. నివృత్తిగల వారికి నిత్య సుఖం. నిర్మల సుఖం లభిస్తుంది.

* నిర్ద్వంద్వం మంచిది. *

ఇదం కృతం ఇదంనేతి ద్వంద్వైర్ముక్తం యదా మనః
ధర్మార్థ కామ మోక్షేషు నిరపేక్షం తదా భవేత్ 150

ఇదం కృతం=ఇదిచేయబడింది; ఇదం న కృతం=ఇది చేయబడ లేదు; ఇతి=ఇట్లనెడి; ద్వంద్వైః=ద్వంద్వరీతులనుండి; యదా=ఎప్పుడు; మనః = మనస్సు; ముక్తం=ముక్తమైనదో; తదా=అప్పుడు; తత్=ఆ మనస్సు; ధర్మార్థ కామమోక్షేషు=ధర్మార్థకామమోక్షాలందు; నిరపేక్షం భవేత్=నిరపేక్షమైనది అగును

తృష్ణారహితమూర్తీ! ఇది చేశాను ఇది చేయలేదు. అనే ద్వంద్వం నుంచి మనస్సు ముక్తమైనప్పుడు ఆ యోగీశ్వరుడు ధర్మార్థ కామమోక్షాల విషయంలో కూడా ఇచ్ఛా రహితుడై తృష్ణారహితుడై నిశ్చలుడై ప్రకాశిస్తాడు. తృష్ణా రహితుణ్ణి ఇచ్ఛారహితుణ్ణి శీతోష్ణాలు సుఖదుఃఖాలు ఆది ద్వంద్వాలు కూడా ఏవీ బాధించలేవు. అట్టి ఋషిపుంగవుడు సంపూర్ణ ద్వంద్వాలకు అతీతుడుగా అలరారుతుంటాడు. ఆ ఋషివర్యులకే జీవన్ముక్తి సుఖాన్ని అందగలదు.

"బాహ్య ప్రపంచంలో అన్వేషించటం మానుకో. పరమానంద సారం కొరకు నీయందే వెతుకు. నీ యంతరాత్మలోని సత్యంలో శరణు పొందు. ప్రశాంతితో నిండిన కేంద్రంలోనికి పో. శాంతి ఆనందాలు బాహ్యంలో దొరికేవికావు. ధీరుడు వాటిని అంతఃకరణంలోనే సంపాదించుకొంటాడు."

— శ్రీ సత్యసాయి బాబా

* విరక్తి *

విరక్తో విషయద్వేష్టా రాగీ విషయలోలుపః
గ్రహ మోక్ష విహీనస్తు న విరక్తో న రాగవాన్ 151

విషద్వేష్టా = విషయభోగాలపై ద్వేషబుద్ధిగలవాడు; విరక్తః = విరక్తుడు అనీ: విషయలోలుపః = విషయసుఖాభిలాషగలవాడు; రాగీ = రాగి అనీ(అనటం లోకంతీరు) గ్రహమోక్షవిహీనస్తు = స్వీకార విసర్జనలు లేని జ్ఞాని: న విరక్తః = విరక్తుడూకాదు: న రాగవాన్ = అనురాగీ కాదు.

నిష్కామీ! విషయాసక్తుడు అనురాగి విషయ ముక్తుడు విరాగి గ్రహణ త్యాగ రహితుడు విరక్తుడూకాదు అనురక్తుడూకాదు. అతడు విలక్షణుడు విశేషజ్ఞుడు. సకామీ కంటే నిష్కామి విశిష్ట తత్త్వజ్ఞుడు జీవన్ముక్తికి యోగ్యుడు.

స్త్రీ పుత్ర సంసార బంధనాలు త్యజించాలనే భావంతో సంసారం ఎడల ద్వేషదృష్టితో ఆత్మతత్త్వంపై అనురక్తికలిగినవాడు విరక్తుడు. విషయ వాసనలపై కామ్యం కలిగి విషయ భోగాలందు ఆసక్తితో చిత్తం గలవాడు అనురాగి. విషయ గ్రహణం కానీ పరిత్యాగం కానీ లేనివాడు అనురక్తుడు. విరక్తుడు కంటె విశిష్టుడు విలక్షణుడు. అతడు జీవన్ముక్తుడు.

* సంసారం వృక్షం *

హేయోపాదేయతా తావత్ సంసార విటపాంకురః
స్పృహా జీవతి యావద్వై నిర్విచార దశాస్పదమ్ 152

యావత్ = ఎంతకాలం; స్పృహా = తృష్ణ; యావత్ = ఎంత కాలం; నిర్విచారద శాస్పదం = ఆత్మవిచారస్థితి లేనిదశ; జీవతి = జీవించునో; తావత్ = అంతవరకూ:

హేయఉపాదేయతా = త్యాజ్యగ్రహణభావద్వయం; సంసారవిటపాంకురః = సంసార వృక్షఅంకురాలు; జీవతి = జీవిస్తుంటాయి.

ద్వంద్వరహితా! తృష్ణ మిక్కిలి చెడ్డది అవివేకస్థితి ఉన్నంతవరకూ తృష్ణ మానవుణ్ణి వెంటాడుతుంది. హేయోపాదేయాలు సంసారవృక్ష శాఖాంకురాలు. అజ్ఞాన తృష్ణ ఉన్నంతవరకు ఇవి ఉంటాయి. ఆత్మతత్త్వ విచార శూన్యదశతృష్ణకు వృద్ధిదశ. ఆదశలో మానవుడు కేవలం భోగభాగ్యాలు విషయవిలాసాలలోనే మునిగి పోతాడు. తత్త్వ విచారం గూర్చి ఆలోచనేరాదు. అది తృష్ణాకాలదశ.

తృష్ణ జీవన్ముక్తికి పనికిరాదు. ఒకానొక వేళ ప్రారబ్ధవశాత్తు జీవన్ముక్తులలో హేయోపాదేయాలున్నా ఏమీ హానిలేదు. జీవన్ముక్తులు అన్ని నియమాలకు అతీతులు. మనోబుద్ధి చిత్తాహంకారాలు లయమైతేనే పూర్ణదశవస్తేనే సంసార వృక్షాంకురాలు నశిస్తాయి. వేయించిన గింజలకు మొలక పోతుంది. జ్ఞానాగ్నిలో మానసికమైన మొలకలు కాచబడాలి.

* * *

జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున

— భగవద్గీత

* ప్రవృత్తి నివృత్తి పదులు *

ప్రవృత్తౌ జాయతే రాగో నివృత్తౌ ద్వేష ఏవహి
నిర్ద్వంద్వో బాల వద్ధీమాన్ ఏవ మేవ వ్యవస్థితః 153

ప్రవృత్తౌ = ప్రవృత్తియందు; రాగః జాయతే = అనురాగం కలుగుతున్నది; నివృత్తౌ = విషయ నివృత్తియందు; ద్వేషః జాయతే = ద్వేషం పుట్టుతున్నది; నిర్ద్వంద్వః = నిర్ద్వంద్వరీతిలో; ఏవమేవ = ఈ ప్రకారమే; బాలవత్ = బాలుడివలె; ధీమాన్ = బుద్ధిమంతుడు; వ్యవస్థితః = ఉంటున్నాడు.

ప్రవృత్తిలో రాగం పెరుగుతుంది కనుక ధీమంతుడు ద్వంద్వరహితుడు కావాలి. విషయాలపై ద్వేష భావంగల నివృత్తిమార్గం వృద్ధి కావాలి. యోగి ఒక వేళ ప్రారబ్ధవశాత్తు ప్రవృత్తి మార్గంలో పడినా బాలునివలె అందు క్రీడిస్తుంటాడు,

కానీ అందు ఆసక్తి విరక్తి ఏమీ చూపడు. ప్రవృత్తి మార్గంలో ఉన్న వాడికి క్రమ క్రమంగా విషయ భోగాలపై ఆసక్తి పెరగటం సహజం. ఈ వాంఛలు పెరిగి పెరిగి ఆకాశాన్ని అంటుతాయి.

విషయాలపై విరక్తి నివృత్తి కలిగితే క్రమక్రమంగా విషయ భోగాలపై ద్వేషం విరక్తి ప్రవృద్ధి అవుతుంది. అభ్యాసం చేయటంలో ఉంది అంతా. అయితే ఎంతటి వారైనా ప్రారబ్ధకర్మ వశం అవుతారు. పండితుడు కూడా అమాయకుడైన బాలుడువలె శుభాశుభాలు గణించకుండా సంచరిస్తాడు. ఆసక్తి విసర్జిస్తే ఇవి ఏమీ బాధించవు. ఆసక్తితో చేసిందే బంధ హేతువు.

* వీ త రా గి *

హాతుమిచ్ఛతి సంసారం రాగీ దుఃఖజిహాసయా
వీతరాగో హి నిర్దుఃఖః తస్మిన్నపి నఖిద్యతి 154

రాగీ = రాగ సహితుడు; దుఃఖ జిహాసయా=దుఃఖనివృత్తియందు ఇచ్ఛగల వాడుగుటచేత; సంసారం హాతుం = సంసారం విడవాలని; ఇచ్ఛతి = కోరుతున్నాడు; వీత రాగః = రాగరహితుడు; నిర్దుఃఖః = దుఃఖంలేనివాడు కనుక; తస్మిన్ అపి = ఆ సంసారవిషయమై; న ఖిద్యతిహి = దుఃఖింపడుగదా!

స్వస్వరూపఅనుసంధానంగల ప్రాజ్ఞుడా! సాంసారికపురుషుడు దుఃఖనివృత్తి కాంక్షించి భవబంధాలన్నీ త్యజించాలని జ్ఞానియై నిశ్చయించుకొంటాడు. తరువాత క్రమంగా ఆ సంసారరాగాన్ని వదిలి దుఃఖదూరుడవుతాడు. ఇక సాంసారిక దుఃఖాలు ఆ పురుషుణ్ణి బాధించలేవు. సర్వకర్మలు చేస్తున్నా వాడికేమీ అంటవు. విషయాను రాగి విషయవాసనవల్ల పుట్టుకవచ్చే దుఃఖాలు దూరంచేసుకోవటానికి సంసారత్యాగం కోరుకొంటాడు. వీతరాగుడు సంసారంలో సంచరిస్తూన్న ఖేదాన్ని పొందడు.

వృక్ష మూలంలోని కోటరంలో అగ్ని పెడితే ఆ చెట్టుకు పచ్చని ఆకులు చిగుళ్ళు ఉత్పన్నంకావు. అలానే పురుషుడి హృదయంలో అజ్ఞాన అగ్ని రాజుకుం టూంటే శాంతి ఏ మాత్రం కలుగదు. సంసార దుఃఖాలున్నంతవరకు మానవుడికి శాంతి ఉండదు. దుఃఖ నివృత్తి అయితేనే సుఖం లభిస్తుంది.

### * అభిమాని జ్ఞాని కాదు *

యస్యాభిమనో మోక్షేఽపి దేహేఽపి మమతా తథా
న చ జ్ఞానీ న వా యోగీ కేవలం దుఃఖభాగసౌ 155

యస్య మోక్షే = ఎవనికి మోక్షమందు; అభిమానః = అభిమానంకలదో; తథా= అలానే; యస్య దేహేఽపి= ఎవనికి దేహంపై; మమతా = మమత్వమున్నదో; సః= అట్టివాడు; న చ యోగీ = మరి యోగీకాదు; న వా జ్ఞానీ= లేక జ్ఞానీకాదు; అసౌ కేవలం = అట్టివాడు కేవలం; దుఃఖభాక్ = దుఃఖభాజనుడు.

అంతేవాసీ ! దైహిక విషయాలలోకానీ ఆముష్మిక విషయాలలోకానీ మమత అభిమానాలు కలవాడు జ్ఞానీకాదు యోగికాదు కేవలం దుఃఖభాగి. "నేను జ్ఞానిని. త్రికాలదర్శిని. ముక్తపురుషుణ్ణి" అని డాంబికాలు పలికేవాడు జ్ఞానికాదు. అజ్ఞాని మాత్రమే. అలానే నేను యోగాభ్యాసం గలవాణ్ణి. ప్రాణాయామం పట్టేవాణ్ణి, అష్టాంగ క్రియలు ఎరిగిన వాణ్ణి అనేవాడు యోగికాదు. ఋషికాదు. అట్టివారు కేవలం దుఃఖభాగులే సుమా!.

• • •

ధర్మవిధినెవ్వడు మనోగతంబులైన సర్వకామంబులను గడు సన్న్యసించి
అంచితాత్మాత్మ సంతుష్టుడగుచునుండు అతడాత్మస్థిత ప్రజ్ఞుడగు కుమార!
—సీతారామాంజనేయ సంవాదం 3-147

### * ఇది విస్మరణోపదేశం *

హరో యద్యుపదేష్టా తే హరిః కమలజోఽపి వా
తథాఽపి న తవ స్వాస్థ్యం సర్వ విస్మరణా దృతే 156

తే = నీకు; హరః = శివుడు; హరిః వా= లేక హరి; కమలజ అపివా= లేక బ్రహ్మదేవుడు; ఉపదేష్టాయది= ఉపదేశకుడైనప్పటికీ చివరికి; తథాఽపి = అయినా కూడా; సర్వవిస్మరణాత్ ఋతే = సర్వవిస్మరణ కలుగకుండా; తవ = నీకు; న స్వాస్థ్యం= శాంతి కలుగదు.

ప్రియశిష్యా! నీ ఉపాసనాదేవత శివుడు లేక విష్ణువు కాక బ్రహ్మ అని భావిస్తే శాంతి లభించదు. అన్నీ విస్మరించినప్పుడే శాంతి. అలాకాక విస్మరించని వారు శాంతి పొందలేరు స్వాస్థ్యం కలుగదు. అన్నీ మానసిక త్యాగం చేసినప్పుడే సుఖశాంతులు కలుగుతాయి. నీకు శంకరుడు ఉపదేశం చేసినా విష్ణుమూర్తి ఉపదేశం చేసినా లేక బ్రహ్మదేవుడు ఉపదేశం చేసినా ఆత్మసుఖం లభ్యంకాదు. విషయాలు విస్మరించినప్పుడే శాంతి సుఖం ఆనందం ప్రాప్తిస్తాయి. ఆత్మతత్త్వోపదేశానికి ముందు విషయత్యాగం చాలా అవసరం.

◆ ◆ ◆

చిరమారాధితో ప్రేష్య పరమప్రీతి మానసి
నా విచారనతో జ్ఞానం దౌతుం శక్నోతి మాధవః

సాధకుడు ఎంతభక్తుడైనా, తపశ్శాలి అయినా అతనికి విష్ణుమూర్తి కూడా జ్ఞానం ఇవ్వలేడు. ఆత్మవిచార అనుభవం అతడికి స్వయంగా రావలసిందే.

—యోగవాసిష్ఠం



# ఆత్మ తత్త్వజ్ఞ స్వరూపం

*  జ్ఞానఫలం  *

అష్టావక్ర ఉవాచ—

తేన జ్ఞానఫలం ప్రాప్తం యోగాభ్యాస ఫలం తథా
తృప్తః స్వచ్ఛేంద్రియో నిత్యం ఏకాకీ రమతే తు యః  157

యః = ఎవడు; నిత్యం = ఎల్లప్పుడు; తృప్తః = సంతృప్తుడైయుండునో, స్వచ్ఛేంద్రియః = ఇంద్రియశుద్ధిగలవాడై; ఏకాకీ = ఎట్టిసంగమంలేనివాడై; రమతే = ఆనందించుచున్నాడో; తేన = అట్టివాడిచేత; జ్ఞానఫలం = జ్ఞానఫలం; తథా = అలానే; యోగాభ్యాసఫలం = యోగ అభ్యాసఫలం; ప్రాప్తం = పొందబడుతున్నది.

అష్టావక్ర మహర్షి, జనకమహారాజుకు ఇలా బోధ చేయసాగాడు. ఆత్మజ్ఞానీ! విజ్ఞానఖనీ! ఆత్మజ్ఞానఫలం జ్ఞానదశలు తెలిసికో! నిత్యసంతృప్తుడైనవాడు సచ్ఛమూ పరిశుద్ధమూ అయిన ఇంద్రియ బలముకలిగినవాడు ఏకాంతంలో పరమానందం అనుభవిస్తాడు. ఆ యోగపురుషుడు జ్ఞానఫలం యోగాభ్యాసఫలం పొందుతాడు.

ఆత్మజ్ఞానఫలం అట్టి మహాత్ములకేలభ్యం. యోగఫలంకూడా వారిదే. అయితే ఆతడు విషయ భోగాపేక్షయందు రాహిత్యబుద్ధి కలిగి ఉండాలి. అట్టి పురుషపుంగవుడే సంతృప్తుడు. అట్టివారి ఇంద్రియాలు పరిశుద్ధమైనవి. విషయాభిలాష కించిత్తు కూడ వారిలో ఉండదు. ఏకాంతవాసం వారికి చాలా ఇష్టం ఏకాంతంలోనే శ్రీకాంతుణ్ణి దర్శిస్తారు. స్పర్శిస్తారు భాషిస్తారు. ఏకాంతంలోని పరమానందం అతి మధురం.

•  •  •

వాసో బహూనాం కలహో భవే ద్వార్తా ద్వయోరపి
ఏకాకీ విచరే ద్విద్వాన్ కుమార్యా ఇవ కంకణః

—దత్తాత్రేయ చరిత్ర

దత్తాత్రేయుడు ఒక గృహానికి భిక్షకు వెళ్ళాడు. ఆ యింటిలో యజమాని కుమార్తె ఒక్కతే ఉంది. వచ్చిన దత్తాత్రేయ మహర్షికి ప్రణామంచేసి "స్వామీ ! రెండు క్షణాలు విశ్రాంతి తీసుకోండి. వడ్లు దంచి బియ్యంచేసి భిక్షతెస్తాను" అంది. మహర్షి ఆమోదించాడు. ఆ అమ్మాయి వడ్లు దంచసాగింది. అపుడు చేతికిగల గాజులు దంపుడుకి ధ్వనిచేయసాగాయి అది విని ఆ యువతి సిగ్గుపడి ఒక్కగాజు మాత్రముంచుకొని మిగిలినవి తొలగించి నిశ్శబ్దంగా వడ్లు దంచి భిక్ష పెట్టింది. దత్తాత్రేయస్వామి అది గ్రహించి ఇలా విచారణచేశాడు. ఏకాంతం ఎంత సుఖం ! ఎంత శాంతి! ఒక్క కంకణం నిశ్శబ్దం మనకి శాంతి నందింపింది.

ఎక్కువ మంది ఉంటే కలహాలు. ఇద్దరే ఉంటే కబుర్లు. శ్రవణ మనన ధ్యానాదులుసాగవు. ఒక్కడే ఉంటే ధ్యానం ఆత్మవిచారణ ఈ అమ్మాయిచేతి ఏకైక కంకణంవలె జపం శాంతంగా సాగుతుంది. జీవన్ముక్తి కోరుకొనేవాడు ఏకైకంగా ఉండాలి

* చిజ్జగత్తు *

న కదా చిజ్జగత్యస్మిన్ తత్వజ్ఞో హంత ఖిద్యతి
యత ఏకేన తేనేదం పూర్ణం బ్రహ్మాండ మండలమ్ 158

తత్త్వజ్ఞః=తత్త్వజ్ఞాని; అస్మిన్ జగతి= ఈ జగతినందు; కదాచిత్=ఒకానొక్కప్పుడుకూడా; న ఖిద్యతే=దుఃఖం పొందడు; హంత=ఇది నిశ్చయం; యతః=ఎందువలన అనగా; ఏకేన=ఒక్కడగు; తేన=అతనిచేత; బ్రహ్మాండ మండలం=బ్రహ్మాండమండలం; పూర్ణం=నిండింపబడినది

విశ్వపురుషా ! తత్త్వజ్ఞుడు ఈ జగత్తునుగూర్చి ఎన్నడూ విచారం పొందడు. ఇది అక్షరాలా సత్యం అట్టి ఏకైక మహాత్ముని వల్లనే ఈ బ్రహ్మాండ మండలం నిండి ఉంది. పూర్ణాత్పూర్ణమై ప్రకాశిస్తుంది ఈ సంసార చంక్రంలో తత్త్వవేత్త అయిన జ్ఞానవంతుడు ఎన్నడూ దుఃఖాన్ని కించిత్తుకూడా పొందడు. నేనే సర్వవ్యాపిని సర్వత్ర నిండియున్నది నా తత్త్వమే. నా రూపమే నా భావమే. నేనే. ఎక్కడా ద్వైతం కనిపించదు. ద్వైతం ఉంటేనే దుఃఖం. అంతా ఏకం సత్. వేరైన భావం కలిగితేనే విచారం. వేర్పాటు వాదంలోనే విషాదం. ఆత్మజ్ఞాని దైహిక సుఖాలు పరిగణింపడు. ఆత్మేతరాలు అతినికృష్టాలు.

తీయ తీయని అందుగు చిగుళ్ళు ఆరగించే హస్తిరాజం వేప చిగుళ్ళకు ఆశపడుతుందా? అలానే స్వాత్మారాముడైన ఆత్మజ్ఞాని తత్త్వ ఆనందామృతం అనుభవించటానికి అభిలషిస్తాడు కానీ విషయసుఖాలు కోరుకుంటాడా! ఎన్నడూ కోరడు.

• • •

నిరపేక్షంమునిం శాంతం నిర్వైరం సమదర్శినమ్
అనువ్రజా మహంనిత్యం పూతమేత్యంఘ్రి రేణుభిః

సత్యద్రష్ట అయిన సమదర్శనుడు తనను సర్వజీవులుగా భావిస్తాడు. సంతోషంగా చరిస్తాడు. నేనే ఆ యోగిని అనుసరిస్తాను. ఆ ఋషి పావనధూళిలో పునీతుడనవుతాను— అంటాడు శ్రీహరి.

—భాగవతం

* స్వారాముడు *

న జాతు విషయాః కేఽపి స్వారామం హర్షయంత్యమీ
సల్లకీ పల్లవ ప్రీతం ఇవేభం నింబ పల్లవాః 159

సల్లకీ పల్లవ ప్రీతం=అందుగు చిగుళ్ళపై ప్రీతిగల; ఇభం=ఏనుగును; నింబపల్లవాః=వేపచిగుళ్ళు; న హర్షయంతి ఇవ=సంతోషపెట్టజాలని యట్లు; అమీ=ఈ; కే=ఏ; విషయా అపి=విషయ భోగాలుకూడా; స్వారామం=స్వాత్మారాముణ్ణి; న హర్షయంతి= సంతోషపెట్ట జాలవు.

విషయ విరాగి! సత్యానురాగి! ఏ ఒక్క విషయవాసనను కూడా స్వాత్మారాముడు హర్షించడు. సల్లకీ పల్లవాలతో సంతృప్తి చెందే మదమాతంగ రాజాలు వేప ఆకులకు హర్షిస్తాయా! స్వాత్మారాముడికి ఆత్మతత్త్వామృతమేకావాలి. స్వాత్మారాముడంటేనే ఆత్మానందరసపాన తత్పరుడు అని.

ఆత్మరాముడికి విషయ వాసనలు సహింపవు. విషయ జన్యసుఖం అశాశ్వతం మిథ్య. ఆత్మజ్ఞానులకు విషయానందాలు విషతుల్యాలు. సల్లకీ పల్లవ లతలు మధురాతి మధురాలు. అవి ఆరగించే దంతావళాలు వేపాకులు మూచూస్తాయా! ఆత్మానంద అనుభవం రుచి చూచిన వాడు విషయానందంలో క్షణం ఉంటాడా! విషయ సుఖం వాంఛిస్తాడా! వాంఛించడు.

# నిరాకాంక్షి

యస్తు భోగేషు భుక్తేషు న భవత్యధివాసితా
అభుక్తేషు నిరాకాంక్షీ తాదృశో భవ దుర్లభః 160

యః = ఎవడు: భుక్తేషు = అనుభవించదగిన; భోగేషు = భోగాలవిషయమై అధివాసితః = ఆసక్తుడు; న భవతి = కాడో; చ = మరియు; అభుక్తేషు = అభుక్త పదార్థాల విషయమై: నిరాకాంక్షీ = ఆశారహితుడో; తాదృశః = అట్టివాడు; భవదుర్లభః = ప్రపంచంలో దుర్లభుడు.

నిత్యసంతోషీ! మృదుభాషీ! భోగాలు అనుభవిస్తూ భోగాసక్తుడు కానివాడు తనకు లభించని భోగాలు కావాలి అని అపేక్షించనివాడు ధన్యుడు. అట్టివాడు ఆత్మ సంతృప్తితో సంతోషంగా ఉంటాడు. ప్రపంచంలో ఇట్టిఆనంద పురుషులు అరుదు. ఎక్కడో ఏ ఒక్కరో ఇద్దరో ఉంటారు.

# మహాశయుండు

బుభుక్షురిహ సంసారే ముముక్షురపి దృశ్యతే
భోగ మోక్ష నిరాకాంక్షీ విరలో హి మహాశయః 161

బుభుక్షుః = భోగేచ్ఛ గలవాడు: ముముక్షుః = మోక్షేచ్ఛగలవాడు: అపి = కూడా; ఇహ సంసారే = ఈ ప్రపంచ జంజాటంలో; దృశ్యతే = కనిపిస్తున్నారు; హి = అయితే; భోగ మోక్ష నిరాకాంక్షీ = భోగ మోక్షాలపై ఆ కాంక్షారహితుడు డగు; మహాశయః = మహాత్ముడు; విరళః = అరుదుగా ఉన్నాడు.

ఇచ్ఛారహితా! భోగాభిలాషులు మోక్షాభిలాషులు లోకంలో విహరిస్తుండటం మనం చూస్తున్నాము. కానీ భోగేచ్ఛ లేనివాడే మహాపురుషుడు అట్టివాడు అరుదుగా ఉంటాడు. యోగులు కాంక్షా రహితులు కావాలి. పరబ్రహ్మం విషయంలో పరిశుద్ధ అంతఃకరణతో పరిపూర్ణ విజ్ఞాని అయి విశ్వాత్ముడిని ఆరాధించాలి.

శ్రీ కృష్ణ భగవానుడిదే ప్రవచించారు —

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః

వేలకొలది పురుషులలో ఏ ఒక్కడో అంతఃకరణ శుద్ధికై ప్రయత్నిస్తాడు. ఆ శుద్ధ పురుషులలో ఎక్కడో ఒక్కడు ఆత్మతత్త్వం తెలిసికోగల్గుతాడు. నీవు ఆత్మతత్త్వం తెలిసికొన్నావు ధన్యుడవు. భోగాపేక్షగలవాడు బుభుక్షువు మోక్షాపేక్ష గలవాడు ముముక్షువు బ్రహ్మతాదాత్మ్యం కోరి నిర్గుణ బ్రహ్మంలో అంతఃకరణ లయించినవాడు మహాశయుడు.

## ఉదార చిత్తుడు

ధర్మార్థ కామ మోక్షేషు జీవితే మరణే తథా
కస్యాప్యుదారచిత్తస్య హేయోపాదేయతా న హి 152

ధర్మార్థ కామ మోక్షేషు=ధర్మార్థ కామ మోక్షా లందు; జీవితే=జీవితమందు; తథా=అట్లే; మరణే=మరణ విషయ మందు; కస్య=ఒకానొక; ఉదారచిత్తస్య= ఉదారచిత్తుడికి మాత్రమే; న హేయోపాదేయాతాహి=హేయోపాదేయాలుండవు కదా!

శిష్యచూడామణీ! ధర్మార్థకామ మోక్షాల విషయంలోనూ జీవన మరణ విషయాలలోనూ మహోదారపురుషులకు హేయోపాదేయాలు లేవు. అట్టి మహోదార పురుషులు లోకంలో దుర్లభం. వారు లౌకిక విషయాలలో ఉదాసీనులు. వారికి దుఃఖాలు సుఖాలు అనేవి లేవు. వారు సమచిత్తులు స్థితప్రజ్ఞులు. వారు అద్వైత ఆత్మానందంలో పరిపూర్ణులు.

సుఖదుఃఖాలు సాపేక్షకాలు. దుఃఖంకలిగిన వాడికి సుఖం, సుఖం కలిగిన వాడికి దుఃఖం క్రమంగా వస్తుంటాయి. నీవు సుఖదుఃఖాలకు అతీతంగా ఉన్నావు. అలా ఆత్మానందం పరిపూర్ణంగా సదా అనుభవించు.

• • •

మనసు మనసునంద మడచి ఆత్మని ఆత్మ
యందు కాంచునట్టి యతడు సర్వ
విదుడు—సకలభూత వితతియందును తను
గనుచునుండు నిర్వికల్పకముగ

— తిక్కన (భారతం - అశ్వమేధపర్వం)

## విజ్ఞుడు విలయాభిలాషి కాదు

వాంఛా న విశ్వవిలయే న ద్వేషః తస్యచ స్థితౌ
యథా జీవికయా తస్మాత్ ధన్య ఆస్తే యథాసుఖమ్ 163

విశ్వవిలయే = ప్రపంచ ప్రళయమందు; వాంఛా = వాంఛగానీ: తస్య = ఆ విశ్వం యొక్క; స్థితౌ = సుస్థితియందు; ద్వేషః = ద్వేషంగానీ; యః = ఎవడు; [న ప్రాప్నోతి = పొందడో] అట్టివాడు. ధన్యః = ధన్యుడు; సః = వాడు; యథా జీవికయా = యథాప్రాప్త ఆజీవికద్వారా; యథా సుఖం = సుఖపూర్వకంగా; ఆస్తే = ఉంటున్నాడు.

సంతోష్! విశ్వ విలయంలో కానీ, విశ్వసంస్థితిలో కానీ ద్వేష తోషాలు నీకులేవు. నీవు ధన్య పురుషుడవు. యథాప్రాప్త ఆజీవికద్వారా సంతృప్తిగా ఉన్నావు. పరమసుఖం నీసొత్తు. ఏవిద్వాంసుడు విశ్వంలయంకావాలని కోరుకోడో ఆ పురుషుడు విశ్వం ఇలానే స్థిరంగా ఉండాలని కోరుకోడు. పోలేదే అని వాంఛించడు.

స్థితిలయాలను గూర్చి ద్వేషాకాంక్షలు లేవు. మరి లయద్వేషాలు గూర్చి కాంక్ష ద్వేషాలు లేవు. విశ్వస్థితి లయాలకు ఆతడు సాక్షీ భూతుడు మాత్రం. అధిష్ఠానుడు.

## ఆత్మ సుఖాను వర్తుడు

కృతార్థోఽనేన జ్ఞానేనేత్యేవం గళిత ధీఃకృతీ
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్నాస్తే యథా సుఖమ్ 164

అనేన = ఈ; జ్ఞానేన = జ్ఞానం చేత; అహం = నేను; కృతార్థః = కృతార్థుడను; ఇత్యేవం = ఈ ప్రకారంగా; గళిత ధీః = జారిపోయిన బుద్ధిగల వాడైన; కృతీ = జ్ఞాని; పశ్యన్ = చూచుచూ; శృణ్వన్ = వినుచూ; స్పృశన్ = తాకుచూ; జిఘ్రన్ = ఆఘ్రాణించుచూ; అశ్నన్ = తినుచూ; యథాసుఖ = సుఖ పూర్వకంగా; ఆస్తే = ఉంటున్నాడు.

మహాశయా! సుకృతీ! ఇప్పుడు ప్రాప్తించిన ఈ జ్ఞానంతో నేను కృతార్థుణ్ణి అనుకొనే బుద్ధ్యహంకార దూరుడైన జ్ఞానపురుషుడు ధన్యుడు. ఆ పురుష పుంగవుడు ఐహికంగా చూస్తున్నా, శ్రవణంచేస్తున్నా, స్పర్శిస్తున్నా, ఆఘ్రాణిస్తున్నా, భోజనం చేస్తున్నా, భాషిస్తున్నా. జనంలో వ్యవహరిస్తున్నా, ఆత్మానందం లక్ష్యంగా ఆనందంగా సంచరిస్తాడు.

అద్వైత ఆత్మజ్ఞానం లభించిన కృతార్థుడా మహాశయుడు. అటువంటి సుబుద్ధి విద్యా పాండిత్యాల వల్ల లభించేదికాదు. అహంకారాదులు శారీరకసుఖాలు వాంఛించక సుఖంగా ఉంటాడు. బాహ్యానికి అన్ని పనులూ చేస్తుంటాడు కాని ఇంద్రియాలకు వశంకాడు. దేహసంబంధ నిత్య కృత్యాలు చేస్తూ సమచిత్తం స్థితప్రజ్ఞ కలిగి ఉంటాడు. అతడు బ్రహ్మజ్ఞాని. బ్రహ్మాఖ్యుడు. బ్రహ్మస్వరూపుడు.

## క్షీణ సంసార సాగరుడు

శూన్యాదృష్టిర్వృథా చేష్టా వికలానీంద్రియాణి చ
న స్పృహా న విరక్తిర్వా క్షీణ సంసారసాగరే 165

క్షీణ సంసారసాగరే=సంసారసాగరం క్షీణించినదగుచుండగా దానియందు: దృష్టిః=దృష్టి; శూన్యాః=శూన్యమగుచున్నది; చేష్టాః = చేష్టలు; వృథా = వ్యర్థమగుచున్నవి: ఇంద్రియాణి=ఇంద్రియాలు; వికలాని=వికలమగుచున్నవి: నా న స్పృహా=మరియు ఇచ్ఛ లేదు; న విరక్తిః=విరక్తిలేదు.

సంసార సాగర కల్లోలాలు శాంతించాయి. సుస్థిర నిశ్చిత శూన్య దృష్టి అలవడింది. ఇంద్రియ వ్యాపారాలు ఉపశమించాయి. ఆ యోగీశ్వరుడికి ఇక రక్తి లేదు విరక్తి లేదు. సాంసారిక విషయ భోగేచ్ఛలు లేని మహాపురుషుడు ధన్యుడు. వారిని సంసారబంధాలు వీడిపోతాయి. వారికి ఏ విధమైన ఆకాంక్షలూ లేవు విరక్తుడు కావాలని కోరిక కూడా లేదు. రక్తుడు అనే మాటేలేదు. వృధాచేష్టలే చేస్తుంటాడు.

ఆ పురుషపుంగవుడి మనస్సు శరీరేంద్రియాదులు బాలుడు ఉన్మత్తుడు వలె ఇచ్ఛలేకుండ ఆసక్తి లేకుండ పనిచేస్తుంటాయి. కాంక్షా శూన్యాలు అవి. శారీరక చేష్టలు కూడా ఆకారరహితాలు. ఇంద్రియాలు పరవశాలు. అవిఏమీ ముందు వెనుకలు విశేష నిర్ణయాలు నిశ్చయాలు తీసుకోవు. అవి దుర్బలాలు. ఆత్మాధీనాలు.

• • •

యా నిశా సర్వ భూతానాం తాస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రంతి భూతాన్ని సా నిశా పశ్యతో మునేః

అన్ని భూతాలు నిద్రిస్తున్న నిశాసమయం మునీశ్వరులకు పగలు. భూతాలు నిద్రిస్తున్నప్పుడు ఋషి మేలుకొనియుంటాడు.

— భగవద్గీత

# ముక్త చేతస్కుడు

న జాగర్తి న నిద్రాతి నోన్మీలతి న మీలతి
అహో పరదశా క్వాపి వర్తతే ముక్తచేతసః 166

న జాగర్తి = మేల్కొనుటలేదు; న నిద్రాతి = నిద్రించుటయూ లేదు, న ఉన్మీలతి=కంటిరెప్ప విప్పుటలేదు; న మీలతి=మూయుటయూ లేదు; ముక్త చేతసః=ముక్తచేతసుడగు జ్ఞానికి; క్వాపి=ఒకానొక; పరదశా=ఉత్కృష్టదశ; వర్తతే=ఉంటున్నది; అహో!=ఆ స్థితికల్గుట ఆశ్చర్యం.

ఓ పురుషశ్రేష్ఠా ! జ్ఞానపరిష్ఠా ! ముక్త పురుషుని దశ చాలా ఉత్కృష్ట మైనది. ఆ మహద్దశ ఇట్టిదని పర్ణించటానికి సాధ్యంకాదు. అది అత్యాశ్చర్యకరం. ఆ మహాజ్ఞాని జాగృతమైయుండడు. అలా అని సుషుప్తినెందడు. కన్ను మూయడు అలా అని కన్నువిప్పి చూడడు. ఆ దశ అపూర్వం - అద్భుతం - అనిర్వచనీయం - అవర్ణనీయం.

మహోత్కృష్ట విశిష్టజ్ఞానుల స్వభావమే ఇంత. మైమరచి నిద్రిస్తున్నాడా ? లేదు. మేలుకొని చూస్తున్నాడా? లేదు. ఈ విషయాలు గూర్చి ఆలోచిస్తున్నాడా? లేదు. ఏమి చేస్తున్నాడు? ఆత్మతత్త్వ విభూతిలో నిమగ్నమై పరమానంద సాగరంలో తేలుతున్నాడు. ఆ యోగి శాంతచిత్తుడు, మహాజ్ఞాని, పరమహంస ఆయనది అలౌకిక తురీయ అవస్థ అత్యద్భుతం. జీవుడికి ముఖ్యంగా మూడు అవస్థలు. జాగ్రత్, స్వప్న, సుషుప్తి. ఈ మూడింటికి అతీతమయినది తురీయం.

ఆత్మజ్ఞాని అనుభవించేది తురీయాతీతావస్థ. ఆత్మజ్ఞానికది నిత్యనివాసం. అది పరదశ. పరమోత్కృష్టదశ. జాగ్రదవస్థలోని జీవుడు విశ్వుడు. స్వప్నావస్థలోని

జీవుడు తైజసుడు. సుషుప్త్యవస్థలోని జీవుడు ప్రాజ్ఞుడు. తురీయావస్థలోని జీవుడు తురీయుడు. తురీయాతీతావస్థలోని జీవుడు ఆత్మస్వరూపుడు. సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపుడు.

## వాసనా విముక్తుడు

సర్వత్ర దృశ్యతే స్వస్థః సర్వత్ర విమలాశయః
సమస్త వాసనో ముక్తో ముక్తః సర్వత్ర రాజతే 167

ముక్తః=జీవన్ముక్తుడు; సర్వత్ర = అన్నిస్థలాలలోనూ సదా; స్వస్థః= ఆరోగ్యంగా ప్రశాంతంగా ప్రసన్నుడై; సర్వత్ర = అన్నిసమయాలలోను సదా; విమలాశయః = నిర్మలాశయుడై; సర్వత్ర = అంతటా అన్నిపరిస్థితులలోనూ; సమస్తవాసనా ముక్తః = సమస్త వాసనా రహితుడై; దృశ్యతే = కనిపిస్తాడు; చ రాజతే=మరియు ఆనందమూర్తియై విరాజిల్లుతున్నాడు.

హే జీవన్ముక్తపురుషా! ఇది అజ్ఞానుల అలౌకికదశ. వారు ముక్త పురుషులు; సర్వవిధాల సర్వత్ర సర్వదా శాంతస్వభావులు. వారు నిర్మలాంతఃకరణ కలిగిన విమలాశయమూర్తులు వారు సర్వ విషయ వాసనారహితులు. జీవన్ముక్తులు సర్వత్ర సుఖదుఃఖాలలోకూడా స్వస్థచిత్తులు. అజ్ఞానులవలె వారు సుఖాలకు హర్షించరు. దుఃఖాలకు శోకించరు. జ్ఞానవంతులకు సుఖదుఃఖాలలో హర్ష శోకాలు సమానం.

అజ్ఞానికి మిత్రులపై బంధువులపై అనురాగ బంధాలు అధికం. శత్రువులపై పరాయివారిపై ద్వేషాలు ఎక్కువ. జ్ఞానులకు శత్రుమిత్రులు సమానం. విద్వాంసులు అంటే విషయ వాసనారహితులు. వారు విద్వాంసులు. అన్ని దశలలోను వారు సమచిత్తం శాంతచిత్తం గలవారు.

## ముక్తపురుషుడు

పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ నశ్నన్ గృహ్ణన్ వదన్ వ్రజన్
ఈ హితానీ హితైర్ముక్తో ముక్త ఏవ మహాశయః 168

పశ్యన్=చూస్తూ; శృణ్వన్=వింటూ; స్పృశన్=స్పృశిస్తూ; జిఘ్రన్=ఆఘ్రాణిస్తూ; అశ్నన్=భుజిస్తూ; గృహ్ణన్=పదార్థాలు గ్రహిస్తూ; వదన్=భాషిస్తూ; వ్రజన్ = ఇవన్నీచేస్తూ; ఈహితానీహితైః = రాగద్వేషాల నుండి; ముక్తః=విడిపడిన; మహాశయః=మహాత్ముడు; ముక్త ఏవ=ముక్తుడే అగును.

మహాశయా! మహాజ్ఞాని బాహ్యానికి సామాన్యుడివలె కనిపిస్తాడు. ఆ మహాపురుషుడు రాగద్వేష రహితుడు ఆ యోగి అంతరంగం అతి స్వచ్ఛం. ఆ పురుష పుంగవుడి చిత్తం బ్రహ్మజ్ఞానంతో నిండి ఉంటుంది. ఆ మహోత్తముడు ఏ కాంత భక్తుడు జీవన్ముక్తుడు.

ఆ జ్ఞాని అందరితోబాటు మాట్లాడుతుంటాడు. అన్నీ చూస్తూంటాడు. ఇతరులు చెప్పేవి వింటూంటాడు. వ్యక్తులను స్పృశిస్తూంటాడు. వస్తువులను పదార్థాలను ఆఘ్రాణిస్తాడు, ఆరగిస్తాడు, స్వీకరిస్తాడు, సంచరిస్తాడు, సలహాలు ఇస్తాడు, సదుపదేశాలు చేస్తాడు. ఎన్నిచేసినా ఆ ఋషి అంతరంగం ఆత్మజ్ఞానంలో మగ్నమై యుంటుంది. కాబట్టి వారికి ఏ దోషాలు సోకవు.

## అసంగుడు

న నిందతి న చ స్తౌతి న హృష్యతి న కుప్యతి
న దదాతి న గృహ్ణాతి ముక్తః సర్వత్ర నీరసః 169

సర్వత్ర=అన్ని విషయాలలోనూ; నీరసః = ఆసక్తిరసం లేనివాడైన; ముక్తః=ముక్తుడగు జ్ఞాని; న నిందతి=ఎవరినీ నిందించడు; న స్తౌతి=స్తుతించడు; న హృష్యతి=దేనికీ హర్షించడు; న కుప్యతి=కోపించడు; న దదాతి=ఎవరికీ ఏమీ ఈయడు; న గృహ్ణాతి=ఎవరినుండి స్వీకరించడు

ఆత్మ జ్ఞానీ! పాండిత్యఖనీ! మహాభక్తుడైన జీవన్ముక్తుని లక్షణాలు విను. జీవన్ముక్తుడు ఎవరినీ నిందించడు. దూషించడు తప్పులెన్నడు. అలా అని ఎవరినీ భూషించడు. స్తుతించడు. హర్షం ప్రకటించడు. ద్వేషం చూపడు ఎవరిపైనా కోపం వ్యక్త పరచడు. ఇతరులు ఆ మహాశయుని ఫలపుష్ప హారాలతో పూజిస్తారు. అయినా హర్షం పొందడు. స్తోత్రపాఠాలు మొదలు పెట్టరు. కొందరు జీవన్ముక్త పురుషుణ్ణి నిందించి పరిహసించి నిరాదరిస్తారు అయినా బాధపడడు. వారిని ఈసడించడు.

షడ్రసోపేత ఆహార అన్నపానాదులు అందించినా హర్షము లేదు. ఎండిపోయిన మెతుకులు పెట్టినా శోకించి దూషించి శపించడు. ఇతరుల నుండి కానుకలు స్వీకరించడు. ఇతరులకు ఇవ్వాలి అనుకోడు. కానీ నిత్య కృత్యాలు సత్కార్యాలు అనుకొనకుండానే సంకల్పరహితంగానే జరిగి పోతుంటాయి. తాను తన ఆత్మ సదా స్వాత్మానందమగ్నమై ఉంటుంది.

ఈ జ్ఞాన నారాయణులను లౌకిక జీవన పరాయణులు గుర్తించలేరు. సకామి నిష్కామిని గుర్తుపట్టలేడు. అజ్ఞానికి జ్ఞాని అంతరంగం అర్థంకాదు అసత్యవాదులకు సత్యజీవనులు దూరంగా ఉంటారు లౌకికులకు సదసద్వివేకం ఉండదు. ధనాకాంక్ష గలవారికి ధర్మాకాంక్ష గలుగదు.

యశోభిలాషులు శ్రేయోభిలాషులుకాలేరు. దంభాచార పరాయణులు సదాచార వంతులుకారు. ధనం కోసం మంత్రోపదేశాలు చేసేవారు గురువులుకారు. వారు సంఘానికి బరువులు. జీవన్ముక్తుడు అంటే వస్త్రరహితుడుకాదు. వాసనారహితుడు మాత్రమే.

ఒక ఊళ్ళో ఒకచోట ఒక భోగి ఒక యోగి ఉన్నారు. భోగి రాజు. యోగి రాజు గురువు. ఇరువురూ ఒక రోజున దివంగతులైనారు అరణ్యంలో నిర్జన ప్రదేశంలో ఒక మహాత్ముడు ముఖ్య శిష్యునితో నివసిస్తున్నాడు. దివ్యదృష్టితో రాజు-రాజగురువుల మృతి గమనించి నవ్వుకొన్నాడు. శిష్యులు గురుదేవుని జేరి "విచిత్రంగా నవ్వారు దాని కారణం తెలిసికోవచ్చునా?" అన్నారు.

"ప్రక్కఊళ్ళో ఒకరాజు, యోగి ఉండేవారు, వారు మరణించారు. యోగి, జ్ఞాని అని పేరు పొందిన గురువుకు నరకం. భోగి అయిన రాజుకు స్వర్గం లభించింది. అది గమనించి నవ్వాను అన్నాడు మహాత్ముడు.

"అలా ఎందుకు జరిగింది స్వామీ!" రాజు మనస్సు గురువు బోధించిన భక్తిలో రక్తి పొందసాగింది. అందుచే స్వర్గం లభించింది. గురువు మనస్సు రాజభోగాలు సన్మానాలు ధనంపైనే ఉండి జ్ఞాన శూన్యమయింది. కనుక నరకం ప్రాప్తించింది" అన్నాడు మహాత్ముడు.

# అవిహ్వల మానసుడు

సానురాగాం స్త్రియం దృష్ట్వా మృత్యుంవా సముపస్థితమ్
అవిహ్వల మనాః స్వస్థో ముక్త ఏవ మహాశయః 170

సానురాగాం = అనురాగంతో కూడిన; స్త్రియం = స్త్రీని; దృష్ట్వా వా = చూచినా లేక; సముపస్థితం = సమీపమందున్న; మృత్యుం = మృత్యువును; దృష్ట్వా = చూచినా; అవిహ్వల మనాః = వ్యాకుల రహితమైన మనస్సుగలవాడై; స్వస్థః = శాంతచిత్తుడై ఉన్న; మహాశయః ఏవ = మహాత్ముడే; ముక్తః = ముక్తుడు.

ముక్తపురుషా! భక్త శిరీషా! సమీపంలో అనురాగవతి అయిన లలనామణిని చూసి కానీ, మృత్యువు చేరువ అయింది అని తెలిసికానీ మోహవ్యాకులతల నొందని? శాంత చిత్తుడు నిజమైన మహాత్ముడు. అట్టి స్వస్థమానసుడు నిశ్చయంగా మహాజ్ఞాని. త్రిగుణాతీతుడు.

అనురాగంతో వచ్చిన స్త్రీని చూచి జ్ఞాని మనస్సు కామాసక్తం కారాదు. అట్టి కామాసక్తిగలవాడు జ్ఞానికాడు. భాగ్యకరమైన వైరాగ్యం గలవాడే యోగి. మృత్యువు సమీపించింది అని తెలిసి యోగి భయపడరాదు. ప్రాణప్రయాణ సమయం శుభ సమయం, పరిమితదైహిక అవధులదాటి అనంత ప్రణవ సాగరేశ్వరుడిలో లీనమవుతున్నాము. ఎంత పుణ్యకాలం. బిందుమాత్రుడు అయిన జీవుడు సింధు రూపుడైన దేవుడిలో లయమవుతున్నాడు ఇది అపూర్వమైన సదవకాశం అని సంతోషించాలి. అట్టివాడే జీవన్ముక్తుడు.

• • •

బహుళ సంకటములు ప్రాప్తంబులైనచో
తల్లడిల్లడాత్మతత్త్వ విదుడు
వాయుశీత వహ్ని వర్షాతపంబుల
కించుకైన గిరి చలింపనట్లు

— సీతారామాంజనేయ సంవాదం 3–180

# విశిష్ట ధీరుడు

సుఖే దుఃఖే నరే నార్యాం సంపత్సుచ విపత్సుచ
విశేషో నైవ ధీరస్య సర్వత్ర సమదర్శనః 171

సుఖే దుఃఖే = సుఖమందు దుఃఖమందు: నరే నార్యాం = పురుషులందు స్త్రీలందు: సంపత్సు విపత్సు=సంపదలందు ఆపదలందు: సర్వత్ర=అంతట అన్ని వేళల: సమదర్శినః=సమబుద్ధిగలదృష్టితో ఉన్న: ధీరస్య=ధీరపురుషుడి భావంలో: న విశేషః=విశేషభేదంలేదు.

చిరంజీవీ! జ్ఞాన రవీ! సుఖదుఃఖాలలోనూ స్త్రీ పురుషుల విషయంలోనూ సంపద్విపత్తులలోనూ సర్వత్ర సమదర్శిగా ధీరపురుషుడుంటాడు. అట్టి ధీరపురుషుడే జీవన్ముక్తుడు.

మహాత్ముడు సుఖదుఃఖాలలో సమబుద్ధితో వ్యవహరిస్తాడు. దేహం పొందే అతిసుఖ భోగవిలాసాలకు ఆనందం చెందడు. శరీరం పొందే క్లేశాలకు ఖేదం పొందడు. సంపదలకు పొంగి పొంగి పోడు. జ్ఞాని విపత్తులకు క్రుంగిపోడు. సమచిత్తుడై ఉంటాడు.

స్త్రీ పురుషుల విషయంలోకూడా వీరు నా బంధువులు అనిగానీ శత్రువులు అని గాని, ఈస్త్రీలు నాకు అయిన వారు ఆత్మీయులు అనిగానీ వేకపరాయివారు అని గానీ భేదం లేకుండా సౌమ్యంగా శాంతంగావ్యవహరిస్తారు. లోకులనందరినీ వాత్సల్యంతో ప్రేమతో చూస్తాడు. అట్టివాడే ముక్తపురుషుడు. ఎవరి యెడల ప్రత్యేకమైన ప్రేమా లేదు ద్వేషం లేదు.

# వికార రహితుడు

న హింసా నైవ కారుణ్యం నౌద్ధత్యం న చ దీనతా
నాశ్చర్యం నైవ చ క్షోభః క్షీణసంసరణే నరే 172

క్షీణ సంసరణే=నశించిన సంసార భావంగల: నరే=మానవుడి యందు: న హింసా=హింసలేదు: న కారుణ్యం=కారుణ్యమూలేదు: న ఔద్ధత్యం =

ద్వేష్యమూ దౌర్జన్యమూలేదు; న దీనతా = దైన్యమూ లేదు; న ఆశ్చర్యం = ఆశ్చర్యమూ లేదు; న క్షోభః = క్షోభమూలేదు.

స్థితప్రజ్ఞాధురీణా ! ఆత్మజ్ఞాన పరాయణా! సంసార భ్రమ క్షీణించిన మహా జ్ఞానికి హింస లేదు. కారుణ్యంలేదు. ఔద్ధత్యం లేదు దైన్యంలేదు. ఆశ్చర్యంలేదు. విలాపంలేదు. ఆ జ్ఞాని వాసనా రహితుడు. త్రిగుణాతీతుడు నిశ్చలుడు నిర్మలుడు.

ఒకరికి ద్రోహం చేయాలని కానీ లేక మేలు చేయాలని కానీ ఏమీ తలంచడు. తలంపులుడిగిన మహా తపస్వి ఆతడు. కర్తృత్వం వహించని శివంకర మూర్తి. నేను ఏదో ఉద్ధరిస్తానని దీనుల యెడల కారుణ్యం వహించటం కానీ తన శారీరక సుఖాలకై ఇతరుల ముందు చేయి చాచటం కానీ చేయని స్థితప్రజ్ఞుడు.

విశ్వంలో విశ్వాత్ముడి వివిధలీలలుచూచి ఆశ్చర్యం పొందటంకానీ ఆవేదన చెందటం కానీ ఎరుగని నిశ్చలచిత్తుడు ముక్త పురుషుడంటే అట్టి వాడే అబ్బాయీ!

• • •

జంతు పదము లెల్ల దంతి పదంబులో
నడగు క్రియ అహింస యందు సకల
ధర్మములు నడంగు-తత్మసంత్యాగికి
నైన భూతదయ సమర్థ గుణము

— తిక్కన (భారతం - శాంతిపర్వం)

## అసంసక్తుడు

న ముక్తో విషయద్వేష్టా న వా విషయ లోలుపః
అసంసక్త మనాః నిత్యం ప్రాప్తాప్రాప్త ముపాశ్నుతే 173

ముక్తః = జీవన్ముక్తుడు; న విషయద్వేష్టా = విషయాలను ద్వేషించువాడుకాదు; న విషయలోలుపః = విషయాలందులోలుపుడుకాదు; నిత్యం = ఎల్లప్పుడు; అసంసక్త మనాః = ఆసక్తిలేని మనస్సు గలవాడై; ప్రాప్త అప్రాప్తం = ప్రాప్తాప్రాప్త వస్తువులను; ఉపాశ్నుతే = అనుభవిస్తున్నాడు.;

విషయ విదూరా! కుమారా! జ్ఞానికి విషయ వాసనలలో విద్వేషం లేదు. విషయ లోభీ, విషయ లోలుపుడూ కాదు. ఎట్టి ఆసక్తి లేని నిశ్చల చిత్తుడు. అప్రాప్తవస్తువుల గూర్చి చింత లేకుండా ప్రాప్త వస్తువులతో సంతృప్తి చెంది సుఖంగా ఉంటాడు జీవన్ముక్తుడు.

• • •

శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇలా అంటాడు- "రెండక్షరంబులు మృత్యువు మూడక్షరంబులు బ్రహ్మంబు. అవి అయ్యవి అంతేని వినుము. "మమ" అనునవి యును "న మమ" అనునవియునై యుండు. అవి భూతంబుల చేతం గానం బడక యా బ్రహ్మ మృత్యువులు పోరుచుండు"

తత్త్వ మనశ్వర - మశరీ
రత్త్వంబున బరగు - భూతరాశి నియత నా
శిత్త్వంబు హింసకత్వము
తాత్త్వికమై లేదు - దేహదళనమున నృపా!

— తిక్కన (భారతం - అశ్వమేధ పర్వం)

## శూన్య చిత్తుడు

సమాధానాసమాధాన హితాహిత వికల్పనాః
శూన్యచిత్తో న జానాతి కైవల్యమివ సంస్థితః 174

శూన్య చిత్తః=సంకల్పరహితుడైన ముక్తుడు శూన్య చిత్తంగలవాడు; సమాధాన అసమాధాన=సమాధానం అసమాధానాలు; హిత అహిత వికల్పనాః=హితం అహితాలు అది వీటి కల్పననూ; న జానాతి=ఎరుగడు; పరంతు=మరేమంటే (ఆ పురుషుడు): కైవల్యం ఇవ = కేవలం మూర్తీభవించిన మోక్షం వలెః సంస్థితః=ఉంటున్నాడు.

జ్ఞానీ! వాంఛాశూన్య చిత్తుడు సమాధాన అసమాధానాలు హిత అహితాలు సంకల్ప వికల్పాలు ఎరుగడు. కాని కేవలం మోక్ష విషయంలో సుస్థిరమైన బుద్ధి కలిగి ఉంటాడు. అట్టి విజ్ఞాని విదేహముక్తికై కైవల్య ప్రాప్తికై సుస్థితుడై ఉంటాడు.

• • •

ఈ అనంత శాశ్వత పరబ్రహ్మమునకు మూడులక్షణాలు. సత్-చిత్-ఆనందం. ఇవి సత్యగుణాలు. ఈ జగత్తులోని అణువునుండి విశాల పదార్థంలో ఈ మూడు గుణాలున్నాయి. మానవుడు త్రిగుణ సహితుడు. అయితే మమకారం వలన సత్తును గుర్తించలేక బాగుగాయోచించ లేక 'చిత్'-ఆనందాలవలన కలిగే సత్ఫలితాలు పొంద లేక మందుడుగా ఉన్నాడు.

జీవుడు సచ్చిదానందుడు. బ్రహ్మం సచ్చిదానందమయం. అందుచేతనే జీవుడు "అహం బ్రహ్మాస్మి" అని ప్రకటించుచున్నాడు.

ప్రేమ రూపమ్ము దైవమ్ము ప్రేమ మయము
ప్రేమ ప్రేమతో సంధింప నీమమగును
కాన ప్రేమను గట్టిగా కలిగియున్న
అద్వితీయంబు పొందగా నర్హుడగును

— శ్రీ సత్యసాయిబాబా

## న కించిత్

నిర్మమో నిరహంకారో న కించి దితి నిశ్చితః
అంతర్గళిత సర్వాశః కుర్వన్నపి కరోతిన 175

అంతర్గళిత సర్వాశః=అంతఃకరణలో సమస్త ఆకాంక్షలు ఆశలు ఉపశమించిన వాడునూ: నిరహంకారః=అహంకారరహితుడునూ: నిర్మమః = మమతా రహితుడునూ: న కించిత్=ఇదంతా మిథ్యమరేమీలేదు, ఏ కొంచమూలేదు: ఇతి=ఇట్లని: నిశ్చితః = నిశ్చయ జ్ఞానం కలవాడు: కుర్వన్నపి = కర్మలు చేస్తున్నవాడైనను: నలిప్యతే=ఏమీ అంటుకోడు.

నిరహంకారీ! అంతరంగంలో అన్నివిధాల ఆశలు అంతరించిన ఆత్మజ్ఞాని మమతాశూన్యుడు. అహంకార రహితుడు. నాది ఏ కొంచముులేదనే నిర్మలభావంతో నిస్వార్థంగా నిష్కామ్యంగా పరమేశ్వర కార్యం అని ప్రజాకార్యాలు నిర్వహిస్తాడు. కానీ అందులో ఆసక్తి స్వార్థవాసన ఏమీ ఉండదు.

అహంకార మమకార అభిమాన శూన్యుడు ధన్యుడు మాన్యుడు. 'ఇదీ నాది దీని కార్యకర్తను నేను'అనే గర్వం అహంకారం లేనివాడు నిజమైన భక్తసత్తముడు.

అధిష్ఠానచేతనుడు ఆదిదేవుడు. ఆ దేవుడు కానిది ఏదీలేదు. స్వామికి వేరయినది సత్యంకాదు. ఇలాంటి నిశ్చితబుద్ధితో ఎన్ని లౌకిక అలౌకిక జనహిత కార్యాలు చేసినా ఆ కర్మయోగికి ఏ దోషం అంటదు. ఆ యోగికి కర్తృత్వాభిమానం లేదు.

• • •

అనఘ! దివసంబు రాత్రియు
ననునవి భానునకు లేనియట్టుల సతతం
బను పరమయోగ యుతుడగు
మునికి వివేకావివేకములు లేకుండున్ !

—తిక్కన (భారతం-శాంతి పర్వం)

## మనః ప్రకాశం

మనః ప్రకాశ సంమోహ స్వప్న జాడ్య వివర్జితః
దశాం కామపి సంప్రాప్తో భవేద్గలిత మానసః 176

గళితమానసః=మనస్సులేని జ్ఞాని; మనః ప్రకాశ సమ్మోహ స్వప్నజాడ్య వివర్జితః=మనః ప్రకాశంనుండి చిత్తభ్రాంతినుండి జడత్వరూపనిద్రనుండి విడివడిన వాడై; కామపి = అనిర్వాచ్యమైన ఒకానొక; దశాం = దశను (అవస్థను); సంప్రాప్తః=పొందినవాడుగా; భవేత్=అగుచున్నాడు

విశృంఖల నిర్మల మనస్వీ! నీకు సంసారవాసనలు విడిపోయాయి. నీకు మమతా పూర్ణమైన మనస్సు హరించింది. అమనస్కుడవైనావు. చాలా మంచిది. మనః ప్రకాశంతో, చిత్తం శాంతం పొందింది. మోహస్వప్నం తొలిగింది. మేఘం విచ్చిపోయింది. జడత్వం వివర్జితమయింది. సుషుప్తి దశ అంతమయింది. అంతఃకరణ ప్రవృత్తి అస్తమించింది.

నీకు ఇప్పుడు అనిర్వచనీయమైన దశ ప్రాప్తించింది. సంకల్ప వికల్ప తరంగాలులేని సాగరుడవు. మోహాలు వ్యామోహాలు దూరమయ్యాయి. స్త్రీ పుత్రాదులపై మమకారాలు మాయమైనాయి. సమ్మోహవివర్జితుడవైనావు. జడతా రహితుడవైనావు. ఆత్మానంద అనుభవశాలివైనావు. ఆత్మారాముడవై జీవన్ముక్తి మార్గంలో అగ్రశేణిలో ఉన్నావు.

ఈ దశలోనివాడు ప్రత్యేక ప్రణవచిత్తుడు. అతనికి సమ్మోహాలు సమ్మోదాలు దూరమైనాయి. హృదయాకాశంలోని ప్రాణంచేసే నాదం ప్రత్యేక ప్రణవనాదం. అదే ఓంకారనాదం. అంతఃకరణ వృత్తి శూన్యుడయిన ఆత్మజ్ఞాని అనిర్వాచ్యదశ అందుకొంటాడు. ఆ ఋషి అమనస్కుడైనాడు. అజ్ఞానం అంతరించింది. ఇది తత్వజ్ఞ స్వరూపం. బాగా అర్థంచేసికో! ఇంకా వివరిస్తాను విను.

ప్రపంచం మిథ్యాకల్పితం. ఆత్మదర్శనంచేత అజ్ఞాన ప్రపంచధ్యాస తొలగి పోతుంది. అజ్ఞానదశనే సుషుప్తి అంటారు. 'తత్త్వమసి' విచారణ వలన మనోబుద్ధి చిత్తాహంకారాలు ఆత్మలోనే లయమౌతాయి.

ప్రపంచం స్వప్నంవలె భాసిస్తుంది. అహంకార మమకారాలు అంతమవు తాయి. సర్వవృత్తులతోబాటు మనస్సు చిత్తం బుద్ధి ఆత్మలో అంతమై మనఃప్రకాశం పోయి సర్వం బ్రహ్మమయమై సాక్షాత్కారం కలుగుతుంది. తానే బ్రహ్మమై బ్రహ్మా నందంలో తురీయాతీతావస్థ చేరుకొంటాడు. ఋషికి అదే జాగ్రదవస్థ. ఆ స్థితి అందుకో! అబ్బాయీ!

• • •

"మనో నిగ్రహం లేనివారికి చిత్తశుద్ధి కుదరదు. చిత్తశుద్ధి లేనివారికి బ్రహ్మభావం కలుగదు. బ్రహ్మభావం లేనివారికి ఆత్మశాంతి లభించదు. శాంతి లేనిదే సుఖమెక్కడ?"

— శ్రీ సత్యసాయిబాబా



# శాంతిశ్రీ

## సుబోధ

యస్య బోధోదయే తావత్ స్వప్నవద్భవతి భ్రమః
తస్మై సుఖైక రూపాయ నమః శాంతాయ తేజసే 177

యస్య=దేనియొక్క; బోధోదయే=బోధోదయమైన మీదట; తావత్=మొదటి; భ్రమః=భ్రాంతి; స్వప్నవత్=స్వప్నంవలె; భవతి=అగుచున్నదో; తస్మై=ఆ; సుఖైక రూపాయ=సుఖస్వరూపుడు; శాంతాయ=శాంతుడు అగు; తేజసే=తేజోరూపునకు; నమః=నమస్కారం

శాంతి ప్రియా! ఆత్మతాదాత్మ్యజ్ఞ స్వభావం స్వరూపం చెప్పాను. వానికి ప్రధానం శాంతి. ఆ శాంతిశ్రీ లక్షణం వివరిస్తాను—

ప్రశాంత మానస సరోవరంలో పరిశుద్ధ జ్ఞాన కమలాలు ప్రవర్ధమానం అవుతూంటాయి. అవి తత్త్వబోధ అనే తరుణారుణ పద్మబాంధవుడు ఉదయించగానే విచ్చుకొంటాయి. అంత స్వప్నం వంటి ప్రపంచ భ్రాంతి విడిపోతుంది. అంతే అజ్ఞాన అంధకారం అంతరించిపోతుంది. అప్పుడు సత్య శివ సుందర సువర్ణ సుప్రభాత కాంతులు సర్వత్ర వ్యాపిస్తాయి.

ఆ ఉదయ కాంతుల్లో ప్రభాకర పరంధాముడు సుఖైక శాంత స్వరూపుడు సాయీశ్వరుడు సహస్ర కిరణాలు విరజిమ్ముతూ సాక్షాత్కరిస్తాడు. అంతటా ఆనందమే అప్పుడు. ఆ స్వామిది మధుర మనోహర మందహాసం. మంగళమయ మందగమనం. సుందర సుకుమార సుభాషితం.

సంసారం భ్రమ. అంతామిధ్య. జ్ఞానికి ప్రపంచ భ్రాంతి తొలగగానే సంకల్ప వికల్పాలు శూన్యమవుతాయి. అజ్ఞాన యజ్ఞ పురుషుడు స్వప్రకాశ తేజస్స్వరూపుడు. దివ్యశాంతితత్త్వ ప్రశాంతుడు. సర్వత్ర అసమదర్శికాంతులే. ఆత్మబోధ కలిగి ఎవనికి ప్రపంచభ్రాంతి స్వప్నం వలె విడి పోతుందో ఆ ఋషి ఆత్మజ్ఞాని సుఖస్వరూపుడు శాంతుడు అయిన ఆ స్వప్రకాశునకు శతసహస్ర నమస్సులు.

# త్యాగం

అర్జయిత్వాఖిలానర్థాన్ భోగానాప్నోతి పుష్కలాన్
న హి సర్వపరిత్యాగ మంతరేణ సుఖీభవేత్ 178

పురుషః=పురుషుడు; అఖిలాన్=తరుగని; అర్థాన్=ధనములను; అర్జయిత్వా = సంపాదించి; పుష్కలాన్ భోగాన్ = పుష్కలమయిన భోగాలను; ఆప్నోతి=పొందుచున్నాడు; పరంతు=అయితే అతడు; సర్వపరిత్యాగం అంతరేణ=సకలపరిత్యాగం చేయకుండా: సుఖీ=సుఖవంతుడు; న భవేత్=కాజాలడు.

జ్ఞానీ! సాధారంగా మనుజుడు మిక్కిలి ధనం గడించి సుఖభోగాలు పొందుతున్నాడు. పుష్కలంగా ఆర్జించిన భోగాలు పరిత్యజించకుండా మానవుడు సుఖి కాలేడు.

లోకంలో పురుషులు అనేక విధాలుగా సంపత్తులు ఆర్జిస్తారు. అమితంగా భోగాలు భోగిస్తుంటారు అందులో అర్థవంతాలు కొన్ని. అనర్థాలు కొన్ని వారు చేసికొన్న కర్మానుగుణంగా సుఖదుఃఖాలు అనుభవిస్తుంటారు.

చూడటానికి ధనవంతులు సుఖవంతులుగా భోగపురుషులుగా పైకి కనిపిస్తారు. అయితే ధనం నష్టపడినప్పుడు విలపిస్తారు. విలాస జీవనం విలాప జీవనంగా మారిపోతుంది. ధనం వలన కలిగే భోగాలు సుఖాలు క్షణభంగురాలు. విషయభోగాలు విషతుల్యాలు. ఇవి త్యజించకుండా సుఖంలేదు. ఆత్మసుఖానికి అవి అవరోధకాలు. ఆటంకాలు. అడ్డుగోడలు. సంకల్ప వికల్పాల సకల ప్రపంచం మిధ్య. ఇది అసత్పదార్థం. అనిత్యం. అసత్యం. అశాశ్వతం. అనర్థం. అల్పం. ఆనంద రహితం.

• • •

న కర్మణా న ప్రజయా ధనేన
త్యాగేనైకేన అమృతత్వ మానశుః

కర్మ కలాపాల వల్ల సుఖంలేదు. సంతానం వల్ల సుఖంలేదు. ఒక్క ధన త్యాగం వల్లనే పరమ సుఖం లభ్యమానం అట్టివాడే అమృతత్వమానసుడు అవుతాడు.

పృథివీం ధనపూర్ణాచేత్ ఇమాం సాగరమేఖలాం
ప్రాప్నోతి పునరప్యేష స్వర్గ మిచ్ఛతి నిశ్చయః

సముద్ర పర్యంతంగల భూభాగం నిండినంత ధనం లభించినా మానవుడాశ పడుతూనే ఉంటాడు. అతనికి తృప్తిలేదు. ఈ ధనధాన్య సుఖభోగాలు అనుభవిస్తూ స్వర్గ సౌఖ్యం అర్రుజాస్తుంటాడు. అక్కడ అప్సరసల నృత్యవినోదాలు రంభా సంభోగాలు లభిస్తాయని కోరుతుంటాడు.

## పీయూషం

కర్తవ్య దుఃఖమార్తాండ జ్వాలా దగ్ధాంతరాత్మనః
కుతః ప్రశమ పీయూష ధారా సారమృతే సుఖమ్ 179

కర్తవ్య దుఃఖమార్తాండ జ్వాలాదగ్ధ అంతరాత్మన=కర్తవ్య జన్య దుఃఖరూప సూర్య కిరణ జ్వాలల వలన దహింపబడుచున్న మనస్సుగలవానికి; ప్రశమపీయూష ధారాసారంఋతే=సంకల్ప వికల్ప ప్రశమన రూప అమృతవర్షధారాసారంలేకుండా; సుఖం కుతః=సుఖం ఎక్కడిది?

పరమ శాంతి ప్రియా! కర్తవ్య నిర్వహణ చాలా కష్టం. సుఖంకంటే దుఖం ఎక్కువ. ఆ కర్మజన్య దుఃఖం మార్తాండ జ్వాలవలె మానవుని దహింప జేస్తుంది. ఆ దుఃఖోపశమనం ఒక్క పరమ శాంతి అనే పీయూష ధారచేతనే కలిగి సుఖం లభిస్తుంది.

చేయ తలపెట్టిన కార్యాలు త్వరత్వరగా చేయాలి అనుకోవడం అహంభావం. ఆ అహంభావసంతాపమే ప్రచండ మార్తాండ జ్వాల. అట్టితీవ్రసంతాప సూర్య జ్వాలచే దంవహ్యమయ్యే మనస్సు గల వాడికి శాంతి శూన్యం. సుఖం దుర్లభం' ఆత్మకు ఆరాటమే అనుదినం.

అట్టి అశాంతి పరుడికి ప్రశాంతి లభించాలంటే ఆత్మజ్ఞానం అత్యవసరం. సంకల్ప వికల్ప ప్రశమనం కలగాలి. ఈ జ్వాలకు శాంతి అనే పీయూష ధారాసారామృతం కావాలి. ఆ అమృత ధారలతో ఆత్మ సుఖం లభిస్తుంది. లౌకిక వ్యాపారాలు గల వాడికి శాంతి సుఖాలు దూరం. జీవుడికి మనో వ్యాపారాలు చిత్త విభ్రమలు తొలిగినప్పుడే ఆనంద ప్రాప్తి సర్వపరిత్యాగమే సుఖస్వరూపం. అదే పరమశాంతి.

# భావనం

భవోఽయం భావనామాత్రో న కించి త్పరమార్థతః
నా స్త్యభావం స్వభావానాం భావాభావ విభావినామ్ 180

అయం = ఈ: భవః = సంసారం: భావనా మాత్రః = సంకల్ప మాత్రమే: పరమార్థః = యథార్థంగా: న కించిదపి = కొంచం కూడా లేదు: హి = ఎందుకంటే: భావాభావ విభావినాం = భావ అభావ రూప పదార్థములందు స్థితంగా ఉంటున్న: స్వభావానాం = స్వభావాలకు: అభావః = అభావం: నా స్తి = లేదు.

భావ ప్రియా! ఈ భవసాగరం భావనామాత్రం. ఇందులో పరమార్థం కించిత్తు కూడా లేదు. ఆత్మ అభావంకాదు భావాభావంగల సమదర్శి స్వభావంలో అభావం అనేది లేదు. భావాభావం అంటే సదసద్వివేకం. భావం అంటే సత్. ఆత్మ సత్ స్వరూపం. ఆత్మది సత్స్వభావం. అభావం అనాత్మ. అసద్రూపం. ఇది సంసారం. ఇది భావనా మాత్రం. జగత్తు అసత్తు

వివేకం గలవాడికి విజ్ఞానం లభ్యమానం. ఆ విజ్ఞానం ఆత్మజ్ఞానం. ఆత్మానాత్మ జ్ఞానంగల వాడికి సంసారంలేదు. అంతా పరమాత్మస్వరూపమే. అంతా ఆత్మ తత్త్వమే. ఈ సంసారం సంకల్ప మాత్రం భావనా రూపం, అభావం, ఆత్మేతరం, అసత్యరూపం, మిథ్య, ప్రతిబింబసదృశం, ఆత్మ మాత్రమే సత్యం, బింబం, భావరూపం.

# ఆత్మ

న దూరం న చ సంకోచాత్ లబ్ధమేవాత్మనః పదమ్
నిర్వికల్పం నిరాయాసం నిర్వికారం నిరంజనమ్. 181

ఆత్మనః = ఆత్మ యొక్క: పదం = స్థానం: న దూరం = దూరంకాదు: సంకోచాత్ = దగ్గరైనదిగా అవి: న లబ్ధం = పొందబడునది కాదు: తత్ = అది: నిర్వికల్పం = వికల్ప రహితం: నిరాయాసం = ఆయాసశూన్యం: నిర్వికారం = వికార దూరం: నిరంజనం = ఉపాధిరహితం.

ఆత్మజ్ఞానీ! ఆత్మ దూరంకాదు. దగ్గరకాదు అది పరిపూర్ణం. అది సర్వవ్యాప్తం అది నిత్యలబ్ధం. ఆత్మ నిర్వికల్పం. నిరాయాసం నిర్వికారం. నిరంజనం.

ఆత్మ సర్వత్ర సర్వపరిపూర్ణం. అది పరిచ్ఛిన్నంకాదు. ఒక్కచోట ఒక్క దానిలో ఇమిడి ఉండేదికాదు. ఆత్మనిత్య సంప్రాప్తం. అమోఘధనం. ఆత్మ నిర్వికల్పం - సంకల్పరహితం, ఆత్మనిరాయాసం - ప్రయత్నరహితం, ఆత్మ నిర్వికారం - వికార రహితం, ఆత్మ నిరంజనం - దుఃఖరహితం, అజ్ఞానికి మానసిక సంకల్పాల బరువు వల్ల ఆత్మ మరుగుపడి కనిపించదు. అప్రాప్తధనం వలె అజ్ఞాని దగ్గరే ఉంటుంది.

ఒకడు బంగారు హారం మెడలో వేసికొని పైన చొక్కా కోటు వేసుకొన్నాడు. ఆ పనీ ఈ పనీ చూసికొని విశ్రాంతి తీసుకొన్నాడు. ఆభరణం తరువాత స్ఫురణకు వచ్చింది. ఇల్లా వాకిలీ వెతకటం మొదలుపెట్టాడు. అతనికెక్కడా హారం కనిపించ లేదు. విచారించ సాగాడు. దుఃఖించాడు. మరునాడు స్నానానికని వస్త్రాలు దుస్తులు తొలిగిస్తే అప్పుడు వాడికి తెలిసింది. 'హారం నా మెడలోనే ఉందే' అని సంతోషించాడు.

అలానే ఆత్మపదం మానవుడి దగ్గరేఉంది. హృదయంలోనే ఉంది. భ్రమ వశాన తెలిసికోలేక పోతున్నాడు. ఆత్మధనం ప్రాప్తించింది. అయినా అజ్ఞానం వల్ల ఆత్మ అప్రాప్తం అని విచారిస్తున్నాడు.

## వీతశోకుడు

వ్యామోహమాత్ర విరతౌ స్వరూపాదాన మాత్రతః

వీతశోకా విరాజంతే నిరావరణ దృష్టయః 182

వ్యామోహమాత్ర విరతః = వ్యామోహం హరించగా; స్వరూపాదాన మాత్రతః = తననిజరూప జ్ఞానంవలన; వీతశోకాః = శోకరహితుడై; నిరావరణ దృష్టయః = ఆవరణరహిత దృష్టిగలవాడై; విరాజంతే = విరాజిల్లుచున్నాడు.

విజ్ఞానీ! జ్ఞానికి స్వరూప జ్ఞానంవలన వ్యామోహం నశిస్తుంది. ఆవరణ తొలిగి తన స్వరూపగ్రహణంచేత ఆత్మస్థితిలో విశ్రమించి శోకరహితుడై విరాజిల్లు తాడు. ప్రపంచ వ్యామోహం నివృత్తికావాలి. వ్యామోహ నివృత్తితో మాయావరణ మటుమాయమవుతుంది. అజ్ఞాన మోహ ఆవరణ మానవుడి అంతఃకరణలో ఆత్మను కప్పి ఉంచుతుంది. ఆవరణతెర తొలగందే ఆత్మసాక్షాత్కారంకాదు. తెరవిడిపోతేనే

ఆత్మ అవగతం అయ్యేది. ఆవరణ తొలగటానికే గురూపదేశాలు శాస్త్రాధ్యయ నాలు జపాలుతపాలు.

అయితే ఆత్మ సాక్షాత్కారం కోసం ఆశ్రమాలా, ఆరామాలా, కొండలా, కోనలూ తీర్థాలూ, క్షేత్రాలు తిరుగనవసరంలేదు. మహాత్ముల మహిత హితోప దేశాలతో 'తానే ఆత్మస్వరూపుణ్ణి' అని గుర్తిస్తాడు జ్ఞాని. దానికి తత్త్వవిచారణ మననం ఆలోచనం ధ్యానం కావాలి. ప్రపంచ భ్రాంతి తొలగగానే ఆత్మకు సంతృప్తి ఆనందం సంతోషం విశ్రాంతి వివేకం కలుగుతుంది. తద్వారా దుఃఖం నివృత్తి అవుతుంది జ్ఞాని సహజంగానే అప్రయత్నంగా అద్వితీయ పూర్ణానంద స్వరూపుడై విరాజిల్లుతాడు.

పరమానందయ్య శిష్యులు ఒక నదిని దాటుతూ ఒకడు తనను మరచి అంద రిని లెక్కపెట్టి ఒకడు నదిలో కొట్టుకు పోయినాడని దుఃఖించసాగాడు. తెలిసినవాడు వచ్చి ఎందుకు దుఃఖిస్తున్నావు? అన్నాడు, అజ్ఞాని-ఇలా చెప్పాడు —

మేము పది మంది వచ్చాము. నది దాటుతున్నాము. అందరమున్నామా! అని లెక్కపెట్టాను. ఒకడు తక్కువ వచ్చాడు. వాడు నదిలో కొట్టుకుపోయాడని దుఃఖి స్తున్నాను. తెలిసిన జ్ఞాని చెప్పాడు— "నిన్ను నీవు లెక్కపెట్టుకోలేదు. మీరందరూ ఉన్నారు. నీతో పదిమంది కదా ఉన్నారు." కనుక మరుపు గలవాడు అజ్ఞాని.

తనను తాను మరచి దుఃఖించేవాడు అజ్ఞాని. తనను తాను ఎరిగినవాడు జ్ఞాని. తనను గూర్చి తనకు తెలియజెప్పేవాడు విజ్ఞాని.

## ఆత్మ సనాతనం

సమస్తం కల్పనా మాత్రం ఆత్మా ముక్తః సనాతనః
ఇతి విజ్ఞాయ ధీరోహి కిమభ్యస్యతి బాలవత్ 183

సమస్తం=సకల విశ్వం; కల్పనా మాత్రం=కల్పనా మాత్రం; ఆత్మా= ఆత్మ; ముక్తః=ముక్తం; సనాతనః=సనాతనం; ఇతి=ఇట్లని; విజ్ఞాయ= తెలిసికొని; ధీరః = ధీనిధియైనజ్ఞాని; బాలవత్ = బాలుడివలె; కిం = దేనిని; అభ్యస్యతి=అభ్యసించుచున్నాడు?

ధీరపురుషా! సమస్తం కల్పనా మాత్రం. ఆత్మముక్తం. సనాతనం. అని తెలిసిన ధీరోదాత్తుడు బాలుడివలె అధ్యయనాలెందుకుచేస్తాడు?

ఆత్మశుద్ధం-అది నిత్యముక్తం. అది బాధపడదు. బంధింపబడదు. బంధ మోక్షాలు మనోధర్మాలు. ఆత్మధర్మాలుకావు. ఈ బంధమోక్షాలు ఆత్మకు అంటవు. మనోక్షయంతో బంధమోక్షాలు శాంతిస్తాయి.

దేహాది సకల ప్రపంచం అధిష్ఠానమైన ఆత్మలో కల్పితం. ఆత్మసంపూర్ణ సత్యసనాతనం. ఆత్మ స్వరూపం నిత్యముక్తం. ఆత్మకు ఆద్యంతాలు అవధుల హద్దులూలేవు. దేనిని అంటదు. ముట్టదు. జ్ఞాని ఈ విధమైన నిశ్చయజ్ఞానం కలిగి బాలుడివలె సంచరిస్తాడు.

## ఆత్మ బ్రహ్మం

ఆత్మా బ్రహ్మేతి నిశ్చిత్య భావాభావౌచ కల్పితౌ
నిష్కామః కిం విజానాతి కిం బ్రూతే చ కరోతి కిమ్ 184

ఆత్మా=జీవాత్మ; బ్రహ్మ=బ్రహ్మం; చ=మరి; భావాభావౌ = భావా భావాలు; కల్పితౌ=కల్పితాలు; ఇతి = అని; నిశ్చిత్య = నిశ్చయించుకొని; నిష్కామః=నిష్కాముడైన పురుషుడు; కిం = దేనిని; విజానాతి = తెలిసి కొంటాడు; కిం బ్రూతే=ఏమి చెప్తాడు; కిం కరోతి=ఏమి చేస్తాడు.

ఆత్మజ్ఞానీ! ఆత్మ బ్రహ్మం. భావ అభావాలు కల్పితాలు అని భావించిన నిష్కామ యోగికి తెలియతగింది, మాట్లాడ తగింది, ఏమీలేదు. ఆ ముని కామనా రహితుడు. జీవాత్మయే పరమాత్మ ఇరువురికి భేదంలేదు

ఆత్మ త్వం పదార్థవాచ్యం. జీవాత్మ తత్ బ్రహ్మ పదార్థ వాచ్యం. త్వం తత్ అవుతుంది నీవే అది. నీవే ఆ బ్రహ్మ స్వరూపం. తత్త్వం.

"అహమేవ బ్రహ్మ" నేనే బ్రహ్మను. భావ అభావాలు సత్ అసత్తులు కల్పితాలు. ఇలాంటి నిశ్చయజ్ఞానం గలవాడు యోగిశ్రేష్ఠుడు. ఆయన నిష్కాముడు.

పరమాత్మ రూపుడు. అన్ని విషయాలు విజ్ఞానాలు తెలిసినవాడు ఆముని. ఆఋషి తెలియ తగింది ఏమీలేదు. ఆత్మ పరమాత్మ. ఇరువురు ఒక అంశలోని వారే. మహాత్ముల కార్యకలాపాలు వేరు కావచ్చు క్రమంగా జ్ఞాని పరమాత్మ కావచ్చు.

ఈ కనిపించే దృశ్యాలు ఘటపటాదులు విశ్వవిన్యాసాలు అన్నీ అధిష్ఠాన చైతన్యమైన పరబ్రహ్మలోనివే. అయితే అధిష్ఠానం యొక్క ప్రతిచ్ఛాయలు కల్పితాలు. జీవాత్మ అవిద్య. పరమాత్మ విద్య. అవిద్య అంతభ్రమ. జగత్తు అంతా ప్రతిబింబం. బింబం తెలిసికొన్నవాడు ధన్యుడు. ఆ యోగీశ్వరుడు అనవరత ఆత్మానుసంధాన పరుడు.

# బ్రహ్మమే తాను

అయం సోఽహమయం నాహం ఇతిక్షీణ వికల్పనాః
సర్వ మాత్మేతి నిశ్చిత్య తూష్ణీం భూతస్య యోగినః 185

సర్వం=సకల ప్రపంచం; ఆత్మా=ఆత్మయే; ఇతి=ఇట్లని; నిశ్చిత్య=నిశ్చయించుకొని; తూష్ణీభూతస్య=ఉదాసీనంగా ఉన్న; యోగినః = యోగికి; అయం=వీడు; సహః=వాడు; అహం=నేను; అయం నాహం=వీడు నేను కాను; ఇతి=ఇట్లని; వికల్పనా=వికల్పన భావాలు; క్షీణాః=హరించిపోతున్నవి.

సర్వం పరమాత్మ స్వరూపం. సర్వం విష్ణు స్వరూపం. సర్వం విష్ణుమయం జగత్ అని నిశ్చయజ్ఞానం గల యోగి మౌనంతో తూష్ణీభావంతో ఉంటాడు. మహాతత్త్వ జ్ఞానికి నేను ఈ పరమాత్మను. నేను ఈ పరమాత్మనుకాను. అనే వికల్పాలు క్షీణించి పోతాయి. ఆ యోగి సర్వం ఆత్మస్వరూపం అనే నిశ్చయ బుద్ధితో ఉండిపోతాడు.

మనో వాక్కాయకర్మలలో తూష్ణీ భావంతో నిర్లిప్తుడై ఉండిపోతాడు. పరబ్రహ్మం నేనే అని పరమ ఉన్నత స్థితి అందుకొంటాడు. ఆ యోగికి ఇది నేను చేయుచున్నాను. నిన్న వ్రతం చేశాను. సోఽహమ్మని ధ్యానిస్తున్నాను. నేను ఫలానా వాణ్ణి. నడుస్తున్నాను. అనే మనోవికల్పాలు మొలకెత్తవు. ఆత్మేతరం అంతా శూన్యం బ్రహ్మమే తాను.

'సర్వం విష్ణుమయమ్' 'వాసుదేవ స్సర్వమ్' 'సోఽహమ్.' అనే నిశ్చయ భావం కలిగిన యోగిలో అహంభావం· శరీర ఇంద్రియాలను గూర్చిన వ్యాపార దృష్టి ఉండదు. అవి వ్యక్తి ప్రమేయం లేకుండానే జరిగి పోతుంటాయి. ఆ ఋషి వ్యాపార శూన్యుడు. ఇంద్రియ జ్ఞాన రహితుడు. జీవన్ముక్తుడవుతాడు.

## ఉపశాంతి

న విక్షేపో న చైకాగ్ర్యం నాతిబోధో న మూఢతా
న సుఖం న చవా దుఃఖం ఉప శాంతస్య యోగినః 186

ఉప శాంతస్య=ఉప శాంతి నొందిన, యోగినః=యోగికి; న విక్షేపః= విక్షేపం లేదు; న ఏకాగ్ర్యం=ఏకాగ్రత లేదు: న అతిబోధః=జ్ఞానం లేదు; న మూఢతా=మౌఢ్యం లేదు; న సుఖం=సుఖం లేదు; న దుఃఖం=దుఃఖం లేదు.

ఉపశాంతి చెందిన యోగీశ్వరునకు విక్షేపమూ లేదు. ఏకాగ్రతా లేదు. అబోధ లేదు మూర్ఖతా లేదు. సుఖమూ లేదు. దుఃఖమూ లేదు.

సంకల్ప రహితమైన మనోరూపం ఇలా ఉంటుంది సంకల్ప వికల్పాలు నశించిన యోగీంద్రుడి మానసిక స్థితి ఇది. ఆ యోగి ఏకాగ్రతకై ప్రయత్నించడు· విక్షేప నిరోధ వృత్తికే కదా ఏకాగ్రయత్నం. విక్షేపమే లేకపోతే ఇంక ఏకాగ్రత ఎందుకు? విషయజన్య సుఖం లేదు దుఃఖం లేదు.

సంకల్ప రాహిత్యంతో స్వస్వరూప సాక్షాత్కారమే. ఆ ఋషి ఆత్మానందంలో నిమగ్నమై ఉంటాడు·

## నిర్వికల్పుడు

స్వారాజ్యే భైక్ష్య వృత్తౌచ లాభాలాభే జనేవనే
నిర్వికల్ప స్వభావస్య న విశేషోఽస్తి యోగినః 187

స్వారాజ్యే = రాజ్యభోగాలందుగానీ; భైక్ష్యవృత్తౌ = భిక్షావృత్తిలోకానీ; లాభాలాభే=లాభనష్టాలతోకానీ; జనే=జనమధ్యంలోకానీ; వనే=వనంమధ్యంలో కానీ; నిర్వికల్ప భావస్య=వికల్పరహితుడైన స్వభావంగల; యోగినః=యోగికి; విశేషః=విశేషం; నాస్తి = లేదు.

స్వారాజ్య భోగాలలోఉన్నా, భిక్షావృత్తిలో ఉన్నా, లాభాలలో ఉన్నా నష్టాలలో ఉన్నా జనంలో ఉన్నా వనంలో ఉన్నా సంకల్పరహిత స్వభావం గల మౌనికి ఏ విక్షేపమూ లేదు. ఆ ఋషి నిర్వికల్ప స్వభావం గలవాడు.

ఆ ముని స్వర్గంలో ఉన్నానుకదా అని మహాహర్షమూ పొందడు. భిక్షా వృత్తిలో ఉన్నాకూడా దుఃఖమూ పొందడు. అప్పుడు విలాసమూ లేదు ఇప్పుడు విలాపమూ లేదు. ఆ సమదర్శికి లాభాలాభాలు సమానమే. జనంలో నివాసమైనా వనంలో ప్రవాసమైనా ఏకరస స్వరూపుడు ఆ మహాపురుషుడు.

## యోగిముక్తుడు

క్వ ధర్మః క్వచవా కామః క్వ చార్థః క్వ వివేకతా
ఇదం కృత మిదం నేతి ద్వంద్వై ర్ముక్తస్య యోగినః 188

ఇదం=ఇది: కృతం=చేయబడింది: ఇదం=ఇది; న కృతం=చేయబడ లేదు; ఇతి=ఇట్లని: ద్వంద్వైః=ద్వంద్వభావములచేత; ముక్తస్య=ముక్తుడైన: యోగినః=యోగికి: క్వ ధర్మః=ధర్మమెక్కడ?; వా=మరి: క్వ కామః=కోరిక లెక్కడ?; క్వ అర్థః=అర్థమెక్కడ?; క్వ వివేకతా = వివేక విచార మెక్కడ?.

'ఇది చేయబడింది. ఇది చేయబడలేదు.' అని ఈ విధమైన ద్వంద్వాల నుండి విముక్తుడైన యోగికి ధర్మమెక్కడ? కామమెక్కడ? అర్థంమెక్కడ? వివేక జ్ఞానమెక్కడ?

సుస్థిర చిత్తుడైన సంయమీంద్రుడికి ధర్మార్థ కామాలతో ప్రయోజనం ఏమిటి? 'ఈ పనిని చేశాను ఇది చేయాలి' అనే ద్వంద్వాలులేని యోగీశుడు జీవన్ముక్తుడు.

## జీవన్ముక్తుడు

కృత్యం కిమపి న ఏవ న కాపి హృది రంజనా
యథా జీవన మేవేహ జీవన్ముక్తస్య యోగినః 189

జీవన్ముక్తస్య=జీవన్ముక్తుడైన; యోగినః=యోగికి; కృత్యం=చేయవలసిన కార్యం; కిమపి=కొంచమైననూ; న ఏవ అస్తి = లేనేలేదు; హృది = హృదయంలో; కా అపి = ఎటువంటి; నరంజనా = అనురక్తి, ఆసక్తి లేదు; యథా= ఈ ప్రకారంగా; ఇహ = ప్రపంచంలో; జీవనం = ఆ మునిజీవనం జరుగుతున్నది.

జీవన్ముక్త యోగీశ్వరుడికి కర్తవ్య కర్మమేమీ ఉండదు. హృదయంలో ఏ అనురాగమూ ఉండదు. ఈ ఇహ లోకంలో యథాజీవనం కర్మానుసారం భోగ భాగ్యాలు కలుగుతుంటాయి.

జీవన్ముక్తుడు ఏ కార్యాన్నీ సంకల్పించి చేయడు. ఆయనకు చేయవలసిన కార్యాలు ఏమీలేవు. ఏ పదార్థంపైనా అనురాగమూలేదు పదార్థ సాధనకు పట్టుదల కూడా లేదు చేసేందీలేదు. రాగద్వేషాలు అవిద్య ఆయనకు తొలిగిపోయాయి. ప్రారబ్ధవశంగా శరీరయాత్ర జరుగుతున్నది.

## మహాత్ముడు

క్వ మోహః క్వచవా విశ్వం క్వతద్ధ్యానం క్వ ముక్తతా
సర్వసంగల్ప సీమాయాం విశ్రాంతస్య మహాత్మనః

సర్వసంకల్ప సీమాయాం = సర్వసంకల్ప పరిధులు దాటిన భూములలో; విశ్రాంతస్య = విశ్రాంతి తీసికొంటున్న; యోగినః=యోగియగు; మహాత్మనః = మహాత్మునకు; క్వ మోహః = మోహమెక్కడ?; క్వ విశ్వం = ప్రపంచమెక్కడ?; తత్=ఆ ప్రసిద్ధమైన; క్వ ధ్యానం=ధ్యానమెక్కడ?; క్వ ముక్తతా = ముక్తి ఎక్కడ?.

సర్వసంకల్ప సీమలు దాటి ఆత్మజ్ఞాన పీఠంపై విశ్రాంతి తీసికొనే సంయమీంద్రుడైన మహాత్ముడికి మోహం ఎక్కడ? సంసారమెక్కడ? ధ్యానం ఎక్కడ? ముక్తి ఎక్కడ?

సంకల్ప రాహిత్యం గల జీవన్ముక్తుడికి ఏ పదార్థాలపైన మోహం ఉండదు. ఆ మహాత్ముడి దృష్టి విశ్వం దాటి విష్ణుదేవుడిపైనే ఉంటుంది. ధ్యానంలేదు ముక్తి లేదు. దేనిని అపేక్షించడు. ఆ మహిమాన్వితుడి మనస్సు ఇచ్ఛాతీతం.

• • •

గుహాయందు నిహిత మనియెడు
మహనీయ బ్రహ్మపదము మహిత దమత్వో
పహతుండగు వానికి స
న్నిహితంబని చెప్పుదురు మనీషి జనంబుల్

— తిక్కన (భారతం - శాంతి పర్వం)

## విశ్వ స్వరూపం

యేన విశ్వమిదం దృష్టం న నాస్తీతి కరోతువై
నిర్వాసనః కిం కురుతే పశ్యన్నపి న పశ్యతి 191

యేన = ఎవనిచేత: ఇదం విశ్వం = ఈ విశ్వం; దృష్టం = చూడబడుచున్నదో: సః = ఆ ప్రపంచం: నాస్తీతి = లేదుఅని; నిశ్చిత్య = నిశ్చయించి; కరోతి = చేయబడిగాక; నిర్వాసనః = వాసనారహితుడైనయోగి; కింకురుతే = ఏమిచేస్తున్నాడు; సః = ఆయోగి: పశ్యన్నపి = చూస్తున్న వాడైననూ; న పశ్యతి = చూచుటలేదు.

వాసనారహిత పురుషపుంగవుడు ఈ విశ్వం యొక్క ఘట పటాదులు కార్య కలాపాలు చూచి ఇది యథార్థంకాదు అని నిశ్చయం చేసికొంటాడు. ఇక తాను ఏమిచేస్తాడు? ఏమీ చేయడు. అతడు విశ్వం చూస్తున్నా చూడని వాడే. ఆ మహా యోగి జీవన్ముక్తుడు.

ఆ యోగి జగత్తును చూస్తాడు కానీ ఇది జగత్తు కాదు అని చెప్పడు. వారికి 'జగత్తు అవును కాదు' అనే వాసనలున్నాయా! అంటే లేవు. ఆ ఋషి నిర్వాసనుడు ఆ మౌని సుషుప్తి చెందిన వాడివలె అమనస్కుడు. సంకల్ప వికల్ప రహితుడు. ఆత్మజ్ఞానికి ఏ కర్మాచరణమూ లేదు.

## పరం బ్రహ్మ

యేన దృష్టం పరంబ్రహ్మ సోఽహం బ్రహ్మేతి చింతయేత్
కిం చింతయతి నిశ్చింతో ద్వితీయం యో న పశ్యతి 192

యేన=ఎవనిచేత; పరబ్రహ్మ=పరబ్రహ్మము; దృష్టం=చూడబడిందో; సః=వాడు; "అహం బ్రహ్మ"="నేను పరబ్రహ్మను"; ఇతి=అని; చింతయేత్=భావన చేయవలయును; యః=ఎవడు; నిశ్చింతః=చింతారహితుడై; ద్వితీయం=రెండవ వస్తువును; న పశ్యతి=చూడడో; సః=వాడు; కిం=దేనిని; చింతయతి=ధ్యానిస్తాడు?

పరమమూ సర్వశ్రేష్ఠమూ అయిన పరబ్రహ్మ దర్శనం అయిన తర్వాత అహం బ్రహ్మ, ఆ బ్రహ్మం నేనేను అని భావించి చింతన చేసి ఆ యోగి నిశ్చింతుడయినాడు. ఆ యోగి ద్వితీయాన్ని దర్శించడమే లేదు. అంతా అద్వితీయ దర్శనమే ఆ మౌనికి చింతనీయం ఏమిఉంది! ఆ యోగి నిశ్చింతుడు ఆత్మానుభవ శాలికి ధ్యానం అవసరం లేదు.

బ్రహ్మసాక్షాత్కారం కాగానే 'నేను బ్రహ్మను' అనే నిశ్చయ జ్ఞానంకలిగి 'విశ్వం విష్ణుమయం'గా సర్వ దర్శనమయింది. ఆదార్శనికుడు సర్వ చింతారహితుడైనాడు. ఆలోచనే లేదు 'నేను బ్రహ్మను' అనే అనుభవం జ్ఞానం కలిగిన తర్వాత ఇంకా అభ్యాసం చేయవలసింది ఏముంది. బ్రహ్మచింతన కూడా అద్వితీయ ఆత్మజ్ఞానానికి అవసరం లేదు.

## ఉదారుడు

దృష్టో యేనాత్మ విక్షేపో నిరోధం కురుతే త్వసౌ
ఉదారస్తు న విక్షిప్తః సాధ్యాభావాత్కరోతి కిమ్ 193

యేన=ఎవనిచేత; ఆత్మవిక్షేపః=ఆత్మవిక్షేపం; దృష్టః=చూడబడిందో; అసౌ=అట్టి ఇతడు; నిరోధం=విక్షేపనిరోధమును; కురుతే=చేయుచున్నాడు; తు=అయితే; ఉదారః=ఉదారుడైన త్యాగపురుషుడు; విక్షిప్తరహితః = విక్షేపరహితుడు; సాధ్యాభావాత్=సాధింపదగినది లేకపోవటంవల్ల; సః=అతడు; కిం కరోతి=దేనిని చేయాలి?.

ఆత్మ విక్షేపాన్ని గమనించిన వాడు చిత్త నిరోధం చేస్తాడు. కానీ ఉదారుడయిన జ్ఞాని అసలు వస్తుతః స్వభావ సిద్ధంగానే విక్షేపరహితుడు. కనుక చిత్త విభ్రమమే లేనివాడికి చిత్త నిరోధం గలవాడు అని అనటం కూడా అనవసరం. "యోగః చిత్తవృత్తి నిరోధకః"

తన ఆత్మలో విక్షేపాలు చూచి వాటిని దూరం చేసికోటానికి చిత్త నిరోధం మొదలైన క్రియలు ఆచరించసాగుతాడు. అసలు విక్షేపాలే లేనప్పుడు చిత్త నిరోధాభ్యాసాలు ఎందుకు? ఆ యోగి సాధించతగింది వేరొకటిలేదు. పూర్ణకాముడు.

## ధీరుడు

ధీరో లోక విపర్యస్తో వర్తమానోఽపి లోకవత్
న సమాధిం న విక్షేపం న లేపం స్వస్య పశ్యతి 194

ధీరః=జ్ఞాని; లోక విపర్యస్తః=లోకంకంటే వేరైనవాడై; లోకవత్=లోకంవలె; వర్తమానః అపి=ఉంటున్నవాడైననూ; స్వస్య=తన; సమాధిం=సమాధినికానీ; విక్షేపం=విక్షేపాన్నికానీ; లేపంచ=బంధముకానీ; న పశ్యతి=గమనించడు.

ధీరుడైన జ్ఞాన పురుషుడు లోకంలో విక్షేపరహితుడు. లోక రీతిని అనుసరించి ఉంటూ వ్యవహరిస్తున్నాకూడా సమాధి విక్షేపం బంధనం స్పర్శించకుండా ఉంటాడు. ఆ మునికి సమాధిలేదు. విక్షేపంలేదు బంధనమూలేదు.

విజ్ఞాని లౌకిక విక్షేపరహితుడు ప్రారబ్ధవశంగా లోక వ్యవహారాలలో తగులుకొన్నాడు. కానీ ఆత్మలో నిర్లేపుడు నిర్వికారుడు.

## సంతృప్తుడు

భావాభావ విహీనో యః తృప్తో నిర్వాసనో బుధః
నైవ కించిత్ కృతం తేన లోక దృష్ట్యా వికుర్వతా 195

తృప్తః=తృప్తుడైన; యః=ఎవడు; బుధః=జ్ఞాని; భావాభావ విహీనః=భావ అభావ రహితుడై; నిర్వాసనః=వాసనారహితుడై; లోకదృష్ట్యా=లోకుల దృష్టిలో; వికుర్వతా అపి=చేయుచున్నవాడైనను; తేన=అతనిచేత; కించిదపి=కొంచెంకూడా; న కృతం=చేయబడుటలేదు.

సంతృప్తుడైన బుధుడు భావాభావరహితుడై వాసనారహితుడై నిశ్చలుడై విరాజిల్లుతాడు. లోకదృష్ట్యా కొన్ని కార్యాలు తాను చేస్తున్నా కూడా ఆత్మదృష్ట్యాతాను ఏమీ చేయనట్లే.

విద్వాంసుడు ఆత్మానందం వలన తృప్తుడై ఉంటాడు. అతడు మానావమాన రహితుడు. లోకందృష్టి అతడు కర్త కావచ్చు కానీ వస్తుతః అతడు అకర్త. ఆత్మజ్ఞానం వలన ఆయన కర్తృత్వాదులు అధ్యాసలు అన్నీ భ్రమలు అంతరించిపోయాయి.

• • •

కర్మణ్యకర్మయః పశ్యేత్ అకర్మణిచ కర్మయః
సః బుద్ధిమాన్ మనుష్యేషు సః యుక్తః కృత్స్న కర్మకృత్

కర్మలో అకర్మను - అకర్మలో కర్మను దర్శించేవాడే బుద్ధిమంతుడు. అతడే గొప్ప యోగి. సర్వకర్మలు చక్కగా చేయగల సమర్థుడు.

— భగవద్గీత 4-18

## సుఖం అంటే....

ప్రవృత్తౌ వా నివృత్తౌవా నైవ ధీరస్య దుర్గ్రహః
యదా యత్కర్తుమాయాతి తత్కృత్వా తిష్ఠతః సుఖమ్ 196

యదా=ఎవడు; యత్ = యత్కించిత్కర్మ; కర్తుం = చేయుటకు; ఆయాతి=వచ్చుచున్నదో; తత్=దానిని; సుఖం=సుఖపూర్వకంగా; కృత్వా=చేసి; తిష్ఠతః=సమాధి స్థితుడైన; ధీరస్య=జ్ఞానికి; ప్రవృత్తే=ప్రవృత్తియందు గానీ; నివృత్తౌ=నివృత్తియందుగానీ; దురాగ్రహః=దురాగ్రహం; న ఏవ = ఎప్పుడూ ఉండనే ఉండదు.

సమాధిస్థుడైనధీరపురుషుడు కర్మకలాపం చేయవలసి వచ్చినా సుఖపూర్వకంగా చేస్తాడు. కాని ఆ ఋషీశ్వరుడికి ప్రవృత్తిలో కానీ నివృత్తిలో కానీ మొండి పట్టుదల హరం లేదు.

ఆ ధీర పురుషుడికి ఏ విషయంలోనూ పట్టుదల పంతాలు లేవు. ఆ ముని కర్తృత్వాభిమాన రహితుడు. ఈ కారణంగా ఆనందంగా ఉంటాడు. ప్రారబ్ధవశంగా ప్రవృత్తిలోనూ సంచరిస్తూంటాడు. అసంగుడై ఆనందంగాకార్యాలు ఆచరిస్తూంటాడు.

• • •

# వాసనారహితుడు

నిర్వాసనో నిరాలంబః స్వచ్ఛందో ముక్త బంధనః
క్షిప్తః సంసార వాతేన చేష్టతే శుష్క పర్ణవత్ 197

నిర్వాసనః = వాసనా రహితుడు; నిరాలంబః = ఆలంబ రహితుడు; స్వచ్ఛందః = స్వేచ్ఛా విహారుడు; ముక్త బంధనః = బంధ విముక్తుడు; సంసార వాతేన = ప్రారబ్ధ కర్మవాయువుచేత; క్షిప్తః = ప్రేరేపింపబడిన వాడై; శుష్కపర్ణవత్ = ఎండుటాకువలె; చేష్టతే = సంచరిస్తాడు.

జ్ఞాని వాసనారహితుడు ఆలంబరహితుడు బంధనరహితుడు స్వేచ్ఛాచారి. లౌకిక వాతావరణ ప్రేరణతో శుష్కపత్రం వలె అటూ తిరుగుతూ పనులు చేస్తుంటాడు.

ఆత్మజ్ఞానికి కర్తవ్యంతో పనిలేదు. దేనిగూర్చి చింతన లేదు. స్వేచ్ఛావిహారి కనుక రాగ ద్వేషాలు ఆ ఋషి అధీనంలో అణిగిపోయి ఉంటాయి. బంధనాలు అజ్ఞాన లక్షణాలు. జ్ఞానికి బంధనాలు లేవు.

• • •

"పాల వంటి మనసు నీళ్ళవంటి సంసారంలో ముంచితే పాలు నీరయిపోయి ఇక వేరుకావు. పాలను కాచి తోడుపెట్టిన పెరుగును తరచి వెన్నవేసి ఆ వెన్నను నీటిలో ముంచినా కలవదు. అలానే సాధనలద్వారా కాచిన మనస్సును భక్తి జ్ఞానాలద్వారా చిలికి వేసిన తర్వాత వచ్చిన వెన్నవంటి మనస్సారాన్ని సంసార జలంలో ముంచినా నిర్లిప్తగా ఉంటుంది. భక్తి జ్ఞానాలు బడసిన తర్వాత సంసారం చేసినా భయంలేదు. నూనెరాచుకొని పనసతొనలు తీసిన జిగురు అంటదు. మంచిబంగారం మట్టిలో పెట్టినా త్రుప్పు పట్టదు"

— రామకృష్ణ పరమహంస

## శాంత మనస్వి

అసంసారస్య తు క్వాపి న హర్షో న విషాదతా
న శీతలమనా నిత్యం విదేహ ఇవ రాజతే 198

అసంసారస్యతు=సంసార రహితుడు అయితే; క్వాఅపిహర్షః=హర్షం ఎప్పుడు? ఎక్కడా; చ=మరియు; న విషాదః=విషాదమూ లేదు; సః= ఆయోగి; శీతలమానాః=చల్లని మనస్సుగలవాడు; నిత్యం=సదా; విదేహ= ముక్తుడి; ఇవ=వలె; రాజతే=విరాజిల్లుతుంటాడు.

జ్ఞానికి ఎన్నడూ హర్షం లేదు విషాదంలేదు. ఆ మౌని శాంత మనస్వి. సదా ముక్తుడువలె విరాజిల్లుతాడు. జ్ఞాని సంసార రహితుడు అసంసారి ఆనంద విహారి. క్షణికాలైన హర్ష విషాదాలు ఆ మహానుభావుడికి అంటవు. చల్లని మనస్సు గల వాడు. విదేహముక్తుడు వలె రాజిల్లుతుంటాడు. స్మృతి 'షడూర్మి రహితః శివః' ఊర్మికలులేనివాడు పరమ శివుడు అంటుంది.

## ఆత్మా రాముడు

అత్రాపి న జిహాసాఽస్మి ఆశావాఽపి న కుత్రచిత్
ఆత్మారామస్య ధీరస్య శీతలాచ్ఛతరాత్మనః 199

ఆత్మారామస్య=ఆత్మలో రమించు; శీతలాచ్ఛతరాత్మనః=శీతలమూ స్వచ్ఛమూ అయిన ఆత్మగల; ధీరస్య = మేధానిధి ఐన జ్ఞానికి; కుత్రాపి = ఎక్కడనూ జిహాసా=త్యాగేచ్ఛయూ; నాస్తి=లేదు; కుత్రాపి = ఎక్కడనూ; ఆశాచ = మరిఆశ గ్రహణేచ్ఛయునూ; ఆశాన = మరి ఆశ గ్రహణేచ్ఛయునూ; నాస్తి= లేదు.

ఆత్మా రాముడు, అతిశీతల చిత్తుడు అతి నిర్మల మానసుడు అయిన ధీరుడి ఏ కొంచం కూడా త్యాగేచ్ఛాలేదు సంగ్రహణేచ్ఛాలేదు. ఆత్మ సుఖంలో రమిస్తూం వాడు ఆత్మారాముడు. అతడు అతి నిర్మల చిత్తుడు. కడు చల్లనివాడు. ఏదీ స్వీకరిం లనే కోరికా లేదు త్యాగం చేయాలనీ లేదు. ఇష్టమూ లేదు. అనిష్టమూ లేద అర్థమూ లేదు. అనర్థమూ లేదు.

## శూన్య చిత్తుడు

ప్రకృత్యా శూన్య చిత్తస్య కుర్వతో౽స్య యదృచ్ఛయా
ప్రాకృతస్యేవ ధీరస్య న మానో నావమానతా 200

ప్రకృత్యా = ప్రకృతి సిద్ధంగా; శూన్య చిత్తస్య = సంకల్ప రహితమనస్సు; యదృచ్ఛయా = యాదృచ్ఛికంగా; ప్రాకృతస్య ఇవ = అజ్ఞాని వలె; కుర్వతః = చేస్తుంటాడు; (అట్టి) అస్య ధీరస్య = జ్ఞానికి; న మానః = మానమూ లేదు; న అవమానతా = అవమానమూ లేదు.

స్వభావసిద్ధంగా ప్రారబ్ధవశాత్తు జ్ఞాని అజ్ఞాని వలె ప్రాకృతుడివలె ప్రవర్తిస్తూ ఉంటాడు. జ్ఞాని శూన్య చిత్తుడు. ధీరచిత్తుడు. ఆ విజ్ఞానికి మానావమానాలు లేవు.

జ్ఞాని శూన్య చిత్తుడు. వికార రహితుడు. జ్ఞాని వికారికాదు. జ్ఞాని అతిశాంతుడు ఆత్మ జ్ఞానపురుషుడు అజ్ఞాని వలె సంచరిస్తాడు. అయినకు హర్షశోకాలు లేవు.

## శుద్ధ స్వరూపుడు

కృతం దేహేన కర్మేదం న మయా శుద్ధరూపిణా
ఇతి చింతానురోధీ యః కుర్వన్నపి కరోతిన 201

ఇదం కర్మ = ఈ కర్మ, దేహేన = దేహంచేత; కృతం = చేయబడింది; శుద్ధరూపిణా = పరిశుద్ధరూపుడనగు; మయా = నా చేత; న కృతం = చేయబడలేదు; ఇతి = ఈ ప్రకారం; యః = ఎవడు; చింతానురోధీ = భావించు చున్నాడో; సః = వాడు; కుర్వన్నపి = చేస్తున్నా కూడా; న కరోతి = చేయనివాడే.

ఈ కర్మ దైహికం. ఇది శుద్ధ రూపకంకాదు. ఈ ప్రకారం చింతించేవాడు కర్మ చేస్తుంటాడు. మరి చేయడు. ఈ కార్యకలాపాలు దేహం చేస్తుంది. ఇవి ఆత్మీయమైనవి కావు. ఆత్మ ఇది చేయదు. నేను ఆత్మజ్ఞానిని. ఈ పనుల్లో నా ఆత్మ జొరబడి పోదు. అందువల్ల ఆత్మ ఇందులో లగ్నంకాదు. అమనస్కంగా దేహేంద్రియాలు చేస్తుంటాయి. మానుతుంటాయి.

'కర్మలు దైహికమైనవి కదా. తప్పుడు పనులు చేస్తూ నా ఆత్మకు నాకు సంబంధంలేదు' అనుకొనేవారు అజ్ఞానులు. తప్పులు కప్పిపుచ్చుకొనే మోసగాండ్రు. అల్పులు వీరికి కర్మఫలాపేక్షమిక్కిలిగా ఉంది. ఆత్మజ్ఞానం అంటే అసలు తెలియదు. అనుభవం-ఆస్థ-శుద్ధ బుద్ధిలేదు.

వీరు కర్మఫలం అనుకూలంగానే ఉంటే పొంగి పోతారు. వ్యతిరేకంగా జరిగితే క్రుంగిపోతారు. శుభం అయితే సంతోషం. అశుభం అయితే అపరిమితదుఃఖం.

అజ్ఞానుల కార్యకలాపాలకు పూర్తిగా విరుద్ధం జ్ఞానుల కృత్యాలు. విజ్ఞానం శుభాలకు పొంగిపోరు. అశుభాలు జరిగినప్పుడు క్రుంగిపోరు. శుభాశుభాలయందు సమబుద్ధి కలిగి ఉంటారు. స్త్రీ వ్యామోహం, ధనాశ, రాగద్వేషాలు జ్ఞాని అయిన వాడి మనసులో జొరవు.

పవిత్ర పరిశుద్ధ మధుర పదార్థాలు ఆరగించే అనుభవం లేనివారు ఇతర పదార్థాలతో తృప్తి పడతారు. కానీ అవి రుచి మరిగినవాడు ఇతర పదార్థాలు తినలేడు. జ్ఞాన పురుషులు ఆత్మానందం వంటి మధురామృత పదార్థ రుచి ఎరిగినవారు. వారికి విషయానందం అత్యల్పం - నైచ్యం. వారికి రుచ్యంకాదు. వారు ఆత్మానంద మగ్న మానసులు. బ్రహ్మానందానుభవం గలవారు. ఉత్తమోత్తములు.

## శ్రీమాన్

అతద్వాదీవ కురుతే న భవే దపి బాలిశః
జీవన్ముక్తః సుఖీ శ్రీమాన్ సంసరన్నపి శోభతే 202

అతద్వాదీవ=ఆత్మ విరుద్ధవాక్యాలు పల్కనివాడివలె; జీవన్ముక్తః = జీవన్ముక్తుడు; కురుతే=కార్యములు చేస్తున్నాడుకానీ; బాలిశః=మూర్ఖుడు; న భవేత్= కాడు; అత ఏవ=కనుక; సంసరన్ అపి=సంసారమందున్నా; సః=అతడు; సుఖీ=సుఖవంతుడై; శ్రీమాన్=శ్రీమంతుడై; శోభతే=శోభిస్తాడు.

జ్ఞాని విరుద్ధవాదివలె నేను ఈ కార్యం చేయను అనడు. ఆ కార్యం చక్కగ నిర్వహిస్తాడు. కానీ అజ్ఞాని, మూర్ఖుడు పామరుడు వలె దానిపై అధికంగా వ్యామోహం పెట్టుకోడు. నిష్కామంగా ఉంటాడు. ప్రారబ్ధవశంగా లభించి

వ్యవహారం చేస్తూ నిరాయాసంగా నిత్యానందంలో సుఖంగా శ్రీమంతుడై ఉంటాడు. జీవన్ముక్తుడై చిన్మయానందుడై శోభిల్లుతుంటాడు. ఆత్మానందశ్రీ గలవాడు శ్రీమంతుడు.

ఆ సంయమీంద్రుడు సాంసారిక వ్యవహారాలు చేస్తున్నా అందులో మానసికంగా ప్రమేయం పెట్టుకోడు లాభాలాభాలలోనూ, ఫలాఫలాలలోనూ సుఖ దుఃఖాలకు లోనుకాడు. తామరాకుపై నీటిబొట్టువలె అంటీ అంటక నిత్య విభూతిలో ఉండిపోతాడు.

• • •

సర్వసంసారమును మానసమున నొదవు
సర్వసంసారమును మానసమున నుండు
సర్వసంసారమును మానసమున నడగు
సర్వసంసారమును మానసంబె యగును

— సీతారామాంజనేయ సంవాదం

## విశ్రాంతి

నానావిచార సుశ్రాంతో ధీరో విశ్రాంతి మాగతః
న కల్పతే న జానాతి న శృణోతి న పశ్యతి 203

నా నా విచార సుశ్రాంతః = బహువిధ విచార నివృత్తిగల వాడై; ధీరః = ధీమంతుడైన జ్ఞాని; విశ్రాంతిం = ఆత్మ శాంతిని; ఆగతః = పొందుతున్నాడు; అతఏవ = కనుక; సః = అతడు; నకల్పతే = కల్పనలు భావనలు చేయడు; న జానాతి = ప్రయత్నించడు; న శృణోతి = వినడు; న పశ్యతి = చూడడు.

ద్వైత భావ విచార ధార నివృత్తి కాగానే జ్ఞానికి శాంతి విశ్రాంతి లభిస్తుంది. అద్వైతభావ విభూతిలో పరమేశ్వరానుభూతి పొందుతుంటాడు. తన్మయుడై ఆత్మ జ్ఞానంలో మగ్నమై ఆత్మరతిలో ఉండి పోతాడు. ఆ స్థితిలో ఆ మౌని ఏమి కల్పనలూ చేయడు. ఏమీ తెలిసికోవాలను కోడు. ఏమి వినడు. ఏమీ చూడడు.

మునికి నా నా ప్రకార విచారధారలు రాహిత్యం పొందుతాయి. ఆ ఋషి అంతరాత్మ శాంతి సుఖం పొందుతుంది. మనో వ్యాపారాలైన సంకల్పాదులు అరి కట్టబడతాయి. బుద్ధి వ్యాపారం కూడ సద్దుమణుగుతుంది. ఇంద్రియాలు వ్యాపారాలు మానివేస్తాయి. ఆ మౌనికి కర్తవ్యాదులపై అభిమానమే ఉండదు.

• • •

సకల రత్నపూర్ణ సర్వవసుంధరా
చక్ర దానవిధియు సరియనంగ
రాదు - విశ్వవేదరాశి సారాధ్యాత్మ
విద్య ఇచ్చుటకు వివేకధుర్య!

— తిక్కన (భారతం శాంతిపర్వం)

# మహాశయుండు

అసమాధేః అవిక్షేపాత్ నముముక్షుః న చేతరః
నిశ్చిత్య కల్పితః పశ్యన్ బ్రహ్మైవాస్తే మహాశయః 204

మహాశయః = మహోన్నత ఆశయంగలజ్ఞాని; అసమాధేః = సమాధి రహితుడుకావడంవలన; ముముక్షుః = మోక్షేచ్ఛగలవాడు; న భవతి = అగుటలేదు; అవిక్షేపాత్ = విక్షేప రహితుడైనందువలన; న ఇతరః = బద్ధుడుకాడు; ఇతి = ఇట్లని; నిశ్చిత్య = నిశ్చయించుకొని; ఇదం = ఈ సకలచరాచరజగత్తును; కల్పితం = మాయాకల్పితంగా; పశ్యన్ = చూస్తున్నాడు; బ్రహ్మైవ = బ్రహ్మమై; ఆస్తే = ఉంటున్నాడు.

యోగి మహాశయుడు సమాధి రహితుడైనంత మాత్రాన ముముక్షువు కాలేదు. ద్వైత భావ అభావంవలన బద్ధుడూకాలేదు. నిశ్చయ జ్ఞానంవలన ఈ సర్వవిశ్వం కల్పితం అని దృఢమైన నమ్మకం కలిగింది. ఆ స్థితిలో అపుడు ఆ యోగి బ్రహ్మమై సుస్థిరుడైనాడు.

జ్ఞాని ముముక్షువుకాడు. ముముక్షువు అయినవాడు విక్షేప నివృత్తికోసం సమాధి అవలంబిస్తాడు. జ్ఞానిలో విక్షేపాలే ఉండవు. ఇక సమాధి ఎందుకు? ద్వైత భ్రమ తొలిగిపోతే బంధంకూడా పోతుంది. ద్వైత భ్రమ ఉంటేనే బంధం.

జ్ఞాని బ్రహ్మస్వరూపుడు. జగత్తు కల్పితం అని జ్ఞానికి మొదటినుంచీ తెలుసు. కాబట్టి ఆ జ్ఞాన పురుషుడు జగత్తును బాధితానువృత్తితో లీలామాత్రం చూస్తుంటాడు. అందువల్ల ఆ యోగి నిర్వికార చిత్తుడే.

• • •

"సమాధి స్థితి నొందితే కర్మలు త్యజింపబడతాయి. విషయ కర్మలేకాక సత్కర్మలైన పూజా జపతపాదులుకూడా విడిపోతాయి అది జ్ఞాని పరిపక్వస్థితి"

— రామకృష్ణ పరమహంస

# నిరహంకారుడు

యస్యాంతః స్యాదహంకారో న కరోతి కరోతి సః
నిరహంకార ధీరేణ నకించి దకృతం కృతమ్ 205

యస్య=ఎవని; అంతః=అంతఃకరణంలో; అహంకారః=అహంకారం; స్యాద్యది = కలుగుతుందో; సః = వాడు; లోకదృష్ట్యా = లోకందృష్టిలో; న కరోతి అపి=చేయనివాడైనప్పటికీ; కరోతి=సంకల్పాదులద్వారా చేస్తున్నాడు; నిరహంకార ధీరేణ = అహంకార రహితుడైన జ్ఞానిచేత; లోకదృష్ట్యా = లోకం దృష్టిలో; న కించిత్=అధికంగా; కృతమపి=చేయబడినదైనా; స్వదృష్ట్యా= స్వకీయ దృష్టిచేత; తత్=అది; న కృతం=చేయబడనిదే.

అంతఃకరణలో అహంకార అధ్యాసగలవాడు లోకందృష్టిలో ఏమీచేయని యోగివలె కనిపిస్తాడు కాని మానసికంగా అన్నీ ఆలోచిస్తూనే ఉంటాడు.

అంతః కరణలో నిరహంకార ధీరత్వం గలవాడు లోకం దృష్టిలో ఎన్నో కార్యాలు చేస్తున్నాకూడా మానసికంగా ఏ కొంచమూ ఆలోచించడు. కనుక ఏమీ చేయనివాడే

అహంకారి ధ్యానాలు సమాధి నిష్ఠలు నియమాలు చేస్తూన్నట్లుండినా అన్ని ఊహాపోహాలు ఆశలు అభిలాషలు సంకల్పిస్తుంటాడు. నిరహంకారి ఆ విధంగా ఉండడు. లోకుల ప్రశంసలు రాకపోవచ్చు. ఆ యోగి ఏమీ అనుకోడు. ఏవైనా కార్యాలు చేసినా మనస్సు నిష్కల్మషంగా నిర్వికారంగా నిశ్చలంగా ఉంటుంది. సంకల్పాలే ఉండవు. కర్తృత్వ అపేక్షలుండవు.

# ఆశా రహితుడు

నోద్విగ్నం న చ సంతుష్టం అకర్తృ స్పంద వర్జితమ్
నిరాశం గతసందేహం చిత్తం ముక్తస్య రాజతే 206

ముక్తస్య = జీవన్ముక్తుని; చిత్తం = మనస్సు; అకర్తృ = కర్తృత్వ రహితమై; స్పందవర్జితం=చలనరహితమై; నిరాశం=ఆశారహితమై; గత సందేహం=సందేహరహితమై; నోద్విగ్నం=ఉద్వేగరహితమై; న సంతుష్టం= సంతోషంతో పొంగిపోవనిదై; రాజతే=ప్రకాశిస్తూ ఉంటుంది.

జీవన్ముక్త పురుషుడు కర్తృత్వరహితుడు. సంకల్ప వికల్ప రహితుడు. ఆశారహితుడు సందేహరహితుడు ఆ మహర్షి చిత్తంలో ద్వేషంలేదు సంతోషం లేదు పరమానందమే, ఆత్మానందమే,

జీవన్ముక్తుడి మానసం ప్రశాంతి నిలయం ప్రకాశగృహం. ఆ ఋషి చిత్తంలో ఉద్వేగం అనేదిలేదు ఉద్వేగం ఉంటేనే ద్వైతం తలయెత్తుతుంది. ఆ ఋషీశ్వరుడి చిత్తం సంకల్ప వికల్ప శూన్యం. లౌకిక ఆశలు అందు పొటమ రించవు. సందేహాలకు స్థానమే లేదు అక్కడ అహంకారం అన్యాయ అజ్ఞానం లేదు.

• • •

విడుపువలను సకల విషయవాంఛలయందు
విడుపుబోలు గుణము వెదకి యెందు
గావనైరి బుధులు కలదె పరిత్యాగ
శీలునకు అసాధ్యసిద్ధి యెందు?

— ఎఱ్ఱన (భారతం)

# నిర్నిమిత్తుడు

నిర్ధ్యాతుం చేష్టితుం వాపి యచ్చిత్తం న ప్రవర్తతే
నిర్నిమిత్త మిదం కింతు నిర్ధ్యాయతి విచేష్టతే 207

యత్ = జ్ఞానిదైన ఏ: చిత్తం = మనస్సు: నిర్ధ్యాతుం = ధ్యానరహితంగా గానీ: వా అపి = లేక: చేష్టితుం = కర్మలు చేయటంలోకానీ: న ప్రవర్తతే ప్రవర్తించదు: కింతు = కానీ ఒకానొకప్పుడు: ఇదం = ఈ చిత్తం: నిర్నిమిత్తం = కారణంలేకుండా: నిర్ధ్యాతుం = ధ్యాన క్రియారహితంగా ఉంటుంది: చ = మరియు: విచేష్టతే = ఏవో క్రియలను చేస్తుంది

జ్ఞాని చిత్తం నిష్క్రియభావంలో సుస్థితంగా విరాజిల్లుతుంది. ఆ చిత్తం చేష్టలు చేయటానికి ప్రవృత్తంకాదు. అది సంకల్పరహితం. నిశ్చలం. సుస్థిరం. కానీ సంకల్ప రహితంగా నిర్నిమిత్తంగా నా నా ప్రకారచేష్టలు చేస్తూంటాడు. ఆ యోగి చిత్తం పరమ పవిత్రం. పరిశుద్ధం. అది స్వస్వరూపంలో సుస్థిరం.

## మందుడు

తత్త్వం యథార్థ మాకర్ణ్య మందః ప్రాప్నోతి మూఢతామ్
అథవాఽఽయాతి సంకోచ మమూఢః కోఽపి మూఢవత్ 208

మందః = అజ్ఞాని: యథార్థం తత్త్వం = యథార్థ తత్త్వం: ఆకర్ణ్యఅపి = వినియున్నూ: మూఢతాం = మౌఢ్యాన్ని: ప్రాప్నోతి = పొందుతున్నాడు: అథవా = లేక: సంకోచం = సంకోచబుద్ధిని: ఆయాతి = పొందుతున్నాడు: తథా = అలా: అమూఢః = జ్ఞాని: కోఽపి = ఒకానొకడు: మూఢవత్ = మూఢుని వలె: మూఢతాం = మూఢత్వం: ప్రాప్నోతి = పొందుతున్నాడు.

మందుడైన అజ్ఞాని, ఆత్మ తత్త్వంలోని రహస్య ప్రబోధాన్ని ఉపనిషత్తుల ద్వారా ఇతర శాస్త్రాల ద్వారా వినికూడా సంశయం మూఢత్వాన్ని అవివేకాన్ని వదులుకోలేడు. అజ్ఞానంతోనే జీవిస్తాడు తత్త్వంలోని అర్థాన్ని పరమార్థాన్ని గ్రహించలేడు. దీని అర్థం అవగాహన కోసం సమాధి యోగాలు పూనతాడు. వీరిలో కోటి కొక్కడు ఆత్మ జ్ఞాని పైకి మూఢుడివలె సంచరిస్తాడు. కానీ అంతరంగంలో ప్రశాంతి అనుభవస్తాడు.

"తత్" అనగా పరమాత్మ "త్వం" అనగా ఆత్మ. ఈశ్వరజీవ ఐక్యమే తత్త్వం. ఈ తత్త్వపదార్థం గురువు వలన విని కూడా అజ్ఞాని విపరీత భావనలు పొందుతుంటాడు. అసంభావన అంటే గురువుచెప్పిన దానిని సందేహించుట విపరీత

భావన అంటే దేహాన్ని ఆత్మ అనుకొనుట మరియు గురూపదేశాలకు విపరీతార్థ వ్యాఖ్యానాలు చేయుట శాస్త్రార్థ సాక్షాత్కారం కోసం చిత్తనిరోధం చేయుట.

◆ ◆ ◆

నిత్యము కర్మయు కర్మ ఫ
ల త్యాగియు నగుట లెస్స - లౌల్యవివియోగం
బత్యుత్తమయోగము - ద
త్ప్రత్యయ లక్షణుడు సూవె బ్రాహ్మణుడు మహిన్
— ఎఱ్ఱన (భారతం)

# చిత్త నిరోధం దూష్యం

ఏకాగ్రతా నిరోధోవా మూఢై రభ్యాసతే భృశమ్
ధీరాః కృత్యం న పశ్యంతి సుప్తవత్ స్వపదే స్థితాః 920

ఏకాగ్రతా = చిత్తైకాగ్ర్యం: వా = లేక; నిరోధః = చిత్తనిరోధం; మూఢైః = మూఢులచేత; భృశం = ఎక్కువగా, మిక్కిలిగా; అభ్యస్యతే = అభ్యాసం చేయబడుతున్నది; ధీరాః = ధీరులైన జ్ఞానమూర్తులు; కృత్యం = పూర్వకృత్యాలయిన ఏకాగ్రత నిరోధాదులను; నపశ్యంతి = చూడరు; పరంతు = మరేమనగా; స్వప్నవత్ = నిద్రిస్తున్నట్లు; స్వపదే = తన ఆత్మపదంలో; స్థితాః = ఉంటుంటారు.

చిత్త ఏకాగ్రత కోసం చిత్తనిరోధం కోసం అజ్ఞానులు అత్యంతమైన అభ్యాసం చేస్తుంటారు. కాని ధీరపురుషుడు చిత్త ఏకాగ్రత, చిత్తనిరోధం లక్షించకుండానే విద్యించిన వాడు నిద్రలేచి కూర్చునట్లు తన ఆత్మ పదంపై సుస్థితంగా విరాజిల్లుతాడు.

ఇతరచింత లేకుండా లక్ష్యం ఒక్కదానినే ధ్యానించటం ఏకాగ్రత. ఏకాగ్రత గానీ చిత్త నిరోధం గానీ ఆత్మ సాక్షాత్కారం కోసం విపరీత భావనలు కలుగకుండటకై అభ్యాసం చేస్తారు కొందరు.

దేహమే నేను అనే విపరీత భావములు లేని విజ్ఞాని అద్వైతానంద ఆత్మ సాక్షాత్కారం పొందుతాడు. ఆ యోగి ఆనందభ్రమలుతేక స్వస్వరూప ప్రకాశం స్ఫురింప పరమాత్మను దర్శిస్తాడు.

# చిత్తనిరోధం నిష్ప్రయోజనం

అప్రయత్నాత్ ప్రయత్నాద్వా మూఢో నాప్నోతి నిర్వృతిమ్
తత్త్వ నిశ్చయ మాత్రేణ ప్రాజ్ఞో భవతి నిర్వృతిః 210

మూఢః = అజ్ఞాని; అప్రయత్నాత్ = అప్రయత్నంగాకానీ; ప్రయత్నాత్ = ప్రయత్నం చేసికానీ; నిర్వృతిం = పరమ సుఖం; నాప్నోతి = పొందకున్నాడు: ప్రాజ్ఞః = జ్ఞాని; తత్త్వనిశ్చయ మాత్రేణ = తత్త్వనిశ్చయం చేయుట మాత్రంచేత: నిర్వృతః = పరమసుఖం పొందువాడుగా; భవతి = అగుచున్నాడు.

అజ్ఞాని చిత్తంనిరోధంచేసి కఠిన కర్మానుష్ఠానుచేసికూడా ప్రయత్నించి ప్రయత్నించకా అవస్థలు పడతాడే కానీ కూడా పరమ సుఖాన్ని పొందలేడు. ప్రాజ్ఞుడైన జ్ఞాన పురుషుడు కేవలం తత్త్వంలోని నిశ్చయార్థం గ్రహించి నిర్వృతి పదవి పొందుతాడు.

జీవ బ్రహ్మ ఐక్యతపై నిశ్చయాభిప్రాయం లేని వాడు మూఢుడు. అజ్ఞాని అవివేకి. అతడు చిత్త నిరోధానికి సమాధి హఠయోగాలు పడతాడు. కర్మానుష్ఠానాలు నిత్యం చేస్తుంటాడు. కానీ పరమసుఖం పొందలేడు. ఆనంద హేతువైన ఆత్మానుభవం అతడికి తెలియదు

జ్ఞాని జీవ బ్రహ్మైక్యం పై దృష్టిగలవాడు. తత్త్వ మూలార్థం తెలిసిన వాడు. అజ్ఞాన యోగీంద్రుడు సమాధిలో కూర్చొడు కర్మలు చేయడు. కానీ నివృత్తిలో గల నిత్య సుఖం అనుభవిస్తాడు. అతడు చేయవలసిన కర్తవ్యాలు ఏవీలేవు.

• • •

యస్త్వాత్మరతి రేవస్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే

ధీరుడు ఆత్మరతిలోనే పరమానందం అనుభవిస్తాడు. ఆత్మలోనే తృప్తి తుష్టి పరిపూర్ణంగా పొందుతాడు. ఆత్మేతర పదార్థాల వల్ల సంతృప్తి కలుగదు. ఆధీరుడికి ఏ కర్తవ్య కార్యాలూ అవసరం లేదు.

— భగవద్గీత

# ఆత్మ శుద్ధం

శుద్ధం బుద్ధం ప్రియం పూర్ణం నిష్ప్రపంచం నిరామయమ్
ఆత్మానం తం న జానంతి తత్రాభ్యాస పరా జనాః 211

తత్ర=ఆ హఠ యోగాదులందు: అభ్యాసపరాః=అభ్యాసపరులైన యోగులైన; జనాః=విశిష్టజనులు: శుద్ధం=శుద్ధమూ: బుద్ధం=జ్ఞాన రాశీ: ప్రియం=ప్రియమూ; పూర్ణం=పూర్ణమూ: నిష్ప్రపంచం = ప్రపంచ వాసనారహితమూ; నిరామయం=దుఃఖహరమూ అయిన; తం=ఆ; ఆత్మానం=ఆత్మను; న జానంతి= తెలుసికోలేరు.

ఈ జగత్తులో అభ్యాసపరాయణులైన జనులు పరిశుద్ధమూ ప్రబుద్ధమూ ప్రియమూ పరిపూర్ణమూ ప్రపంచ రహితమూ దుఃఖ రహితమూ అయిన ఆత్మను గూర్చి ఎరుగరు.

కర్మ కలాపు ఆచరణలోగల అభ్యాసపరాయణులై ఆత్మ జ్ఞానం లేని అజ్ఞానులు ఆత్మను అర్థం చేసికోలేరు. ఆమూఢులు తత్త్వజ్ఞానం పొందలేక మాయా తీతం - స్వప్రకాశవిలసితం - పరిపూర్ణం - ప్రపంచాతీతం - సంసార దుఃఖరహితం - నిరామయం అయిన స్వస్వరూప ఏకాత్మను తెలుసుకోలేరు. అది తెలిసిన వాడికే ముక్తి అట్టి వాడే జీవన్ముక్తుడు.

♦ ♦ ♦

"నేను ఉపకారం చేస్తున్నాను" అనుకోవటం అహంకారం. అజ్ఞానం వలన ఈ అహంకారం ఆవిర్భవిస్తుంది. "సర్వేశ్వరుడే సర్వం చేయిస్తున్నాడు అనే భావన జ్ఞానబీజం. ఈశ్వరుడు కర్త, భర్త, హర్త. జీవుడు అకర్మ, అకర్త".

— రామకృష్ణ పరమ హంస

# విజ్ఞానం ముఖ్యం

నాప్నోతి కర్మణా మోక్షం విమూఢోఽభ్యాస రూపిణా
ధన్యో విజ్ఞాన మాత్రేణ ముక్తస్తిష్ఠత్య విక్రియః 212

విమూఢః = అజ్ఞాని; అభ్యాసరూపిణా = అభ్యాసరూపమైన; కర్మణా = కర్మచేత; మోక్షం = మోక్షం; న ఆప్నోతి = పొంద జాలదు; అవిక్రియః = క్రియా రహితుడైన; ధన్యః = ధన్య పురుషుడు; విజ్ఞాన మాత్రేణ = జ్ఞానమాత్రం చేత; ముక్తః = ముక్తుడై; తిష్ఠతి = విరాజిల్లుతున్నాడు.

మూఢుడు అభ్యాసంవల్ల అలవాటుపడి కర్మలు చేసినంత మాత్రాన మోక్షం పొందలేడు. ధన్యుడూ భాగ్యశాలి అయిన పురుషపుంగవుడు క్రియా రహితుడై కేవలం విజ్ఞానం వల్ల ముక్తి పదం అధిష్ఠిస్తాడు.

యోగాభ్యాసాలు కర్మకలాపాలు మోక్షం సంపాదించి పెట్టలేవు. "తథాచ— న కర్మణా న ప్రజయా న ధనేన...." కర్మలు సంతానం ధనం మానవుడికి మోక్షం అందించలేవు. అవిద్య అంతరించాలి విజ్ఞానం విస్తరిల్లాలి. అప్పుడే అపవర్గం సంప్రాప్తం.

• • •

కామంబును క్రోధంబును
నేమరక జయింపవలయు నెల్ల విధములన్
ధీమహిత! అదియ సతత
క్షేమంకరమైన పథము కృత బుద్ధులకున్

— ఎఱ్ఱన భారతం

## కోరికమాత్రం చాలదు

మూఢో నాప్నోతి తద్బ్రహ్మ యతో భవితు మిచ్ఛతి
అనిచ్ఛన్నపి ధీరోహి పరబ్రహ్మ స్వరూపభాక్ 213

యతః = ఏ కారణంవలన; మూఢః = అజ్ఞాని; బ్రహ్మ = బ్రహ్మ; భవితుం = అగుటకు; ఇచ్ఛతి = కోరుకొంటున్నాడో; తతః = ఆ కారణం వలననే; సః = అతడు; తత్ = ఆ బ్రహ్మను; న ఆప్నోతి = పొందజాలకున్నాడు; ధీరః = ధీర పురుషుడగుజ్ఞాని; అనిచ్ఛన్నపి = కోరకున్నను; పరబ్రహ్మస్వరూప భాక్ భవతి = పరబ్రహ్మ స్వరూపం పొందువాడగుచున్నాడు.

అజ్ఞాని తాను బ్రహ్మ కావాలని తీవ్రంగా కోరుకొంటాడు. కోరుకోవటం కారణంగా తాను బ్రహ్మకాలేడు. జ్ఞాని జితేంద్రియుడు. వాంఛారహితుడు. వారికి ఏ కోరికలు లేవు. ఏమీ కోరుకోనివాడు కనుక జ్ఞాని పరబ్రహ్మ స్వరూపం పొందుతాడు.

అజ్ఞాని అయిన మూఢుడు చిత్త నిరోధ నియమాలు పాటించి కష్టించి వాంఛలను అరికట్టుకోలేక తానే బ్రహ్మనై పోవాలని నిశ్చయం చేసికొంటాడు. వాంఛలు అజ్ఞాన లక్షణాలు. అజ్ఞాన వాంఛవల్ల తాను ఎన్నటికీ బ్రహ్మ కాలేకపోతు బాధలు పడుతూంటాడు.

జ్ఞాని మోక్షాన్ని కూడా అపేక్షించడు. అపేక్ష లేకపోవటంచేత జితేంద్రియుడికి బ్రహ్మత్వం సిద్ధిస్తుంది. మోక్షం ప్రాప్తిస్తుంది. కోరికలు జయించటమే సిద్ధికి త్రోవ. మోక్షాపేక్షగలవాడు ముముక్షువు. అపేక్షలు వర్జనీయం అన్నప్పుడు మోక్షాపేక్ష కూడా వర్జనీయమే. మోక్షేచ్ఛ లేనివాడు పరబ్రహ్మస్వరూపుడు. అంతఃకరణ సహితుడు జీవుడు. అంతఃకరణ రూపావరణ రహితుడు దేవుడు.

## సంసారపోషకులు మూఢులు

నిరాధారాః గ్రహ వ్యగ్రా మూఢాః సంసార పోషకాః
ఏతస్యానర్థ మూలస్య మూలచ్ఛేదః కృతో బుధైః 214

నిరాధారాః = ఆధారరహితులయిన; గ్రహవ్యగ్రాః = దురాగ్రహాలయిన; మూఢాః = మూఢులు; సంసార పోషకాఃభవంతి = సంసార పోషకులు అగుచున్నారు; బుధైః = జ్ఞానవంతులగు పండితులచేత; ఏతస్య = ఈ; అనర్థమూలస్య = అనర్థ హేతువైన; సంసారస్య = సంసారం యొక్క; మూలచ్ఛేదః కృతః = మూలచ్ఛేదం చేయబడుతున్నది.

ఆధార హీనులు దురాగ్రహపరులు అయిన అజ్ఞానులు సంసార పోషణలోనే జీవనం గడుపుతుంటారు. సంసారం అనర్థమూలం. బుధులైన జ్ఞానులు అనర్థ మూలమైన సంసార వృక్షాన్ని జ్ఞాన ఖడ్గంతో ఖండించి పరమ సుఖం పొందుతారు.

మొండి పట్టుదల హఠం గలవాడు మూర్ఖుడు. వేదాంత శాస్త్రీలు ఆత్మ విచారాలు గురుబోధ పొందకుండానే కేవలం చిత్తనిరోధం చిత్తనిరోధం అని జపించేవాడికి మోక్షంరాదు. సంసార బంధంపోదు. సంసార మూలచ్ఛేదం చేయటానికి జ్ఞానం కావాలి. అది లేకుండా బంధవిముక్తి కాదు. అజ్ఞాని జ్ఞానానికే విముఖుడు.

## వాంఛలు జయించాలి

న శాంతిం లభతే మూఢో యతః శమితు మిచ్ఛతి
ధీర స్తత్వం వినిశ్చిత్య సర్వదా శాంత మానసః 215

యతః=ఏకారణం వలన; మూఢః=మూఢుడు; శాంతిం=శాంతిని; ఇచ్ఛతి=కోరుతున్నాడో; తతః=ఆకారణం వలన; సః=అట్టి వాడు; శాంతిం= శాంతిని; నలభతే=పొందడు; ధీరః=ధీశక్తిగలవాడు; తత్త్వం=పరతత్త్వం; వినిశ్చిత్య=నిశ్చయించుకొని; సర్వదా=సదా: శాంతమానసః = శాంతమనస్వి అగుతున్నాడు.

అజ్ఞాని శాంతిగా ఉండాలని వాంఛించి వాంఛాలబ్ధికి ప్రయత్నిస్తాడు. ఈవాంఛ కారణంగా అజ్ఞాని శాంతి పొందలేడు. నిశ్చయ జ్ఞానంతో జ్ఞాని తత్త్వ రహస్యమెరిగి ఏ విధమైన వాంఛ లేకుండా నిశ్చలంగా సదాశాంతి పొందుతుంటాడు.

అజ్ఞాని చిత్త నిరోధంతో శాంతి సాధించాలని పట్టుపట్టి విఫలుడవుతాడు. ధీరుడు పట్టుదల మారకుండా ఆత్మతత్తం నిశ్చయంగా గ్రహించాలని వాంఛలు జయించి శాంతి పొందుతాడు.

• • •

"పాప పుణ్యాలు ఉన్నవి-లేవు. 'అహం' తత్త్వమున్నంతవరకు భేద బుద్ధి ఉండును. అపుడు పాప పుణ్యాల జ్ఞానంకూడా ఉండును. అహము తుడిచివేసినవారు పాప పుణ్యాలకు మంచి చెడ్డలకు అతీతులు.

ఈశ్వరదర్శనం కానంత వరకు భేదబుద్ధి - మంచిచెడ్డలనే జ్ఞానం ఉండనే ఉండును. ఈశ్వరుని పూర్తిగా ఎవరెరుగుదురు కావలసినంతవరకు ఎరిగిన చాలు. చక్కెరకొండకడకేగిన చీమ దానికి కావలసినంత మాత్రమే కొనును కాని దానికి కొండ అక్కరలేదు. గ్లాసెడు నీరుతో దాహంతీరిపోగా సరోవరం నీరు లెక్కింప నేల!"

— రామకృష్ణ పరమహంస

# ఆత్మ అవ్యయం

క్వాత్మనో దర్శనం తస్య యద్దృష్ట మవలంబతే
ధీరా స్తంతం న పశ్యంతి పశ్యంత్యాత్మాన మవ్యయమ్ 216

యత్ = ఎవని చేత: దృష్టం = దృశ్య పదార్థం: అవలంబతే = అవలో కింప బడుతున్నదో; తస్య = అతనికి; ఆత్మనః = ఆత్మయొక్క: దర్శనం = సాక్షాత్కారం; క్వ = ఎక్కడ?; ధీరాః = జ్ఞానులు: తంతం = ఆయా; దృష్టం = దృశ్య ప్రపంచం: న పశ్యంతి = చూడరు; అవ్యయం = నాశరహితమైన; ఆత్మానం = ఆత్మను; పశ్యంతి = చూచు చుంటురు.

అజ్ఞానికి ఆత్మదర్శన మెక్కడ లభ్యం అతడు కళ్ళుతెరిచే సర్వం చూడా లని చూస్తూంటాడు. బాహ్య చర్మచక్షువులకు ఆత్మ కనిపించదు. అంతర్దృష్టిగల వాడికే ఆత్మ దర్శన భాగ్యం. జ్ఞాని ఆత్మను ఈ కన్నులతో చూడదు. అంతర్దృష్టితో అవి నాశి అయిన ఆత్మను అవలోకిస్తాడు.

అజ్ఞానికి ప్రత్యక్షప్రమాణాలే కావాలి. అవే సత్యం నిత్యం అనుకొంటాడు. అందువల్ల అతడికి ఆత్మ దర్శనం కాదు. జ్ఞాని కనిపించే పదార్థాలను కాక పదార్థాల అంతర్గత కారణశక్తిని తెలుసికొంటాడు. అందువల్ల అతడు సర్వదా చిద్రూపమైన ఆత్మను అవలోకిస్తాడు. కనుక ఆ యోగి ఆత్మజ్ఞానంలో లీనమై ఉంటాడు. కార్య రూపంలో గల బాహ్యపదార్థాలు అతడికి కనిపించవు.

• • •

"శరణాగతియే మోక్షభవనమునకు సింహ ద్వారం"

— శ్రీ సత్యసాయిబాబా

# బలవంతం తగదు

క్వ నిరోధో విమూఢస్య యో నిర్బంధం కరోతివై
స్వారామస్యైవధీరస్య సర్వదాఽసావ కృత్రిమమ్ 217

యః=ఎవడు: నిర్బంధం=చిత్త నిరోధం: వై =హఠముగా, పట్టుదలగా: కరోతి=చేయుచున్నాడో: తస్య=ఆ: విమూఢస్య=మూఢునకు: నిరోధః= చిత్త నిరోధం: క్వ=ఎక్కడ?: స్వారామస్య=ఆత్మారాముడైన: ధీరస్య= ధీరుడైన జ్ఞానికి: సర్వదా ఏవ = ఎల్లప్పుడూ: అసౌ = ఈ చిత్త నిరోధం: అకృత్రిమ=స్వాభావికమే.

చిత్త నిరోధం బలవంతంగా హఠంతో చేసేవాడు అజ్ఞాని. అతడు ఏమి చేస్తాడు? నిరోధం సాధించలేడు. ఆత్మారాముడు ధీరుడు జ్ఞాని. నిశ్చయబుద్ధితో నిశ్చింతగా స్వాభావికంగా సులభంగా అతి సహజంగా చిత్త నిరోధం సాధిస్తాడు.

అజ్ఞాని శుష్కచిత్తుడు. చిత్త నిరోధం సాధించలేడు. చిత్త నిరోధానికి సమాధి అవలంబిస్తాడు. కానీ అతడు సమాధినుంచి లేవగానే చిత్తం లౌకిక విషయాలపైకి పరుగులెత్తుతుంది. నిత్యం నిశ్చల చిత్తంతో ఆత్మస్మరణ చేసేవాడు. సదా ఆత్మా నందంలో నిలిచిపోతాడు. సదా సమాధి సాధిస్తాడు. స్వాత్మారాముడై విరాజిల్లు తాడు.

• • •

భూత హితంబుగా పలుకు బొంకును సత్యఫలంబునిచ్చు - త
ద్భూత భయాస్పదంబగు ప్రభూతపసత్యము బొంకుసట్ల....

— ఎఱ్ఱన (భారతం)

# నిరాకులుండు

భావస్య భావకః కశ్చిత్ కించిద్భావ కోఽపరః
ఉభయాఽభావకః కశ్చిత్ ఏవమేవ నిరాకులః 218

క్వచిత్ = ఒకానొకడు. భావస్య = భావములయొక్క భావాలు; భావకః = భావించువవాడు అగుచున్నాడు; అపతః = మరొకడు; కించిత్ = కొంచం కూడా; న భావయతి = భావించడు; ఏవమేవ = ఈ ప్రకారం; కించిత్ = కొంచమంతకూడా; ఉభయాభావకః = రెండింటినీ భావించనివాడు; నిరాకులః = వ్యాకులతలేని స్వస్థ చిత్తుడగుచున్నాడు.

లోకంలో ఒకానొకడు భావాన్ని మన్నిస్తాడు. ఇంకొకడు ఏ కొంచమూ ఏ ఒక్కటీ మన్నించడు. ఇంకొకటి ఇలానే మరొకడు. భావ అభావాలు ఉభయాన్ని కూడా మన్నించనివాడు స్వస్థచిత్తుడు. నిరాకులుడు. నిశ్చలుడు.

భావరూప ప్రపంచం పరమార్ధ సత్యం అంటాడు నైయాయిక మహాశయుడు. ప్రపంచం అంతా శూన్యం. ప్రపంచం శూన్యంనుంచి మాత్రమే ఉత్పత్తి అవుతోంది అంటాడు శూన్యవాది. కోటి కొకడు ఆత్మానుభవంగలవాడుంటాడు. ఆ మహాత్ముడు భావం అభావం రెండు భావనలు త్యజించి స్వస్థచిత్తుడై ఆత్మానంద సాగరంలో మునిగి ఉంటాడు.

# ఆత్మ అద్వయం

శుద్ధ మద్వయ మాత్మానం భావయంతి కుబుద్ధయః
నతు జానంతి సంమ్మోహాత్ యావజ్జీవ మనిర్వృతాః 219

కు బుద్ధయః = కుబుద్ధులగువారు; శుద్ధం = పరిశుద్ధమూ; అద్వయం = అద్వితీయమూ అయిన; ఆత్మానం = ఆత్మను: భావయంతి = భావన చేస్తున్నారు; తు = అయితే; సమ్మోహాత్ = అజ్ఞానం వలన; న జానంతి = తెలిసికోలేకున్నారు; అతః = ఈ కారణంవలన; యావజ్జీవం = జీవితాంతంవరకు; అనిర్వృతాః = సంతుష్ట రహితులగుచున్నారు.

కుబుద్ధి అల్పబుద్ధి దుర్బుద్ధి గలవాడు ఆత్మానుభావంలేక శుద్ధమూ బుద్ధమూ అద్వయమూ అద్వితీయమూ అద్వైతమూ అయిన ఆత్మను గూర్చి భావన చేస్తాడు. కానీ సమ్మోహ వశంచేత అజ్ఞానం కారణంగా తెలిసికోలేడు. వాడు యావజ్జీవితం అసంతృప్తి అసంతోషంతోనే కాలం గడుపుతాడు.

అల్పులు అజ్ఞానులు సర్వవ్యాపకమైన ఆత్మను గూర్చి అర్థంచేసికోలేరు. వారికి సంసార వ్యవహార బంధాలు అడ్డువస్తాయి. నివృత్తి పొందలేరు. వారికి ఆత్మ సాక్షాత్కారంకాదు. కనుక ఉన్నంత వరకూ వారికి తృప్తిలేదు. సంతోషంలేదు. ఆనందంలేదు

“నకించిదపి చింతయేత్” అణుమాత్రమైనది దేనిని చింతింపతగదని భగవద్వాక్యం. “నిర్మలత్వం” అంటే కల్పితాలైన ఆణవిక కార్మికమాయిక మాయేతర మలములు లేకుండుట. “అద్వయత్వం” అంటే కల్పిత గగన మారుతాది భూత భౌతికరాహిత్యం. “ఆత్మతత్త్వం” అంటే సకల వ్యాపకత్వం. అనాత్మ కల్పితం ఇతరాపేక్ష జనకం. సాపేక్షరూపచింతన మోహవర్ధకం. చింతాపరులకు ఆత్మానుభవం కలుగదు. సద్గురు లబ్ధవిజ్ఞానం వలననే పరమానంద ప్రాప్తి అవుతుంది.

## ముముక్షువు

ముముక్షో ర్బుద్ధి రాలంబం అంతరేణ న విద్యతే
నిరాలంబైవ నిష్కామా బుద్ధి ర్ముక్తస్య సర్వదా 220

ముముక్షోః = ముక్తి కోరేవారి యొక్క; బుద్ధిః = బుద్ధి; ఆలంబమంతరేణ = ఆలంబం విడిచి; న విద్యతే = ఉండదు; ముక్తస్య = ముక్తునియొక్క; బుద్ధిః = బుద్ధి; నిష్కామా = కామనారహితమైనది; చ = మరియు; నిరాలంబా = ఆశ్రయ రహితమైనది; ఏవ = మాత్రంగానే; విద్యతే = ప్రకాశింపును.

ముముక్షువు బుద్ధి ఆలంబం లేకుండా ఉండలేదు. ముక్తపురుషుని బుద్ధి సదా కామనారహితం. ఆలంబరహితం. సునిశ్చలం. ఆత్మసాక్షాత్కారం పొందని యోగ భ్రష్టుని బుద్ధి సాంసార వ్యామోహాలవైపు పరుగులు తీస్తుంది. నిష్కాముడు జీవన్ముక్తుడు అయిన మహా యోగి బుద్ధి ఆత్మాశ్రయమై ఆత్మావలంబనం ఆలంబనం పొంది నిశ్చలంగా ఉంటుంది. ఆత్మ అచలం అద్వితీయ ఆనందంకదా!

అజ్ఞాని బుద్ధి శివకేశవ భేదాలు శక్తిభేదాలు మూర్తి భేదాలు నామ భేదాలు పరిశీలిస్తుంది. సంశయ గ్రస్తమై హరిహరరూప ధ్యానం చేస్తూ తద్వారా మోక్షం పొందాలని అపేక్షిస్తుంది. ఆత్మ సాక్షాత్కారం ఆత్మానుభవం గలవాడు ఆత్మేతరం కలపెట్టక ఆత్మారాముడై శోభిల్లుతుంటాడు.

• • •

జనని - జనకుడు - సద్గురు - తనలు - డాత్మ -
తనగ నియ్యేపురును నేగృహస్థు చేత
సుగతి వాంఛ ప్రసాదితులగుదురట్టి
వాడ చూపె ధర్మాత్ముండు వసుధ మీద

— ఎఱ్ఱన (భారతం)

# విషయాలు వ్యాఘ్రాలు

విషయద్వీపినో వీక్ష్య చకితాః శరణార్థినః
విశంతి ఝటితి క్రోడ న్నిరోధైకాగ్ర్య సిద్ధయే 221

విషయ ద్వీపినః=విషయ రూప వ్యాఘ్రాదులను; వీక్ష్య=చూచి; చకితాః= భయపడిన వారై: శరణార్థినః=శరీరరక్షాపరాయణులైన మూఢులు; నిరోధై కాగ్ర్య సిద్ధయే=చిత్తనిరోధము ఏకాగ్ర సిద్ధికొరకు; ఝటితి=శీఘ్రంగా; క్రోడం= గుహలందు; విశంతి=ప్రవేశిస్తున్నారు.

విషయ వ్యాఘ్రాన్ని చూచి శరణార్థి భయపడి చిత్త నిరోధంకోసం ఏకాగ్రత సిద్ధికోసం శీఘ్రంగా కొండ గుహలో ప్రవేశిస్తాడు. కానీ అజ్ఞానికి అంతర్వృత్తి వ్యాపిస్తుంది. దుఃఖం ఎక్కువ అవుతుంది. శాంతి సుంతకూడా ఉండదు. జ్ఞాని జీవన్ముక్తుడు విషయ వ్యాఘ్రం చూచి ఒక బొమ్మవలెనో, ఐంద్రజాలికమైన అటవస్తువు వలెనో భావిస్తాడు. భయం చెందడు.

విషయాసక్తి రాహిత్యంకోసం చిత్తనిరోధం కోసం యత్నించాలి. విషయాసక్తి అనేదే లేనప్పుడు చిత్తనిరోధం అవసరంలేదు. ఆ యోగి అతన్నిరసన పూర్వకంగా ఆత్మానుభవం పొందుతాడు.

తత్ అంటే పరబ్రహ్మ అతత్ అంటే పరమాత్మయందు కల్పిత నామ రూపాత్మకమైన జగత్తు. జగత్తును నిరసించుట అతన్నిరసనం - ఆత్మేతర వస్తు నిరాసనం అంటే సత్య వస్తువును గుర్తించి మిధ్యను మిధ్య అని భావించుచే తన్నిశ్చయబుద్ధి - అతన్నిరసనం కలగాలి. అట్టివాడే యోగి.

విషయ వాసనలు తొలగనివారికి గృహాలలో నివసిస్తే విషయాలు ఎక్కువవు తాయనే భయంతో అవధూతలు సాధువులు యోగులు ఆశ్రమాలు స్వీకరించి నిర్జనా రణ్యాలలో నివశిస్తుంటారు. అక్కడి పర్వతగుహల్లో చిత్తైకాగ్రతకు ప్రాణాయా మాలంటికా యోగాదులు అభ్యసిస్తారు. వారికి భవనాలలో విషయసంసర్గ భీతి గహన వనాలలో క్రూర మృగాలభయం, గుహలలో సర్పవృశ్చిక ఆందోళన. ఇక క్షేమవ శ్శాంతి ఎక్కడ! చిత్తనిరోధ ప్రయత్నమెక్కడ? సంశయగ్రస్తునకు స్వస్వరూప సంధానసిద్ధి ఎక్కడ?

'సంశయాత్మా వినశ్యతి' అని భగవద్గీతలోని వచనానుసారం అట్టి సందేహ చిత్తుడికి శాంతిలేదు. బ్రహ్మానందమూ లేదు.

గ్రామోనాస్తి కుతః సీమా? కుతః ప్రాప్యాది వేదదీః
దేహో నాస్తి కుతోవర్ణా శ్రమాచారాదికః క్రమః?

అలానే శీతోష్ణ సుఖదుఃఖ ద్వంద్వాలు, దేహవాసన అహంకార మమకారాలు బాహ్యాంత వృత్తులు. ఇవిలేని జ్ఞానులు గృహంలో ఉన్నా గహనంలో ఉన్నా సంసారు లయినా, సంచారులయినా, సన్యాసులయినా, సర్వదా పరబ్రహ్మ స్వరూపులే

## యోగి చలించడు

నిర్వాసనం హరిం దృష్ట్వా తూష్ణీం విషయ దంతినః
పలాయంతే న శక్తాస్తే సేవంతే కృత చాటవః 222

నిర్వాసనం=వాసనారహితమైన: హరిం=సింహాన్ని: దృష్ట్వా=చూచి విషయదంతినః=విషయ మత్తేభాలు: న శక్తాః=అసమర్థములై: తూష్ణీం=ఊరకే: పలాయంతే=పరుగెత్తి పోతున్నాయి: తే = ఆ విషయాలు ఈశ్వర ప్రేరితాలై: కృతచాటవః=ప్రియోక్తులు చాటూక్తులు: అగత్య = వచ్చిచేరి: సేవంతే = సేవిస్తాయి.

వాసనా శూన్యుడైన పురుష పుంగవుడు సింహం వంటి వాడు. ఆ వైరాగ్య సింహాన్ని చూచి అసమర్థమూ జ్ఞాన హీనమూ అయిన విషయమాతంగజం చెదరి కుంటా పారిపోతుంది.

జ్ఞానం ముందు విషయం వీగి పోతుంది. ప్రియనాధుని భయభక్తులతో సేవించు పతివ్రతవలె అదృష్ట ప్రేరితాలైన విషయ వాసనలు మౌనిని వినయంగా భజిస్తాయి. అయితే అల్పుడైనా అజ్ఞుడైనా ప్రియవాది యైన సహృదయుడు, ఈశ్వర కృపకు పాత్రుడై దైవప్రేరితుడై ఈశ్వర ప్రేమకలిగి మహాత్ముల పాదసేవ చేయ కల్గుతాడు. జ్ఞానుల సంసేవనంతో తానుకూడా జ్ఞాని అయి రాణిస్తాడు

ప్రారబ్ధవశమైన క్షుత్పిపాసలు దేహధర్మాలు. అవి ఆత్మారాముడి చిత్తం చలింప చేయలేక అణిగి మణిగి యథా క్రమంగా జరుగు తుంటాయి.

• • •

"అప్రియంబొగి చేసియు - అనృతవాదియయ్యు హింస గావింపని అమ్మ హాత్ముడేగు సుగతికి............"

— నన్నయ (భారతం)

# నిశ్చలమానసుడు సుఖి

న ముక్తి కారికాం ధత్తే నిశ్శంకో యుక్త మానసః
పశ్యన్ చ్ఛృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ నాస్తే యథా సుఖమ్
273

నిశ్శంకః=శంకారహితుడును; యుక్తమానసః = నిశ్చలుడైన మనస్వి: ముక్తి కారికాన్ = యమనియమాది యోగాలను; ఆగ్రహాత్ = పట్టుదలవలన: న ధత్తే=ధారణచేయడు; కింతు=మరేమిటంటే; పశ్యన్=చూస్తూ: శృణ్వన్= వింటూ: స్పృశన్=తాకుతూ; జిఘ్రన్=ఆఘ్రాణిస్తూ; అశ్నన్=తింటూ: సః=అతడు; యథాసుఖం=సుఖయుక్తంగా: ఆస్తే=ఉంటుంటాడు.

రాజర్షీ! శంకారహితుడు నిశ్చలమానసుడు అయిన జ్ఞాని ముక్తి కారికలయిన యమ నియమాదులను పట్టుపట్టి ధారణ చేయుడు.

ఆ మహర్షి ఆత్మానందంలో ఉంటూ లౌకికంగా అన్నికృత్యాలు చేస్తుంటాడు. సాధారణ వ్యక్తులవలె చూడటం వినటం స్పృశించటం ఆఘ్రాణించటం భుజించటం మామూలుగా చేస్తూ యథాసుఖం అనుభవిస్తుంటాడు. కానీ కర్తృత్వ అధ్యాసం ఉండదు.

జీవన్ముక్తుడైన జ్ఞాని ఏ యోగమూ మొండిపట్టుతో చేయడు. ఆ ఋషికి మదిలో కర్తృత్వాధ్యాసలేదు. నిశ్చలుడు నిర్మలుడు. లోకదృష్టితో అన్ని కార్యాలు చేస్తూంటాడు. అనవరతం ఆత్మానందంలో మునిగి ఉంటాడు.

• • •

తత్త్వవేత్త జ్ఞాన కర్మేంద్రియ ప్రాణాలచేత సమస్త కార్యాలు చేస్తుంటాడు. అయితే ఎన్ని చేసినా తనయందు కర్తృత్వాభిమానం ఉంచుకోడు ఇంద్రియాలు తమ పనులు తాము చేసుకుపోతున్నాయి అనే నిశ్చయబుద్ధితో ఉంటాడు. తన సర్వకర్మలు సర్వేశ్వరుని కర్పణచేస్తాడు. — భగవద్గీత

## శుద్ధ బుద్ధి నిరాకులుడు

వస్తు శ్రవణ మాత్రేణ శుద్ధ బుద్ధి ర్నిరాకులః
నైవాచారం అనాచారం ఔదాస్యం వా ప్రపశ్యతి 224

వస్తుశ్రవణ మాత్రేణ = యదార్థ తత్త్వశ్రవణమాత్రంచేత; శుద్ధబుద్ధిః = పరిశుద్ధ బుద్ధిమంతుడు; నిరాకులః = వ్యాకులత లేనివాడు; ఆచారం వా = ఆచారంగానీ; అనాచారం = అనాచారంగానీ; ఔదాస్యం = ఉదాసీనతగానీ; న పశ్యతి = చూడడు.

శుద్ధబుద్ధీ! నిరాకులుడూ నిశ్చలుడూ స్వస్థచిత్తుడూ అయిన విజ్ఞాని యథార్థమైన ఆత్మతత్త్వ వస్తువు శ్రవణంచేసినంత మాత్రంచేత శుద్ధబుద్ధ స్వరూపుడై రాజిస్తాడు. పరబ్రహ్మమవుతాడు.

ఆ యోగి పుంగవుడు ఆచారమూ చూడడు అనాచారమూ చూడడు. ఔదాసీన్యమూ పొందడు హర్షమూ పొందడు. సదా సచ్చిదానందంలో తన్మయుడై ఉంటాడు. బ్రహ్మవిదుడు బ్రహ్మమై ప్రకాశిస్తాడు.

చిదాత్మ శ్రవణంతో చిత్తం పరిశుద్ధం అవుతుంది. బుద్ధి అఖండాకారం దాలుస్తుంది. ఆ ముని ఆచార అనాచారాలకు సభాసభాలకూ అతీతుడు. ఇచ్ఛారహితుడు. మహామహిమాన్వితుడు. జ్ఞాని 'తత్త్వమసి' అది మహావాక్య ఉపదేశాల వలన అఖండ ఆత్మ సాక్షాత్కారం కలిగి స్వస్వరూప సంస్థితుడవుతాడు. ఆ మునికి క్రియానుష్ఠాన ఆచారం అవసరంలేదు.

• • •

యోగి జ్ఞాన నిష్ఠుడై ప్రయత్నశీలుడై పాప నిర్ముక్తుడై యోగసిద్ధుడవుతాడు. తదుపరి అనేక జన్మార్జిత అభ్యాస విశేషంచేత బ్రహ్మజ్ఞానం బ్రహ్మాత్మ ఐక్యం పొంది ఉత్తమమోక్షం అనే పరాంగతిని సునాయాసంగా అందుకొంటాడు.

— భగవద్గీత

# బాల్యలీల

యదా యత్కర్తు మాయాతి తదా తత్కురుతే ఋజుః
శుభం వాప్యశుభం వాపి తస్య చేష్టాహి బాలవత్ 225

యదా = ఎప్పుడు; శుభం వా = శుభం కానీ; అశుభం వా = అశుభం కానీ యత్ = ఏకర్మను; కర్తుం = చేయుటకు; ఆయాతి = అవకాశం వస్తుందో; తదా = అప్పుడు; తత్ = ఆకర్మను; ధీరః = ధీరపురుషుడైన జ్ఞాని; ఋజుః = ఆగ్రహం లేని ఋజు వర్తనుడై; కురుతే = చేస్తుంటాడు; హి = ఎందుకనగా; తస్య = ఆయోగి యొక్క; చేష్టా = వ్యవహారం; బాలవత్ = బాలుడివనివలె; భవతి = అగును.

ఎప్పుడు ఏది శుభకార్యం కానీ అశుభకార్యం కానీ చేయ ప్రాప్తిస్తుందో దానిని జ్ఞాని పట్టుదల ప్రగాఢ వాంఛలేకుండా చేస్తుంటాడు. ఆ జ్ఞానస్వామి వ్యవహారాలు అన్నీ బాల్య చేష్టల వలె ఉంటాయి.

ప్రారబ్ధవశంగా దైవగతిననుసరించి వారిచర్యలు సాగిపోతుంటాయి శుభం కానీ అశుభంకానీ బుద్ధి కుశలత బట్టికాదు. చేయాలని నియమ బద్ధతవల్లకాదు. బాల్యక్రీడవలె లక్ష్య రహితంగా ఉంటుంది. ఆ యోగీంద్రుడు రాగద్వేష రహితుడు ఆత్మానంద మగ్నమానసుడు.

పసిబాలుడు తన కషాయమని తలంచక దీపం ముట్టుకొంటాడు. హేయ పదార్థాలని ఎంచక ఉచ్ఛిష్ట పదార్థాలను నోటిలో పెట్టు కొంటాడు. చిన్నచిన్న పురుగు లను చంపుతాడు. పెద్దవారిని ప్రేమిస్తాడు. ఈ మొదలైన బాల్యచేష్టలకు సంకల్ప వికల్పాలు భావాభావాలు ఉండవు. ఆత్మారాముడు బాలుదేసుమా!

# స్వాతంత్ర్యం

స్వాతంత్ర్యాత్ సుఖ మాప్నోతి స్వాతంత్ర్యా ల్లభతే పరమ్
స్వాతంత్ర్యా న్నిర్వృతిం గచ్ఛేత్ స్వాతంత్ర్యా త్పరమం పదమ్ 226

జ్ఞానీ=జ్ఞాని; స్వాతంత్ర్యాత్=స్వాతంత్ర్యం వలన; సుఖం ఆప్నోతి=సుఖం పొందుతున్నాడు. స్వాతంత్ర్యాత్=స్వాతంత్ర్యం వలన; పరంలభతే=పరం పొందుతున్నాడు; స్వాతంత్ర్యాత్=స్వాతంత్ర్యం వలన; నిర్వృతిం గచ్ఛేత్=పరమ శాంతిని సుఖాన్ని పొందుతున్నాడు; స్వాతంత్ర్యాత్=స్వాతంత్ర్య వలన పరమం పదం=పరమపదం; ఆప్నోతి=పొందుతున్నాడు.

జ్ఞాని స్వతంత్రత వల్ల నే పరమ సుఖం పొందుతాడు. స్వతంత్రత వల్ల నే పరం జ్యోతి పరమ జ్ఞానం పరతత్వం లభ్యమవుతుంది. స్వతంత్రతవల్ల నే నిర్వృత్తి లభిస్తుంది. ఆ స్వతంత్రతవల్ల నే పరమ పదమైన స్వస్వరూప సాక్షాత్కార సంప్రాప్తం కలుగుతుంది.

జ్ఞాని స్వాతంత్ర్యం వల్ల నే రాగద్వేష అధీనుడుకాడు. అందువల్ల స్వాతంత్ర్యం వలన ఆత్మ జ్ఞానం నిత్యసుఖం పరమశాంతి ప్రాప్తిస్తుంది. స్వాతంత్ర్యంవల్ల పరం జ్యోతి, పరంధామం, పరబ్రహ్మం, పరమాత్మ యొక్క సుజ్ఞానం లభిస్తుంది.

"స్వమ్" అంటే తాను, ఆత్మ అని అర్థాలు. స్వతంత్రమే స్వాతంత్ర్యం అంటే ఆత్మ విచారం ఆత్మతత్త్వం పరమాత్మ అనుగ్రహం ప్రాప్తి. వీనివల్ల అన్ని సుగుణాలు, సుఖాలు మహిమాన్విత తంత్రాలు శక్తులు లభిస్తాయి అని వ్యాఖ్య. "పరమ్" అంటే అన్యం అనికూడా అర్థం. దానిపై పార తంత్ర్యం వచ్చింది. విషయాది దేహాదికాలు. అనాత్మ. ఇది జడం. దుఃఖకరం. పరతంత్రం. దాస్యం. దీని అర్థాలు దీనికి వ్యతిరేకం స్వాతంత్ర్యం.

ఈ స్వాతంత్ర్యం అంటే ఆత్మసాక్షాత్కార కృత్యం. దీనివల్ల సుజ్ఞానం. విజ్ఞానం, ప్రజ్ఞానం ఆత్మజ్ఞానం లభిస్తుంది రాగద్వేషాలు నశిస్తాయి. రాగద్వేషాలు చిత్తం యొక్క మలాలు. ఈ చిత్తమలాలు పోతే చిత్తం నిర్మలం అవుతుంది. అపుడు లభించేది మనః ప్రసాదం. రాగద్వేషాలు అహం మమతలు అనేవి మలమూత్రాలు. ఇవిపోతే మనః ప్రసాదం-దీనితో జ్ఞానోదయం.

# అకర్తృత్వం

అకర్తృత్వం అభోక్తృత్వం స్వాత్మనో మన్యతే యదా
తదాక్షీణా భవంత్యేవ సమస్తా శ్చిత్త వృత్తయః 227

యదా=ఎప్పుడు పురుషుడు; స్వాత్మనః=తన ఆత్మకు; అకర్తృత్వం= అకర్తృత్వ భావం; అభోక్తృత్వం=అభోక్తృత్వ స్థితిని గూర్చి; మన్యతే= తలంచి మన్నించు చున్నాడో; తదా=అప్పుడు; తస్య=ఆ పురుషుడికియొక్క; సమస్తాః=సమస్తమైన; చిత్తవృత్తయః=చిత్తవృత్తులు; క్షీణాః=క్షీణముళ్లై నవిగా; భవంత్యేవ=నిశ్చయంగా భావించాలి.

రాజర్షీ! జ్ఞాన పురుషుడు తన ఆత్మకు అకర్తృత్వం అభోక్తృత్వం ఆపాదించి నప్పుడు నిశ్చయంగా చిత్తవృత్తులన్నీ ఉపశమిస్తాయి.

"ఈ కర్మకాండ ఈ కార్యకలాపం నేను చేస్తాను. దీనివల్ల ఉత్తమ ఫలం నాకు లభిస్తుంది." అని నిశ్చయించుకొన్నప్పుడు అనేక చిత్త వృత్తులు ఉద్భవించి ఆశలు ఆశయాలు పెరిగిపోతాయి. ఆ భారంతో వాడు క్రుంగిపోతాడు. చాలా దుఃఖపడతాడు. పరితపిస్తాడు. కర్తృత్వం భోక్తృత్వం తనపై పెట్టుకోనప్పుడు నిశ్చింత చిత్తం లోగల వృత్తులన్నీ ఉపశమించి పరమ శాంతి లభిస్తుంది.

విద్వాంసులైన జ్ఞానుల హృదయాలు పరిపక్వ నిశ్చయాలతో నిర్మలంగా ఉంటాయి. మనోవాక్కాయ క్రియా పూర్వకంగా వారు నిశ్చయ జ్ఞానం కలిగి శాంతి స్వరూపులై జీవిస్తారు. విషయాలపై వారి మనస్సు పోనేపోదు.

పఠకాః పాఠకాశ్చైవ యేచాన్యే శాస్త్ర చింతకాః
సర్వేచతే వ్యసనీ మూర్ఖా యః క్రియావాన్ స పండితః

— ధర్మశాస్త్రము

నానా శాస్త్రాలు చదివేవారు, గ్రంథాలు చదివించేవారు, ధర్మ శాస్త్ర విచారణ సల్పేవారు ఆచారరహితమైన వ్యసనపరులు. మూర్ఖచిత్తులు పేరుకు మాత్రం చదువు కొన్నవారు పండితులు.

జ్ఞాన శాస్త్రసూత్రాలను ఆచరణలో అక్షరాలా పాటించి నిత్య జీవనంలో చరించేవాడు విద్వాంసుడు పండితుడు. ఆ బుధుడు క్రియాశీలుడు సుశీలుడు. కర్తృత్వ భోక్తృత్వాదులు రాగేష్వాదులు బుద్ధిసహితాలు. ఇవి జాగ్రత్స్వప్నాలలో పని చేస్తుంటాయి. కానీ సుషుప్తిలో ఇవి ఉండవు. ఇవి బుద్ధి ధర్మాలేకాని ఆత్మధర్మాలు కావు.

## స్వేచ్ఛాజీవి

ఉచ్ఛృంఖలాప్యాకృతికా స్థితిర్ధీరస్య రాజతే
న తు సంస్పృహ చిత్తస్య శాంతి మూఢస్య కృత్రిమా 228

ధీరస్య=ధీరునియొక్క; స్థితిః=పరిస్థితి; ఉచ్ఛృంఖలా అపి=స్వేచ్ఛా శీలమూ శాంతిరహితమూపలె ఉన్ననూ; అకృతికా=స్వాభావికమై శాంతికరమై; రాజతే = ఒప్పారుతుంది; సంస్పృహచిత్తస్య = కాంక్షాపూరితమైన మనస్సుగల; మూఢస్య=మూఢునియొక్క; శాంతిః = శాంతి; కృత్రిమా = కృత్రిమమైనదై ఉంటుంది: న రాజతే=అదిశోభించదు.

ధీరపురుషుడైన జ్ఞాని స్వేచ్ఛా స్వభావం కలిగి విశృంఖలంగా ఉండికూడా శోభిస్తాడు. అజ్ఞాని మూర్ఖుడు సంస్పృహచిత్తుడై అతివాంఛాలోలుడై కృత్రిమ శాంతి స్వభావం కలిగి జీవితంలో శోభించలేడు.

నిస్పృహ నిశ్చలజ్ఞానం నిర్మలత్వంగల జ్ఞాని సహజ సుందరంగా శోభిస్తాడు. వారి స్వభావమే అంత. వారిలో కృతిమ వేషాలు ఉండవు మూఢుడే దొంగవేషాలు కపట నాటకాలు ధరించి ఆత్మద్రోహం చేసికొంటాడు. వాడికి శాంతి చాలాదూరం.

## ముక్తపురుషుడు

విలసంతి మహా భోగైః విశంతి గిరి గహ్వరాన్
నిరస్త కల్పనా ధీరా అబద్ధా ముక్త బుద్ధయః 229

నిరస్తకల్పనాః=సంకల్పరహితులు; అబద్ధాః=బంధన రహితులు; ముక్త బుద్ధయః = ముక్త బుద్ధులుగల; ధీరాః = జ్ఞానులు; కదాచిత్ = ఒకప్పుడు;

ప్రారబ్ధవశాత్ = ప్రారబ్ధవశమున; మహాభోగైః = మహాభోగాలతో; విలసంతి = ఒప్పుచున్నారు; కదాచిత్ = ఒకప్పుడు; గిరిగహ్వరాన్ = కొండగుహలయందు; విశంతి = విశ్రమిస్తున్నారు.

జ్ఞాని కల్పనారహితుడు. బంధనరహితుడు. ముక్తిపై బుద్ధిగలవాడు. ముక్త పురుషుడు. సిద్ధుడు. ఇట్టి ఆత్మజ్ఞాని ఎక్కడున్నా, పెద్దపెద్ద భోగాలలో క్రీడిస్తున్నా, విలాసాలలో విలసిల్లుతున్నా, లేక గిరి కందరాలలో కందమూలాలు భుజిస్తూ జీవనం గడుపుతున్నా తృప్తిగా సుఖంగా ఆనందంగా ఉంటాడు.

# పూజ్యులు

శ్రోత్రియం దేవతాం తీర్థం అంగనాం భూపతి ప్రియం
దృష్ట్వా సంపూజ్య ధీరస్య న కాఽపి హృది వాసనా 230

శ్రోత్రియం = వేదపండితుడినీ; దేవతాం = దేవతనూ; తీర్థం = తీర్థమునూ; సంపూజ్య = పూజించిననూ; చ = మరియు; అంగనాం = స్త్రీనీ; భూపతిం = రాజునూ; ప్రియం = ప్రియపుత్రాదులనూ; దృష్ట్వా = ప్రేమ గౌరవపురస్సరంగా చూచిననూ; ధీరస్య = జ్ఞానియొక్క; హృది = హృదయమందు; కా అపి = ఎటువంటి; వాసనా = మమతావాసనాగంధం; న భవతి = కలుగదు.

ధీరుడైన జ్ఞాని హృదయంలో ఎవరియెడల మమకారం ఉండదు. శ్రోత్రియ బ్రాహ్మణవరేణ్యులను చూచినా దేవతా దర్శనం అయినా తీర్థక్షేత్రాలను సేవించినా పూజనీయంగా భావిస్తాడు కానీ ప్రత్యేకంగా పక్షపాతం చూపడు. అలానే స్త్రీల యెడలకానీ మహీపతులపై కానీ పుత్రాది ప్రియ బంధువర్గం గూర్చికానీ ఏ విధమైన వాసనా వాంఛలు కలుగవు.

ఆ ధీరపురుషులు జ్ఞానమూర్తులు వారి అంతఃకరణం అతి శుద్ధం. నిర్మలం నిశ్చలం. వారి హృదయాలు దేవాలయాలు. ఆత్మజ్ఞాన నిలయాలు మమకారాలు అహంకారాలు వికారాలు జ్ఞానిలో ప్రవేశించలేవు. వారి ఇంద్రియాలు చలించవు. వేదపండిత ప్రకాండులను చూచినా వేదవిప్రులయిన బ్రహ్మవేత్తలను దర్శించినా ధీరపురుషుల ఇంద్రియాలు మమత్వం పొందవు. అగ్నిహోత్రం మరి ఇతర దేవతల విషయంలోనూ అంతే.

## నిర్మమత

భృత్యైః పుత్రైః కళత్రైశ్చ దౌహిత్రైశ్చాపి గోత్రజైః
విహస్య ధిక్కృతో యోగీ న యాతి వికృతిం మనాక్ 231

భృత్యైః = సేవకులచేతనూ; పుత్రైశ్చ = పుత్రులచేతనూ: కళత్రైః = భార్యచేతనూ; దౌహిత్రైః = మనుమలచేతనూ: గోత్రజైరపి = దాయాదుల చేత కూడా; విహస్య = పరిహసింపబడి; ధిక్కృతః = ధిక్కరింపబడినవాడైననూ: యోగీ = జ్ఞాని; మనాక్ = కొంచంకూడా; వికారం = మనోవైకల్యం; నయాతి = పొందడు.

ఆత్మజ్ఞానియైన యోగీశ్వరుడు భృత్యులను పుత్రాదులను దౌహిత్రులను గోత్రీకులను చివరకు భార్యను చూచినా ఒక నిస్పృహజన్యమైన నప్పునవ్వి తృణీకార భావంతో ఉంటాడే కానీ కించిత్తు కూడా వ్యామోహానికి లోనుకాడు.

జీవన్ముక్తుడి చిత్తం నిశ్చలం. దాసదాసీజనం కనిపించినా, పుత్రులు పుత్రికలు తన ధర్మపత్ని సంబంధులు సహజ్ఞాతులు బంధువులు వచ్చినా నిరపేక్ష దృష్టితో ఉంటాడే కానీ బంధం పెంచుకోడు. మోహం పొందడు. వారి యెడల సత్కారం లేదు. తిరస్కారం లేదు. హర్షం లేదు దుఃఖం లేదు. ఆ ముని రాగద్వేష రహితుడు. సర్వజీవ హితుడు ఆత్మజ్ఞాన సన్నిహితుడు.

## ఆశ్చర్యం

సంతుష్టోఽపి న సంతుష్టః ఖిన్నోఽపి న చ ఖిద్యతే
తస్యాశ్చర్య దశాం తాం తాం తాదృశా ఏవ జానతే 232

జ్ఞానీ = జ్ఞాని; సంతుష్టః అపి = సంతోషించినవాడైనా; న చ సంతుష్టః = ఆత్మపరంగా మరి సంతుష్టుడుకాడు; ఖిన్నః అపి = దుఃఖితుడైనప్పటికీ; న చ ఖిద్య = మరిదుఃఖించడు; తస్య = ఆ యోగియొక్క; తాం తాం = ఆయా; ఆశ్చర్యదశాం = ఆశ్చర్యదశలను; తాదృశా ఏవ = అంతటివారే; జానతే = తెలిసికోగలరు.

మహాజ్ఞాని స్వభావం ఆశ్చర్యకరంగా ఉంటుంది ఎవరూ గుర్తించలేరు. లోకం దృష్టిలో సంతుష్టుడుగా ఉన్నా తాను సంతుష్టుడు మాత్రంకాడు. లోకం దృష్టిలో

దుఃఖితుడు బాధితుడుగా ఉన్నాకూడా తాను మాత్రం దుఃఖితుడు కాడు. ఆ ఋషి స్థితిని ఎవరూ అర్థం చేసికోలేరు.

మరల అంతటి జ్ఞానికే ఆ జ్ఞాని సంగతి తెలుస్తుంది. ఖేదమూ పొందడు సంతోషమూ పొందడు. బ్రహ్మజ్ఞాని ఆశ్చర్యలీల అంతటి బ్రహ్మజ్ఞానికే అవగతం. పాముల పాదాలు పాములకే ఎరుక.

## నిరాకారుడు

కర్తృత్వ మేవ సంసారో న తాం పశ్యంతి సూరయః
శూన్యాకారా నిరాకారా నిర్వికారా నిరామయాః 233

కర్తృతా ఏవ=కర్తృత్వబుద్ధియే: సంసారః = సంసారం; తాం = అట్టి సంసారాన్ని; శూన్యాకారాః=శూన్యచిత్త వికారులూ; నిరాకారాః=నిరాకారులూ; నిర్వికారాః=వికారరహితులూ; నిరామయాః=దుఃఖరహితులూ అయిన; సూరయః= సూరిపర్యులు: న పశ్యంతి=చూడరు, లక్ష్యంచేయరు.

కర్తృత్వతా స్వభావంకలది సంసారం. శూన్యాకారుడు ఆకారరహితుడు సంకల్పరహితుడు నిరాకారుడు నిర్వికారుడు నిరామయుడు దుఃఖరహితుడు ఆ సంసారాన్ని కన్నెత్తికూడా చూడడు

"మమేవం కర్తవ్యమ్" నాది ఈ కర్తవ్యం అని నిశ్చితమయింది. ఈ సంసార ప్రపంచం. జీవన్ముక్తుడు ఈ సంసారాన్ని గమనించడు దీనిని సంకల్ప మాత్రంగాకూడా భావించడు. ఆ యోగి సంకల్ప రహితుడు. ఆధ్యాత్మికాదులుకూడా లేనివాడు శూన్యుడు. మాన్యుడు ధన్యుడు. నిరాకారి. నిర్వికారి.

• • •

వ్యాసుడు శుకునితో —

అపరిగ్రహ సర్వారం
భ పరిత్యాగములు గలుగుపండితునకు దుః
ఖపు చెరువువాటిలదు మో
క్షపదము సొచ్చడి తదాత్మక సుఖంబొందున్

— తిక్కన (భారతం - శాంతిపర్వం)

## కుశలుడు

అకుర్వన్నపి సంక్షోభాత్ వ్యగ్రః సర్వత్ర మూఢధీః
కుర్వన్నపి తు కృత్యాని కుశలో హి నిరాకులః 234

మూఢధీః = వక్రబుద్ధియైన మూఢుడు; అకుర్వన్ అపి = కర్మలు చేయని వాడయినా; సంక్షోభాత్ = మనస్సంక్షోభంకారణంగా; వ్యగ్రః = వ్యాకులచిత్తుడు; భవతి = అగుచున్నాడు; కుశలః = కుశలబుద్ధి ఐనజ్ఞాని; కృత్యాని = కర్మలను; కుర్వన్ అపి = చేయుచున్నవాడైననూ; తు = మరేమయినా; నిరాకులాః = వ్యాకులత లేనివాడు; భవతి = అగుచున్నాడు.

అజ్ఞాని కర్మలు చేయకపోయినా సంక్షోభచిత్తంతో సంకల్ప వికల్పాలతో వ్యాకులంతో వ్యగ్ర మానసంతో ఉంటాడు. జ్ఞాని కర్మలు చేస్తున్నా నిశ్చయ బుద్ధితో బ్రహ్మజ్ఞానంలో అమస్కుడై ఆత్మానందంతో నిర్మలచిత్తంతో నిరాకులంగా నిర్వికారంగా ఉంటాడు.

అజ్ఞాని కర్మలు చేయకపోయినా సంయమనం లేక నిష్క్రియుడు కాలేడు. జ్ఞాని కర్మలు చేస్తున్నా నిష్క్రియుడే. నిర్వికారుడు కనుక, సంయమి కనుక.

◆ ◆ ◆

"శోక ప్రమదాది ద్వంద్వ
వ్యాకులుడవుగాక - శాంతి అంతఃకరణ
శ్రీకి పరిరక్ష సేయుము
నీకు వితృష్ణత్వ సౌఖ్య నిత్యత కలుగున్"

— తిక్కన (భారతం - శాంతిపర్వం)

## సుఖమే సుఖం

సుఖమాస్తే సుఖం శేతే సుఖమాయాతి యాతి చ
సుఖం వక్తి సుఖం భుంక్తే వ్యవహారేఽపి శాంతధీః 235

శాంతధీః = శాంతుడు, ధీరుడు; వ్యవహారే అపి = ప్రపంచ వ్యవహారమందు; శాంతధీః = శాంతధీర స్వభావంగలవాడై : సుఖం = సుఖంగా; ఆస్తే = స్థిరంగా విరాజిల్లుతుంటాడు; సుఖం ఆయాతి = సుఖంగా వస్తుంటాడు; చ = మరి; యాతి = పోతుంటాడు; సుఖం వక్తి = సుఖకరంగా మాట్లాడుతుంటాడు; సుఖం భుంక్తే = సుఖంగా భుజిస్తూంటాడు.

శాంతచిత్తుడు ధీరపురుషుడు. ఆత్మసుఖంలో సుస్థిర మానసంతో ఉంటాడు. పైకి లౌకికంగా దైహికంగా సాధారణంగా సామాన్యంగా ఉంటాడు. నిత్యకృత్యాలు దైహికోపచారాలు సామాన్యమే.

సుఖంగా లేస్తాడు. కూర్చుంటాడు. సుఖంగా వస్తుంటాడు. పోతుంటాడు. సుఖంగా మాట్లాడిస్తాడు. మాట్లాడుతాడు. సుఖంగా భోజనం చేస్తాడు. విశ్రమిస్తాడు. దిన కృత్యాలలో వేషభాషల్లో జ్ఞానికి అజ్ఞానికి భేదం కనిపించదు. కాని జ్ఞాని శాంత చిత్తుడు. అజ్ఞాని వ్యగ్ర చిత్తుడు.

♦ ♦ ♦

సర్వేంద్రియములచే ద
త్సర్వ విషయముల నెరుంగు చందంబున త
త్సర్వజ్ఞు సర్వగతునిన్
సర్వమయుం దెలియవచ్చు సమరసదృష్టిన్

— సీతారామాంజనేయ సంవాదం

# ఆత్మస్వభావం

స్వభావాద్యస్య నైవార్తిః లోకవత్ వ్యవహారిణః
మహాహ్రద ఇవాక్షోభ్యో గతక్లేశః సుశోభతే 236

యస్య=ఏ జ్ఞానికి; వ్యవహారిణః=వ్యవహారం చేస్తున్నా; స్వభావత్ = ఆత్మజ్ఞాన స్వభావంవల్ల; లోకవత్=పామరులవలె; ఆర్తిః = ఖేదం; న ఏవ= ఉండదో; సః = అట్టివాడు; గతక్లేశః = కష్టరహితుడై; మహాహ్రద ఇవ = గొప్ప సరోవరంవలె; అక్షోభ్యః=క్షోభరహితుడై; సుశోభతే=శోభాయమానుడగు చున్నాడు.

జ్ఞాని లోక వ్యవహారాలలో సంచరిస్తున్నా స్వాభావికంగా ఆత్మజ్ఞానంగలవాడు కనుక లౌకికులవలె దుఃఖామోదాలు పొందడు. క్లేశరహితుడు మహాసముద్రుడువలె క్షోభరహితుడు. శోభాయమానుడు. అజ్ఞానివలె ఆరాటపడడు. ఆనందంగా ఉంటాడు.

## ప్రవృత్తిలో నివృత్తిగలవాడే

నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తి రుపజాయతే
ప్రవృత్తి రపి ధీరస్య నివృత్తి ఫలదాయినీ 237

మూఢస్య=మూఢునియొక్క: నివృత్తిః అపి=నివృత్తి కూడా: ప్రవృత్తిః=ప్రవృత్తి: ఉపజాయతే=అగుచున్నది: చ=మరియు: ధీరస్య = ధీరపురుషుని యొక్క: ప్రవృత్తిః అపి=ప్రవృత్తికూడా: నివృత్తి ఫలభాగినీ=నివృత్తి ఫలము కలదిగా: భవతి=అగుచున్నది.

మూఢ చిత్తుడికి నివృత్తి కూడా ప్రవృత్తిని కలిగిస్తుంది. జ్ఞానచిత్తుడి ప్రవృత్తి మార్గం కూడా నివృత్తి ఫలాన్ని ప్రసాదిస్తుంది నివృత్తి - ప్రవృత్తి ఆత్మ ధర్మాలు.

ఇంద్రియ వ్యాపార నిరోధం. లోకం దృష్టిలో మాత్రం నివృత్తి అనిపించు కొంటుంది. అటువంటి నివృత్తి నివృత్తికాదు. అది ప్రవృత్తియే. ఆ పురుషుడి అహంకారం అంతరించలేదు. ఎన్ని యోగాలు పట్టినా ఎన్నాళ్ళు తపస్సులు చేసినా ఆత్మజ్ఞాన తత్త్వం రహస్యం తెలిసికొనకపోతే అన్నీ వ్యర్థమే. ఆత్మజ్ఞాని లోకం దృష్టిలో ఇంద్రియ పశుడుగా కనిపించినా ఆ ధీరుడు నివృత్తి మార్గంలోనే ఉంటాడు. ముక్తి అనే మౌక్తిక ఫలం ఆత్మజ్ఞానికే లభిస్తుంది. ఆ జ్ఞానిలో అభిమానమూ లేదు అహంకారమూ లేదు. ఆత్మానందమే ఆత్మానందం.

## వైరాగ్యం

పరిగ్రహేషు వైరాగ్యం ప్రాయో మూఢస్య దృశ్యతే
దేహే విగలితాశస్య క్వ రాగః క్వ విరాగతా 238

మూఢస్య=మూఢుని విషయంలో: పరిగ్రహేషు=స్వీకృత గృహారామాదుల యందు: ప్రాయః=తరచుగా: వైరాగ్యం=వైరాగ్యం: దృశ్యతే=కనబడు చుంది: పరంతు=అయితే: దేహే=దేహమందు: విగళితాశస్య = నశించిన ఆశగల జ్ఞానికి: క్వ రాగః=రాగమెక్కడ?: క్వ విరాగతా=వైరాగ్యమెక్కడ?.

మూఢుడు వైరాగ్యం అంటే కేవలం గృహాదుల విషయంలోనే చూపిస్తాడు. కానీ దేహంలో ఆశలు అంతంకావు. ఆశారహితుడైన జ్ఞానికి రాగమెక్కడ? విరాగ మెక్కడ? దేహాభిమానానికి ఐహిక సుఖాలతో సంబంధంగల ధన సంపదలు భార్యా పుత్రుల విషయంలో తన మాట సాగక వైరాగ్యం కలుగవచ్చు. అది వైరాగ్యంకాదు. లౌకికసంబంధమైన ఆస్తిపాస్తులపై బాంధవులపై అభిమానం అంతరించాలి. జ్ఞానికి దైహికంగానూ పుత్రాదుల పైననూ కళత్రాదులపైననూ మిత్ర శాత్రవులపైననూ రాగద్వేషాలుండవు. దేహాభిమానం గల వాడికే రాగద్వేషాలు. జ్ఞాని నిస్పృహుడు నిశ్చలుడు.

• • •

"హే ఈశ్వరా! నీవే ఈ మానవ యంత్ర నిర్మాతవు. జగన్నేతవు. నేను కేవలం ఒక యంత్రాన్ని. నీచేతిలో ఒక పని ముట్టును - అని తలంచువాడు ముక్తికి అర్హుడు. అట్టి మునిసత్తముడు మరల జనన మరణ చక్రంలో చిక్కుకొనడు."

— రామకృష్ణ పరమహంస

## సుదృష్టి

భావనాభావనాసక్తా దృష్టి ర్మూఢస్య సర్వదా
భాష్య భావనయా సా తు స్వస్థస్యాదృష్టి రూపిణీ 239

మూఢస్య దృష్టిః=మూర్ఖుల దృష్టి: సర్వదా=సదా: భావనఅభావనాసక్తా= భావనయందు అభావనయందు ఆసక్తమైయుండును: స్వస్థస్య = స్వస్థచిత్తుడైన జ్ఞాని యొక్క: సా=ఆ దృష్టి: భావ్య భావనయా=భావింపదగిన దానిని భావించుట వలన: అదృష్టి రూపిణీ = దృశ్యదర్శన రహిత రూపముగా: భవతి = అగు చున్నది.

మూఢుడైన అజ్ఞాని దృష్టి ఎప్పుడూ భావనలో కానీ అభావనలోకానీ లగ్నమై ఉంటుంది. జ్ఞాని దృష్టి భావ్య భావనలో ఉన్నా దృశ్యదర్శన రహితంగా ఉంటుంది. అంతర్దృష్టికలిగి ఆత్మానందంపై కేంద్రీకరించి ఉంటుంది.

అజ్ఞాని భావనా ప్రపంచంలోనూ, అభావనా జగత్తులోను సంచరిస్తాడు. వీటిలోనే ఆసక్తి. అతనికి ఇందే అహంకారం ఎక్కువ. తనదైన స్వరూపనిష్ఠ లేదు. స్వస్వరూప జ్ఞానం భావనా అభవనా రహితం. సర్వదా ఆత్మనిష్ఠం. ఆత్మతత్త్వం జ్ఞానభరితం. కనులకు కనిపించని వస్తుసందోహాన్ని మనస్సుతో భావించి దర్శించటం భావనం. మనస్సు భావన - అభావనలలో లగ్నమై ఉంటుంది.

## కామనారహితుడు

సర్వారంభేషు నిష్కామో యశ్చరేత్ బాల వన్మునిః
న లేప స్తస్య శుద్ధస్య క్రియ మాణేఽపి కర్మణి 240

యఃమునిః=ఏ జ్ఞాని; బాలవత్=బాలకునివలె; నిష్కామః=కామనారహితుడై; సర్వారంభేషు=సర్వక్రియారంభములందు; చరేత్=చరించునో; తస్య=అటువంటి; శుద్ధస్య=పరిశుద్ధునకు; కర్మణి=కర్మ; క్రియమాణే=చేయబడుచున్నదైననూ; లేపః=లేపం; న భవతి=కలుగదు.

జ్ఞానవంతుడైన మునీంద్రుడు కామనారహితుడై బాలుడివలె సర్వకార్యాలు ప్రారంభం చేస్తుంటాడు. నిర్వహణ చూస్తుంటాడు. ఆ మునీంద్రుడు శుద్ధ పురుషుడు. కార్యాలు చేస్తున్నా కూడా ఆ కార్యాలలో లగ్నం కాడు.

ఆ బ్రహ్మవేత్త నిష్కాముడు చిన్న బాలుడులాగా పనులుచేస్తుంటాడు. పూర్వజన్మపరంపరలచే ప్రాప్తించిన ప్రారబ్ధకర్మలు ఆచరిస్తాడు. కానీ వాస్తవంగా ఆ మునికి ఏ విధమైన ఫలాపేక్షలు లేవు. ఏ కార్యమూచేయనట్లే ఆ ముని. అహంకారంలేదు. అపేక్షలులేవు. కర్తృత్వాకాంక్ష లేదు. ఆ ఋషి నిస్సంగుడు.

## ఆత్మజ్ఞుడు

స ఏవ ధన్యః ఆత్మజ్ఞః సర్వభావేషు యః సమః
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ నిస్తర్ష మానసః 241

యః=ఎవడు; పశ్యన్=చూస్తూ; శృణ్వన్=వింటూ; స్పృశన్=స్పృశిస్తూ; జిఘ్రన్=అఘ్రాణిస్తూ; అశ్నన్=భుజిస్తూ; సర్వభావేషు=సమస్త భావక్రియలలో; సమః=సమచిత్తుడై; నిస్తర్షమానసః=ఆశారహితంగా ఉంటాడో; సః ఏవ=వాడే; ధన్యః=ధన్యుడు; అతడే ఆత్మజ్ఞః=ఆత్మతత్త్వం బాగా తెలిసినవాడు.

తృష్ణారహితుడై చూస్తూ వింటున్నవాడు ధన్యుడు. నిస్తర్షమానసుడై స్పృశించినా అఘ్రాణించినా భోజనం చేస్తున్నా ఆ ఋషి ఏకరసంలో సమభావంతో ప్రవర్తిస్తుంటాడు.

ఇట్టిమునీశ్వరుడు ఆత్మజ్ఞుడు. ఆత్మతత్త్వాన్ని బాగా అర్థంచేసికొని ఆత్మసుఖం అనుభవిస్తున్నటువంటి ధన్యాత్ముడు. మహాత్ముడు. సర్వుల యందు సమబుద్ధిగలవాడు సమదర్శి. అట్టివాడు ఆత్మజ్ఞుడు, ఆ ముని చిత్తం తృష్ణారహితం. అన్ని పదార్థాలు చూస్తూన్న అనుభవిస్తూన్న ఆ యతివరేణ్యుడికి ఏ దోషం అంటదు. ఆసర్వజ్ఞుడు సదా శాంత స్వభావుడు.

• • •

నిష్కారణము నిరీహము
నిష్కంపము నిష్క్రియంబు నిష్కల్మషమున్
నిష్కళము నిష్కళంకము
నైష్కర్మ్య ప్రాప్య నిర్గుణ బ్రహ్మమగున్

— సీతారామాంజనేయ సంవాదం

## నిర్వికల్పుడు

క్వ సంసారః క్వచా భాసః క్వ సాధ్యం క్వచ సాధనమ్
ఆకాశస్యేవ ధీరస్య నిర్వికల్పస్య సర్వదా 242

సర్వదా = ఎల్లప్పుడూ: ఆకాశస్యేవ=ఆకాశానికివలె: నిర్వికల్పస్య= సంసారరహితుడగు: ధీరస్య=జ్ఞానికి: క్వ సంసారః=సంసారమెక్కడ?: క్వ ఆభాసః=ప్రపంచ ఆభాసమెక్కడ?: క్వ సాధ్యం=సాధ్యమైన స్వర్గమెక్కడ?: క్వ సాధనం=సాధనాలైన యజ్ఞాదులు ఎక్కడ?

యోగీశ్వరుడు ఆకాశం వంటి అనంత స్వభావుడు. నిర్వికల్పుడు నిరంజనుడు. ఆధీరపురుషుడైన ఆత్మజ్ఞానికి అసంగుడికి సంసారం ఎక్కడ? ఆభాసం ఎక్కడ? సాధ్యమైన స్వర్గమెక్కడ? సాధనాలైన యజ్ఞాది కర్మ లెక్కడ?

సంకల్ప వికల్ప రహితుడికి ప్రపంచ దృష్టి ఉండదుకదా! ఆయన దృష్టికి స్వర్గాదులు అత్యల్పాలు.

## సంన్యాసి

స జయ త్యర్థసంన్యాసీ పూర్ణస్వరస విగ్రహః
అకృత్రిమోఽనవచ్ఛిన్నే సమాధి ర్యస్య వర్తతే 243

యస్య=ఎవనికి: అకృత్రిమః=కృత్రిమంకాక స్వాభావికమై: సమాధిః= సమాధి: అనవచ్ఛిన్నే= తన పూర్ణస్వరూపంలో: వర్తతే=వర్తిస్తుందో: సః= అటువంటి: అర్థసన్యాసీ=అర్థయుక్తుడైన సర్వసంగ పరిత్యాగి: పూర్ణస్వరస విగ్రహః=పూర్ణానంద స్వరూపుడైన జ్ఞాని: జయతి=సర్వోత్కృష్టుడగుగాక!

జ్ఞాని దృష్టాదృష్ట కర్మఫల రహితుడు ఆ ఆత్మజ్ఞుడు పూర్ణానంద రసవిగ్రహుడు. ఆత్మ విజ్ఞానంలో జయం సాధిస్తాడు సర్వోపరిస్థానం చేరుకొంటాడు.

ఆ ముని స్వాభావిక సమాధినిష్ఠలో అనవచ్ఛిన్న స్వస్వరూపంలో నిర్వికల్పుడై విరాజిల్లుతాడు. ఇది పరిపూర్ణ ఆనంద స్థితి. "రసోవై సః" అనిపించుకొన్న ధీరుడు లోక పరలోక కర్మ ఫలాలపై ఆశలు విడిచి నిష్కాముడై పరిపూర్ణ స్వస్వరూప జ్ఞాన దశలో ప్రకాశిస్తూంటాడు.

దేవదత్తోహ మిత్యేతత్ విజ్ఞానం నిరపేక్షకమ్
తద్వత్ బ్రహ్మవిదోఽప్యస్య బ్రహ్మాహ మితి వేదనమ్

"నేను దేవదత్తుడను" అనే జ్ఞానం సహజంగా కల్గుతుంది. అలానే బ్రహ్మజ్ఞానికి తాను బ్రహ్మాననే స్ఫురణ అతిసహజంగా కల్గుతుంది.

— వివేక చూడామణి

# నిరాకాంక్షి

బహునాత్ర కిముక్తేన జ్ఞాతతత్త్వో మహాశయః
భోగమోక్ష నిరాకాంక్షీ సదా సర్వత్ర నీరసః 244

అత్ర=ఈవిషయమై; బహునా=పెక్కువిదాల; ఉక్తేన=పలుకుటచేత; కిం=ఏమిప్రయోజనం; జ్ఞాతతత్త్వః=తత్త్వమెరిగిన; భోగమోక్ష నిరాకాంక్షీ = భోగ మోక్షాలు గూర్చి ఆశవిడిచిన; మహాశయః = ఉత్తమాశయుడైన జ్ఞాని; సదా=సతతము; సర్వత్ర=ఎల్లెడల; నీరసః=రాగద్వేషరహితుడై; వర్తతే= ఉంటున్నాడు.

విజ్ఞానీ! ఈ విషయంలో ఎక్కువ చెప్పేది ఏముంది? తత్త్వజ్ఞానం తెలిసినవాడు భోగమోక్షాంకాక్షలు లేనివాడై మహాశయుడై ప్రకాశిస్తాడు. ఆ జ్ఞాని సదా సర్వత్రా రాగద్వేష రహితుడై సర్వులకు హితుడై సన్నిహితుడై సర్వులను ఆదుకొంటాడు.

ఆత్మజ్ఞాని ఆత్మతత్వం అర్థం చేసి కొంటాడు. అట్టివాడు జ్ఞాన తత్త్వమూర్తి. వానిలో రాగద్వేషవాసనలు అణువంత కూడా ఉండవు. ఆ విజ్ఞాని తత్త్వవిదుడు.

• • •

ఆత్మానాత్మలు రెండు వస్తువులు లక్ష్యంబుల్ గదా! అందనా
త్మాత్మభ్రాంతి అనాదినుండి సహజం బైయుండగా నిప్పుడీ
వాత్మజ్ఞప్తిపటంచు చెప్పితిక అన్యం బేమియున్ లేదు - ఖు
ద్ధాత్మ ప్రత్యగభిన్నపూర్ణ పరమాత్మారాముని దర్శింగన్

— సీతారామాంజనేయ సంవాదం

# ద్వైత జగత్తు

మహదాది జగద్వైతం నామమాత్ర విజృంభితమ్
విహాయ శుద్ధ బోధస్య కిం కృత్య మవశిష్యతే 245

మహదాది=మహత్త్వాదులు:
విజృంభితం = నామమాత్ర భిన్నమై
కల్పనాం=కల్పనను: విహాయ=విడి:
కిం=ఏమి: కృత్యం=కర్తవ్యకార్య

మహదాది ద్వైత జగత్తు నామ...
జగత్తులో కల్పనలు విడిచినట్లయితే అంతా శుద్ధము
అకృత్యం ఏమి ఉన్నది?

మహత్తు, అహంకారం, పంచతన్మాత్రలు
దాదులు. వీటి కార్యకలాపాల మిశ్రమరూపం
నామమాత్రంగా వాపించి ఉంది. ఆత్మకు భిన్నంగ

"వాచరం భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్య మితి శ్రుతేః"
ఈ జగత్తు అంతా విషయ వికార నామాస్పదం. ఈ దృశ్యాలు నామాలు వాగ్దేవీ విలాస విన్యాస విహార భంగిమలు. ఇవి అన్నీ మిథ్యాబింబాలు. అంత మృణ్మయం. మృత్తిక నిజం. సత్యం. నామాలు ఘటాపటాదులు జగత్కల్పనలు ఇవి మిథ్య. బ్రహ్మ మాత్రమే సత్యం.

విద్వాంసుడు కల్పనలు త్యజించి శుద్ధ చైతన్య స్వస్వరూపంలో సుస్థిరంగా ఉండాలి. ఆ ధీరుడు చేయవలసిన కర్తవ్యాలు కర్మ కలాపాలు ఏమీలేవు ఆ ఆత్మజ్ఞాని సర్వదా నిత్యముక్తుడు. నిర్మలుడు మేఘామునిచే అపరింపబడిన నిర్మలాకాశం వంటి అనంతుడు. అతి నిశ్చలుడు. సర్వ వ్యాప్తి గలవాడు.

• • •

అశంకితాపి సంప్రాప్తా గ్రామయాత్రా యథాధ్వగైః
ప్రేక్ష్యతే తద్వదేవజ్ఞైః భోగశ్రీ రవలోక్యతే

గ్రామీణులు యాత్రికులను చూస్తున్నట్లు జ్ఞాని జగల్లీలలు చూస్తూంటాడు. అది నిస్సంగం అది నిర్వికారం. — మహోపనిషత్తు

# సర్వం భ్రమం

భ్రమ భూత మిదం సర్వం కించిన్నాస్తీతి నిశ్చయీ
అలక్ష్య స్ఫురణం శుద్ధ స్స్వభావేనైవ శామ్యతి 246

ఇదంసర్వం = ఈసమస్తవిశ్వం; భ్రమభూతం = భ్రాంతి మూలం; కించిత్ = కొంచం కూడా (యథార్థం): నాస్తి = లేనిదై యున్నది; ఇతి = ఈ ప్రకారంగా; నిశ్చయీ = నిశ్చయంగల; శుద్ధః = పరిశుద్ధుడు; అలక్ష్య స్ఫురణః = చైతన్య ఆత్మానుభవం గల జ్ఞాని; స్వభావేనైవ = స్వాభావికంగానే; శామ్యతి = శాంతి పొందుతున్నాడు.

ఈ సర్వప్రపంచం కించిత్తుకూడా సత్యం కాదు. అని చైతన్యాత్మానుభవజ్ఞుడు గుర్తిస్తాడు. అలక్ష్య స్ఫురణ గల పరిశుద్ధ నిశ్చయ జ్ఞానంగల కోవిదుడు స్వాభావికంగానే శాంతి పొందుతాడు.

విజ్ఞాని తన శుద్ధ స్వరూపాన్ని స్వప్రవేశాన్ని చిద్రూపాన్ని దర్శించి ఆనందిస్తాడు అన్య దృశ్య పదార్థాన్ని చూడడు. దృశ్యం కల్పితం. అధిష్ఠానం సాక్షాత్కరించగానే జగత్తుభ్రమ కల్పితం అని తెలుస్తుంది. వాస్తవంగా ఏమీ సత్యంకాదు. ఇలా జ్ఞానం కలిగింది అంటే అది స్వాభావికంగా సహజంగా కలుగవలసిందే. ప్రయత్నం చేస్తే వచ్చేది కాదు. స్వభావ సిద్ధమైనది శాంత స్వరూపం. జ్ఞానఫలం శాంతి. అట్టి శాంతి పొందటానికి ఆ ముని ఏమీ చేయనవసరం లేదు.

# శుద్ధ స్ఫురణ

శుద్ధస్ఫురణ రూపస్య దృశ్యభావ మపశ్యతః
క్వ విధిః క్వచ వైరాగ్యం క్వ త్యాగః క్వ శమోఽపివా 247

దృశ్యభావం = భావ దృశ్యప్రపంచం; అపశ్యతః = చూడనట్టి; శుద్ధ స్ఫురణరూపస్య = శుద్ధప్రకాశ స్వరూపుడగుజ్ఞానికి; విధిః = విహితకర్మానుష్ఠాన రూపవిధి; క్వ = ఎక్కడ?; క్వ వైరాగ్యం = వైరాగ్యమెక్కడ?; క్వ త్యాగః = త్యాగమెక్కడ?; క్వ శమోఽపి = శమముకూడ ఎక్కడ?

దృశ్యభావాన్ని చూడని శుద్ధస్ఫురణ రూపాత్మకునకు విధి ఎక్కడ? త్యాగ మెక్కడ? ఇంకా శమ మెక్కడ? స్వస్వరూపమైన శుద్ధ స్వరూపం స్వప్రకాశం చిద్రూపంగా తన ఆత్మతత్త్వాన్ని దర్శించుకొనేవాడు బాహ్యదృశ్య ప్రపంచాన్ని చూడడు. అట్టి ఉత్తమోత్తమ యోగ వరిష్ఠునకు ఇంక రాగమేమున్నది ఏమిలేదు-విధీ లేదు. వైరాగ్యమూలేదు. శమమూలేదు. దమమూలేదు.

## మాయా ప్రకృతి జగత్తు

స్ఫురతోఽనంత రూపేణ ప్రకృతిం చ న పశ్యతః
క్వ బంధః క్వచవా మోక్షః క్వ హర్షః క్వ విషాదతా 248

అనంతరూపేణ=అనంతరూపాలతో; స్ఫురతః=ప్రకాశిస్తున్న; ప్రకృతిం= మాయను; నపశ్యతి=చూడనట్టి జ్ఞానికి; క్వ బంధః=బంధ మెక్కడ?; క్వ మోక్షః=మోక్షమెక్కడ?; క్వ హర్షః=హర్షమెక్కడ?; క్వ విషాదః=విషాద మెక్కడ?

అనంత రూపాలలోగల మాయాప్రకృతి జగత్తును చూడని జ్ఞానికి బంధనం మోక్షం హర్షం విషాదం అనేవి ఉండవుకదా! చిద్రూప ఆత్మజ్ఞాని కర్మభూమిని మాయా జాలాన్ని చూడనైనా చూడడు. అట్టి మహర్షికి మాయ అంటదు. ఆ మహర్షికి బంధ మోక్షాలూలేవు హర్ష విషాదాలూలేవు.

• • •

"దానంబును - ప్రియంబు చేతయును - సత్యంబును - అహింసయు వనునివి నాలుగును సమానంబులు. అయినను 'అహింస' విశేషంబు. ఎట్లనిన దేవ మనుష్య తిర్యగ్యోను లనియెడు మూడు గతులయందును మనుష్యుండు దానాది గుణంబులు గలిగి అహింసాపరుడైనవాడు దేవగతి పడయు."

— నన్నయ (భారతం - అరణ్యపర్వం)

## సంసారం మాయ

బుద్ధిపర్యంత సంసారే మాయామాత్రం వివర్తతే
నిర్మమో నిరహంకారో నిష్కామః శోభతే బుధః 249

బుద్ధి పర్యంత సంసారే=బుద్ధి బలంతో నిండినట్టి ప్రపంచంలో: మాయా మాత్రం=మాయా విశిష్టచైతన్యం: వివర్తతే=కల్పన జేయమన్నది: బుధః= బుధుడైన జ్ఞాని: నిర్మమః=మమతారహితుడూ: నిరహంకారః = అహంకార రహితుడూ: నిష్కామః=కామనా రహితుడూ అయి: శోభతే=శోభిల్లుతున్నాడు.

ఆత్మ జ్ఞానమే సంసారంలో మాయా చైతన్యంతో జగదాకారం పొంది కల్పితమై భాసిస్తుంది. ఇది తెలిసిన బుధుడు నిరహంకారంగా నిర్మమతగలవాడై నిష్కాముడై శోభిస్తాడు. ఆత్మ జ్ఞానం చేత సంసారం అంతరిస్తుంది. సర్పం అనుకొన్న త్రాడును త్రాడు అని గుర్తించిన తరువాత భయం పోయినట్లు ఇది జగత్తుకాదు· పరమాత్మ అని గుర్తించిన తర్వాత సంసార చింత ఉండదుకదా!

మాయా విశిష్ట చైతన్యం వివర్తరూపంలో మాయామాత్ర జగదాకారం ధరించింది. వివర్తం అంటే అసలు వస్తువు మార్పు సేయకుండ మరొకటి అనిపిస్తుంది. విష్ణుతత్వం విశ్వంవలె భాసిస్తుంది. విద్వాంసులు నిష్కాములై ఆత్మాత్త్విక దేహ సంబంధిత దారాపుత్రాదుల యెడల మమతా శూన్యులై మాన్యులై ధన్యులై రాణిస్తారు.

వివర్తం అంటే మారని తత్త్వ వస్తువు సత్తు అసత్తు అనిపిస్తుంది. పరిణామం అంటే మార్పుచెందు వస్తువు పాలు పెరుగు అవటం. సజాతీయం అంటే అత్యల్ప వస్తువులు కలిసి పెద్దవవటం నూలు ప్రోగులు కలిసి వస్త్రమవటం.

• • •

ఆంజనేయ! సచ్చిదానందమయునిగా
నన్ను గాంచు తెరగు విన్నవింతు
అమల మనముచేత అవధరింపుము నీదు
సకల సంశయములు సమసి పోవు

— సీతారామాంజనేయ సంవాదం

# ఆత్మ అక్షయం

అక్షయం గత సంతాపం ఆత్మానం పశ్యతో మునేః
క్వ విద్యా క్వచవా విశ్వం క్వ దేహోఽహం మమేతి వా 250

అక్షయం = నాశరహితమైనట్టి; గతసంతాపం = సంతాపశూన్యమైన; ఆత్మానం = ఆత్మను; పశ్యతః = చూస్తున్న; మునేః = మునికి; క్వ విద్యా = విద్యా శాస్త్రాదులెక్కడ?; క్వ విశ్వం = విశ్వమెక్కడ?; క్వ దేహః = దేహమెక్కడ?; క్వ అహం మమ ఇతిచ = నేను నాది అనే భావం ఎక్కడ?

అక్షయమూ అవినాశి సంతాపరహితమూ అయిన ఆత్మను పూర్తిగా ఎరిగిన తత్త్వజ్ఞుడైన మునికి విద్యా శాస్త్రాలు ఎందుకు? అసలు లోకంతో పనేముంది? దేహవాసన లేదు. అహంకారం మమకారం అసలు లేదు. ధీరుడైన ఆత్మజ్ఞాని నాశరహితుడు. సంతాప శూన్యుడు. ఆత్మానంద పరుడు. ఆ మునికి ఆత్మతత్త్వంకాక అన్యం స్ఫురించదు. సర్వాధిష్ఠానాత్మయొక్క సాక్షాత్కారం పొంది సుఖిస్తాడు.

• • •

వ్యాసుడు శుకుడితో—

హింస లేకయునికి - ఇంద్రియజయము - నై
రాశ్య - మచపలత్వ - మను గుణములు
నాల్గు కలుగునట్టి నరునకు కరతలా
మలక మంతరాత్మ మహిమ యెల్ల

— తిక్కన (భారతం - శాంతిపర్వం)

# ఇంద్రియాలు నిరోధించు

నిరోధాదీని కర్మాణి జహాతి జడధీ ర్యది
మనోరథాన్ ప్రలాపాంశ్చ కర్తు మాప్నోతి తత్క్షణాత్ 251

జడధీః = జడబుద్ధి అయిన అజ్ఞాని; నిరోధాదీని = చిత్తనిరోధాదులైన

కర్మాణి=కర్మలను: జహాతి యది=విడిచిపెట్టిన వాడైనప్పటికీ: అతత్త్వజ్ఞాత్=కొర్దిసేపటికే: మనోరథాన్ = కోరికలను గూర్చి: ప్రలాపాన్ = ప్రలాపాలు: కర్తుం=చేయుటకు: ఆప్నోతి=ప్రవృత్తుడగుచున్నాడు.

అజ్ఞాని చిత్త నిరోధాది కర్మలు విడువగానే మనోరథాలవైపు ప్రలాపాల వైపు లౌకిక కృత్యాలు వైపు ప్రవృత్తుడౌతాడు. జడ చిత్తుడి మనస్సు చిత్తనిరోధాది కృత్యాల వదిలితే మధుర వాక్కులతో మనోరథాలు తీర్చుకోవటం కోసంపరుగులు. తీస్తుంది కళ్ళెం తీసిన గుర్రమై ఎటో పరుగెత్తుతుంది.

అజ్ఞాని ఆత్మసాక్షాత్కారం కోసం చేసే యోగాభ్యాసాది కర్మకలాపం కుంజర శౌచప్రాయం. ఏనుగు సరస్సులో చాలా సేపు స్నానం చేసిచేసి ఒడ్డుకు రాగానే బురద దుమ్ము చల్లు కొంటుంది. ఇది గజశౌచం. అలానే అజ్ఞాని సమాధిలో ఉండి బైటకు రాగానే లోకవ్యవహారాలలో చిక్కుకొంటాడు.

• • •

జ్ఞానమునన కాని జన్మ జరామృత్యు
వుల జయించునట్టి అలఘ మోక్ష
పదము కల్గనేర దది కారణముగ సు
జ్ఞాన మెల్లభంగి సాధ్యతమము

— తిక్కన (భారతం - శాంతిపర్వం)

# మందబుద్ధి దొంగబుద్ధి

మందః శ్రుత్వాపి తద్వస్తు నజహాతి విమూఢతాం
నిర్వికల్పో బహిర్యత్నాత్ అంతర్విషయ లాలసః 252

మందః=మందుడైన అజ్ఞాని: తద్వస్తు=ఆ ఆత్మవస్తువును: శ్రుత్వాపి=విన్నప్పటికీ: విమూఢతాం=మూఢత్వాన్ని: న జహాతి=విడిచిపెట్టడు: బహిః=బాహ్యానికి: యత్నాత్=ప్రయత్నంవలన అతికష్టంమీద: నిర్వికల్పః=సంకల్ప రహితుడుగా ఉంటాడే: పరంతు=కానీ: అంతః=లోపల: విషయలాలసః=విషయలాలసుడు: భవతి=అగుచున్నాడు.

మందబుద్ధి తద్వస్తువైన ఆత్మతత్త్వాన్ని శ్రవణం చేసికూడా విమూఢతను విడువజాలడు. అజ్ఞాని పైకి బాహ్యానికి నిర్వికల్పుడుగా నిశ్చలుడుగా సంకల్ప వికల్ప రహితుడుగా కనిపిస్తాడు. కానీ లోపల మనస్సులో విషయ లాలసత్వం అత్యధికం. మనశ్శుద్ధి లేదు.

మూర్ఖబుద్ధి దొంగ బుద్ధి చూపిస్తాడు. పైపైన ఆత్మను గూర్చి వింటాడు. వినిపిస్తాడు. కానీ విషయ సుఖాలు వీడలేడు. ఆలోచనలన్నీ భోగభాగ్య సంపాదనలను గూర్చినవే. ఆశలు చంపుకోలేని అంధుడువాడు. కేవలం ఆత్మబోధ, శ్రవణం అవివేకుడిని మార్చలేవు. చిత్తశుద్ధి, విషయవిస్మరణం విశ్వేశ్వర కటాక్షంతో కలగాలి.

• • •

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే

నిష్ఠకలిగిన వాడి నుండి విషయాలు విరమిస్తాయి. కాని విషయ వాంఛలు మట్టి క్రింద పడిన విత్తనాలవలె మరుగునపడి ఉంటాయి. ఆత్మానుభవంలో అవి కూడా అంతరిస్తాయి.

— భగవద్గీత

## జ్ఞానంతో కర్మలు జయించు

జ్ఞానాత్ గళిత కర్మాయో లోక దృష్ట్యాపి కర్మకృత్
నాప్నో త్యవసరం కర్తుం వక్తుమేవ న కించన 253

యః=ఎవడు; జ్ఞానాత్=జ్ఞానంవలన; గళితకర్మా=కర్మరహితుడైకూడా: లోకదృష్ట్యా=లోకందృష్టికి; కర్మకృత్ అపి=కర్మిష్ఠిగా ఉంటాడో: సః=అట్టి వాడు; కించన=కొంచంకూడా; కర్తుం=చేయుటకుగానీ: వక్తుం=భాషించుటకు గానీ: అవసరం=అవసరం: న ఆప్నోతి=పొందడు.

జ్ఞానం కలిగి కర్మజంజాటం వీడిన జ్ఞాని లోకందృష్టిలో కర్మలు చేస్తూండ వచ్చుకానీ ఆ మునీంద్రుడు ఏమీ చేయవలసిన అవసరంలేదు. ఇతరులతో మాట్లాడ పలపిన అవసరంకూడా లేదు. ఆ ఋషి నిర్వికారుడు నిశ్చలుడు నిత్యానంద మగ్నుడు.

ఆ ధీర పురుషుడి కర్మలు ఆత్మజ్ఞానంతో అంతరించిపోయాయి. ఏ కర్మ ఆ ముని చేయనవసరంలేదు. అయినా లోకంకోసం కర్మకాండ నలుపుతూ 'నేనుకూడా ఈ సత్కర్మలు చేస్తున్నాను. మీరు కూడా చేయండి. మానకండి' అన్నట్లుగా కర్మాచరణ చేస్తున్నట్లు కనిపిస్తాడు. నిజంగా ఆ సంయమీంద్రుడు చేయవలసింది చెప్ప వలసింది ఏమీలేదు. ఆత్మజ్ఞాన బలంచేత కర్మఫలేచ్ఛను పరిత్యజించాడు.

• • •

సత్యము తపమును యజ్ఞము
సత్యము వేదంబు దాంతి శాంతులు నగుటన్
సత్యము దొరగుట నిర్మల
నిత్యానుష్ఠానములును నిష్ఫలములగున్

— తిక్కన (భారతం - శాంతిపర్వం)

# ద్వంద్వాతీతుడు

క్వ తమః క్వ ప్రకాశో వా హానం క్వచన కించన
నిర్వికారస్య ధీరస్య నిరాతంకస్య సర్వదా 254

సర్వదా=ఎల్లప్పుడు; నిర్వికారస్య=వికారరహితుడు; నిరాతంకస్య = సంతాప భయశంకారహితుడయిన; ధీరస్య=ధీరుడయినజ్ఞానికి; క్వ తమః=అజ్ఞాన తమస్సు ఎక్కడ?, క్వ ప్రకాశంః=ప్రకాశం అంటూఎక్కడ?; క్వ హానం= హాని లేక పరిత్యాగంఎక్కడ?; న కించన=కొంచం కూడాలేదు.

సర్వదా నిర్వికారుడు నిర్భయుడు నిశ్చలుడు అయిన ధీరుడు అంధకారంలో వెళ్ళినా వెలుగులో నడిచినా భయమేమిటి? ధైర్యమేమిటి? అట్టి జ్ఞానికి హానిఏమిటి? లాభమేమిటి? రాగమేమిటి? ద్వేషమేమిటి? ఆఋషి సత్వసముడు. సమదర్శి సమబుద్ధి.

మోహాది వికారాలు లయమైపోయాయి. ఇక వారిదృష్టిలో తమస్సు ఎక్కడుంది? ప్రకాశం ఎక్కడుంది? తమముంటే ప్రకాశముండదు. ప్రకాశముంటే తమ ముండదు. రెండు సాపేక్షకాలు లౌకిక దృష్టిలోనే చీకటి వెలుగులు. ఆత్మదృష్టిలో

ఈ భేదాలు ఉండవు. రెండూ సమానమే. కనుక జ్ఞానికి కాలాదులతో కూడా పనిలేదు. కాలుడన్నా భయంలేదు. కాలాంతకుడన్నా భయంలేదు. భయం అనేది అసలు ఎరుగడు.

• • •

దృశ్యమె నాకము—దృశ్యమె వాయువు—దృశ్యమె భూజలతేజములున్—
దృశ్యమె దేశము—దృశ్యమె కాలము—దృశ్యమె దేహము నింద్రియముల్—
దృశ్యమె ప్రాణము—దృశ్యమె చిత్తము—దృశ్యమె హంకృతి ధీ మనముల్
దృశ్యమె విద్యయు—దృశ్యమవిద్యయు—దృశ్యముగానిది దృక్కరయన్
— సీతారామాంజనేయ సంవాదం

# వివేకి

క్వ ధైర్యం క్వ వివేకిత్వం క్వ నిరాతంకతాఽపివా
అనిర్వాచ్య స్వభావస్య నిఃస్వాభావస్య యోగినః 255

అనిర్వాచ్య స్వభావస్య=చెప్పశక్యంకాని స్వభావంగలిగిన; నిస్స్వభావస్య= స్వభావరహితుడైన; యోగినః=యోగికి; క్వ ధైర్యం=ధీరత అన్నదెక్కడ?; క్వ వివేకిత్వం=వివేకిత్వం ఎక్కడ; క్వ నిరాతంకతాఅపి=ఇంకా నిర్భయత్వం ఎక్కడ? (ఆయోగి గుణాతీతుడు).

సామాన్యుడికి స్వభావ రహితుడైన యోగికి ధీరత్వంలో కాని వివేకత్వంలో కానీ నిర్భయత్వంలోకాని సామ్యం ఎక్కడ? యోగి నిర్భయస్థుడు సదా ఆనంద రూపుడు. ఏకరస ప్రియుడు. అఖండ ఆత్మజ్ఞాని.

ధైర్యం-వివేకం-నిర్భయత్వం సాధకునకు ప్రధానగుణాలు. ఇవి పర్వతారోహనకునకు అవరాల వంటివి. గమ్యం చేరిన తర్వాత పరికరాలు అవసరంలేదు. అలానే ఆత్మస్థానం జేరిన తర్వాత నియమాలు వ్రతాలు అక్కరలేదు. జీవన్ముక్తుడు నిస్స్వభావుడు గమ్యం జేరినవాడు. దేనితో ఏమి అవసరం ఉంది?

• • •

జనకుడు శుకుడితో ఇలా అంటాడు —

కుమారా! మానవుడు నాలుగాశ్రమధర్మాలు వడిచి క్రమంగా మోక్షం అందుకోవాలి. అయితే కారణజన్ములు ఇవిదాటి మోక్షపదం అందుకోవచ్చు. అట్టియోగి

గురూపదేశం పొంది జ్ఞాన విజ్ఞానాలు అంది మోక్షం చేరుకొంటాడు. అతడు మోక్ష కారణ శుద్ధుడై జన్మిస్తాడు. లోక బంధవిచ్ఛేదం కోసం కర్మవ్యాకులత విడనాడ టానికి పూర్వఋషులు చతురాశ్రమాల క్రమంచెప్పారు. కానీ అట్టి అద్భుత ఋషి కోటికేఒక్కడో ఉంటాడు.

ఆ ఉత్తమఋషి తమోధీనమై తనుదోషం రజోధీనమైన గుణందోషం తుడిచి పైచి సత్త్వమూర్తిమై ప్రకాశిస్తాడు. ఆ ముని సత్త్వమార్గాభిరతితో ఆత్మతత్త్వ దర్శనం పొందుతాడు. స్వస్వరూపం చూచుకొంటాడు. ఆ ఋషి తనలో విశ్వాన్ని, విశ్వంలోతననూ అవలోకనం చేసికొని మోక్షం పొందుతాడు.

## జ్ఞాని అతీతుడు

న స్వర్గో నైవ నరకో జీవన్ముక్తిః నచైవ హి
బహూనాత్ర కిముక్తేన యోగదృష్ట్యా న కించన 256

జ్ఞానినః=జ్ఞానికి; న స్వర్గః=స్వర్గమూలేదు; నైవ నరకః=నరకమూలేదు; న జీవన్ముక్తిః=జీవన్ముక్తిలేదు; అత్ర=ఈ విషయంగూర్చి; బహూనా=అనేకం; ఉక్తేన=చెప్పటంచేత; కిం=ఏమి ప్రయోజనం; యోగదృష్ట్యా=యోగదృష్టిచేత; న కించన=ఏమియులేదు.

జ్ఞానికి స్వర్గమూలేదు. నరకమూలేదు. జీవన్ముక్తి అనేదికూడాలేదు. ఏదీ పట్టించుకోడు కోరుకోడు. ఆ జ్ఞానినిగూర్చి ఎక్కువ చెప్పేది ఏముంది? ఆ యోగీ శ్వరునికి యోగదృష్ట్యా ఏమీ అక్కరలేదు. ఆత్మజ్ఞానియైన జీవన్ముక్తుడి దృష్టిలో స్వర్గంలేదు నరకంలేదు.

నాస్తికుడి దృష్టిలో ఈ లోకమేకానీ పరలోకంలేదు. ఆత్మకూడాలేదు. అతడి దృష్టిలో అంతా శూన్యమే. కానీ జీవన్ముక్తుడి దృష్టిలో ఈ లోకం పరలోకంకూడా లేదు. ఆత్మ అంతటా నిండివుంది. సర్వత్ర ఆత్మ ప్రకాశమే ప్రభావమే. ఆత్మకు అతిరిక్తంగా మరేమీలేదు.

# పూర్ణ చిత్తుడు

నైవ ప్రార్థయతే లాభం నాలాభే నానుశోచతి
ధీరస్య శీతలం చిత్తం అమృతేనైవ పూరితమ్ 257

ధీరస్య=ధీవిశారదుని: చిత్తం=మానసం: అమృతేన ఏవ=అమృతం చేతనే: పూరితం=నింపబడినదై: శీతలం=చల్లగా ఉంటుంది (కనుకనే): నః= ఆ జ్ఞానమూర్తి; లాభం=లాభమునూ: నప్రార్థయతే=కోరడు: చ=మరియు: అలాభేన=అలాభం కలిగినా; న అనుశోచతి=దుఃఖించడు.

ధీరుడి చిత్తం అమృతంతో నిండి చల్లగా ఉంటుంది. కనుక అది లాభాల కోసం ప్రార్థనలు చేయదు. నష్టం వస్తేకానీ లేక లాభం లేదనిగానీ హాని కలిగిందని కానీ శోకించదు జీవన్ముక్తుడైన జ్ఞాని లాభాలకు సంతోషం, నష్టాలకు దుఃఖం పొందడు. ఆ ముని చిత్తం పరమానందామృతంతో తృప్తిగా ఉంటుంది.

"పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే" పూర్ణం నుండి పూర్ణం తీసివేస్తే పూర్ణమే మిగులుతుంది. అనంతం నుండి దేనినీ తీసివేయలేము. కలప లేము. అది తరగదు పెరగదు. జీవన్ముక్తుని అంతరంగం సదా శాంతరసంతో నిండి పూర్ణంగా ఉంటుంది. అది అమృత భాండం. అమృతం అంటే అమరత్వం అంటే మనస్సు యొక్క ఆనందస్థితే.

• • •

అక్షర తత్త్వజ్ఞానము
సాక్షాన్మోక్షప్రదంబు సాంసారిక దుః
ఖక్షయకరమగు - దక్కిన
లక్షణములు సుఖతరములు లలితాత్మలకున్

— సీతారామాంజనేయ సంవాదము

# సమవర్తి

న శాంతం స్తౌతి నిష్కామో న దుష్టమపి నిందతి
సమదుఃఖ సుఖస్తృప్తః కించిత్కృత్యం న పశ్యతి 258

నిష్కామః=కామనా శూన్యుడైన జ్ఞాని; శాంతం=శాంతపురుషుడని; నస్తౌతి=స్తుతించడు; దుష్టమపి=దుష్టాత్ముడని; న నిందతి=నిందించడు; సమదుఃఖ సుఖః=సుఖదుఃఖాలను; తృప్తః=సంతృప్తచిత్తుడై; కించిత్=కొంచంకూడా; కృత్యం=ఇదిచేయదగినది అని; న పశ్యతి=లక్షింపడు.

నిష్కాముడైన జ్ఞాని శాంతుణ్ణి స్తుతించడు. దుష్టుణ్ణి నిందించడు. సుఖ దుఃఖాలు సమంగా చూసే యోగీంద్రుడు ఆనందంగా ఉంటూ కర్మలను ఏ ఒక్కటి కూడా ఆచరించడు. ఆత్మజ్ఞానంలోనే నిమగ్నమై ఉంటాడు. నిష్కాముడు కనుక ఏమీ ఆత్మేతరం లక్షించడు.

జ్ఞాని విద్యాకాముక కర్మలు చేయడు. ఎవరినీ మంచివారినీ పండితులను కూడా స్తుతించడు. దుర్మార్గులను నిందించడు. ఆ ముని నిష్కామస్థితి అందినవాడు.

నిఃస్తుతి ర్నిర్నమస్కారో నిఃస్వధాకార ఏవచ
చలాచలానికేతశ్చ యతి ర్నిష్కాముకో భవేత్

జ్ఞానవంతుడైన యతీశ్వరుడు ఎవరినీ స్తుతించడు. ఎవరికీ నమస్కరించడు. అగ్ని కార్యమూచేయడు. ఒకచోట స్థిరంగా ఉండడు. ఎవరినీ దూషించడు. ఎవరినీ భూషించడు. ఆయతి వరుడికి సుఖదుఃఖాలు సమానం. కష్ట నష్టాలు సమానం. ద్వేష హర్షాలు సమానం. ఆ ఋషి సమదర్శి.

# న ద్వేష్టి

ధీరో నద్వేష్టి సంసారం ఆత్మానం న దిదృక్షతి
హర్షామర్ష వినిర్ముక్తో న మృతో నచ జీవతి 259

ధీరః=బుద్ధిగల జ్ఞాని; సంసారం=ప్రపంచాన్ని; నద్వేష్టి=ద్వేషింపడు; న దిదృక్షతి=చూచుటకైనా ఇష్టపడడు; హర్ష అమర్ష వినిర్ముక్తః=సంతోషదుఃఖాలు లేనివాడు కనుకనే; సః=ఆ ముని; న మృతః=మరణించిన వాడూకాడు; న జీవతి=జీవించనవాడూకాడు.

హర్షామర్ష వినిర్ముక్తుడైన ధీరపురుషుడు సంసారాన్ని ద్వేషించడు. ఆత్మను కూడా చూడడు. ఆ యతి లౌకికంగా మృతుడూకాదు జీవించిన వాడూకాదు. ఇది జీవన్ముక్తుడి పరిపక్వస్థితి.

సంసార దృష్టిలేదు బాధలేదు కాబట్టి ఆ ఋషి విషయ సంసారాన్ని ద్వేషించటం లేదు అంటే సంసారంపై వ్యామోహం బంధంతో చూడడు. అనుబంధంలేదు. చూచినా చూడనట్లే మనస్సు అటుపోదు.

ఆత్మపైనే ధ్యాస. ఆత్మనే అవలోకిస్తూంటాడు. చివరి చరమావస్థలో ఆత్మను కూడా లక్షించడు. తానే పరమాత్మ అవుతాడు కనుక. ఇక స్వయం ఆత్మస్వరూపుడు అయిన మహాత్ముడికి హర్ష శోకాదులు జనన మరణాలు ఉండవు.

## మమతా శూన్యుడు

నిస్స్నేహః పుత్ర దారాదౌ నిష్కామో విషయేషుచ
నిశ్చింతః స్వశరీరేఽపి నిరాశః శోభతే బుధః 260

బుధః=బుధుడైన జ్ఞాని; పుత్రదారాదౌ=భార్యా బిడ్డలందు; నిఃస్నేహః=స్నేహరహితుడై; విషయేషు=విషయాలందు: నిష్కామః=కామశూన్యుడై: అపిచ=మరింకా; స్వశరీరే=తనదేహం విషయంలో: నిశ్చింతః=చింతారహితుడై: శోభతే=శోభిల్లుచున్నాడు.

యోగి స్త్రీ పుత్రాదులపై స్నేహం మమతానుబంధాలు లేకుండా ఉంటాడు. విషయభోగాలపై కోరికలు లేకుండా ఉంటాడు. స్వశరీరం గూర్చి చింతలేకుండా ఉంటాడు. ఏ విధమైన ఆశలూ పెట్టుకొనడు అటువంటి ఉత్తమోత్తమ యోగి వరేణ్యుడు శోభిస్తాడు.

జీవన్ముక్తుడు ఆశలులేకుండా అభ్యుదయం సాధిస్తాడు. భార్యా పుత్రులపై మమతపెట్టుకోకుండా విషయ భోగరహితుడై రాణిస్తాడు. అతడు తన దేహాన్ని గూర్చి కూడా చింతించడు. ఆ ముని నిష్కాముడు. నిశ్చింతుడు. ఆ ఋషి నిత్యానంద యోగి.

## తుష్టియే పుష్టి

తుష్టిః సర్వత్ర ధీరస్య యథా పతిత వర్తినః
స్వచ్ఛందం చరతో దేశాన్ యత్రాస్తమిత శాయినః 261

యత్ర=ఎచ్చట: అస్తమిత శాయినః=సూర్యుడు అస్తమించుచున్నాడో అచట శయనించుచున్నటువంటివాని: స్వచ్ఛందః=తనఇష్టానుసారంగా: దేశాన్=దేశాలను: చరతః=సంచరిస్తున్నటువంటివాని: యథా పతితవర్తినః=ప్రారబ్ధాను సారంగా వచ్చిన దానితో తృప్తుడై ప్రవర్తిస్తున్న: ధీరస్య = ధీ విశాలునకు: సర్వత్ర=అన్నిచోట్ల: తుష్టిః=సంతృప్తి: భవతి=అగుచున్నది.

యోగి ప్రారబ్ధవశాత్తు సూర్యాస్తమయం వేళ పడుకొని నిద్రిస్తాడు. స్వేచ్ఛగా స్వచ్ఛందంగా వనాలలో జనాలతో దేశవిదేశాలలో సంచరిస్తాడు. లోకం దృష్టిలో మాత్రం పతితుడువలె కనిపిస్తాడు. కాని సర్వత్ర సర్వదా ఆత్మానందంతో సంతృప్తిగా జీవనం చేస్తాడు.

## సహజరూపం

పతతూదేతు వా దేహో నాస్య చింతా మహాత్మనః
స్వభావ భూమి విశ్రాంతి విస్మృతాశేష సంసృతేః 262

స్వభావభూమి విశ్రాంతి = సహజసిద్ధమైన పీఠంపై విశ్రాంతి తీసికొంటూ విరాజిల్లుతున్న: విస్మృతాశేష సంసృతే=అశేష ఆనంత సంసార సంస్కార విశేషాలు మరచి ఆత్మస్థితిలోగల: అస్య=ఈ జీవన్ముక్తుడగు: మహాత్మనః=మహాత్మునకు: దేహః=దేహం: ఉదేతు=ఉండుగాక!: వా=లేక: పతతు=పడించుగాక!: న చింతా=చింతలేదు.

మహాత్మునకు తన స్వభావమూ తన సహజ రూపమూ విశ్రామ స్థానం అది తనదైన సుస్థిర స్వభావ భూమి. అది విశ్రాంతిప్రదేశం. ఆతడు సంపూర్ణ సంసారం విస్మరణ చెందవలసినదే. విశ్వం విస్మరించవలసినదే. ఆతనికి సహజస్వభావమే ఆత్మస్థానం. ఆత్మస్థానమే విశ్రాంతి స్థానం. మిగిలింది అంతా మరువ దగినదే. ఇక దిగులు లేదు నిశ్చింతగా ఉంటాడు యోగి. దేహం ఉన్నా రాలిపోయినా దిగులు పడడు. అట్టి జ్ఞానియే జీవన్ముక్తుడు. సంసారనివృతుడు. సచ్చిదానంద స్వరూపుడు. సదమల జ్ఞాని.

• • •

"ఆత్మనిత్యుండు - క్షయరహితుండు - శుద్ధుండు - క్షేత్రజ్ఞుండు. గగనాదుల కాశ్రయుండు - క్రియాశూన్యుండు - స్వప్రకాశుండు - సృష్టి హేతువు. వ్యాపకుండు నిస్సంగుడు - పరిపూర్ణుండు ఒక్కడు అని వివేకసమర్థంబులగు ఆత్మ లక్షణంబులు పన్నెండు."

— పోతన (భాగవతం - సప్తమస్కంధం)

## అకించనుడు

అకించనః కామచారో నిర్ద్వంద్వశ్ఛిన్న సంశయః
అసక్తః సర్వభావేషు కేవలో రమతే బుధః 263

అకించనః = దీనభావరహితుడై; కామచారః = విధినిషేధ రహితుడై; నిర్ద్వంద్వః=ద్వంద్వభావశూన్యుడై; ఛిన్నసంశయః=సంశయ విచ్ఛిన్నుడై; సర్వభావేషు=సమస్త భావాలయందు; అసక్తః=ఆసక్తిలేనివాడై; బుధః=పండితుడైన జ్ఞాని; కేవలః = వికారవిదూరుడై; రమతే = ఆత్మానందంలో రమించుచున్నాడు.

అకించనుడు, గృహస్థధర్మ వర్జితుడు, కామచారుడు, విధినిషేధరహితుడు, ఆసక్తి రహితుడు, కాంక్షలులేనివాడు, కేవలుడు నిర్వికారుడు అయిన పండితుడు బుధుడు. ఆ జ్ఞాని అన్ని భావాలలోనూ రమిస్తాడు. ఆనందం పొందుతాడు.

జీవన్ముక్తుడు నిర్వికారుడై జగత్తులో ఆనందం పొందుతాడు. ఏ వస్తువు కొంచెంకూడా గ్రహించనివాడు అకించనుడు విధి నిషేధాలకు బద్ధుడుకాడు. స్వచ్ఛందచారుడు. స్వేచ్ఛగా సంచారం చేస్తాడు సుఖదుఃఖాలకు అతీతుడు. ద్వంద్వ రహితుడు. సంశయ రహితుడు - కాంక్షారహితుడు మహామహితుడు. సర్వహితుడు.

• • •

భిద్యంతే హృదయగ్రంధిః ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే

పరాపరాలు దర్శించగల యోగుల హృదయగ్రంథులు ఏకమై సర్వ సంశయాలూ నశిస్తాయి. వారి కర్మలు అన్నీ సంశయాలతోపాటు హరిస్తాయి.

— ముండకోపనిషత్తు

## సమచిత్తుడు

నిర్మమః శోభతే ధీరః సమలోష్టాశ్మ కాంచనః
సుభిన్న హృదయ గ్రంథిః వినిర్ధూత రజస్తమః 264

నిర్మమః=మమతా రహితుడు; సమలోష్ట అశ్మకాంచనః = పాషాణమునూ, బంగారమునూ సమముగా నెంచేవాడు; సుభిన్న హృదయ గ్రంథిః=బాగుగాఛేదింపబడిన విషయహృదయగ్రంధులు గలవాడు; నిర్ధూత=ఎగురగొట్టబడిన; రజస్తమః= రజోగుణాలు గలవాడు అయిన; ధీరః = ధీరుడైన జ్ఞాని మాత్రమే; శోభతే = శోభిల్లుచున్నాడు.

మమతారహితుడైన జ్ఞానికి మట్టి - మాణిక్యం రాయి - రత్నం సమానం. జ్ఞాని దృష్టిలో బంగారం బండరాయి సమానం. వారి హృదయగ్రంధి వ్రీలిపోయింది. రజస్తమోగుణాలు వీడిపోయాయి. అట్టి ఆత్మజ్ఞాని స్వచ్ఛరత్నమై శోభిస్తున్నాడు. మమత్వం వదులుకొన్నవాడు మహర్షి. జీవన్ముక్తుడు చిరత్న రత్నమై మౌక్తికమై రాణిస్తాడు. హృదయగ్రంధి ఛేదింపబడింది. అహంకార మమకారాలు దూరమై పోయాయి. ఆత్మ సాక్షాత్కారం కలిగింది. ధన్యుడైనాడు.

• • •

క్షురస్యధారా నిశితా దురత్యయా
దుర్గం పథస్తత్ కవయో వదంతి

ఈ మార్గం కత్తివాదరంత నిశితం. దీనిమీద నడపటం చాలాకష్టం. గమ్యం చేరటం మరీకష్టం అని జ్ఞానులు అంటారు.

— కఠోపనిషత్తు

## ముక్తాత్మ

సర్వత్రా నవధానస్య నకించి ద్వాసనా హృది
ముక్తాత్మనో వితృప్తస్య తులనా కేన జాయతే 265

సర్వత్ర=అన్ని విషయాలలోనూ: అనవధానస్య=ఏకాగ్రత లేని: హృది= హృదయంలో: కించిత్=కొంచమైననూ: న వాసనా = విషయవాసనలు లేనట్టి: తృప్తస్య=సంతృప్తచిత్తుడైన: మహాత్మనః=మహా ఆత్మవిదుడైన: ఈదృశస్య= ఇటువంటి జ్ఞానికి: కేన=ఎవనితో: తులనా=సాదృశ్యము: జాయతే=అగు చున్నది.

సర్వత్ర అన్ని విషయాలలో ఆసక్తి రహిత హృదయంలో కొంచం కూడా వాసనాగంధం ఉండదు అటువంటి సంతృప్తిగల ముక్తాత్ముడికి తులతూగే వాడెవడు· ఎవరూ అట్టి యోగితో సమానంకారు. జ్ఞానికి ఏవిషయంలోనూ చిత్తాసక్తిలేకపోతే వాసన లేనట్లే. అముని అభ్యాస లేనివాడు. ఆ మునికి సాటి ఎవడూ లేడు. ఆ ఋషి నిజమైన జ్ఞాని.

• • •

జనకుడు మాండవ్యుడితో ఇలా అంటాడు "మునీ! అర్థసంపదలు అనర్థాలకు మూలం. అవి దుఃఖ దోషాకరాలు. ఆశలూ తృష్ణలూ మమతలూ దుఃఖదాలు. మిథిల కాలిపోతున్నా నాకేంపట్టనట్లే ఉన్నాను. అలా ఉండటంలో ఆత్మసుఖం, అనంతం. కామసుఖం, దివ్యసుఖం కంటే కూడా తృష్ణాత్యాగసుఖం ఎన్నోరెట్లు గొప్పది.

గోవుతోపాటూ కొమ్ములు పెరుగుతున్నట్లు అర్థంతోపాటు తృష్ణకూడా అభి వృద్ధి అవుతుంది. దీనితో మమత మారాకు వేస్తుంది. మమతపోతే తృష్ణ తుత్తుమురై పోతుంది. ప్రాప్తించింది అనుభవించు· ప్రాప్తించని దానికై పరుగులు తీయకు. ఆశ అతిశరిస్తే తృష్ణతుడిచిపెట్టుకుపోతుంది. ఈ తృష్ణ దుర్మతులకు దుష్టులకు మరీ ఎక్కువ· వారు ఒడలుకృశించి ముదిమితో ముడుచుకపోతున్నా ప్రాణాలు పోతున్నా వారిని ఈ తృష్ణ విడిచిపెట్టదు. అయితే వాడు వర్జితకాముడైతే మాత్రం తృష్ణపోయి సౌఖ్యం సంప్రాప్తిస్తుంది."

— తిక్కన భారతం (శాంతి పర్వం)

## నిర్వాసన

జానన్నపి న జానాతి పశ్యన్నపి న పశ్యతి
బ్రువన్నపి న చ బ్రూతే కోఽన్యో నిర్వాసనా దృతే 266

జానన్ అపి = తెలిసికొన్నవాడయినా; న జానాతి = తెలిసికొనటంలేదో; పశ్యన్ అపి=అవలోకించేవాడైనా; న పశ్యతి=అవలోకించటంలేదో, బ్రువన్ అపి = భాషించేవాడైనా; న బ్రూతే = భాషించటంలేదో; సః = అటువంటి; నిర్వాసనాత్ ఋతే=వాసనారహితుడైన ఋషికంటే; కః అన్యః=ఇతరుడు ఎవడు?.

వాసనా రహితుడైన మహాజ్ఞానికి సామ్యం ఇతరుడెవ్వడూ లేడు. ఆ ఆత్మ జ్ఞాన పండితుడు అన్నీ ఎరుగును. కానీ పరమార్థ దృష్టితో ఏమీ ఎరుగనివాడు. అన్నీ చూస్తుంటాడు కాని ఆత్మ జ్ఞానదృష్టితో ఏమీ చూడనివాడే. అన్ని విషయాలు భాషిస్తాడు. కాని తత్త్వదృష్టితో చూస్తే భాషించకుండానే ఉంటాడు.

• • •

"పశ్యత్యచక్షుః సః శృణోత్యకర్ణః" కళ్ళులేకుండా చూస్తాడు - చెవులు లేకుండా వింటాడు. అది జ్ఞాని స్వభావం అంటుంది కైవల్యోపనిషత్తు.

# నిష్కాముడు

భిక్షుర్వా భూపతి ర్వాపి యో నిష్కామః స శోభతే
భావేషు గలితా యస్య శోభనాఽశోభనా మతిః 267

యస్య=ఎవనియొక్క; శోభనా=శుభదమై శ్రేష్ఠమైనట్టిగానీ; అశోభనా= అశుభమూ అశ్రేష్ఠమూ అయినట్టిగానీ; మతిః=బుద్ధి; భావేషు=సమస్త భావ ప్రపంచంనుండి; గలితా=జారిపోయినదో; సః=అట్టి; నిష్కామః=కామనా రహితుడైనవాడు; భూపతిః=రాజేయగుగాక; వా=లేక; భిక్షుః వా=భిక్షువే యగుగాక; శోభతే=శోభిల్లుచున్నాడు.

ఆత్మజ్ఞుడైన జ్ఞాని అన్ని విధాలభావాలు వదులుకొంటాడు. శోభించేవి శోభించనివి అనే భేదంకానీ, విచక్షణ అనే లౌకిక దృష్టికానీ వారికుండదు. కనుక వారు కామనా రహితులు. అటువంటి మహర్షికి భిక్షువు అని కానీ మహారాజు అని కానీ భేదం ఉండదు. ఆ ఋషి శోభిస్తాడు.

వారి బుద్ధి ఉత్తమ పదార్థాలను అపేక్షించదు. 'మంచివికావే' అని అనుత్తమ పదార్థాలను ద్వేషించదు. ఆ వీక్షించబడేవి పదార్థాలుకానీ వ్యక్తులుకానీ. ఆ వ్యక్తి భిక్షువుకానీ రాజుకానీ వారికి సమానమే.

## స్వచ్ఛంద స్వభావం

క్వ స్వాచ్ఛద్యం క్వ సంకోచః క్వ వా తత్వవినిశ్చయః
నిర్వ్యాజార్జవ భూతస్య చరితార్థస్య యోగినః 268

నిర్వ్యాజార్జవ భూతస్య=నిష్కపట సరళ స్వభావుడైనట్టి; చరితార్థస్య=చరితార్థుడైన; యోగినః=యోగికి; క్వ స్వాచ్ఛంద్యం=స్వచ్ఛందత ఎక్కడ?; క్వ సంకోచః = సంకుచిత స్వభావం ఎక్కడ?; వా = లేక; క్వ తత్త్వవినిశ్చయః=తత్త్వవినిశ్చయం ఎక్కడ?.

నిష్కపట సరళ స్వభావులు నిర్వ్యాజార్జవభూతులు వారు చరితార్థులు. నిజమైన యోగీశ్వరులు. వారికి స్వతంత్రత ఏమిటి? అస్వతంత్రత ఏమిటి? సంకోచం ఏమిటి? విశాలం ఏమిటి? అట్టి మహాయోగీంద్రులకు ఇక తత్త్వనిశ్చయం ఏమిటి?

ఆ యోగివరేణ్యులు పూర్ణార్థులు. ఆత్మనిష్ఠులు కోమలస్వభావులు మహానుభావులు. నిష్కపటులు. నిర్మలులు. వారికి వృత్త్యాది సంచారాలుండవు సంకోచాలు సందేహాలు ఉండవు. కర్తృత్వమూ లేదు. భోక్తృత్వమూ లేదు. అట్టి వారికి పదార్థాల పైన వ్యక్తులపైన అధ్యాసయే ఉండదు

## ఆత్మ విశ్రాంతి

ఆత్మ విశ్రాంతి తృప్తేన నిరాశేన గతార్తినా
అంతర్యదనుభూతేప తత్కథం కథం కథ్యతే 269

ఆత్మ విశ్రాంతి తృప్తేన = ఆత్మ పీఠమందే విశ్రాంతిపొంది సంతుష్టుడైన; నిరాశేన=ఆశాశూన్యుడైన; గతార్తినా=ఆర్తిహరించిన జ్ఞాని చేత; అంతః= లోపల మానసంలో; యత్=ఏది; అనుభూతేన = అనుభవింపబడుతున్నదో; తత్=దానిని; కస్య=ఎవనికి; కథం=ఎట్లు; కథ్యతే=చెప్పబడును?

ఆత్మ విశ్రాంతితో తృప్తిగా ఆశారహితంగా ఉండే మహాభక్తుడైన జ్ఞానికి తుల్యం ఎవరూ లేరు. అజ్ఞానుల హృదంతరంలో అనుభవానందం నిండిఉంటుంది. వారితో ఏ విధమై పండితులూ సరిరారు.

ఆ మహర్షి ఆత్మతృప్తిగలవాడు. శాంతమూర్తి. ఆశారహితుడు. ఆనందుడు. ఆనందప్రదుడు. అంతఃకరణలో అనుభవం గలవాడు. ఆడంబరం లేనివాడు. తన ఆనందానుభూతిని ఇతరులకు వెల్లడించనివాడు. అట్టి యోగికి గలిగిన ఆనందం ఇతరులకు అలభ్యం. ఆ అనుభవానందం స్వసంవేద్యం ఏ వాణీ దానిని వర్ణించలేదు.

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" ఎక్కడ మనస్సు తన వాక్కుతో అశక్తత పొంది తిరిగి వస్తుందో అక్కడ సత్యం ఉంటుంది. సత్యం మనోబుద్ధులను అధిగమించి ఉంటుంది.

— తైత్తరీయం

## ధీరుడు తృప్తుడు

సుప్తోఽపి న సుషుప్తేచ స్వప్నేఽపి శయితోనచ
జాగరేఽపి న జాగర్తి ధీర స్తృప్తః పదే పదే 270

ధీరః = ధీరుడు; సుషుప్తేఅపి = సుషుప్తియందుకూడా; న సుప్తః = నిద్రించడు; స్వప్నే అపి = స్వప్నమందు కూడా; న శయితః = శయనించడు; జాగరే అపి = జాగ్రదవస్థయందుకూడా; న జాగర్తి = మేల్కొనడు; అతఏవ = ఇలానే; సః = ఆ యోగీంద్రుడు; పదేపదే = అడుగడుగునా మాటిమాటికీ పదం పదంలోనూ; తృప్తః = సంతృప్తుడౌతున్నాడు.

జ్ఞాని ధీరపురుషశ్రేష్ఠుడు. ఆ యోగిపుంగవుడు సుషుప్తిలో కన్నుమూసి నిద్రించడు. స్వప్నంలో కూడా శయనించి ఒడలు మరువడు. జాగ్రదవస్థలో మేల్కొంచి యుండడు. కనుక ఆ మహర్షి మహా సంతృప్తిగా ఉంటాడు.

జ్ఞానికి అన్ని అవస్థలు సమానం. వారికి నిద్రలేదు జాగరణలేదు. స్వప్నమూ లేదు సుషుప్తీలేదు. ఈ అవస్థలు అనుభవించేది బుద్ధి. ఆ బుద్ధికి అతీతుడు ఆత్మజ్ఞాని. అతడు అన్నిటికీ సాక్షీ మాత్రుడు.

## విజ్ఞుడు

జ్ఞః సంచితోఽపి నిశ్చింతః సేంద్రియోఽపి నిరింద్రియః
సబుద్ధిరపి నిర్బుద్ధిః సాహంకారోఽనహంకృతిః 271

జ్ఞః = జ్ఞాని: న చింతః అపి = చింతా సహితుడైనా: నిశ్చింతః = చింతా రహితుడు: సేంద్రియః అపి = ఇంద్రియ సహితుడైనా: నిరింద్రియః = ఇంద్రియ రహితుడు; సబుద్ధిః అపి=బుద్ధితో యోచిస్తున్నవాడైనా: నిర్బుద్ధిః=బుద్ధిరహితుడు; సాహంకారః అపి = అహంకార సహితుడైనా: అనహంకృతిః = అహంకార రహిడుతు; భవతి = అగుచున్నాడు.

జ్ఞాని చింతాసహితుడు చింతా రహితుడు. ఇంద్రియ సహితుడు. మరి ఇంద్రియ రహితుడు. బుద్ధి సహితుడు. బుద్ధి రహితుడు. అహంకార సహితుడు- అహంకార రహితుడు.

జీవన్ముక్తుడు ఎలా తలంచిన వారికి అలానే కనిపిస్తాడు లోకులకు సచింతా పరుడు జ్ఞాన పురుషులకు నిశ్చింతుడు నిరింద్రియుడు నిర్బుద్ధి నిరహంకారి. జ్ఞాని ఆత్మదృష్టి వల్ల సదా సదానందుడు.

◆ ◆ ◆

ఒకరోజు జనకమహారాజు దగ్గరకు విప్రుడొకడు వచ్చి కొరగామిగా మాట్లాడ సాగాడు. రాజుకీభాషణం నచ్చక 'నాదేశం వెడలిపొమ్ము' అన్నాడు. అపుడు ఆ బ్రాహ్మణుడు రాజుతో—

"రాజా! ఏమన్నావు. నన్ను నీదేశం వెడలి పొమ్మన్నావా! ఎంత వరకు నీది? నీదేశం హద్దు ఏమిటి? తత్త్వతః ఆ సంగతి తెలియ చెప్పితే పరదేశానికేపోతాను ఏదీ తెలియ చెప్పు!" అంత ఆబ్రాహ్మణునిలోని అపూర్వతేజస్సు చూచి గ్రహించి వాడై రాజు ఇలా అన్నాడు.

"బ్రాహ్మణోత్తమా! కన్ను తెరిపించావు. నా తాత తండ్రులు తరతరాలుగ ఈ మహీతలం పాలిస్తూవచ్చారు. అయినా ఇదినాది అనేది భ్రమయే. మహిపై మమ కారం కలుగ కూడదు. నిజం. వ్యవహారికంగా అనినా, నేను త్రికరణ శుద్ధిగా నాది అనుకోను.

ఎన్నో సంవత్సరాలనుండి రాజ్య రాజధాని మిధిలలో ఉన్నా ఇది నాది అను కోను. దేశంగూర్చి ఏమి పలికేది? 'ఇది నాదేశం - నీవు పరదేశానికి పొమ్మనేది ఎలాసంభవం - నాదేమిటి? నీదేమిటి? స్వ ఏమిటి? పరఏమిటి? నీతో వెడలి పొమ్మ న్నందుకు తెలివితప్పి మూర్ఛ వచ్చింది. చాలా పశ్చాత్తాపం కలిగింది మానసికంగా దుఃఖించాను. ఇది పరమేశ్వర భూమి. అంతా ఈశ్వరాధీనం మనం నిమిత్త మాత్రులం-" అన్నాడు.

అప్పుడు ఆ విప్రుడు "రాజా! మీకు ఇంత జ్ఞానసిద్ధి కలగటానికి దీనికి కారణ మేమైయుండవచ్చు?" "సత్సాంగత్యం. ఈ రాజ్యసంపదలు తనువులు అస్థిరాలు. నా ధనం నా దేశం అనుకోవటం భ్రమ. నాసికాదుల ద్వారా తెలుసుకోబడే అమూర్త్య గంధాదులు పోయేవి ఒకప్పటికావు ఆవినావి అనుకోవటంలేదు. భూమ్యాదులు జయింప బడి స్వాధీనంలో ఉన్ననూ ఇవికూడా మకియాలుకావు. అస్థిరాలు - క్షణికాలు-నావి అనుకోవటం అజ్ఞానం భ్రమ అని తెలిసికొన్నాను."

"ఇంత జ్ఞానివని తెలిసి నిన్ను పరీక్షించటానికి, నిన్ను చూడాలనీ బుద్ధికలిగి వచ్చాను. నేను యమధర్మరాజుని. నీ వివేకపరిపాకం సుస్థిరంగా సదానిల్చు గాక! శాంతిశ్రీ పొందుదువు గాక!" అన్నాడు.

> అనవుడు బ్రాహ్మణ ప్రవరుడల్లన నవ్వుచు నిన్ను నారయన్
> మనమున వేడ్క పుట్టి నరనాయక! వచ్చితి నేను ధర్ముడన్
> బనుపడి ఇవ్వివేక పరిపాకము గాఢనిరూఢ భావమొం
> ది నిలుచుగాత! నీదగు మదిన్ సతతంబును శాంతికారియై
>
> — తిక్కన (భారతం - అశ్వమేధపర్వం)

## జ్ఞానిసుఖీకాడు దుఃఖీకాడు

> **న సుఖీ నచవా దుఃఖీ న విరక్తో న సంగవాన్**
> **న ముముక్షుః నవా ముక్తో న కించిత్ నచ కించన** 272

జ్ఞానీ = జ్ఞాన శీలుడు; న సుఖీ=సుఖవంతుడూ కాడు; న దుఃఖీచ=మరి దుఃఖితుడూకాడు; న విరక్తః = విరక్తుడూ కాడు; న సంగవాన్ = విషయ

సంగతుడూకాదు; న ముముక్షుః=ముముక్షువూకాదు; న ముక్తః=ముక్తుడూకాదు; తస్య=అతనికి; న కించిత్=ఏమీలేదు; న కించన=ఏమీ కాడు.

జ్ఞాని సుఖీకాదు. దుఃఖీకాదు. విరక్తుడూకాదు. రక్తుడూకాదు. సంగవంతుడూ కాదు. నిస్సంగుడూ కాదు. ముముక్షువూ కాదు. ముక్తుడూ కాదు. కించనుడు కాడు. కించనుడు. లోకం దృష్టిలో సుఖవంతుడు అనుకొనే వాడు వాస్తవంగా మానసికంగా ఆత్మదృష్ట్యా దుఃఖవంతుడు. అలానే దుఃఖి అనిపించేవాడు సుఖవంతుడే. అంతఃకరణాదుల ద్వారా అతడు అధ్యాస లేనివాడు. సుఖస్వరూపుడే.

"సత్యానృత వస్త్వభేద ప్రతీతి రధ్యాసః-" సత్యవస్తువు ఆత్మ. మిథ్యా వస్తువు అంతఃకరణం. ఈ రెండింటిలో భేదం అజ్ఞానికి తోచదు. కనుక అంతఃకరణ ధర్మాలైన సుఖదుఃఖాలు తనవిగా భావిస్తాడు. సుఖిదుఃఖి అవుతాడు.

జ్ఞానికి ధ్యాస ఉండదు. కనుకనే సుఖ దుఃఖాలు అంతఃకరణధర్మాలు నా ఆత్మవికావు అని సుఖదుఃఖాలు పొందడు.

## ధన్యజీవి

విక్షేపేఽపి న విక్షిప్తః సమాధౌ న సమాధిమాన్
జడోఽపి న జడో ధన్యః పాండిత్యేఽపి న పండితః 273

జ్ఞానీ=మహా ఆత్మజ్ఞాని; విక్షేపే అపి=విక్షేపం కలిగిననూ; న విక్షిప్తః=విక్షిప్తుడుకాడు; సమాధే=సమాధి యందున్ననూ; న సమాధిమాన్=సమాధిగలవాడుకాడు; జాడ్యే అపి=జడత్వముండిననూ; న జడః=జడుడుకాడు; పాండిత్యే అపి=పాండిత్యమున్ననూ; న పండితః=పండితుడుకాడు; సః=అతడు; ధన్యః=ధన్యుడు.

ధన్యపురుషుడైన జ్ఞాని విక్షేపంలో ఉన్నా కూడా విక్షేపవంతుడు కాడు. సమాధిలో లేకపోయినా సమాధిగలవాడే. జడుడుగా ఉన్నా అసలు జడుడు కాడు. పాండిత్యం లేకపోయినా పండితుడే. లోకందృష్టిలో పండితుడైనప్పటికి పండితుడుకాడు.

జ్ఞాని లోకం దృష్టిలో విక్షేపాలు కలవాడైనా అసలు వాస్తవంగా విక్షిప్తుడు కాడు. ఆ యోగి స్వప్రకాశంలో ఆత్మానుభవం పొందుతుంటాడు. లోకం దృష్టిలో సమాధిలో ఉన్నట్లు కనిపించినా ఆ యోగికి సమాధి అనేదే లేదు. ఆ మహర్షికి కర్తృత్వ అధ్యాస లేదు. లోకుల దృష్టిలో ఆ ఋషి జడుడుగా ఉన్నా ఆత్మ జ్ఞానంలో జడుడుకాడు. ఆ జ్ఞానికి అభిమానంలేదు. అహంకారంలేదు. ఆ మహర్షి జీవన్ముక్తుడు. ధన్యాతిధన్యుడు.

• • •

"బ్రహ్మం అనగా బృహత్. ఇంత అంత అని చెప్పలేము లోకంలో అభివృద్ధి కావించే పదార్థాలకంటే - అగోచర పదార్థాలకంటే ఎంతో వృద్ధి కలది అది అనంత వైశాల్య పరివ్యాప్తం. అగమ్య గోచరం. దాని శక్తి అనంతం."

— శ్రీ సత్యసాయిబాబా

# సర్వత్ర సమవర్తి

ముక్తో యథాస్థితి స్వస్థః కృత కర్తవ్య నిర్వృతః
సమః సర్వత్ర వైతృష్ణాత్ న స్మరత్యకృతం కృతమ్ 274

ముక్తః=ముక్తుడైన జ్ఞాని; యథాస్థితి స్వస్థః=ప్రారబ్ధానుసారంగా ప్రాప్త వస్తువిషయమై స్వస్థ చిత్తంగలవాడూ; కృత కర్తవ్య నిర్వృతః=చేయబడిన, చేయదగిన కార్యాలవిషయమై సంతుష్టి గలవాడూ; భవతి=అగుచున్నాడు; సర్వత్ర= అంతటా; సమః=సమదృష్టి సమభావంగలవాడై; వైతృష్ణాత్=తృష్ణారహితుడై నందువలన; అకృతం=చేయబడని; కృతం=చేయబడిన; కర్మ=కర్మనుగూర్చి; న స్మరతి=స్మరించడు.

ముక్త పురుషుడైన జ్ఞాని కర్మానుసారంగా సంప్రాప్తించిన వస్తువులతో స్వస్థ చిత్తుడౌతాడు. చేసిన చేయతగిన కర్తవ్యాలతో సంతోషం పొందుతాడు. సర్వత్రా సమచిత్తం కలిగి తృష్ణారహితుడై చేయని సుకృత్యాలు గూర్చి గానీ, చేసిన సుకృత్యాలు గూర్చిగానీ స్మరించడు.

జీవన్ముక్తుడు ప్రారబ్ధవశం వల్ల లభించిన దానితో తృప్తిచెందుతాడు. స్వస్థ స్థితిలో ఉంటాడు. ఉద్వేగం ఎన్నడూ ఏ పరిస్థితిలోనూ పొందడు. పూర్వం తాను చేసిన కార్యానికి సంతుష్టిపడతాడు. ఏదో చేయాలని కూడా అనుకోడు. ఆరాటపడడు. పూర్వం గూర్చి కానీ భవిష్యత్తు గూర్చి కానీ తలంచడు. నిశ్చింతగా నిర్మలంగా ఉంటాడు.

• • •

"మతి దలపగ సంసారం
బతి చంచల మెండమావులట్టుల సంపత్
ప్రతతు లతి క్షణికమ్ములు
గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్"

— నన్నయ (భారతం - ఆదిపర్వం)

## ఆత్మజ్ఞాని

న ప్రీయతే వంద్యమానో నింద్యమానో న కుప్యతి
నైవోద్విజతి మరణే జీవనే నాభినందతి 275

జ్ఞాని=జ్ఞాన సింధువు: వంద్యమానః=స్తుతింపబడినవాడై; న ప్రీయతే= ప్రీతి చెందడు; నింద్యమానః=నిందింపబడిన వాడై; న కుప్యతి=కోపింపడు; మరణే=మరణ విషయమై; న ఉద్విజతి=ఉద్వేగపడడు; జీవనే అపి=జీవించి యున్నందుకు; న అభినందతి=ఆనందింపడు.

ఆత్మజ్ఞాని స్తుతి విన్నంత మాత్రం చేత ప్రసన్నుడుకాడు. నింద విన్నంతనే కుపితుడూకాడు. మరణం వచ్చిందని ఉద్వేగం పొందడు ఆర్తి చెందడు. జీవనం కదా అని హర్షమూ పొందడు.

ఆత్మజ్ఞాని అన్యపురుషులవలె స్తోత్రపాఠాలకు అభినందనలకు ఆత్యుత్సాహ పడడు. అలానే తనను గూర్చి అపనిందలు వచ్చినా ఆగ్రహించడు. మృత్యువుకు భయపడడు. ఆత్మ నిత్యం అని తెలుసు. ఆత్మను మృత్యువు ఏమీచేయజాలదని జీవన మరణాలు గూర్చిన ఆలోచననే ఉండదు. సదా ఏక రసాత్ముడు జీవన్ముక్తుడు.

• • •

"నాభినందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా" దేనినీ అభినందించకుండా దేనినీ ద్వేషించకుండా మహర్షి స్థితప్రజ్ఞుడై ప్రకాశిస్తుంటాడు.

— భగవద్గీత

# ప్రశాంతి

న ధావతి జనాకీర్ణం నారణ్య ముపశాంతధీః
యథా తథా యత్ర తత్ర సమ ఏవావతిష్ఠతి 276

ఉపశాంతధీః=ఉపశమన చిత్తంగల జ్ఞాని; జనాకీర్ణః = జనంతోగూడిన ప్రదేశంలోనికి కానీ; అరణ్యం=అడవిలోనికి కానీ; న ధావతి=పరుగిడడు; కింతు=మరేమిటంటే; యత్ర తత్ర=ఎక్కడో ఒకచోట; యథా తథా=ఏదో విధానంగా; సమఏవ=సమచిత్తంగలవాడై సమబుద్ధితో; అవతిష్ఠతే=నివసిస్తున్నాడు.

శాంతిశ్రీ విరాజితుడు ఉపశాంత ధీరచిత్తుడు జనంలోకి పరుగెత్తుకుపోడు. అలా అని వనంలోకీ పరుగెత్తుకుపోడు. స్వస్థచిత్తుడై సమభావం కలిగి సుస్థితుడై ఆత్మ జ్ఞానాంబుధిలో ఓలలాడుతుంటాడు

ఓ జనకరాజా ! జీవన్ముక్తుడు శాంతచిత్తుడు. శాంతిశ్రీ నంశోభితుడు. ఆ యోగి జనాకీర్ణంగల జనార్ణవంలోకీ పోడు. అరణ్యాలు పట్టి కొండలకూ కోనలకూ పోడు. జనులపై ప్రేమలేదు ద్వేషమూలేదు. వనంలో ఉన్నా జనంలో ఉన్నా నిశ్చింతగా నిశ్చలంగా నిర్మలంగా ఆత్మానందంలో విరాజిల్లుతుంటాడు.

శాంతిశ్రీకి ప్రపంచం ప్రశాంతి నిలయం. ప్రశాంతి నిలయ నివాసి శాంతిశ్రీ.

• • •

విహరన్ జనతావృందే దేవ కీర్తన పూజనైః
ఖేదాహ్లాదౌ న జానాతి ప్రతిబింబ గతైరివ

జనమధ్యంలో వినోదంలో ఉన్నా దేవ పూజలో ఉన్నా సుఖదుఃఖాలు జ్ఞానికి చెందవు. సూర్య ప్రతిబింబానికి పరిసర ప్రభావం ఉండనట్లే జ్ఞానికి శరీరసుఖదుఃఖాల సంబంధం ఉండదు.

— అన్నపూర్ణోపనిషత్తు

# ఆత్మ విశ్రాంతి

## విశ్రాంతి

తత్త్వవిజ్ఞాన సందంశం ఆదాయ హృదయోదరాత్
నానావిధ పరామర్శ శల్యోద్ధారః కృతో మయా 277

భవతః=తమనుండి; తత్త్వవిజ్ఞాన సందంశకం=తత్త్వవిజ్ఞానం అనే పట్టకారును; ఆదాయ=పొంది; హృదయోదరాత్ = హృదయగర్భంనుండి; నానావిధ = అనేక ప్రకారాలైన; పరామర్శ=సందేహ వివాద; శల్యోద్ధారః = శల్యములు తీసివేయుట; మయా=నాచేత; కృతః=చేయబడినది.

పవిత్రఛాత్రుడైన జనకమహారాజు దీక్షతో ఆచార్యదేవుడైన అష్టావక్ర మహర్షి మహోపదేశం శ్రవణం చేశాడు స్వాభావిక సిద్ధమైన శాంతిసంపద అందుకొన్నాడు శాంతిశ్రీని దర్శించాడు అనుభవించాడు కృతార్థుడైనాడు. ఇక తాను కృతజ్ఞతగా తన అనుభవంలోకి తెచ్చుకొన్న ఆత్మ ప్రశాంతినిగూర్చి ఇలా వివరించసాగాడు—

స్వామి! సంయమీంద్రా! తమ నుఖతః వెలువడి అపూర్వమూ అత్యద్భుతమూ అనుపమానమూ అయిన ఆత్మతత్త్వం విజ్ఞానం సందంశం పంటిది. అందే ఇనుపపట్కారు. అది శస్త్రపరికరం అది స్వీకరించి నా హృదయం పొరలలోనూ ఉదరం ప్రేగులలోనూ దాగిన నానా సందేహాలు అనుమానాలు శల్యాలవలే బాధించే వాటిని ఆ శస్త్రంతో పెరికి వేశాను.

గురువర్యా! నాలోని సంకల్ప వికల్పాలు నమసిపోయాయి కృతార్థుణ్ణిఅయినాను. అమోఘం అపూర్వం ఐన ప్రశాంతి లభించింది. హృదయం అనంద శాంతి కాంతులతో నిండి పోయింది. ధన్యుణ్ణి అయ్యాను.

• • •

యేషాం వృత్తిః సమావృద్ధా పరిపక్వాచ సా పునః
తేప్పై సత్ బ్రహ్మతాం ప్రాప్తా నేతరే శబ్ద వాదినః

మనస్సు శుద్ధిచేసికొని బుద్ధిపరంగా ఆత్మానుభవానికి సిద్ధమైనవాడు మాత్రమే బ్రహ్మాన్ని పొందగలడు. శాస్త్రవాగాడంబరవిదులు ఎన్నటికీ బ్రహ్మానుభవం పొందలేడు.

— తేజోబిందు ఉపనిషత్తు

# స్వకీయమహిమ

క్వ ధర్మః క్వచవా కామః క్వ చార్థః క్వ వివేకతా
క్వ ద్వైతం క్వచవాఽద్వైతం స్వ మహిమ్ని స్థితస్యమే 278

స్వమహిమ్ని=స్వకీయ మహిమయందు; స్థితస్య=ఉంటున్న; మే=నాకు; క్వ ధర్మః = ధర్మమెక్కడ?; క్వ కామః = కామమెక్కడ?; క్వ అర్థః = అర్థమెక్కడ?; క్వ వివేకితా=వివేక మెక్కడ: క్వ ద్వైతం వా=ద్వైతమెక్కడ?; క్వ అద్వైతం=అద్వైత మెక్కడ?

స్వకీయమైన మధుర మహిమార్ణవంలో సుస్థితుడనైనాను. నిశ్చలుడనైనాను నిర్మలుడనైనాను. గురుదేవా! ఇక నాకు ధర్మార్థ కామాలు ఎక్కడ! ద్వైతమూలేదు. అద్వైతమూలేదు.

నా హృదయం నుండి ఈ ధర్మ సందేహాలు అంతరించాయి. నేను మహిమార్ణవంలో మునిగి ఉన్నాను. చైతన్యంలో విశ్రాంతి లభించింది. నిత్యసత్యమైన ఆత్మకు ప్రశాంతి దక్కింది. ఇక ద్వైతంతో అద్వైతంతో పనియేమిటి?

"ఉత్తీర్ణేతు గతే పారే నౌకాయాః కింప్రయోజనమ్" మహానదీ ప్రవాహందాటి ఇవతల గట్టుకు వచ్చిన తరువాత ఇక నౌకతో ప్రయోజనమేముంది?

అద్వైతం కేచిదిచ్ఛంతి ద్వైతమిచ్ఛంతి చాపరే
సమంతత్త్వం న విందంతి ద్వైతాద్వైత వివర్జితమ్.

కొంత మందికి ద్వైతం మరికొంత మందికి అద్వైతం ఇష్టం. ఇరువురూ సత్యం దర్శించటం లేదు. ఆత్మతత్త్వం ద్వైతము కాదు అద్వైతమూకాదు. అది కేవలం దానికదే. అది అనుపమానం.

— అవధూత గీత

## స్థితప్రజ్ఞ

క్వ భూతం క్వ భవిష్యద్వా వర్తమానమపి క్వవా
క్వ దేశః క్వచవా నిత్యం స్వమహిమ్ని స్థితస్యమే 279

నిత్యం=సదా: స్వమహిమ్ని=నాస్వంత మహిమయందే: స్థితస్య=ఉంటున్న: మే=నాకు: క్వ భూతం=భూతకాల మెక్కడ?: క్వ భవిష్యత్=భవిష్యత్కాల మెక్కడ?: క్వ వర్తమానం అపివా = వర్తమాన కాలమైననూ ఎక్కడ?: క్వ దేశః=దేశం ఎక్కడ?

గురూత్తమా! నిత్యం స్వ మహిమాంబుధిలో ఓలలాడుతుండే నాకు భూత భవిష్య ద్వర్తమానాలు లేవు. దేశంలేదు విదేశంలేదు. సర్వం సమానం. సర్వం సర్వేశ్వర స్వరూపమే. కాలావధులులేవు. దేశపరిధులు లేవు. నాకు సర్వం సాయి మయం. నిత్యం నా మహిమలో ప్రకాశిస్తూంటాను. నాకు అంతా ఆత్మదృష్టియేకానీ అన్యంలేదు. అన్యం అంతా మిథ్య. శాశ్వతం సత్యం.

• • •

స్థానత్రయం యదిచనేతి కథం తురీయం
కాలత్రయం యదిచనేతి కథం దిశశ్చ
శాంతం పదం హిపరమం పరమార్థ తవ్యం
జ్ఞానామృతం సమరసం గగనోప మోఽహమ్

అవస్థాత్రయం లేనప్పుడు నాల్గవదైన తురీయం ఎలా? భూత భవిష్యద్వర్తమాన కాలత్రయం లేకపోతే దిశలెలా! పరమాత్మపదం పరమ శాంతం. నేను అమృతం. జ్ఞానం. గగన సదృశం. పరిణామరహితం. పరమార్థం. సమరసం.

— అవధూతగీత

## మహిమ

క్వచ ఆత్మా క్వచవాఽనాత్మా క్వ శుభం క్వా శుభం తథా
క్వ చింతా క్వచవాఽచింతా స్వ మహిమ్ని స్థితస్య మే 280

